శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులచే రచియింపఁబడిన

# త్రిలిఙ్గలక్షణ శేషము

అను

## ప్రౌఢ వ్యాకరణము

**సుబోధినీ వ్యాఖ్యాన సహితము**


వ్యాఖ్యాత:

ఉభయభాషాప్రవీణ - సాహిత్యవిద్యాప్రవీణ,

**బులుసు వేంకటరమణయ్య, పి. ఓ.,**





## వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

మదరాసు - 1.

**వారిచే ప్రకటితము.**

1885-సంవత్సరము ఫిబ్రవరిలోఁ బ్రకటితమైన
తొలికూర్పులోని అంకిత పత్రము.

---

TO

HIS HIGHNESS

THE HONOURABLE MAHARAJAH

Mirja Sri Vijaya Ananda Gajapati
Maharaja Mannya Sultan Bahadur of
Vizianagaram, K. C. I. E.

**This Book is repsectfully dedicated
by kind Permission**

***By The Author***

---

మొదటి కూర్పు

# ఉపోద్ఘాతము

పండితోత్తముండును సజ్జనాగ్రేసరుండు నగు మజ్జనకుండు నాయెడ స్వామిభావంబును దాసభావంబును నెఱపి మిత్రభావంబును నెఱపం బ్రారంభించుతఱి నాకు యథోచితముగఁ గవితాధార యొకింత గలుగ, తోడనే నాకు బాలవయోఽవస్థాకాలవాసస్థానంబై యున్న నాగపట్టణం బను దివ్యదేశంబున దివ్యమంగళవిగ్రహంబుతో నన్వర్థాభిధానుండై వేంచేసి యుండెడు శ్రీసౌందర్యరాజస్వామినిఁ బద్యరూపంబునం బ్రస్తుతింప మతి వొడమి, ఏను దన్నామాంకితంబుగ నాంతము శబ్దాలంకార సహితంబై యుండ నొక్క శతకంబుఁ గావించితి. తదనంతరము విద్యావిచారతత్పరుండనై కొన్ని హాయనంబులు కడపి యంత నాంధ్రశబ్దరత్నాకరం బను నకారాదినిఘంటు వొకటి వ్రాయు నుద్దేశముతో గ్రంథశోధనము సేయం దొరకొని తద్విఘ్ననిరసనార్థంబు తదధిదేవతాస్తవం బొనరింపం దలంచి తదంకితంబుగ నాంతము నర్థాలంకార సహితంబై యుండ నొక్క శతకంబు రచియించితి. అంతట నా నిఘంటువు వ్రాయ నుద్యమించి వ్రాయుచు వ్రాయుచుఁ దత్కాలంబున విద్యార్థిజనసహాయంబుగ వైకృతదీపిక, సంస్కృతాంధ్ర ద్రవిడహూణభాషాసహితం బగు పదార్థనామకోశము, బాలచంద్రోదయము, అలఘుకౌముది, త్రివిధం బగు నీతిమాల యను నీ పుస్తకం

బులను గ్రమంబుగ విరచించి ముద్రింపించి, పిమ్మట భారతాది గ్రంథములయందు సంగ్రహించి యుంచిన నీతిపద్యములను గొని స్త్రీజనసామాన్యపఠనయోగ్యం బగు సతీధర్మసంగ్రహం బను నొక పుస్తక మేర్పఱిచి యచ్చువేయించి, అట్లు మిగులఁ బూనికతోఁ బ్రారంభించి వ్రాయుచుండిన యీ గొప్ప నిఘంటువును వ్రాసి పరిసమాప్తిఁ బొందించితిని. ఇంతకు ముందు నా షష్టిపూర్తి సమయంబునఁ బ్రపన్నపారిజాత మను నొక ప్రపత్తిగ్రంథము నఱువది పద్యములు గలదానింగా నొకటి సంతరించి ముద్రింపించితిని. తుద కిప్పుడు తద్భారతాదిగ్రంథ పరిశోధనంబుచే దొరకిన విశేష లక్షణప్రయోగముల నేర్చి కూర్చి త్రిలిఙ్గలక్షణశేషం బను నొక యపూర్వవ్యాకరణమును దీని వ్రాసితిని. ఇందలి లక్షణములు లసాధారణము లనియు, నియ్యది విద్యార్థుల కత్యంతోపకారక మనియు మంచి మనసుతోఁ బరికించువారల కెల్లఁ జక్కఁగాఁ దెల్లము కాఁగలదు.

కాన శక్తిమంతులు యథాశక్తిని దీనిని విద్యార్థుల యుపయోగమునకుఁ దేవలయు నని యేను మిక్కిలి కోరిక గలవాఁడనై యున్నాఁడను.

బ. సీతారామాచార్యులు

# నివేదిక

రమారమి యిరువదేండ్లక్రిందట భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి కోరికమేరకు 'ప్రౌఢవ్యాకరణము'ను సంస్కరించి యందుదాహృతభాగములను పరిశోధించి, వానికి పద్యసంఖ్యలఁగూడ నిచ్చి, యట్లు సరిచేసిన ప్రతిని శ్రీశాస్త్రులు గారి కొసఁగియుంటిని. శ్రీవారు సూత్రానుక్రమణిక, శ్రీనిడుదవోలు వేంకటరావుగారి విపులపీఠిక మున్నగువానితోఁ గొంత క్రొత్తదనమును గూర్చి, యా వెంటనే దానిని ప్రకటించియున్నారు. భాషాభిమానుల యాదరమువలన నా గ్రంథపుఁ బ్రతు లచిరకాలముననే చెల్లిపోయినవి. శ్రీ శాస్త్రులుగారా గ్రంథమును మరల ముద్రింపించిరి. మఱియు ప్రత్యేకముగ వ్యాఖ్యానముతోఁ గూడ నా వ్యాకరణమును బ్రకటింపఁ దలఁచి ఆ వ్యాఖ్యాన రచనాభారమును నాపైనే వైచిరి. వ్యాఖ్యానరచనమునకుఁ గావలసినంత సామర్థ్యముగాని, అవకాశముగాని నాకు లేకున్నను, నన్నతివాత్సల్యముతోఁ జూచుచున్న శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారి మాట కెదురాడలేక 'సుబోధిని' అను పేరిట నీ చిన్నవ్యాఖ్యను వ్రాసి ఆంధ్రలోకమున కర్పించుకొనుచున్నాను.

భాషావాఙ్మయములయెడ నాసక్తియు, పరిశీలనముపట్ల శ్రద్ధయు క్రమక్రమముగ క్షీణించుచున్న యీకాలమున

ప్రాచీనగ్రంథము లన్నియుఁ వ్యాఖ్యానముల నపేక్షించుచున్న వనుట పండిత విమర్శకులకు సువిదితము. అట్టియెడ వ్యాఖ్య లేనిదే వ్యాకరణము నవగాహన చేసికొనుట మిక్కిలి కష్టము. అందును త్రిలిఙ్గలక్షణశేషమువంటి ప్రౌఢలక్షణగ్రంథముతత్త్వ మును వ్యాఖ్యాననిరపేక్షముగఁ దెలిసికొనుట అత్యంతము కష్ట తరము. కావుననే ఈ టీకారచనమునకు సిద్ధపడవలసివచ్చినది.

త్రిలిఙ్గలక్షణశేషమునకు—(ప్రౌఢవ్యాకరణమునకు) శ్రీ టి. ఆర్మగం పిళ్లగారి "కుమారదేవపండితీయ" మను వివరణము వెలువడియున్నది. మూలముతోఁబాటు ఆ వ్యాఖ్యానము, శ్రీ వావిళ్లవారు 'పరిష్కృతముద్రణము'ను ప్రకటించిన సమ యమునందే ప్రకటితమైనది కావున ఉదాహరణముల సాధు పాఠము లా వివరణసహిత ప్రతిలోని కెక్క లేదు. మఱియుఁ జాలచోట్ల సూత్రవివరణములు సంగతములుగా కానరాలేదు. ఇంకను విపుల మగు వ్యాఖ్యానము నావశ్యక మని తోఁచినది. కావుననే నీ 'సుబోధిని' ని వ్రాయఁబూనితిని. †

ఈ 'సుబోధినీ' వ్యాఖ్య మూలాభిప్రాయమును వెల్ల డించుటకు మాత్ర ముద్దేశింపఁబడినది. ఎడనెడ మూలము నందలి బాగోగులు చూపఁబడినవి. ఇయ్యది వ్యాకరణలక్షణ జిజ్ఞాసువుల కేమాత్ర ముపయోగించినను, నా ప్రయత్నము చరితార్థము కాఁగల దని విన్నవించుచున్నాను.

---

† ప్రౌఢవ్యాకరణముపై - 'తత్త్వబోధిని' అను వేఱొక వ్యాఖ్య యీ నడుమనే వెలువడినది.

భాషావాఙ్మయోద్ధారకులు, ప్రాచీనాధునికాంధ్రవాఙ్మయ ప్రకాశకులు విద్వద్వతంసులు నగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు నాయెడ నపారవాత్సల్యము చూపుచు నా భాషావాఙ్మయ కృషికి దోహద మొనర్చును, నన్ను గౌరవించుచున్నందుకు కృతజ్ఞతను దెల్పుచు వారి యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై సర్వదా భగవంతుని ప్రార్థించుచున్నాను.

సుధీజనవిధేయుఁడు,

మదరాసు.
15-7-1952.

బులుసు వేంకటరమణయ్య,

# విషయసూచిక

# సంకేతాక్షర వివరణము



| సంకేతము | గ్రంథము | గ్రంథకర్త | ప్రథమముద్రణము |
|---|---|---|---|
| అచ్చ.రా. | అచ్చతెనుఁగురామాయణము | కూచిమంచి తిమ్మకవి | 1888 |
| అని. | అనిరుద్ధచరిత్ర | కనుపర్తి అబ్బయ్య | 1904 |
| ఆము. | ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు | 1869 |
| ఉ. రా. | ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు | 1863 |
| ఉ. హరి. | ఉత్తరహరివంశము | నాచన సోమన | 1897 |
| కవిక. | కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి | 1885 |
| కళా. | కళాపూర్ణోదయము | పింగళి సూరన | 1888 |
| కాశీ. | కాశీఖండము | శ్రీనాథుడు | 1888 |
| క్షేత్రయ. | క్షేత్రయ పదములు | క్షేత్రయ | 1862 |
| చంద్ర. | చంద్రభానుచరిత్ర | తరిగొప్పుల మల్లన | 1917 |
| చంద్రా. | చంద్రాంగదచరిత్ర | పైడిమఱ్ఱి వేంకటపతి | 1897 |
| జై. | జైమినిభారతము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి | 1871 |
| నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము | తిక్కన | 1898 |
| నై. | నైషధము | శ్రీనాథుఁడు | 1859 |
| పర. | పరమయోగి విలాసము | సిద్ధరాజు | 1915 |
| పాంచా. | పాంచాలీ పరిణయము | కాకమాని మూర్తి | 1894 |
| పాండు. | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | 1888 |
| పారి. | పారిజాతాపహరణము | నంది తిమ్మన | 1865 |
| ప్రభా. | ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన | 1894 |

| సంకేతము | గ్రంథము | గ్రంథకర్త | ప్రథమముద్రణము |
|---|---|---|---|
| భర్తృ. | భర్తృహరిసుభాషితము | ఏనుఁగు లక్ష్మణకవి | 1876 |
| భల్లా. | భల్లాణచరిత్ర (అముద్రితము) | మల్లవరపు వాలేశ్వరుఁడు | |
| భాగ. | భాగవతము | పోతన | 1848 |
| భాను. | భానుమతీపరిణయము | రెంటూరి రంగరాజు | 1872 |
| భార. | భారతము | కవిత్రయము | 1853 |
| భాస్కర. | భాస్కరశతకము | మారర వెంకయ్య | 1871 |
| భీమ. | భీమఖండము | శ్రీనాథుఁడు | 1901 |
| భోజ. | భోజరాజీయము | అనంతామాత్యుఁడు | 1904 |
| మార్కం. | మార్కండేయపురాణము | మారన | 1900 |
| య. | యయాతిచరిత్ర | పొన్నగంటి తెలగన | 1897 |
| రా. | భాస్కరరామాయణము | భాస్కరాదులు | 1864 |
| రా. వి. | రాజవాహనవిజయము | కాకమాని మూర్తి | 1902 |
| రాఘ. | రాఘవపాండవీయము | పింగళి సూరన | 1857 |
| రామా. | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుఁడు | 1895 |
| రుక్మాం. | రుక్మాంగదచరిత్ర | ప్రౌఢకవి మల్లన | 1882 |
| లక్ష్మీ. | లక్ష్మీనృసింహావతారము(నృసింహాపురాణము(ఎఱ్ఱాప్రెగ్గడ | | 1901 |
| వసు. | వసుచరిత్రము | రామరాజభూషణుఁడు | 1844 |
| వి. పు. | విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరన | 1881 |
| విక్ర. | విక్రమార్కచరిత్ర | జక్కన | 1895 |
| విజ. | విజయవిలాసము | చేమకూర వేంకటకవి | 1850 |
| విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము | కేతన | 1895 |
| వీర. | వీరభద్రవిజయము | పోతన | 1901 |
| వేం. పంచ. | పంచతంత్రము | వేంకటనాథుఁడు | 1874 |

| సంకేతము | గ్రంథము | గ్రంథకర్త | ప్రథమముద్రణము |
| --- | --- | --- | --- |
| శశాం. | శశాంకవిజయము | శేషము వేంకటపతి | 1864 |
| శివ. | శివయోగసారము | కొలనియాది గణపతిదేవకవి | 1913 |
| శుక. | శుకసప్తతి | పాలవేకరి కదిరీపతి | 1908 |
| శేష. | శేషధర్మము (అముద్రితము) | సిద్ధకవి | |
| సత్య. | సత్యభామా సాంత్వనము | లింగనమఖి శ్రీకామేశ్వరకవి | 1930 |
| సా. | సారంగధరచరిత్ర | చేమకూర వేంకటకవి | 1910 |
| సుమతి. | సుమతిశతకము | | 1877 |
| స్వా. | స్వారోచిష మనుసంభవము | అల్లసాని పెద్దన | 1862 |
| హరి. | హరివంశము | ఎఱ్ఱాప్రెగ్గడ | 1871 |
| హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి | 1889 |

## గ మ ని క

I. ఈ క్రింది సంకేతములను గమనింపవలెను—పా = పాఠము. పూ = పూర్వభాగము. ఉ = ఉత్తరభాగము. స్కం=స్కంధము. ఆది = ఆదిపర్వము. [ఈ విధముననే పర్వము పేరిలోని మొదటి రెండక్షరములును, ఆ పర్వమును సూచించు నని తెలియునది.]

II. అధస్సూచిక (Foot-note)లోని విషయములు, ఉదాహరణములు, పాఠాంతరములును పాఠకులు సౌకర్యముకొఱకే ఈయఁబడినవి. పాఠాంతరములు తఱచు ముద్రితప్రతులలోనివే గ్రహింపఁబడినవి.

III. గ్రంథసంకేతవివరణపట్టికలో ఈయఁబడిన ప్రథమముద్రణ సంవత్సరములు పాఠకుల యెఱుకకు ఉద్దేశింపఁబడినవి. పద్యసంఖ్యాకలనమున కవియే యాధారము లని భ్రమింపరాదు.

IV. పద్యసంఖ్యానిర్ణయము లబ్ధములయిన ముద్రితప్రతుల ననుసరించి చేయఁబడినది. వేర్వేఱు ముద్రణము లున్న గ్రంథములలో, ఆ సంఖ్య కొన్ని యెడల మాఱినను మాఱవచ్చును.

# త్రిలిఙ్గలక్షణశేషము

## సంజ్ఞాపరిచ్ఛేదము

### సుబోధినీసహితము

త్రిలిఙ్గలక్షణశేషము— శ్రీశైల, కాళేశ్వర, దక్షారామము లనెడి మూఁడు లింగములకును నడుమఁ గల దేశము త్రిలిఙ్గదేశము; ఈ దేశమున వాడఁబడు భాషయుం త్రిలిఙ్గమగును. ఈ త్రిలిఙ్గపదమువలననే తెలుఁగు దేశము, తెలుఁగు భాష యేర్పడిన వని కొందఱి మతము.

భాషాస్వరూపమును, విశిష్టతను దెలిసికొనుట కుపయోగించు ఛందోవ్యాకరణాలంకారములకు 'లక్షణము' లని పేరు. అయినను ఈ గ్రంథమున లక్షణపదముచే వ్యాకరణముమాత్రము గ్రహింపఁబడుచున్నది.

ఇంతకుఁబూర్వము తెలుఁగుభాషకు లక్షణములు చాల వెలసి యున్నవి. వాని నన్నింటిని బరిశీలించి, అందు చెప్పఁబడని విశేషములను సేకరించి శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులుగా రీ వ్యాకరణమును రచించి యున్నారు. ఇదివఱ కున్న తెలుఁగువ్యాకరణములకు శేషరూప మగు గ్రంథ మగుటచే నియ్యది 'త్రిలిఙ్గలక్షణశేష' మని పిలువఁబడుచున్నది.

పరిశీలించి చూడఁగా నిది శ్రీచిన్నయసూరి రచించిన 'బాలవ్యాకరణము'నకు శేషగ్రంథ మని తోఁచుచున్నది. సూత్రరచనయు, వివరణము, నుదాహరణములు నీ యంశమునే చాటుచున్నవి. శ్రీసీతారామాచార్యులుగా రిందు చెప్పకున్నను దీనికి 'ప్రౌఢవ్యాకరణము' అను పేరు ప్రసిద్ధ మయి

యున్నది. ఏతద్వ్యాకరణకర్త స్వయముగ ముద్రింపించిన తొలికూర్పునఁ గూడ మొదటి పుటలో దీనికి 'ప్రౌఢవ్యాకరణ' మనునది నామాంతర మని తెలుపఁబడినది. ఈ విషయముకూడ నిది బాలవ్యాకరణమునకు శేష మనియు, అందలి లోపములను సవరించుటకొఱకే యియ్యది రచింపఁబడిన దనియుఁ స్పష్ట మగుచున్నది. శ్రీ చిన్నయసూరిగారి వ్యాకరణము బాలుర కుపయోగించున దనియుఁ, నియ్యది ప్రౌఢుల కుపయోగించునది యనియుఁ నీ వ్యాకర్త యాశయము.

సంజ్ఞాపరిచ్ఛేదము—కల్పించుకొన్న పేర్లు సంజ్ఞలు; వానిం గూర్చి తెల్పు గ్రంథభాగము సంజ్ఞాపరిచ్ఛేదము. ముందుఁ జెప్పఁబోవు విష యములను సులభముగా గ్రహించుటకు ఏర్పఱచుకొన్న సంకేతములే యిచటి సంజ్ఞలు. వానింగూర్చి యీ ప్రకరణమున వివరింపఁబడును.

క. సత్యము శ్రేయము జనులకు;
సత్యము దక్కొండు లేదు సద్ధర్మ; మదే
యత్యలఘుతపఃఫల మిదు;
నిత్యతఁ బాటిల్లు దాన నిఖిలార్థంబుల్.

సత్యము శ్రేయము జనులకు— సత్యమే శ్రేయస్కరము; అదియే గొప్ప ధర్మము; గొప్ప తపస్సు చేసినందువలనఁ గలుగు ఫలము నీ సత్యమే యీయఁగలదు. దీనివలననే ప్రయోజనములు - చేసిన సత్కార్య ములు అన్నియుఁ స్థిరత్వము నొందును.

భగవంతుఁడు సత్యస్వరూపుఁడు కాన, నీ సత్యతత్త్వమును దెల్పి నచో భగవత్ప్రార్థన చేసిన ట్లగు ననియుఁ, అందువలననే వ్యాకర్త యీ పద్యమును గ్రంథాదిని గూర్చె ననియుఁ కొందఱి యాశయము.

వ్యాకరణగ్రంథమునకు—అందును ప్రాచీనపద్ధతిని విడిచి, వచనరూప మున వెలసినదానికిఁ దొలుత దైవప్రార్థనముఁ గూర్చుట వింతయే; కాని శ్రీ చిన్నయసూరి మార్గము ననుసరించి యిందును అది కూర్పఁబడినది.

అట్లయినను ఏ దేవునేని ధ్యానింపక సత్యస్వరూపమును వివరించుట వింతగనే యున్నది. దీనిని కొందఱు క్రిందిరీతిని సమర్థింతురు—'ఆంధ్రవ్యాకరణములు తొలుత సంస్కృతముననే రచింపఁబడుచు వచ్చినవి. చింతామణి, వికృతివివేకము లట్టివే! అవియే యితర లక్షణముల కాధారములు. ఆంధ్ర వ్యాకర్తలు సంస్కృతమున గొప్ప పండితు లగుటచేతను, ఆంధ్రవ్యాకరణపరిజ్ఞానమునకు సంస్కృతవ్యాకరణ సంప్రదాయము మూల మగుటచేతను, సంస్కృతమున సంగ్రహసూత్రరచన సులభమగుటచేతను తొలుత సంస్కృతమున సూత్రరూప వ్యాకరణమును రచించి దాని నా పిదప తెలిఁగించి గ్రంథములు వ్రాయ దొరకొనెడివారు. శ్రీ చిన్నయసూరి తన 'బాలవ్యాకరణము నకు స్వరచిత సంస్కృత సూత్రతతి మూల మని చెప్పియున్నాఁడు. 'బాలవ్యాకరణము' మంచి ప్రచారమునుగూడ పొందియున్నది.

'బాలవ్యాకరణ' ప్రశస్తిని సహింపని కొందఱు దానిని సంస్కృత కారికలలోనికి మార్చి 'హరికారిక' లని పేరిడి, శ్రీ చిన్నయసూరి యా కారికలనే తెలిఁగించె నని వింతవాదమును బ్రచారమునకుఁ దెచ్చిరి. ఇట్టి ప్రచారము శ్రీ సీతారామాచార్యులుగారినాఁటికే యుండెను. కాని సత్యప్రియుఁ డగు వ్యాకర్త అట్టి వాదమును నిరసించుచు అసత్యప్రచార మనర్థహేతు వని సూచించుచు గ్రంథాదిని సత్యస్వరూపమును వివరించినట్లు పెద్దలు చెప్పుదురు.

## ౧. ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః;

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

ఌకారగ్రహణము సంస్కృతప్రాకృతభాషావ్యాకరణజ్ఞులసమ్మతము. అయ్యది మంత్రశాస్త్రప్రసిద్ధము. యవలలవలె

రేఫంబును బ్రయత్నభేదంబుచే ద్వివిధంబుగాన శబ్దశాసనాదుల చేత నలఘురేఫము వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె. క్షకారము సంస్కృతవ్యాకరణములయందును, నిఘంటువుల యందును భాషాంతపదమధ్యమునందుఁ బఠింపఁబడుటం జేసి యది వర్ణాంతరము గాదు, సంయుక్తాక్షర మని తెలియవలయు.

౧ ఆంధ్రభాషకు = తత్సమ, తద్భవ, దేశ్యరూప మగు తెలుఁగు భాషకు; వర్ణంబులు= అక్షరములు. శ్రీచిన్నయసూరి బాలవ్యాకరణమున సంస్కృతమున నేఁబది వర్ణము లనియుఁ బ్రాకృతమునకు నలువది వర్ణము లనియుఁ జెప్పి, యచ్చతెలుఁగునకు ముప్పదియా అక్షరములను గ్రహించెను. ఋకారాదు లగు పందొమ్మి దక్షరములును సంస్కృతసమములతోఁ గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు నని చెప్పెను. ఈ విధముగా తెలుఁగునకు ఏఁబది యైదక్షరము లని ఎట్లును తేలుచున్నది. కావుననే ప్రౌఢవ్యాకర్త సంగ్రహముగ నిట్లు సూత్రింప దొరకొనెను.

ఈ యక్షరములలో 'అ' మొదలు 'ఔ' వఱకును గల యక్షరములు అచ్చులు; 'అఁ, అం, అః' అను మూఁడు నుభయాక్షరములు. 'క' నుండి 'ళ' వఱకును గల యక్షరములు హల్లులు. అచ్చులయొక్కయుం హల్లులయొక్కయుం ధర్మము కల వగుటచే ఉభయాక్షరముల కా పేరు వచ్చినవి.

ఌకారగ్రహణము——ఌకారమునకు దీర్ఘము లేదనియు,ఏ,ఐ, ఓ.ఔలకు హ్రస్వము లేదనియు సిద్ధాంతకౌముదియందుఁ జెప్పఁబడినది. కాని ఇచట ఌకారము గ్రహింపఁబడినది.అట్లు ఌకారమును వర్ణముగా గ్రహించు టకుఁ గారణము నీ వ్యాకర్త యిట వివరించుచున్నాఁడు. వివృతమగు ఌకా రమునకు దీర్ఘము లేకున్నను, ఈషత్ స్పృష్టమగు ఌకారమునకు దీర్ఘ ముండ వచ్చునని లఘుశబ్దేందుశేఖరమునఁ జెప్పఁబడినది; వరరుచిమతమునను, హేమ

చంద్రుని మతమునను ళ్రాకారము కలదు; ఇయ్యది మంత్రశాస్త్రమునందును ప్రసిద్ధము. కావున ళ్రాకారమును వర్ణసమామ్నాయమున గ్రహింపవచ్చును.

శ్రీ చిన్నయసూరి ప్రాకృతమునకుఁ జూపిన వర్ణములలో ౡ, ళ్రా లను గ్రహింపలేదు. ప్రాకృతమునను ళ్రాకారము కలదని వివరించుటకయి ప్రాకృత భాషావ్యాకరణజ్ఞులు ళ్రాకారమును గ్రహించి రని యిటఁ జెప్పఁబడినది. హేమచంద్రుఁడు సుప్రసిద్ధప్రాకృతవ్యాకర్త.

యవలలవ లె— శబ్దశాసనుఁడు చింతామణికర్త: చింతామణి యందు 'యరలవసహాళం తు హాల్వర్గః' అనుచోట యరలవలు నాలుగే గ్రహింపఁబడినవి; కాని శకటరేఫము గ్రహింపఁబడలేదు. 'యవల'అను మూఁడిటికిని లఘువు, అలఘువు అను రెండు భేదము లున్నవి. అట్లే రేఫమునకును రెండుభేదము లుండును. 'ర'లఘు రేఫము. 'ఱ'శకటరేఫము, లఘుయకారమును వేఱుగను, అలఘుయకారమును వేఱుగను గ్రహింపనట్లే రేఫమునుకూడ వేర్వేఱుగా గ్రహింపనక్కఱలేదనియు, రేఫము శకటరేఫమునకు గ్రాహకమనియు నభిప్రాయము. 'వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె' ననఁగా శకటరేఫము ప్రత్యేకాక్షరముగా గ్రహింపఁబడలే దనుట.

క్షకారము— కకార, షకారముల సంయోగమే క్షకారము కాన ఇది సంయుక్తాక్షర మగును; కాని ప్రత్యేకాక్షరము కాదు. కొందఱు క్షకారమును ప్రత్యేకాక్షరముగా గ్రహించి వర్ణసమామ్నాయమునందు దానినిగూడఁ జేర్చుదురు. కాని అది సరికాదు. నిఘంటువులలో క్షాంత పదము షకారాంత పదములనడుమనే పఠింపఁబడినది. వ్యాకరణములం దిది షకారాంతముగానే గ్రహింపఁబడినది.

౨. నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కార ప్రత్యయాంతములును, రవర్ణ మిఫ ప్రత్యయాంతమునగు.

ఉ/అకారమునకు ఉకారము వచ్చును, కకారమునకు గకారము, వచ్చును, లకారమునకు రేఫము వచ్చును మొ. ఆకారము, ఇకారము, అకారము, రేఫము మొ. తలచుగ ననుటచేఁ గేవల వర్ణోచ్చారణమునం దీ విధి నిత్యము కా దని తెలియునది.

వి. 'అకారాదు లచ్చులు; కకారాదులు హల్లులు-రేఫము' అనుకీతిని 'అ' మున్నగువానికంటె 'కార' ప్రత్యయము. 'ర'కంటె 'ఇఫ' ప్రత్యయము చేర్చి చిన్నయసూరి ప్రయోగించి యున్నాఁడు, కాని 'కార, ఇఫ' ప్రత్యయములను విధించు సూత్రములను రచింపలేదు. ఆ లోపము తీర్చుటకయి యిందు వానిని విధించుచు నీ సూత్రము రచింపఁబడుచున్నది.

ఒకదానిని గ్రహించి, దానికి ఏదైన కార్యమును నియమించినపుడు-దేనికిఁ గార్యము విధింపఁబడునో అది నిర్దేశ మగును; దానికి నియమింపఁబడిన విధి విధాన మగును. ఉచ్చారణ మనఁ బలుకుట. పయి నిర్దేశ, విధానోచ్చారణములయెడ సాధారణముగ 'అ' మున్నగు వానికి 'కార' ప్రత్యయమగును. 'ర' అనుదానికి 'ఇఫ' చేరును. 'కార, ఇఫ'లు ప్రత్యయములు. ప్రయోజనము ననుసరించి శబ్దము చివర విధింపఁబడు నక్షరముగాని, అక్షరసమూహముగాని ప్రత్యయ మనఁబడును. అది చివరఁ గలది ప్రత్యయాంతము. అనఁగాఁ బై సందర్భములందు 'అ, ఇ' మొదలైనవి అకారము, ఇకారము మున్నగు విధమునను, 'ర' రేఫ మనియుఁ బ్రయోగింపఁబడును.

అకారమునకు ఉకారము వచ్చును— ఇచట అకారము నిర్దేశము. ఉకారము విధానము. 'కకారమునకు గకారము వచ్చు' ననుచో కకారము నిర్దేశము; గకారము విధానము. 'లకారమునకు రేఫము వచ్చు' ననుచో లకారము నిర్దేశము, రేఫము విధానము. 'అకారము, ఇకారము' మున్నగునవి ఉచ్చారణమున కుదాహృతులు. ఇట్లు 'కార, ఇఫ' ప్రత్యయ

ములు చేరుట తెలుపుట నుండును. కొన్నియెడల ఆ యా అక్షరముల నున్న వాని నున్నట్లుచ్చరించినపుడు ఈ ప్రత్యయములు రాకపోవచ్చును.

చిన్నయసూరి బాలవ్యాకరణమునఁ జెప్పని యీ విషయ మిట చెప్పఁబడుట కొంత యనుచితమే. కాని సూరి కొన్నియెడల 'టుగాగమము, రుగాగమము, నుగాగమము' మున్నగువానిని - వాని యిత్సంజ్ఞలకుఁ గల ప్రయోజనమును దెలుపకయే ప్రయోగించి యున్నాఁడు. ఇందువలన వాని ప్రయోజనము తెలియవలసి యున్నది. కాని యేలకో యది వివరింపఁబడ లేదు. బాలవ్యాకరణమున నీ విషయము లెవ్వియుఁ జెప్పఁబడకుండుటకుఁ గారణము, ఆంధ్రవ్యాకరణ జిజ్ఞాసువులకుఁ గొంత సంస్కృతవ్యాకరణ పరిజ్ఞాన ముండు నను నభిప్రాయమే కావలయును.

## 3. ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు.

నిర్దేశవిధానంబులం గారేఫప్రత్యయములు రానియెడల హ్రస్వమునకు దీర్ఘము వచ్చు నని యర్థము.

ఉ. అ కు ఆ వచ్చును, క కు గా వచ్చును, ల కు లా వచ్చును.

3. ఒకచో—ఒక్కొక్కచోట-అనఁగా 'కార, ఇఫ' ప్రత్యయములు రానియెడ ననుట. అట్టిచోట్ల నున్న హ్రస్వము హ్రస్వముగా నుండక దీర్ఘ మగు నని యర్థము.

'అ' కు, 'ఉ' వచ్చును అనునపుడు 'ఆ' కు 'ఊ' వచ్చును అని చెప్పవలయు నని భావము. ఇట్లే తక్కినవియును.

ఈ సూత్రమునుబట్టి హ్రస్వము లన్నియును నిర్దేశాదుల దీర్ఘములు కావలసి వచ్చుచున్నది. కాఁగా 'ఋ, ౠ, ఐ, ఔ' లును మఱి, ఇ, ఈ లు

ఋకారసహితమ్మను చోట 'అ, ఆ, ఐ, ఔలును...ఈ, ఈలు-' అనురీతిని గావలసివచ్చుచున్నది. అట్లయినచో ఋద్యప్రయోజనము మృగ్యము. అచట అ, ఆ, ఇ, ఈ-మున్నగురీతినే యుండవలెను. మన వాడుకయందును 'అఆలు, ఇఈలు, ఉఊలు, ఋౠలు-అనురీతిని తొలుత హ్రస్వముతే ప్రసిద్ధములు. కావున నట్లు హ్రస్వము దీర్ఘమగుట కొన్నియెడలనే యనియుం దీర్ఘము కానివి కొన్ని యున్నవనియుఁ జెప్పవలెను. సూత్రములోని 'ఒకచో' అను దానికి 'కొండొకచో' అను నర్థమును గ్రహించుట మేలు.

## ౪. దీర్ఘంబు దీర్ఘంబ.

నిర్దేశవిధానవిషయము లయిన వర్ణములు దీర్ఘము లయ్యేనేని యవి యట్లే యుండు నని యర్థము.

ఉ. ఐకి ఔ వచ్చును. మొ.

౪. నిర్దేశవిధానోచ్చారణ విషయములగు నక్షరములు దీర్ఘములుగా నున్నయెడల అవి దీర్ఘములుగానే ఉండు నని యర్థము. ఉదాహరణము స్పష్టము. ఐ, ఔలు దీర్ఘముః లగుట సర్వజనవిదితము.

'క' అనుదానికి 'గ' వచ్చును—అనునపుడు 'కాకు,గా వచ్చు'నని చెప్పవలెను. 'కా' అనుదానికి 'గా' వచ్చును. అనునపుడు 'కా' కు 'గా' వచ్చుననియే చెప్పవలెను. కాఁగా హ్రస్వ దీర్ఘములకు భేదము కానరాకున్నది. తొలుత నేవి హ్రస్వములో ఏవి దీర్ఘములో ఆ యా సందర్భములం బట్టియే తెలిసికొనవలసి యున్నది.

## ౫. ఒకానొకచో జకారం బుభయంబు నగు.

శ్లేషయందు జకార మొక్కటియ యొక యర్థమున దంత్యమును, వేఱొక యర్థమునఁ దాలవ్యము నయ్యెడు నని యర్థము.

ఉ. 'అకట! పాండురాజయశ మెన్న వైతి!' రాఘ. ౧ ఆ. ౩౧. (ఇట జకారము భారతార్థమునందు దంత్యము, రామాయణార్థమునందుఁ దాలవ్యము నని యెఱుంగవలయు.)

సి. ఉభయంబు—దంత్యము, తాలవ్యము కూడ నగునది. జకారమునకుఁ గొన్నిచోట్ల దంత్యోచ్చారణము, తాలవ్యోచ్చారణముకూడనుండు నని భావము. ఈ యంశమే వివరణమునఁ దొలుతఁ స్పష్టీకరింపఁబడినది.

చిన్నయసూరి 'దంత్యతాలవ్యభేదములచే' చ-జ లను రెండు విధములఁ బేర్కొని, ఇ ఈ ఎ ఏలం గూడినవి తాలవ్యము లనియుం, అ ఆ ఉ ఊ ఒ ఓ లం గూడినవి దంత్యము లనియుం సూత్రించి యున్నాఁడు. ఇది యచ్చ తెలుఁగు విషయము. సంస్కృతమునందు తాలవ్యములగు చ జలే గాని దంత్యములు లే వని 'ఇ చ ఛ జ ఝ య శ అనువానికి స్థానము తాలువు' అను నియమము స్పష్టపఱుచుచున్నది. ఇట్లు తత్సమములో దంత్యములగు 'చ, జ'లు లే కున్నను, - ఇకారాంతశబ్దములకు బహువచనములలో ఉకారము వచ్చునపుడు మాత్రము తాలవ్యములు దంత్యము లగు నని చిన్నయసూరి పల్కెను. 'రాజి, వీచి' మున్నగువాని బహువచనములు 'రాజులు' వీచులు' అని, వ్యాకరణ నియమము ననుసరించి యగుచున్నవి. అట్టి జు, చు లు దంత్యములు కావచ్చును. మఱియుం రాజన్ శబ్దమునకుఁ దత్సమరూప మగు 'రాజు' అనునదిమాత్రము దంత్యముగాఁ గన్పడుచున్న దని సూరి తెల్పెను. అనఁగా నీ శబ్దము దంత్యజకారయుక్త మని నిరూపించుటకు మార్గాంతరము లేనందున నిట్లు సూరి నియమింపవలసి వచ్చె నని తోఁచుచున్నది.

చిన్నయసూరి సిద్ధాంతములను సవరించుటకుఁ బూనిన ప్రాక్ వ్యాకరణకర్త జకారం బుభయంబు నగు నని చెప్పవలసి వచ్చినది. ఏల యనఁగా-పింగళి సూరనార్యుని రాఘవపాండవీయమునందు 'అకట! పాండు

రాజయశ మెన్నవైతి' అని ప్రయోగము కలదు. అచట 'పాండురాజ!' అను భారతార్థమునందు జకారము రాజన్ శబ్దసంబంధి యగుటచే దంత్యమగును; 'పాండుర+అజయశము' అను రామాయణార్థమునందు అజ శబ్దములోని జకారము తాలవ్య మగును. కావుననే 'జకార ముభయము నగు' ననవలసి వచ్చెను.

బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికలో 'జకార ముభయము నగు' నను విషయము పరాస్త మయ్యెను. ఒకే సమయమున నొక్క యక్షరమునే దంత్యముగాను, తాలవ్యముగాను ఉచ్చరించుట సాధ్యము కా దనియు, పాండురాజశబ్దమునకు పాండురోగముచేఁ బ్రకాశించువాఁడా!' అను నర్థమే [నిందార్థమే] యుచిత మనియు, అప్పు డచటి జకారము తాలవ్యమే యగు ననియు, నిట్లు భారత, రామాయణార్థములు రెండింటను జకారము తాలవ్య మని చెప్పిననే కుదురుననియు గుప్తార్థప్రకాశికాకారుని యాశయము. కాని శ్లేషయందు నొక్కసారిగా విభిన్నోచ్చారణము సాధ్యము కానట్లు సభంగాభంగపదముల సమానోచ్చారణమును సాధ్యము కాఁజాలదు. శ్లేషలో నొకయెడ పదముల విఱు పావశ్యకము; వేఱొకయెడ విఱుపనే రాదుకదా! కావున శ్లేషలో నట్టివానిని పాటింపరాదు. 'శ్లేషే సబిందునిర్బిందోశ్లేషనం కుత్రచిన్మత' మను నభియుక్తోక్తియుఁ గలదు. అట్టిచో నుచ్చారణము వేఱగునంతమాత్రమున కుదురదనుట పొసఁగదు.

'పాండురాజ! యశమెన్నవైతి' అనుసంబోధనలో, దంత్యోచ్చారణ లేదనియుఁ, తాలవ్యమునే గ్రహింపవలెననియుఁ గొందరి మతము.

## ౬. రాజు వైకృతం బని కొంద ఱందురు *

(అప్పుడు తత్సమంబునందలి చ జ లు దంత్యములు కావని యూహించునది.)

* ఇది కూచిమంచి తిమ్మకవిమత మయినట్లు కానంబడుచున్నది.

ఉ. 'తే. రాజు చూడంగఁ జెప్పంగరాని కడిమి, నీఁటి యలఁ గ్రుమ్మి నొంచిరి లేటిమగల.' [illegible] మొ.

ఊ. రాజుశబ్దం బొక్కటి మాత్రము తత్సమములందు దంత్యయుక్త మగుటం జేసి, చిన్నయసూరి 'రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానం బడియెడి' నని ప్రత్యేకముగఁ జెప్పవలసి వచ్చినది; కాని యది వైకృత మని (అచ్చతెలుఁగని) యంగీకరించినచో నెట్టి చిక్కును లేదు. కూచిమంచి తిమ్మ కవి మున్నగువా రీ శబ్దమును తమ యచ్చతెలుఁగు కావ్యములలో వాడి యున్నందున నిది వైకృత మనవలె నని భావము. 'రాజు చూడంగ'నను నిందలి యుదాహృతి తెలగన రచించిన యచ్చతెలుఁగుకబ్బమగు యయాతి చరిత్రములోనిది. ఇది తత్సమమే యగుచో నచటఁ బ్రయోగింపఁబడుట పొసఁగదుకదా ?

కాని యీ మతము ప్రౌఢవ్యాకర్తకు సమ్మతము కానట్లు 'కొంద అందురు' అను వాక్యము తెల్పుచున్నది. 'రాజు' వైకృత మగుచో, దంత్యము కావచ్చును. 'పాండురాజు' శబ్దము తత్సమమే యగుటవలన తాలవ్యయుక్తమే యగును. అపుడు పింగళి సూరకవి ప్రయోగమును సాధించుటకు 'జకారం బుభయంబు నగు' నని సూత్రింప నక్కఱయే లేకుండ పోవును. కావున ప్రౌఢవ్యాకరణకర్త మతమున 'రాజు' వైకృతము కాదనవలెను.

## ౭. నకారం బసాధారణంబు ద్రుతంబు.

ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమయిన నకారంబు ద్రుతసంజ్ఞకం బని యర్థము. ద్రుత మనఁగా నొల్లని యెడ మఱఁగిపోవునది యనుట.

ఉ. ప్రత్యయాత్మక మైన నకారమునకు - తాను, నేను, ధనమును, వనమును, చదువుచున్నాను, చదువఁగలను. మొ. ఆగమాత్మక మయిన నకారమునకు - నన్నును, నాచేతను,

చదువుదును. చదువుచున్ను మొ. అవ్యయాత్మక మయిన నకార మునకు - అన్నయును, తమ్ముండును, మఱియును, ఏనియును మొ. వలయుచో నీ ద్రుతంబునందలి యుత్వంబునకు లోపం బగు. ఉన్నాను ఇత్యాదులయందు ద్రుతంబునందలి యుకా రంబునకు లోపంబు గలుగదు. శబ్దశాసనుఁడు 'ద్రుతాఖ్యో నః' అని కేవల నకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వ సిద్ధికై యని దెలియవలయును.

౭. అసాధారణంబు——సామాన్యము కానిది; సాధారణమైన నకారము ద్రుతము కా దనియు, విశేషవిశిష్టమగునదియే ద్రుత మనియు సూత్రాభిప్రాయము. వివరణమునం దావిశిష్టత తెలుపఁబడుచున్నది. ప్రత్యయ రూపముగాఁగాని, ఆగమరూపముగాఁగాని; అవ్యయరూపముగాఁగాని యున్న 'ను' అనునదియే (ఉకారముతోఁగూడిన నకారమే) ద్రుత మగు నని యర్థము.

చిన్నయసూరి ద్రుతాఖ్యో నః' అను చింతామణి సూత్రము నను సరించి 'నకారంబు ద్రుతం' బని మాత్రము చెప్పెను. కాని ఉదాహరణ ములంబట్టి చూచినచో ఉకారముతోఁగూడిన నకారమే ద్రుత మని యాతని యాశయ మైనట్లు స్పష్టమగుచున్నది.

చిన్నయసూరి 'నకారంబు ద్రుతం'బని చెప్పెంగాని, దాని స్వరూప మును వివరింపలేదు. కాన ఇచట 'ద్రుత మనఁగా నొల్లనియెడ మఱఁగిపోవు నది' అని వివరింపఁబడుచున్నది. అనఁగా—అక్కఱలేనిచో ద్రవించి, లోపిం చునది ద్రుత మని యర్థము. కావుననే 'వలయుచో నీ ద్రుతంబునందలి యుకారంబునకు లోపం బగు' నని చెప్పఁబడుచున్నది. కాని యట్టి లోపము వివక్షాధీనము. కావుననే 'ఉన్నాను' మున్నగుచోట్ల ద్రుతమును లోపింపఁ జేసి 'ఉన్నా' అని ప్రయోగింపరాదు.

చింతామణికర్త 'ద్రుతాఖ్యో నః' అని 'నకారము ద్రుత' మను నభిప్రాయమును సూచించి యున్నాఁడు. అచటఁ గూడ 'ఉత్వవిశిష్ట మగు నకారమే ద్రుత'మని గ్రహింపవలె నని శ్రీసీతారామాచార్యులుగారి యభిప్రాయము; అట్లయినచోఁ జింతామణికారుఁడు 'ద్రుతాఖ్యో నుః' అని చెప్పక 'నః' అని ఏల చెప్పవలసి వచ్చె ? నను ప్రశ్న కలుగకపోదు. కాన పరుష సరళములను జెప్పిన పిదప, నందు 'స్థిరా ఇతరే' అని చెప్పుటచే నకారమునకును స్థిరత్వము రావలసి యున్నందునను, 'ను' అను దానినే ద్రుతముగా గ్రహించినచో నకారమునకు స్థిరత్వము కలుగకపోవలసి వచ్చును కావునను, సామాన్య నకారమునకు స్థిరత్వమును సిద్ధింపఁజేయుటకై చింతామణిలో 'ద్రుతాఖ్యో నః' అని సూత్రింపఁబడెనని ప్రౌఢవ్యాకర్త వివరించుచున్నాఁడు.

(౮) అక ప్రత్యయాంతావ్యయంబు కళయ.

వ్యతిరేకార్థక భూతకాలికాసమాపకక్రియ ద్రుతప్రకృతికము కా దని యర్థము.

ఉ. 'ఉ కాదన కెట్టిపాటి యుపకారముఁ దక్షకుఁ డేక విప్రసం, బోధనఁజేసి చేసె.' భార. ఆది ౧ ఆ. ౧౨౮. 'హర్ష మదమానవిషాదములం జొరంగనీక తోలఁగఁ ద్రోవు.' భార. శాంతి ౨. ఆ. ౨౫౩. 'ప్రాణవ్యపాయంబు లేక తగ౯.' హరి. ఉ. 3 ఆ. ౨౦3. మొ. ప్రయోగము లిట్లుండ. 'క. అనఘుయిది యేటితప మ్మే, మనుపమదుఃఖితుల మగుట నాధారము లే,కను సంతానోచ్ఛేదం,బున ప్రేలెద మధమలోకముల తెరువు సన౯' భార. ఆది. ౨ ఆ. ౧3౯. ఇందు 'లేకను' అని ద్రుతాంతముగా నుండుటవలనం గొంద ఱయ్యది ద్రుతప్రకృ

తిక మని భ్రమియించెదరు.) (చూ. శబ్దపరిచ్ఛేదము. ౧౧౬-వ సూత్రము.)

౮. అకప్రత్యయాంతావ్యయంబు = క్త్వార్థముయొక్క వ్యతిరేక రూపమును దెల్పు నవ్యయము, కళయ = కళయే కాని ద్రుతప్రకృతికము కాఁజాలదు.

వ్యతిరేకక్త్వార్థకమున బాలవ్యాకరణాదులందు 'కజ్' ప్రత్యయమే (క) విహితము. అది పరముగా నున్నపుడు ఉకారము అకారముగా మాఱుచు 'అను+క=అనక' మన్నగు రూపము లగుచుండును. కాని యిందు ఉకారాదేశమగు అకారముతోఁగూడ 'క' ను గ్రహించి 'అక' ప్రత్యయాంతావ్యయం బని గ్రహింపఁబడినది. న్యాయముగ నిది 'క' ప్రత్యయాంతావ్యయం బని యుండ నగును.

వ్యతిరేకక్త్వార్థక 'క' ప్రత్యయాంతము లన్నియు కళలుగా గ్రహింప బడినవి. కాని భారతాదిపర్వమున 'అనఘ! యిది యేటి తప' మను పద్యమున 'లేకను' అని వ్యతిరేకక్త్వార్థకము ద్రుతాంతముగాఁ గనఁబడుచున్నందున అకప్రత్యయాంతంబులు ద్రుతప్రకృతికము లని కొందఱు భ్రాంతిపడిరి. ఆ భ్రాంతిని పోఁగొట్టుటకై యిచట నది కళయే యని చూపఁబడుచున్నది. 'లేకను' అనుచోటఁ గల 'ను' సముచ్చయార్థకము. సముచ్చయములు కళలగు నవ్యయములమీఁదను చేరుచుండును. ఈ యంశము ముస్ముందు వివరింపఁ బడును. కాఁగా వ్యతిరేకక్త్వార్థకము లన్నియును కళలే యగు నని తెలియ నగును. ఈ యంశము ఉదాహరణములమూలమున స్పష్టపఱుపఁబడుచున్నది.

కాదనక—అను+క = అనక: చొరంగనీక - ఇచ్చు+క = ఈక ప్రాణవ్యపాయంబు, లేక - కలుగు+క = లేక.

**⊕ ౯. తద్భవములందును నలఘురేఫము గలదు.†**

ఉ. కఱకంఠుఁడు, కాఱియ, గఱి, గొఱపము, గొఱ్ఱె. గోఱజము జీలకఱ్ఱ, పిఱికి, పెఱ, మోఱకు, ఱాఁగ, మొ; కఱకంఠుఁడు-గరళకంఠశబ్దభవము; కాఱియ-కారికాశబ్దభవము; గఱి-గరుచ్ఛబ్దభవము; గొఱపము - కురపశబ్దభవము; గొఱ్ఱె - కురరీశబ్దభవము, గోఱజము-గోరోచనాశబ్దభవము; జీలకఱ్ఱ-జీరకశబ్దభవము; పిఱికి - భీరుకశబ్దభవము; పెఱ - పరశబ్దభవము; మోఱకు - మూర్ఖశబ్దభవము; ఱాఁగ-లంకాశబ్దభవము మొ. (చూ. ప్రయోగములు - ఆంధ్రశబ్దరత్నాకరము)

౯. చిన్నయసూరి 'య ర ల వలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' నని సూత్రించుచు, నా సూత్రవివరణమున 'శకటరేఫము తత్సమతద్భవములందు లేదు' అని చెప్పి యున్నాఁడు. అలఘు (శకట) రేఫము తత్సమములం దెట్లును ఉండదు; కాని తద్భవములం దుండుట కనఁబడుచున్నది.* ఈ యంశమే యీ సూత్రము సోదాహరణముగ వివరించుచున్నది.

కఱకంఠుఁడు మున్నగునవి సంస్కృతభవము లగు పదములు. కఱకంఠుఁడు 'గరకంఠుఁడు' శబ్దభవమై యుండు నని ప్రౌఢవ్యాకర్తయాశయము. 'గరళకంఠ' శబ్దభవమని ముద్రణమున 'ళ' ఎక్కువగఁ బడి, గతానుగతికముగ నట్లే ముద్రింపఁబడుచు వచ్చినది' 'కఱకంఠుఁడు' పయిరీతిని తద్భవమగుటచే 'తద్భవములందు నలఘురేఫము కల'దని చూపుటకు ఉదాహరణ మగుచున్నది. కాని యిది యగ్రామ్యము కా దని ప్రౌఢవ్యాకర్తమతము కాదు. పెద్దలు

---

† తద్భవములందు ఱకారము లే దని చిన్నయసూరిమతము.

* వీని వివరణమునకై సీతారామాచార్యులవారి "అలఘుకౌముది" యను గ్రంథమును జూడుఁడు.

ప్రయోగమున నున్నందున నియ్యది యనింద్యగ్రామ్యమే యగును. శబ్ద రత్నాకరమున నియ్యది వైకృతగ్రామ్యముగఁ జూపఁబడినది. 'కఱకంఠ' శబ్దము తద్భవ మని చెప్పఁ బడి యున్నను, దీనిచివరఁ గల 'ఠ' కారము తద్భవము లలో నుండఁజాలదు. కావుననే దీని నగ్రామ్యము క్రింద గ్రహింప వీలు కాక పోయినది.

చిన్నయసూరి యిచ్చిన యుదాహరణము లన్నియు సంస్కృతాంధ్రపదముల సమాసములు కల వగుటచే నిట్టివి గ్రామ్యము లనియుఁ, బెద్దలు వీనిని ప్రయోగించినందున నివి గ్రాహ్యము లనియు నతఁడు తలఁచి యుండును. 'కఱకంఠుఁడు' తద్భవము గాక, మిశ్రబహువ్రీహి యని యాతని యాశయమై యుండవలెను. ఏల యన బాలసరస్వతీయాదులం దిది మిశ్ర బహువ్రీహిగాఁ జెప్పఁబడినది. ప్రౌఢవ్యాకరణకర్త మతమున నిది తద్భవ మగుటచే మిశ్రబహువ్రీహి కాఁజాలదు. బహువ్రీహిమాత్ర మగును. ఈ యంశమే ఇందలి సమాసపరిచ్ఛేదములోని ౫౭-వ సూత్రమున వివరింపఁ బడినది.

## ౧౦ కారము క్షారశబ్దభవము.*

ఇందు సారూప్యము గనఁబడెడి క్షారశబ్దము కటుశబ్ద పర్యాయంబు నగు. 'త్రిరాత్రముభయో రధశ్శయ్యా, బ్రహ్మచర్యమ్: క్షారలవణవర్జనఞ్చ.' అని ఆపస్తంబసూత్రవాక్యము.

౧౦. 'కారము' కటు శబ్దభవమైనట్లు బాలవ్యాకరణమునందలి ౧౯-వ సూత్రపు వివరణమునఁ గలదు. కాని యది క్షారశబ్దభవ మనుట యుచిత మని యీ సూత్రము విధించుచున్నది. క్షారశబ్దభవ మనినచో తత్సమ తద్భవముల సారూప్యము సరిపడు నని ప్రౌఢవ్యాకర్త యాశయము. 'క్షారము' అనునది కటు శబ్దమునకుఁ బర్యాయపదము కావచ్చును. క్షారపదమునకు 'కారము' అను

* కారశబ్దము కటుశబ్దవికార మని ప్రాచీనులు చెప్పిరి.

నర్థము ప్రసిద్ధము. అపస్తంబసూత్రమునందలి వాక్యమందుఁ గల 'క్షార లవణవర్జనం చ' అనుదానికి 'కారము, ఉప్పు విడువవలె నను నర్థమునే చెప్ప వలసియున్నది గదా !

## ౧౧. కోటపేఁటలు వైకృతములు

ఉ. కోట్టశబ్దభవము కోట. పింతాశబ్దభవము పేఁట. 'కోట్టారఘట్టహట్టాశ్చ' అని అమర త్రిలిఙ్గశేషము. 'పింతా విటజనాశ్రయః' అని అమరపదపారిజాతము. కోట్టశబ్దపర్యాయంబుగా సంస్కృతంబునఁ గోటశబ్దంబు నొక్కండు గానంబడియెడి. దానివలనఁ గలిగిన దందురేని యప్పు డది కుండలోనగు వానివంటి దని యెఱుంగవలయును. పేఁట శబ్దార్థము ప్రకృతి యగు పింతాశబ్దార్థముకంటె నించుక భిన్నముగా నున్నది. అది వికృతియందు సహజంబ. చూ. (వైకృతదీపిక.)

౧౧. చిన్నయసూరి త్రిలింగదేశవ్యవహారసిద్ధములగు పదములు దేశ్యము లని చెప్పుచుఁ దక్కిన కొన్నిశబ్దములతోఁ బాటు 'కోట, పేఁట' అను శబ్దముల నుదాహరించెను. కాని యివి దేశ్యములు కా వనియు, తద్భవములే యగు ననియు నిట ప్రౌఢవ్యాకర్త వివరించుచున్నాఁడు. 'కోట్ట' పదము త్రికాండశేషమునఁ గలదు; దానినుండి 'కోట' ఏర్పడినది; 'పింతా' శబ్దము అమరపదపారిజాతమునఁ గలదు. దానినుండి 'పేఁట' యేర్పడినది. కావున నియ్యవి దేశ్యములు కా వని ప్రౌఢవ్యాకర్తమతము. సంస్కృతమునందు 'కోట్ట' శబ్దమునకుఁ బర్యాయముగా 'కోట' అను శబ్దమును గలదు. దాని ననుసరించి 'కోట' తెలుఁగున తత్సమమే యేల కారాదు? అని సందేహము కలుగవచ్చును. 'కాని ''కోట'' తత్సమ మగునేని 'కోటము' కావలసియున్నది. 'కుండ' శబ్దము సంస్కృతమునను గలదు. అది తత్సమమగుచో 'కుండము,

అగును; వైకృతమగునపుడే 'కుండ' అగును. ఆ విధముననే 'కోట' వైకృతమైన దని గ్రహింపవలెను.

*'పేఁట'కుఁ బ్రకృతి యగు 'పింతా' శబ్దమునకు విటజనాశ్రయమర్థము; వికృతి యగు 'పేఁట'కు శాఖానగర మని యర్థము. ఇట్లు వికృతులగునపుడు ప్రకృతులయర్థము కూడ మాఱుట సహజము. ఈ యంశమే 'పేఁట శబ్దార్థము' అను వాక్యమున వివరింపఁబడుచున్నది.

ఇచ్చట 'కుమారదేవపండితీయము'న కోటశబ్దపర్యాయము కోటశబ్దము ఉండఁగా తెనుఁగులోని కోటశబ్దము తత్సమ మనక తద్భవ మనుట కర్థభేదమే కారణము' అని వ్రాయఁబడినది. కాని తత్సమమగు 'కోట'కే యర్థమో తద్భవమగు 'కోట'కు నదియే యర్థము. తెలుఁగులోని 'కోట' తద్భవ మనుటకు అర్థభేదము కాక ముప్రత్యయము చేరకుండుటయే కారణ మని గ్రహింపవలెను.

## ౧౨. ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁ దగు.

ఇయ్యది ప్రాణకుట్టకశబ్దభవము. అంచపదము అంచయాన లోనగువానివంటిది. (చూ. ఆంధ్రశబ్దరత్నాకరము.)

౧౨. 'ప్రాణగొడ్డము, అనింద్యగ్రామ్య' మని చిన్నయసూరి తెలిపియున్నాఁడు. ఇయ్యది గ్రామ్యము కా దనియుఁ 'ప్రాణకుట్టక' శబ్దభవమనియుఁ ప్రౌఢవ్యాకర్త చెప్పుచున్నాఁడు. హంసయాన, హంసపదము మున్నగు తత్సమములనుండి 'అంచయాన, అంచపదము' మున్నగు తద్భవము లేర్పడినట్లే యిదియుఁ నుత్పన్నమైన దని వివరణమునఁ దెల్పఁబడినది.

'కఱకంఠుఁడు' అనునది తద్భవమే యైనను, అందు 'ఱ' కార ముండుట వలన నయ్యది యగ్రామ్య మని చెప్పవీలుపడ లేదు. కాని 'ప్రాణగొడ్డ'శబ్దమున

* వీని వివరణమునుగూర్చి సీతారామాచార్యులవారి 'బాలచంద్రోదయము' అను గ్రంథమును చూడుఁడు.

అనాంధ్రవర్ణములు లేమింజేసి యిది యగ్రామ్య మనుట కెట్టి యాటంకము లేదు.

**(౧౩) కపిలశబ్దభవము కవిలశబ్దం బొండు గానంబడెడి.**

ఉ. 'అక్కఱ. అవసరజ్ఞుం డయి వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి, కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును, దవినయన్నువ నల్లనైన దీర్ఘఘ్రుఁదనువును జూచి, యువిద కన్నుంగవ మొగిచి తెఱవకయుండె భయమున.' భార. ఆది. ౫ ఆ. ౨౫౨.

౧౩. చిన్నయసూరి చూపిన యనింద్యగ్రామ్యపదములలో 'కపిల కన్నులు, కపిలగడ్డము, కపిలజడలు' అనునవి కలవు. అయ్యవి నన్నయభారత భాగములోని యొక యక్కరలోఁ బ్రయోగింపఁబడినవి. అయ్యవి యనింద్య గ్రామ్యములు కా వనియుం, అదుష్టము లనియుం నిరూపించుట కీ సూత్రము వ్రాయఁబడుచున్నది. 'కపిలశబ్దమునుండి' పుట్టిన 'కవిల' శబ్దం బొండు కల దని చెప్పినచోఁ బయి పదముల గ్రామ్యత పరాస్తమగు నని సీతారామాచార్యులు గారి యాశయము. మఱియుం 'కపిలకన్నులు' మున్నగువాని నంగీకరించినచో నన్నయ 'ప-వ' ప్రాసము నంగీకరించె నని యొప్పవలసి యున్నది. నన్నయ ప-వ ప్రాసము నంగీకరించినట్లు చెప్పుట సాహసము. అట్టి ప్రయోగములు కానరావు. వ్రాఁత ప్రతులను బాగుగఁ బరిశీలింపక ప-వ ప్రాసము నన్న యాంగీకృత మనుట సమ్మతము కాదు.

తిక్కన రచన యగు భారతశల్యపర్వమునఁ గల 'క. కపదోనలును గాండీవము, నవల నిడంబనుపు ముంద అరదము దిగు మేను పిదప డిగియొద శుభకర' అనుచోట 'ప-వ' ప్రాసము సుస్పష్ట మనియుం, నా రీతిని నన్నయ కాలమునఁగూడ 'ప-వ ప్రాస' మంగీకృతమై యుండు ననియుఁ గొందఱి

మతము. తిక్కన కంగీకృతమైనచో నన్నయకు నయ్యది యిష్టమే యని చెప్ప వలనుపడదు. ఇంతకును తిక్కన రచించిన పయి పద్యమున ప-వ ప్రాసము లేదు. అచట 'ఏన విదప-'అనునదియే సరియైన పాఠము. 'ఏను' శబ్దముపై నవధారణార్థమగు 'అ' చేరి 'ఏన' అయినది. కళలగు నవ్యయముల మీఁదఁ గూడ గసడదవాదేశము విధింపఁబడుటచే 'పిదప'లోని తొలి పకారము వకారమై 'విదప' అయినది. కాన ప-వ ప్రాసమున కియ్యది ప్రమాణము కాఁజాలదు. మఱియు 'ఏను పిదప' అని గ్రహించి 'ప-వ' ప్రాసమునకు దీని నుదాహరించుటయుఁ బొసఁగదు. 'ఏను' ద్రుతాంత మగుటచే దానికిఁ దర్వాత నున్న పకారమునకు సరళాదేశము వచ్చి 'ఏను బిదప' అయి తీరవలెను. కాఁగా నిట 'ఏన విదప' అను పాఠమే యుంచిత మని గ్రహింపనగును; దీనినే విద్వాంసు లందఱు నంగీకరించిరి. కాఁగా ప-వ ప్రాసము నన్నయకుఁగాని, తిక్కనకుఁగాని సమ్మతము కా దనియు; నన్నయ 'కవిలగడ్డంబును' మున్నగురీతినే ప్రయోగించియుండు ననియుం గ్రహింప నగును.

ఈ సందర్భమున 'కుమారదేవపండితీయము'న వివరింపఁబడిన విషయము సంగతముగా లేకున్నది.

## ౧౪. గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హంబగు.

ఉ. [1] 'మొక్కేము సామి.' రామా. ౨ ఆ. ౭. '[2]ఎ-గీ. ఇతని, సూసి నా మేలుబాగెము సేసినాము.' య. ౧. ఆ. ౧౨౦. మొ.

౧౪. లక్షణవిరుద్ధం బైన భాష గ్రామ్య మనియు, అట్టిభాష ప్రయోగానర్హం బనియు బాలవ్యాకరణమునందుఁ జెప్పఁబడెను. కాని విద్యాగంధము లేని గ్రామీణులు సంభాషించునపుడు లక్షణయుక్తముగ మాటలాడుట యెప్పు

---

1. మ్రొక్కెదము సామి. ముద్రితప్రతి పా.
2. వేగమును మేలు బాగెము సేశీయుంట, ము. పా.

డును పొసఁగదు కాన అట్టివారి వర్ణనసందర్భమున నా యా జాతులకుఁ దగినరీతిని గ్రామ్యమును వాడవచ్చునని యీ సూత్రమునఁ జెప్పఁబడు చున్నది. ఈ యంశమే అథర్వణాచార్యులవారి 'గ్రామ్యం తత్రద్విధా సాధు' అను సూత్రమువలనను దెలియుచున్నది.

'మొక్కెము సామి' మున్నగునవి యుదాహరణములు. ముద్రిత ప్రతులందు గ్రామ్యము ప్రయోగార్హము కాదను భ్రమచేఁ బరిష్కర్తలు కొన్ని మార్పులు చేసిరి. అయ్యవి అథసూచికయందు చూపఁబడినవి.

**౧౫ ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి.**

ఉ. "తే. అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి." జై. ౪. ఆ. ౭౧.

౧౫. తెలుఁగున అవ్యయములు, సుబంతములు, తిజంతములు, క్త్వా, తుమున్ మున్నగు ప్రత్యయాంతములు నగు సంస్కృతపదములను బ్రయోగింప రాదనియుం, అనుకరణసహితముగ సంస్కృతవాక్యమును మాత్రము ప్రయోగింపవచ్చుననియుం నాంధ్రశబ్దచింతామణిలోఁ గలదు. చిన్నయ సూరి యీ విషయమును దెలుపలేదు. పై విషయమును దెలుపుటకయి యీ సూత్ర మారంభింపఁబడుచున్నది.

కొన్ని చోట్ల అనుకరణము లేకుండఁగనే సంస్కృతవాక్యము ప్రయోగింపఁబడుచున్న దని చింతామణియాశయ మిందు నవరింపఁబడినది. ఈ విషయమున 'వినానుకరణం కేచి దార్యశబ్దా ప్రయుంజతే' అను వికృతివివేక సూత్రము మార్గదర్శియైన దని చెప్పవచ్చును. ఉదాహృతిలో 'అంటితి-పాపాత్మురాలి' అను రెండు పదములకును నడుమ అనుకరణరహితముగ 'నమశ్శివాయ' అను సంస్కృతవాక్యము ప్రయోగింపఁబడినది.

౧౬. జయపదం బనుకరణవిరహితంబ తెలుచుగ నగు.

ఉ. 'తరువోజ. జయ పూతనాఘాత జయ దైత్యదమన, దయనిమ్ము జీవితదానమ్ము నాకు.' హరి. పూ. ౭. ఆ ౫౧. 'మ. జయ నారాయణ పుండరీకనయనా శార్ఙ్గి జగన్నాయకా!' ఉ హరి. ౬. ఆ ౨౦. మొ. తెలుచుగ ననుటచే ఒక్కొకచో ననుకరణసహితంబు నగు నని యెఱుంగవలయు.

౧౬. సంస్కృతమునందలి 'జయ (జయింపుము)!' అను పదము సర్వసాధారణముగ అనుకరణము లేకయే తెలుఁగున వాడఁబడుచున్నదని సూత్రార్థము. 'వినానుకరణ'మ్మను వికృతివివేక సూత్రము నిది సవరించుచున్నది. 'జయ! పూతనాఘాత!' మున్నగునవి యుదాహరణములు. ఇయ్యెడ కుమారదేవపండితీయమున 'జయ ! పూతనాఘాత ! జయ దైత్యదమన ! దయనిమ్ము జీవితదానమ్ము నాకు' అను హరివంశోదాహృతభాగము తరువోజలోని యొక పాద మను భ్రాంతితో 'ఇందలి తరువోజపాదములో నేకాక్షరయతి పాటింపఁబడినట్లగపడదు' అని వ్రాయఁబడినది. ఆ వ్యాఖ్యాత మూలమును చూడకుండుటచే నిట్టి భ్రాంతి పొంది యుండవలెను. ఉదాహృతభాగము కేవల మొక్క పాదము కాదు. 'జయ పూతనాఘాత ! జయదైత్యదమన !' అనునది మూఁడవపాదములోని చరమభాగము; మిగిలినది నాల్గవపాదములోని తొలిభాగము. పూర్తి తరువోజను కనుఁడు - 'జయ సర్వభూతేశ జయ సర్వవరద ! జయ సర్వరక్షక ! జయ సరోజాక్ష !, జయ జగద్వందిత ! జయ జగన్నాథ ! జయ జగద్ధారక ! జయ విశ్వరూప !, జయ కృష్ణ ! గోపాల ! జయ మహాసత్త్వ ! జయ పూతనాఘాత ! జయ దైత్యదమన!, దయనిమ్ము జీవితదానంబు నాకు, తగ శరణాగతత్రాతవు గావె !'

కావున కుమారదేవపండితీయమునందలి మీఁది వ్రాఁత నిరాధారమని చెప్పవలసి యున్నది.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.

---

# సంధిపరిచ్ఛేదము

రెండు పదముల కవ్యవహితోచ్చారణము కలుగునపుడు వానినడుమఁ గలుగు మార్పు సంధి. తెలుఁగున సాధారణముగా నచ్చుల సంధియే కాన నగును. సాధారణముగ నిందు వర్ణలోపము కనఁబడుచుండును. ఆ సంధిని వివరించు గ్రంథభాగమే సంధిపరిచ్ఛేదము.

**(౧) శ్రేష్ఠతావాచకంబు లగు నార్యాంబాద్యర్థకశబ్దంబులు పరంబు లగుచో నన్ని యచ్చులకును సంధి నిత్యము.**

ఉ. రామయ్య, సామయ్య, సీతమ్మ, లక్ష్మమ్మ మొ. అది శబ్దము అన్న అక్క అప్పలను దెలిపెడు.

౧. చిన్నయసూరి అకారసంధి బహుళ మని చెప్పుటచేఁ గొన్నిటికి నిత్యసంధి యగు నని యూహింపవచ్చును; కాని బాలవ్యాకరణమున వికల్పసంధికిని, సంధిరామికిని సూత్ర ముదాహరణము లీయఁబడినవి. ఒకవేళ నా సూత్రముచే 'రామ + అయ్య = రామయ్య' మున్నగు రూపములను సాధింప వీలగునేమో కాని 'సామి + అయ్య = సామయ్య, లక్ష్మి + అమ్మ = లక్ష్మమ్మ' మున్నగు రూపములు సిద్ధములు కాఁజాలవు. కావున నిట్టి నిత్య సంధులను సాధించుటకై యీ సూత్రము వ్రాయఁబడుచున్నది. శ్రేష్ఠత్వమును దెలుపు 'అయ్య, అమ్మ' మున్నగు శబ్దములు పరములుగా నున్నపుడు అచ్చు లన్నిటికిని సంధి నిత్యముగా నగు నని సూత్రార్థము. అన్న, అక్క, అప్ప మున్నగు వానిని గూడ గ్రహింపవచ్చు నని వివరణము. సోమన్న సుబ్బక్క, వెంకప్ప మున్నగునవి వాని కుదాహరణములు కావచ్చును. ఈ సూత్రమునకు వికృతివివేకమునందలి 'సంధి ర్నిత్యం ప్రత్యయాచ స్తథార్యాదిగతస్య చ' అను సూత్ర మాధారము.

'కుమారదేవపండితీయమున నిట 'అమ్మాయి, అబ్బాయి, తాటాకు' మున్నగునవి ఉదాహరణములుగా ఈయఁబడినవి. అవి శ్రేష్ఠతావాచకములు కానందున చిన్నయసూరిగారి అత్వసంధిసూత్రమునకే ఉదాహరణములు కాఁదగియున్నవి. 'పొన్నాకు' నట్టిదే! 'అరఁటాకు, తాటాకు'లు శ్రేష్ఠతా వాచకములు కానందున నిట నుదాహరింపఁబడుటకుఁ బ్రసక్తి లేదు. మఱియు నట సంధి వైకల్పికము. 'అరఁటియాకు, తాటియాకు' అనియు నుండ వచ్చును. ఇవి యన్నియుఁ చిన్నయసూరిగారి అత్వసంధివిధాయకసూత్రమునకే ఉదాహృతులు కాఁగలవు.

శ్రేష్ఠతావాచకము లగు అంబాద్యర్థకములు పరమగుచో నిత్యసంధి లేకుండుటయుఁ గలదు. అమ్మాజమ్మ, అమ్మాజియమ్మ. అనుటయుఁ గలదు. 'అమ్మాజియమ్మ' అనునది తెనాలిరామకృష్ణుని ప్రయోగము. [పాండురంగ- ఆ. ౧. ప. ౬౭.]

(౨) ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి.[1]

భూతకాలికాసమాపకక్రియయొక్క యికారమునకుఁ బ్రామాణికప్రయోగములయందును గొన్నియెడల సంధి గనఁబడుచున్న దని యర్థము.

ఉ. 'చాపము నా కందిమ్మనుడు.' భార. విరా. ౪. ఆ. ౧౧౨. [2]వెఱ చిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు సాలించి యం,దఱు పాఱంగ.' నిర్వ. ౫. ఆ. ౮౮. 'ఎఱెంగెఱెంగి నా వలువిడి యేల కట్టుకొని వచ్చును దానవి.' భాగ. ౯. స్కం. ౫౧౫. 'శా. నేఁ డేతెంచు ప్రయత్నమున్న నకటా, నీచేతఁ జెప్పింపఁడే?' ప్రభా. ౪. ఆ. ౯౪౬. మొ.

---

1. ఆధునికులు కొందఱీ సంధిని ప్రయోగించియున్నారు. "చెట్టువట్టి పుడు." 2. వెఱ సిట్లంబుధి. పా.

౨. 'క్త్వార్థం బైన యిత్తునకు సంధి లే' దని చిన్నయసూరి చెప్పి యున్నాఁడు. కాని కొన్ని ప్రామాణిక ప్రయోగములందు క్త్వార్థేకారసంధి కానవచ్చుటచే దానిని సాధించుటకొఱకీ సూత్రము ప్రారంభిఁబడినది. కాని యిట నుదాహరింపఁబడినవానిలోఁ గొన్ని సరియగునవి కా వని యభిజ్ఞుల యభిప్రాయము. 'చాపము, నాకందిమ్ము' అనుచో 'అంది + ఇమ్ము' అని విడఁదీసి క్త్వార్థసంధిని చెప్పనక్కఱలేదు. 'అందిమ్ము' శబ్దపల్లవము. 'వెఱచి + ఇట్టు' అని గ్రహించి యిచట క్త్వార్థసంధిని జూప నక్కఱలేదు. ఇచట 'వెఱ నిట్టంబుధి నాథ-' అనియే యుచితమగు పాఠము. భారతములో 'ఎఱిఁగించిపుడే' అను దానిని కొందఱు క్త్వార్థేకారసంధి కుదాహరణముగఁ జూపుదురు. అచట ఎఱిఁగించి, తగన్' అని పాఠము కలదు. అదియే సరియైనది. కవిత్రయేతర ప్రయోగములందు మాత్ర మీ క్త్వార్థేకారసంధి కొన్నియెడలఁ గానవచ్చు చున్నది.

(3) కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి.

ఉ. 'మ. ఘనచక్రాయుధ నిష్ఠుర క్షత [1]గళద్రక్తార్ద్ర సర్వాంగు న్నిన్నుభూతా ప్రతిమప్రగల్భపరివాదాంతర్హితోద్వి క్రమున్.' ఉ. హరి. ౬. ఆ ౨౨౬. 'సర్వమున్నతని దివ్య కళామయ మంచు విష్ణునం,దుల్లముసేర్చి.' భాగ. ౭. స్కం. ౧౮౨. 'మ. తరుణీ శాత కటాక్షవీక్షలకొన ల్దార్కొన్న చోట్లుంబలె, న్నురుశోభావిభవాకరంబు లగుచున్ రోమాంకురస్థానముల్, పరఁగున్.' కళా. ౭. ఆ. ౧౦౮. (నన్నయభట్టారకుఁడు 'అన్నిష్టసఖి నూఁది యున్నదాని' అని ప్రయోగించి 'లుక్సం

1. గళద్రక్తార్ద్రసర్వాంగు న,భ్యనుభూతాప్రతిమప్రగల్భపరివాదాం తర్హితోద్విక్రమున్. వా.

శ్లేషా నాచి ద్రుతస్య' అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్య సూచనార్థం బని యెఱుంగునది.)

3. ద్రుతంబుమీఁద ద్రుతంబు కానవచ్చుచున్న దని చిన్నయ సూరి సూత్రించి యున్నాఁడు; కాని 'సర్వమున్నతని-' మున్నగు ప్రామాణిక ప్రయోగములందుఁ గానవచ్చుచున్న ద్రుతద్విత్వమును సాధింపలేదు. తత్సాధనకొఱకయి యీ సూత్ర మారంభింపఁబడుచున్నది. కొందఱు మహాకవులు ప్రయోగించుటవలన అచ్చు పరమగునపుడు ద్రుతమునకు ద్విత్వము నంగీకరింపవచ్చు ననియు, నిట్టిదానిని ప్రామాణికప్రయోగముల ననుసరించియే నిర్ణయింపవలయు ననియు సూత్రము నభిప్రాయము.

'ఘనచక్రాయుధ......' అను నీ హరివంశప్రయోగము ముద్రిత ప్రతులంబట్టి యీయఁబడినట్లు కానఁబడుచున్నది. ఇచట యతి తప్పినది. 'ఘన...... ధ్రక్తాస్య' అని యుండుట సరికాదు. సుప్రార్థప్రకాశికాకారులు నీ యపపాఠమునే గ్రహించియున్నారు. కాని యిచట 'అనుచుం గృష్ణుఁడు వోయినం బిదప బాణామర్త్యవైరిశును, ఘ్ననచక్రాయుధనిష్ఠురక్షతగళద్రక్తార్ద్రి సర్వాంగు న,భ్యనుభూత——'అని యుండవలయును. ఈ పాఠము నంగీకరించి నచో ద్రుతద్విత్వమున కవళ్యకత యుండదు. మఱియు 'గళద్రక్తాస్య 'సర్వాంగు' ననుటకంటె 'గళద్రక్తార్ద్రిసర్వాంగు' ననుటయే యుంచితమనియు, ఆ పాఠమే కవ్యభిప్రేత మనియు నభిజ్ఞులు గమనింపకపోరు.

'సర్వమున్+అతని దివ్యకళామయము-' ద్రుతద్విత్వము రాఁగా—— 'సర్వమున్నతని దివ్యకళామయము-' అయినది.

'చోట్టుంబలేన్+ఉరుశోభా-'ద్విత్వము వచ్చి 'చోట్టుంబలె న్నురుశోభా-' అయినది.

'నన్నయభట్టారకుఁడు చింతామణియందు 'లుక్ సంశ్లేషా నాచి ద్రుతస్య' అని సూత్రించియున్నాఁడు. అనఁగా అచ్చు పరముగా నున్నపుడు

ద్రుతమునకు లోపము గాని, సంశ్లేషముగాని యుండ దని అర్థము. సంశ్లేష మనఁగా మీఁది వ్రాల్తోఁ గలిసియుండుట. ఈ మీఁది సూత్రము ననుసరించి 'సర్వమున్నతని-చోట్లుంబలెన్నురుశోభా-' మున్నగు ప్రయోగములు అసాధువులు కావలసి వచ్చుచున్నది. కాని ద్రుతసంశ్లేషము లే దని చెప్పిన యాతఁడే 'అన్నిష్టసఖి' అని ప్రయోగించుటచే అచ్చు పరంబగునపుడు ద్రుతసంశ్లేషము నాతఁ డంగీకరించినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది" అని యిట్లు ప్రౌఢవ్యాకర్త చెప్పుచు అచ్చు పరమగుచో ద్రుతము సంశ్లిష్ట మగుట క్వాచిత్క మని వివరించి యున్నాఁడు. పయి విషయమునుబట్టి నకార ముత్వవిశిష్టమైనను గాకున్నను గూడ ద్రుత మగుచుండు నను అభిప్రాయము స్పష్టమగుచున్నది.

'అన్నిష్టసఖి' అనునది ౯-వ సూత్రమునకు ఉదాహరింపఁబడినది. ఇట్లుదాహరించుటలోఁ గారణము మృగ్యము.

"ఎకారాదిపదములగు 'ఎదుట, ఎల్ల' మున్నగునవి చింతామణికారుని మతమున 'యెదుట, యెల్ల-' అనురీతి యకారాది పదములే యనియు, నట్టియెడ ద్రుతసంశ్లేషము నంగీకరించినచో 'నిలిచెన్యెదుట' మున్నగురీతి ననిష్టరూపములు సంభవింపవచ్చు ననియు, అట్టివానిని వారించుటకే 'లుక్స్యం శ్లేషో నాచి ద్రుతస్య' అను సూత్ర మారంభింపఁబడిన దనియు, కాఁగా 'లుక్స్యంశ్లేషౌ నాచి' అను సూత్రంబునకు విషయస్థలంబులు - ఎకారస్వరాదియైన శబ్దంబులే యనియు" గుప్తార్థప్రకాశికాకారుల యభిప్రాయము.

## (౮) చిట్టడవిఁ జిట్టి.

ఇయ్యది తదితరంబులకును నుపలక్షణం బని యెఱుంగునది.

ఉ. చిట్టడవి, చిట్టాముదము, చిట్టీఁదు, చిట్టుడుకు, చిట్టెలుక, చిట్టెలకి ఇత్యాదులందుఁ బూర్వపదంబు చిట్టిశబ్ద మని

యర్థము. ఇవి సంజ్ఞావాచకములు గాన సంధి నిత్యము. హల్లు పరంబగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికంబు. చిట్టిచాఁప, చిటిచాఁప. చిట్టితాళము, చిటితాళము. మొ.

౪. 'చిట్టడవి, చిట్టెలుక, చిట్టేలకి' మున్నగువానిలోని తొలిపదమును 'చిఱు'గా గ్రహించి చిన్నయసూరి - పయి రూపములను సాధించుటకయి 'కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల ఱ-డ ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు' నని బాలవ్యాకరణమున సూత్రించెను. పయి యుదాహృతులలోని తొలిపదము 'చిట్టి' యగును గాని 'చిఱు' కా దని ప్రౌఢవ్యాకర్తమతము. 'చిట్టి' లోని ద్విత్వమునకు హల్లు పరమగుచో లోపంబు వికల్పముగా వచ్చి 'చిటిచాప, చిటితాళము' మున్నగు రూపములు సిద్ధించు ననియు, దీనింబట్టి 'చిట్టి' యనుటయే యుచిత మనియు నాతని తలంపు; 'చిట్టి + ఎలుక, చిట్టి + అడవి' అనురీతి నున్నపుడు ఇకారాంతములగు తొలి పదములకు సంధి వికల్పముగా వచ్చును. 'చిట్టియెలుక, చిట్టియడవి' మున్నగు రూపములు కావలసియున్నవి. కాని పైవి సంజ్ఞావాచకము లగుటచే నిత్య సంధి కలుగు నని సూత్రకారుఁడే వివరించెను.

కాని భాషాతత్త్వశాస్త్రవేత్తల సంప్రదాయము ననుసరించి చూచి నచో 'సిట్టు, కుట్టు,' అనునవే ప్రాచీనరూపములు. అవియే రానురాను కొన్ని యెడల 'చిఱు, కుఱు' మున్నగురీతిని మాఱినవి. కొన్నిచోట్ల 'చిట్టు - కుట్టు' మున్నగురీతిని ద్విరుక్తటాంతము లయి యున్నవి. ఈ తత్త్వము గుర్తించి నచో 'చిట్టాముదము, చిట్టుడుకు' మున్నగునవియు సుసిద్ధము లగును. కానఁ బ్రత్యేకముగ నిట్టియెడ 'చిట్టి'ని గ్రహించుట యనావశ్యకము. అది భాషాతత్త్వసంప్రదాయవిరుద్ధము.

**౫. కొన్ని యెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గదవలు గానంబడియెడి.**

కొన్ని యెడల ననఁగాఁ బ్రాసంబులం దని యర్థము.

ఉ. 'వీ, రల్గోపించిన నంతకుఁడుఁ జెడు; మీ రా యోర్చు వారు?' ఉ. హరి. ర. ఆ. ౫౩. 'ఇట్లు దపంబు సేయుచుండుదు.' నిర్వ. ౫. ఆ. ౧. 'వే వణములు', విజ్ఞా. ప్రా. కాం. ౪౯. మొ.

౫. 'తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రా' వని చిన్నయసూరి సూత్రించి యున్నాఁడు. ఆ సాంస్కృతిక పరుషములకు గసడదవాదేశము బహుళముగా 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు' నను సూత్రముచే రావలసియుండఁగాఁ బయి సూత్రముచేఁ జిన్నయసూరి నిషేధించెను. కాని కొన్ని ప్రామాణిక ప్రయోగములందుఁ దెలుఁగులమీఁది సాంస్కృతికశబ్ద సంబంధు లగు 'క-త-ప' లకును 'గ-ద-వ'లు కాన వచ్చుచున్నందున ప్రౌఢవ్యాకర్త యీ సూత్రమును వ్రాయవలసి వచ్చెను.

వీరల్ + కోపించిన = వీరల్గోపించిన - ఇట్లు + తపంబు = ఇ, ట్లు దపంబు-, వే + పణములు = వేవణములు. ఇచట నుదాహరింపఁబడిన వన్నియుఁ బ్రాసస్థానమున నున్నవే!

**౬. కొన్ని యెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చతపలకు సదవలు గానంబడవు.**

ఉ. [1]'అందచందములు.' అని. ౫. ఆ. ౯౧. 'అప్పా చెల్లెండ్రు.' నిర్వ ౩. ఆ. ౭౭. 'కండతుండెములు,' *రామా. [2]'శాకపాకలు.' భాగ. ౧౦. స్కం. మొ.

---

1. సందములు. పా. *రామా : లో కానరాదు. చూడుము. రా. వి. ౩ ఆ. ౭౪. 2. కళా. ౨ ఆ. ౪౨.

ఉ. 'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' నని బాలవ్యాకరణమునఁ జెప్పఁబడెను. ఆ విధి నిత్యమైనట్లు చిన్నయసూరి తలఁచె నని తోఁచుచున్నది. కాని కొన్నియెడల నట్టిచోట్ల 'చ-త-ప' లకు 'స-ద-వ' లు రాకుండుట కానవచ్చుచున్నందున నట్టివానిని సాధించుటకొఱకీ సూత్ర ముద్దేశింపఁబడినది. దీనింబట్టియే 'అందచందములు, అందసందములు'గా మాఱలేదు. 'అప్పాచెల్లెండ్రు' అట్లే యుండినది. 'కండతుండెములు, కండదుండెములు' కాలేదు. 'రాకపోకలు, రాకవోకలు'గా మాఱలేదు.

## ౭. సర్వపర్యాయం బయిన యెల్ల శబ్దమునకు సప్తమియు, అసమాసంబున విశేష్యములకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు.

ఉ. 'తే. ఎఱిఁగె సకలశాస్త్రంబుల [1]నెల్లయందు, నధికసాత్త్వికుఁ డస్తికుఁ డనఁగ జనులు' భార. ఆది ౨ ఆ. ౧౬౨. తే. ఎల్లయందును దా వసియించుకొల్ల, యదియుఁ దనయందు వసియించు టండ్రు వాసు, దేవుఁ డనుపేరి కర్థంబు.' భార. ఉద్యో. ౨ ఆ. ౩౨౪. 'నే నొకఁడనే భిక్షానకుఁగ వత్తునో, యెల్లఁగ శిష్యులఁ గొంచువత్తునో.' భీమ. ౨ ఆ. ౧౨౦.

౭. ఎల్లశబ్దము ద్రుతాంత మగు నవ్యయ మనియుం, అయ్యది సమాసమునందే విశేష్యమునకు ముందు ప్రయోగింపఁబడు ననియుం, సమాసము లేనపుడు విశేష్యమునకు బిదప నుండు ననియుం బాలవ్యాకరణమునఁ జిన్నయసూరి చెప్పియున్నాఁడు. ఆ విషయ మీ సూత్రమున సవరింపఁబడుచున్నది. 'సర్వము' ను నర్థము నిచ్చు 'ఎల్ల' శబ్దము సప్తమిం బొంది 'ఎల్లయందు' అని యగుననియుం, సమాసము కానపుడుకూడ నది విశేష్యమునకు ముందుగాఁ

1. ఎల్లనెందు అని పా.

ప్రయోగింపఁబడు ననియు నియ్యది ద్రుతాంతము కా దనియుఁ ప్రౌఢ వ్యాకర్తమత మని చెప్పవలసి యున్నది.

'ఎఱిఁగె సకలశాస్త్రంబుల నెల్లయందు-' అనునది సప్తమి వచ్చుట కుదాహృతి. చిన్నయసూరి మతము ననుసరించి కాఁబోలు కొందఱు పరిష్కర్తలిచట 'ఎల్లనెందు-' అను పాఠమును గల్పించిరి. 'ఎల్లయందును దావసియించుటెల్ల-' అనునది యుదాహరణాంతరము. 'ఎల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ-' అనునది యసమాసంబున విశేష్యమునకు ముందు 'ఎల్ల' ప్రయోగింపఁబడుట కుదాహరణము. ఇచటి 'ఎల్లన్' లోని ద్రుతము ప్రకృతిసిద్ధము కాదనియుఁ 'ఎల్ల'కు సముచ్చయము చేరఁగా నేర్పడిన దనియుఁ గొందఱు వ్యాకర్తల సిద్ధాంతము.

**(౨.) తామర కాకు పరంబగునపుడు పుగాగమం బగు**

ఉ. 'ఉ. తామరపాకునీరువలెఁ దల్లడమందిరి పౌరులందఱున్.' ఉ. హరి. 3 ఆ. 3౫.

౨. 'తామర+ఆకు' అని యుండఁగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' నను బాలవ్యాకరణసూత్రముచే సంధి వచ్చి 'తామరాకు' అని మాత్ర మగుచున్నది. 'తామరపాకు నీరువలె' వంటి ప్రయోగము లుండుటంబట్టి వానిని సాధించుటకీ సూత్రము వ్రాయఁబడుచున్నది. 'తామర+ప్+ఆకు= తామరపాకు' - పుగాగమము మొదటిపదము చివఱనే చేరుచుండును.

ఈ సూత్రము పాక్షిక మగును. పుగాగమము రానపుడు 'తామరాకు' అగు నని గ్రహింప నగును.

**(౩.) తఱచుగఁ గర్మధారయసమాసంబునం బెన్వాదుల కడ హల్లున కచ్చు పరం బగునపుడు ద్విత్వంబు గానంబడియెడి.**

ఉ. 'పెన్నదరులు' రా. యు. కాం. ౧౧3౧. [1]'పెన్న రదము.' రుక్మాం. 3 ఆ. ౧౮౦. 'పెన్నుద్ధి', పాండు. 3 ఆ. ౬. "పెన్నూఁత." శివ. ౨ ఆ. [2]'పెన్నొడలు' భోజ. ౬ ఆ. 3౨౯. 'కన్నాకు' (కను+ఆకు.) భార. భీష్మ. ౧. ఆ. ౭౬. 'పల్లఱపు.' (పలు+అఱపు) హరిశ్చ. ౪ ఆ. ౧౦౯. మొ,

తఱచుగ ననుటచే, 'అన్నిష్టసఖి నూఁదియున్న దాని.' (అను+ఇష్టసఖి) భార. ఆది. 3. ఆ. ౧౪౦. 'అన్నుర్వీశుఁడు' నిర్వ. ౫ ఆ. "పెన్నురము" రా. యు. కాం. ౧ ౧౪. ఇత్యాదులు గ్రాహ్యంబులు (పెను పెనుపుశబ్దము లుప్తశేషము.)

౯. 'సాధారణముగాఁ గర్మధారయ సమాసమునందు అచ్చు లోపించిన 'పెను' మున్నగువానికి ('పెన్' మున్నగు వానికి) అచ్చు పరమగుచో ద్విత్వము కానవచ్చుచున్నదని సూత్రార్థము. ఇచటి 'పెను' అనునది 'పెనుపు' శబ్దముయొక్క లుప్తశేషమని-అనగా 'పు' లోపింపఁగా 'పెను' మిగిలిన దని, దానినే సూత్రములోని 'పెను' అనుదానిచే గ్రహింపవలె నని వివరణమునఁ జెప్పఁబడినది.

'పెనుపు+అదరులు' అనుచో 'పు' లోపించఁగా 'పెను+అదరులు' అగును. 'కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే క్వచిత్' అను చింతామణి ననుసరించి ఉకారలోపము రాఁగా 'పెన్+అదరులు' అని యుండును. పిదప నీ సూత్రముచే నకారమునకు ద్విత్వము రాఁగా 'పెన్నదరులు' అగును. ఇట్లే తక్కినవానిని గ్రహించునది.

'అను' మున్నగునవి పయి పెన్నాదులలోఁ జేరలేదు. అయినను వాని కడహల్లునకు ద్విత్వము గానవచ్చుచున్నది. ద్విత్వము రానిచో 'అన్నిష్టసఖి' మున్నగు రూపములు సిద్ధింపవు. ఇట్టివానిని సాధించుటకొఱకే సూత్రమున 'తఱచుగ' అను పదము చేర్పఁబడినది. తఱచుగఁ బెన్నాదుల కడహల్లునకు

---

1. పెన్నురువులు. రా. యు. కాం. 3. 2. పినొ్న్నడలికి. పా.

ద్విత్వము కలుగు ననియు, తక్కినవానికిఁగూడ నొకొక్కయెడ నీకారత్వము కలుగవచ్చు ననియు నభిప్రాయము. ఈ విషయమే 'కఱచుగ' ననుటచే 'అన్నిషష్ఠి నూఁదియున్నదాని' 'ఇత్యాదులు గ్రాహ్యములు' అని వివరణమునఁ జెప్పఁబడినది.

**(౧౦) కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబునకు లోపంబు నగు.**

ఉ. 'గోకులమిల్లిలు [1]దప్పకుంట లక్ష్మీపతి గృష్ణురుఁ గడియనేపున రేపున.' హరి. పూ. ౫ ఆ. ౨౦౩. 'సీ. దినవెచ్చమునకునై తనమేనఁ గల సొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువనైచు' పాండు. ౩ ఆ. ౧౬. 'శిరసందం బరయఁగా.' కళా. ౭ ఆ. ౧౨౬. మొ.

౧౦. చిన్నయసూరి 'షష్ఠీసమాసమునం దుకార, ఋకారముల కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు' నని నుగాగమమును నిత్యముగా విధించెను. ఆ యాగమము రాని ప్రయోగములు కొన్ని కానవచ్చుచుండుటచే నట్టివానిని సాధించుకొఱ కీ సూత్రము చెప్పఁబడుచున్నది. 'షష్ఠీసమాసములో ఉకారమునకు అచ్చు పరముగా నున్నను నుగాగమము రాకుండుట కొన్ని యెడలఁ గల' దని సూత్రార్థము.

'గోకులము + ఇల్లిలు' అనుచోట 'గోకులమునిల్లిలు' అని నుగాగమము రావలసి యుండఁగా అది రాక 'గోకులమిల్లిలు' అని యైనది. 'బచ్చు + ఇంట= బచ్చునింట' అని కాక నకారరహితముగ 'బచ్చింట' అయినది. 'శిరసు + అందంబు = శిరసునందంబు' కాకుండ 'శిరసందంబు' అయినది.

---

1. దప్పకుండ. పా.

## ౧౧. పూ పూవు.

అసమాసంబునం బూశబ్దము పూవుశబ్దముయొక్క పర్యాయముగాఁ గానంబడియెడి నని యర్థము.

ఉ. "ఎ, గీ. కాలకంఠుని శిరసుపూ గగనగంగ." కాశీ ౧ ఆ. ౨.

౧౧. బాలవ్యాకరణమునందు 'సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళముగా నగు' నని సూత్రింపఁబడి యుదాహరణములలో 'పూవు+రెమ్మ=పూరెమ్మ' అని యగు నని చూపఁబడి నది. కాఁగా 'పూవు' లోని, 'వు' కారము సమాసమున లోపించుట కల దని చెప్పినట్లయినది. 'పూవు' సమాసములందు పూర్వపద మగునపుడే 'వు' లోపించు ననియం చెప్పినట్లయినది. ఈయి యభిప్రాయమును సవరించుట కీ సూత్రము చెప్పఁబడుచున్నది.

'పూవు' శబ్దములోని ఏకాక్షరశేషమగు 'పూ' అనునది 'పూవు' శబ్దమునకు బర్యాయముగా నుండు నని సూత్రముయొక్క అర్థము. వివరణమునందు అసమాసమునను నిట్లగునని చెప్పఁబడినది. అనఁగా ప్రాఁతాదులంను పతె సమాసమునఁ బూర్వావయవము కాకున్నను 'పూవు'లోని 'వు' లోపింపవచ్చు నని భావము. 'కాలకంఠునిశిరసుపూ గగనగంగ' అను ప్రయోగమున 'పూవు' ఉత్తరపదముతో సమాసము పొందకున్నను అందలి 'వు' లోపించె నని చూపఁబడినది.

## ౧౨. సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడును నుగాగమాదులు గానంబడియెడి.

ఉ. ముంగోపము, వింజామరము. మొ. (వెల్ల+చామరము.) సంధియందు వర్ణవికారము, (చూ. సమాసపరిచ్ఛేదము. ౭. సూ.)

౧౨. చిన్నయసూరి 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు' నని సూత్రించుచు 'లుప్త శేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు' నని విధించి యున్నాఁడు. ఆ సూత్రద్వయమునకు నీయఁబడిన యుదాహరణములంబట్టి ప్రాఁతాదులకు అచ్ఛికములతోడి సమాసము కలుగునపుడే మీఁది కార్యములు కలుగు నని చిన్నయసూరి తలఁచినట్లు భ్రాంతిపడ నవకాశము కలదు. ఆ భ్రాంతిని తొలఁగించుటకై యీ సూత్రము చెప్పఁబడుచున్నది.

సమాసమునందుఁ దత్సమశబ్దము పరముగా నున్ననుగూడ నుగాగమము మున్నగునవి కానఁబడుచున్న వని సూత్రార్థము.

ఇచట ముద్రితప్రతు లన్నిటియందును 'నుమాగమాదులు' అనియే గలదు. కాని సంధిపరిచ్ఛేదమున నెచ్చటను నుమాగమము విధింపఁబడనందున 'నుగాగమాదులు' అని యుండుటయే యుచితము. ఆదిశబ్దముచే ఆద్యక్షరము మిగులుట మొదలగువానిని గ్రహింపవలెను.

'ముందు + కోపము-' ఆద్యక్షరశేషలోపము-'ము + కోపము' నుగాగమము, ద్రుతకార్యమును, 'ముంగోపము.' ఇట 'అఁట, యిఁక, చుఁడు' అను బాల వ్యాకరణసూత్రము ననుసరించి నిండుసున్న. 'వెల్ల + చామరము' ఆద్యక్షరశేష లోపము - 'వె + చామరము' సంధియందు వర్ణవికారము. 'వి + చామరము' నుగాగమము, ద్రుతకార్యము, పూర్వమువలె నిండుసున్న 'వింజామరము.' (వీఁచు + చామరము=వింజామరము అని యనుట యుచిత మని కొందఱు.)

**౧౩. అను కొను లోనగు ధాతుజ విశేషణముల యంత్యో కారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు.**

ఉ. 'గిరివ్రజమున్పురంబు.' భార. సభా. ౧ ఆ. ౧౭౨. "జడిగొను కోర్కుల నింతి తాను మగవేషంబూని.' సత్య. 3 ఆ.

౧౦౫. తోడువింటి వాఁడు చన్ త్రోవఁ బోక' ఆము. ఉ. ఆ. ౭౮.

౧౩. 'పదాంతంబులయి యసంయుక్తంబు లయిన ను-రు-లు'-ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు'నని బాలవ్యాకరణమునఁ బ్రకీర్ణ పరిచ్ఛేదమునఁ గలదు. కాని 'ను' చివరగాఁ గల కొన్ని శబ్దములకు సమాసము నందును ఉత్వలోపము కానవచ్చుటచే, అట్టివానిని సాధించుటకై యీ సూత్ర మారంభింపఁబడినది.

'అను, కొను' మొదలగు ధాతుజవిశేషణముల చివర నున్న ఉకారము హల్లు పరముగా నున్నపుడు వికల్పముగా లోపించు' నని సూత్రార్థము.

గిరివ్రజము + అను + పురంబు=గిరివ్రజమన్పురంబు; జడిగొను + కోర్కులన్=జడిగొన్ కోర్కులన్, చను + త్రోవన్=చన్ త్రోవన్. ఇచట ఉత్వ లోపము లేక 'గిరివ్రజ మను పురంబు, జడిగొను కోర్కులు, చనుత్రోవ' అను రీతినిగూడ నుండును.

## ౧౪. నెన్నడాదులన్ నెఱి దగు.

నెన్నడ, నెన్నడుము ఇత్యాదులయందు నెఱిశబ్దము పూర్వపదంబుగా నుండుట యుక్తమగు నని యర్థము. నెఱి పూర్ణార్థకము, నెఱి రమ్యార్థకము.

౧౪. బాలవ్యాకరణమున 'అన్యంబులకు సహిత మిత్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' నను సూత్రమున కీయఁబడిన యుదాహృతులలో 'నెఱి + నడుము = నెన్నడుము' అని యుదాహరింపఁబడినది. కాని 'నెన్నడ, నెన్నడుము' మున్నగు సమస్తపదములందలి పూర్వపదము 'నెఱి' యగును కాని 'నెఱి' కా దని తెల్పుటకు 'నెన్నడాదులన్ నెఱి దగు' నని సూత్రింపఁబడినది. 'నెఱి' అనఁగా 'అందమైన' అనియు, నెఱి' అనఁగా'

'నిండైన' అనియును నర్థము. కాన నెఱి + నడ = నెన్నడ' అగు ననవలెను. ఇచటఁ గావలసినది 'అందమైన నడక' కాని 'నిండు నడక' కాదు. ఇట్లే 'నెఱి+నడుము = నెన్నడుము' ఇచ్చటను అందమైన నడు మని యర్థము. నిండు నడుము' వికారలక్షణము; సౌందర్యలక్షణము కాదు.

'బాలవ్యాకరణమున క్రొత్తాది సూత్రోదాహృతములలో నెఱి+నడుము అని యుఁన్న' దని కుమారదేవపండితీయమున వ్రాయఁబడుట పొరపాటు.

## ౧౫. కొన్ని యెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వ పదాంత్యడకారంబు నకారం బగు.

ఉ. రెన్నాళ్లు. 'క పదిదినము లైదు ప్రొద్దులు, పదపడి రెన్నాళ్లు నొక్క పగలుఁ రేయుఁ.' భార. ఆది. ఆ ౧. ౯౮. మూన్నాళ్లు. 'ఎ. గీ. చెఱఁగుమాసిన మూన్నాళ్ళ సిగ్గుతోడఁ, బతివిలోకనమార్గంబు పరిహరించి.' కాశీ. ౨ ఆ. ౭౨. వేన్నీళ్లు. 'తే. ఏళ్లనీళులనొండె వేన్నీళ్లనొండె, గడువ ఱాతఁ దోమిన నొండెఁ గలుగు శుద్ధి.' మార్క. 3 ఆ. ౨౫౪.

౧౫. 'రెండు+నాళ్లు = రెన్నాళ్లు; మూఁడు+నాళ్లు=మూన్నాళ్లు; వేఁడి+నీళ్ళు=వేన్నీళ్ళు' అను రూపములు ప్రామాణిక ప్రయోగములందుఁ గాన వచ్చుచున్నవి. కాని వీనిని సాధించు సూత్రము లెక్కడను లేవు. కావున నిట్టివానిని సాధించుటకయి యీ సూత్రము చెప్పఁబడుచున్నది. 'న' అను వర్ణము పరముగా నున్నపుడు దానికి ముందున్న పదముయొక్క చివర నున్న డకారము నకారముగా మాఱు నని సూత్రార్థము.

ఇచటి డకారము అచ్చుతోఁగూడిన డకారమే యనియుఁ, ఆ డకారమునకు ముందు బిందు వున్నయెడల ఆ బిందువుతోఁగూడ డకారము లోపించు ననియుఁ గ్రహింపవలెను.

'రెండు + నాళ్లు' అనుచోట 'ండు' అనుదానికి నకారాదేశము; 'మూఁడు + నాళ్లు' అనుచోట 'ఁడు' కు నకారాదేశము. 'వేఁడి + నీళ్లు' అనుచోట 'ఁడి' కి నకారాదేశము.

'మూన్నాళ్ళు, వేన్నీళ్లు' మున్నగుచోట 'ద్విరుక్తం బగు హల్లుపరం బగునపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వం బగు' నను సూత్రముచే హ్రస్వము రాలేదు. ఆ సూత్రప్రవృత్తి ప్రయోగముల ననుసరించి బహుళమై యుండు నని చెప్పవలెను.

## హలవసానంబులు పరంబు లగునపు డేమిశబ్దము యొక్క మికారమునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. 'నీ కే బ్రాఁతియే వెన్నలుంబాలుఁ'; హరి. పూ. ౫. ఆ ౨౩౭. "శవము క్రియ నుండెదిదే ?" భాగ. ౯. స్కం. ౪౦౪.

౧౬. అవసాన మనఁగా అక్షరము లేమియు లేకుండుట; హల్లుగాని అవసానము గాని పరంబు లగునపుడు ఏమి అను శబ్దములోని 'మి' అను దానికి లోపము వికల్పముగా నగు నని సూత్రార్థము. 'నీ కేమి + బ్రాఁతియే = నీ కే బ్రాఁతియే' అనునది హల్లుపరమగునపుడు 'మి' లోపించుట కుదాహరణము. 'శవము క్రియ నుండెదు + ఇదేమి?' అనునది అవసానము పరమగునపుడు 'మి' లోపమున కుదాహృతి.

ఇచట సూత్రములో 'ఏమి శబ్దముయొక్క యికారమునకు లోపంబు వైకల్పిక' మని తప్పుగా ముద్రింపఁబడినది. ఆముద్రణమునే ఆధారముగఁ జేసికొని కుమారదేవపండితీయమునందు 'ఉదాహృతులలో లోపించినది మివర్ణ మంతయునే కాని, తద్గతమయినట్టి యికారమాత్రము కాదు. కావున 'మి' లోపించు నని సూత్రించుట శ్రేయము.' అని యింకను గొంత చర్చ సాగింపఁ బడినది. అది యంతయు నప్రసక్తము. మఱియు భాగవతోదాహరణమును

జాపుపట్టున 'శవము క్రియనుండెడిదే?' అని తప్పుగా ముద్రింపఁబడినది. అట్లుండినచో నది ప్రస్తుతసూత్రమున కుదాహరణము కాఁజాలదు. 'శవము క్రియ నుండె దిదే?' అనియే యుండవలెను.

## ౧౭. షష్ఠీసమాసమందలి నిలలమీఁది యచ్చులకు హల్లు పరంబగుచోఁ గొన్నియెడల లోపంబు గానంబడియెడి.

ఉ. 'శా. ప్రీతిక్ సూరెల నశ్వినీసుతులు రాఁ, బెం పొందు [1]నింద్రన్వలెక్.' ఉ. రా. ౨ ఆ. 33. "తూలె రజనీ చరభాస్కరబింబముల్రుచుల్." రామా ౫ ఆ. ౭౫. "అజ్ఞాస [2]నాంకముల్ పెంపు." చంద్రా. ౧ ఆ. ౧౮౭.

౧౭. షష్ఠీతత్పురుషసమాసమునందు మొదటిపదముచివర 'ని, ల' అనునవి ఉన్నయెడల వానిమీఁది యచ్చులకు లోపము కొన్నియెడలఁ గనఁబడును. నకారముమీఁది ఇకారము, లకారముమీఁది అకారము లోపించునని యర్థము. ఈ లోపము హల్లుపరముగా నున్నప్పుడే కలుగును.

'ని' లోని ఇకారలోపమునకు ఉదాహరణము '...ఇంద్రుని+వలెన్= ఇంద్రున్ వలెన్.' కాని యిచట 'ఇంద్రుంబలెన్' అగు పాఠాంతరము కలదు.

'ల' లోని అకారలోపమునకు ఉదాహృతులు - '...బింబముల + రుచుల్=బింబముల్ రుచుల్; అజ్ఞాసనాంకముల+పెంపు=అజ్ఞాసనాంకముల్ పెంపు'. ఇచట 'అజ్ఞాసనాండముల్ పెంపు' అని పాఠాంతరము కలదు. అదియే సరియైన పాఠముగాఁ దోఁచుచున్నది.

కుమారదేవపండితీయమున నేతత్సూత్రవివరణమున పయి ప్రయోగముల సాధుత్వాసాధుత్వములంగూర్చిన చర్చ విపులముగఁ గలదు. మఱియు నందు నకారము మీఁది ఇకారలోపమున కుదాహరణముగ 'రాకాచంద్రున్

1. నింద్రుంబలెన్. పా. 2. నాండముల్ పెంపు. ము. పా.

రాకొట్టున్’ అను విజయవిలాసపద్యభాగ మీయఁబడినది. అచట ‘రాకాచంద్రునియొక్క ‘రా’ కారమును గొట్టివేయు’ నను వ్యంగ్యార్థమున షష్ఠీవిభక్తికిఁ బ్రసక్తియుండును; కాని ‘రాకాచంద్రునిఁ గయ్యమునకుఁ బిలుచు’ నను వాచ్యార్థమున ద్వితీయకే గాని షష్ఠికిఁ బ్రసక్తి లేదు. వాచ్యార్థమున స్పష్టముగ ద్వితీయతోఁ గూడిన యీ ప్రయోగము నీ సూత్రమున కుదాహరణముగా గ్రహించుట యుచితము కాఁజాలదు.

## ౧౮. మధ్యమపురుషమువర్ణకంబున కచ్చుపరంబగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి

ఉ. [1]‘ఆడిదె నీదుపందెము., కళా. ౫ ఆ. ౧౧౬. ‘భవచ్చిత్తేప్సితం బెద్ది [2]చెప్పనినన్.’ మార్క. ౧ ఆ. ౧౨౭.

౧౮. బాలవ్యాకరణమునందు ‘మధ్యమపురుష మువర్ణకంబునకు హాలవసానంబులు పరంబు లగునపుడు లోపను విభాష నగు’ నని చెప్పఁబడియున్నది. కాని హాలవసానంబులే కాక అచ్చు పరముగా నున్నపుడు కూడ మువర్ణకము లోపించుట కొన్ని ప్రామాణిక ప్రయోగములలోఁ గానవచ్చుచున్నందున తత్సాధనకై యీ సూత్రము చెప్పఁబడుచున్నది. ‘మధ్యమపురుషమునందు వచ్చు ‘ము’ ప్రత్యయమునకు అచ్చు పరమగుచున్నపుడు కూడ కొన్నిచోట్ల లోపము కానవచ్చుచున్న’దని సూత్రార్థము.

‘ఆడుము + ఇదె నీదుపందెము=(ములోపము) ఆడిదె నీదుపందెము.’ ‘భవచ్చిత్తేప్సితం బెద్ది. చెప్పుము + అనినన్=భవచ్చిత్తేప్సితం బెద్ది చెప్పనినన్. (ములోపము), అని యుదాహరణములు.

పరిశీలింపఁగా మీఁది యుదాహరణములు రెండును పయి సూత్రము కట్టు సరికావు. ఆడిదె నీదుపందెము’అను పాఠముతప్పు. ఇచ్చట ‘ఆడితె, నీదు

1. ఆడితె పా. 2. చెప్పు నినున్. పా.

పందెము’ అని పాఠము కలదు. ‘నీపందెము నాడితివా?’ అని దాని యర్థము; అయ్యదియే ప్రస్తుతము.

‘భవచ్ఛిత్తేప్సితం బెద్ది, చెప్పునినన్’ అనునదియుం సరియైన పాఠము కాదు. ‘భవచ్ఛిత్తేప్సితం బెద్ది చె-ప్పు నినున్ సంతతసత్యపాలనునిఁగాఁ బుణ్యాం ధుకాఁ జూచితిన్’ అనునదియే సరియగు పాఠము. ‘చెప్పు నినున్’ అను నీ పాఠమునే అంగీకరించినచో బాలవ్యాకరణమునుబట్టియే హల్లు పరంబైనం దున ‘ము’ వర్ణకలోపము సిద్ధించును. ‘చెప్పునినన్’ అను పాఠమును గ్రహించి నచో చె-‘ప్పునినన్.........బుణ్యాంధుకాఁ జూచితిన్’ అనునెడ యతి భగ్నమై పోవును. కావునఁ బయి యుదాహృతులు రెండును సరికానందున సూత్రారంభమునకుఁ బ్రయోజనము మృగ్య మని గ్రహింపవలెను.

కుమారదేవపండితీయమున ‘భవచ్ఛిత్తేప్సితంబెద్ది చెప్పునినన్’అనునది లేఖక, ముద్రాపకాదులవలనఁ గల్గిన యపపాఠ మనియుం, నచట ‘భవచ్ఛి త్తేప్సితం బేదో కో యనినన్’ అని దిద్దుకొనుటే శ్రేయ మనియుఁ జెప్పఁబడినది. అట్లు దిద్దినను యతిభంగము తదవస్థమే యని సహృదయులు గుర్తింపఁగల రారు. ఆ వ్యాఖ్యాత మార్కండేయపురాణపద్యమును జూడక ప్రౌఢ వ్యాకరణమును, సుప్తార్థప్రకాశికలో ఉదాహరణముగా నీయఁబడిన ‘భవచ్ఛిత్తేప్సితంబెద్ది చెప్పునినన్’ అను భాగమును మాత్రము చూచుటచే ఇట్లు వ్రాయవలసి వచ్చినది. ఇయ్యెడ సుప్తార్థప్రకాశికాకారులును ప్రౌఢ వ్యాకరణమునే యనుసరించుటచే వారు నీ తప్పును గమనింపకపోయి రని చెప్పవలసి వచ్చుచున్నది.

**౧౫. ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువు పరంబగుచోఁ గొన్నియెడల ముగాగమం బగు.**

ఉ. ‘కనకనమను, రామా. ౬. ఆ. ‘సలసలమను.’ పాండు. ౫. ఆ. ౨౧౭. మొ.

౧౯. ధ్వని ననుకరించు శబ్దములు ధ్వన్యనుకరణ శబ్దములు. అనుకరణమునందుఁ దఱచుగ 'అను' ధాతువు ప్రయోగింపఁబడుచుండును. ఆ యను ధాతువు పరముగా నున్నపుడు ధ్వని ననుకరించు శబ్దముల చివర కొన్నిచోట్ల మకారము చేరుచుండు నని సూత్రార్థము. ఉదాహృతులు—కనకన+అను= కనకనమను' అగును. 'సలసల+అను=సలసలమను' అగును.

పయిచోట్లఁ గల ధ్వన్యనుకరణశబ్దములు ద్విరుక్తములై (రెండు సారు లుచ్చరింపఁబడినవై) యున్నవి. ఏల యన ధ్వన్యనుకరణశబ్దము లెప్పుడును ద్విరుక్తములై యుండును. ఈ విషయమునే ౨౦-వ సూత్రము తెలుపుచున్నది.

(౨౦) ధ్వన్యనుకరణశబ్దంబులు ద్విరుక్తంబుల యగు.

ఉ. గడగడ, వడవడ, తళతళ, పెళపెళ. మొ.

౨౦. ధ్వని ననుకరించు శబ్దములు ద్విరుక్తములే యయి యుండును, కాని ఒక్క పదముగా నుండ వని సూత్రార్థము.

ఇచట నుదాహరింపఁబడిన 'గడగడ - వడవడ'-మున్నగునవి 'గడ-వడ'-అని మాత్రముండవు. రెండు మాఱు లుచ్చరింపఁబడనిచో నవి శ్రోతలకు ధ్వన్యనుకరణము లని తెలియుటయే కష్టము.

(౨౧) ఇయ్యవి క్రియావ్యవహితంబులు నగు.

ఉ. వడవడ 'జమదగ్నిసూతి వడఁకె.' రామా. ౪. ఆ. ౧౪౦.

౨౧. ఇయ్యవి=ధ్వన్యనుకరణ శబ్దములు. క్రియా వ్యవహితంబులు= క్రియతో వ్యవధానము కలవి.

ధ్వన్యనుకరణశబ్దములు క్రియతోనే సమన్వయించుచుండును. అను ధాతువు ప్రయోగించునపుడు దానితోఁ గూడి యుండుటచే 'అను' అనుదాని

తర్వాతనే క్రియాపద ముండును; కాని ధ్వన్యనుకరణముల వెనుక అను ధాతు వుండితీరవలె నను నియమము లేదు. అనుధాతువు అనుప్రయుక్తము కానివియుఁ గలవు. అట్టిచోట్ల ఆ పదములవెంటనే క్రియ యుండవలెను. కాని య ట్లుండక ధ్వన్యనుకరణశబ్దములకును క్రియకును నడుమ వేఱొక పదముచేరి, క్రియను దూరముచేయుటయుఁ గల దని సూత్రార్థము.

'వడవడ జమదగ్నిసూతి వడకెన్-' అని యుదాహృతి. ఇచట ధ్వన్యనుకరణమునకును క్రియకు నడుమ 'జమదగ్నిసూతి' అను పదము చేరినది. క్రియ అవ్యవహితముగా నుండుట కుదాహరణము. 'క. శౌరి కలకల నవ్వెన్.' భార ఉద్యో. 3 ఆ. ౯౬.

## ౨౨. ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతం బునకు మకారాదేశం బగు.

ఉ. 'కమ్మని లతాంతములకు మ్మొనసి.' భార. ఆది. ౫. ఆ. ౧౩౭. 'మత్త, వృష్టిఁ జే, సె మ్మహానది. దీర్ఘి కాసరసినదంబులు నిండఁగాన్.' భార. అర. 3. ఆ. ౧౧3.

౨౨. ప్రాసమునందు ద్రుతమునకు మకారము పరమైనయెడల ద్రుత నకారము మకారముగా మాఱు నని యర్థము.

'కమ్మని లతాంతములకున్ + మొనసి' అని యున్నపుడు-'కున్' నకారము మకారముగా మాఱినది. కావుననే ప్రాసయతి సరిపడినది. అట్లుకాక 'కమ్మని లతాంతముల కున్మొనసి -నియే యుండినచో నది కుదురదు; ప్రాస స్థలముల కుదాహృతి.-'వృష్టిఁ జే సెమ్మహానది.' ఇచట 'వృష్టిజేసెన్ + మహానది-' అనుచోట నకారము మకారమైనది. లేనిచో మీఁది పాదములోని 'మ్మ'కు నీ పాదమునందలి 'న్మ' ప్రాసము కాఁజాలదు కదా!

## (౨౩) ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు.

ఉ. లేలెమ్ము. పోపొమ్ము మొ.

౨౩. కృతహ్రస్వంబు = వ్యాకరణనియమముచే హ్రస్వముగాఁ జేయఁబడినది - హ్రస్వమైనది. ఆమ్రేడితము పరముగా నున్నయెడల పూర్వము దీర్ఘముగా నుండి, తర్వాత నియమానుసారముగా హ్రస్వమైన దానికి దీర్ఘము వచ్చునని సూత్రార్థము.

ఉదా- 'లెమ్ము + లెమ్ము=లేలెమ్ము; పొమ్ము + పొమ్ము=పోపొమ్ము.'

'లేచు' ధాతువునకు మధ్యమపురుష ముజ్ఞు పరంబగునపుడు 'చు' లోపము; 'లే + ము, అని యుండఁగా 'ముజ్ఞు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మామ్మడియు నగు'నను సూత్రముచే 'లెమ్ము' అయినది. 'లెమ్ము + లెమ్ము'' అని యున్నపుడు 'ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్ఞులకు లోపంబు విభాష నగు' నను సూత్రముచే మొదటి 'మ్ము' పోయి, 'లె + మ్ము' అని యుండఁగా ప్రకృతసూత్రముచే కృత హ్రస్వమైన 'లె' దీర్ఘమై 'లేలెమ్ము' అగును.

ఇట్లే 'పోవు + ము' అనుచో 'పోవునకు దుమ్మత్తులు ముజ్ఞుం బరంబులగునపుడు వులోపంబుం బొదపదలును విభాష నగు' నను సూత్రముచే 'వు' లోపము వచ్చి 'పో + ము' అయి, పిదప దీర్ఘమునకు హ్రస్వము, 'ము' కు మామ్మడి వచ్చి 'పొమ్ము' అగును. 'పొమ్ము + పొమ్ము' అనుచో ఆమ్రేడితము పరము కాఁగా 'మ్ము' పోయి, ప్రకృతసూత్రముచే కృతహ్రస్వమునకును దీర్ఘమై 'పోపొమ్ము' అయినది.

కుమారదేవపండితీయమున నీ సూత్ర మనావశ్యక మనిచెప్పి, 'లెమ్ము పొమ్ము'లలోని ముజ్ఞు లోపింపఁగా, తన్మూలముగా వచ్చిన హ్రస్వముకూడ

పోవుననియు, దీనికి 'సన్నియోగశిష్టానాం సహ ప్రవృత్తిః' (?) అను సంస్కృత వ్యాకరణ పరిభాష' ప్రమాణమనియు, 'మ్ము' తోడ హ్రస్వము కూడ పోఁగా, దీర్ఘమే యుండి 'లేలెమ్ము, పోపొమ్ము' అనునవి సహజముగనే కుదురుననియుఁ జెప్పఁబడినది.

కాని 'లెమ్ము+లెమ్ము, పొమ్ము+పొమ్ము' అనుచోఁ దొలి 'మ్ము' లోపింపఁగా, తన్మూలమున వచ్చిన హ్రస్వముకూడ పోయి, దీర్ఘమే ఉండు నని తలఁచినచో 'మ్ము' మూలముగా వచ్చిన 'చు,వు'ల లోపము కూడ 'సన్నియోగశిష్టానాం సహ వా ప్రవృత్తిః, సహ వా నివృత్తిః' అను న్యాయమున తదవస్థయే యగును. కాఁగా 'లేచులెమ్ము, పోవుపొమ్ము' అను రూపములే యగును; కాని 'లేలెమ్ము, పోపొమ్ము' అని కాఁజాలవు.

కావున 'లె+లెమ్ము, పొ+పొమ్ము' అని యుండఁగా మొదటి 'లె, పొ' లకు దీర్ఘత్వసంపాదనార్థము ప్రకృతసూత్ర మావశ్యకమై యున్నదన వలెను.

ఇది సంధిపరిచ్ఛేదము.

---

# శబ్దపరిచ్ఛేదము



## నామప్రకరణము

నామవాచకములును, సర్వనామములును శబ్దము లని ప్రసిద్ధి. ఆ శబ్దములను గూర్చిన విషయమును దెలియఁజేయు భాగమే శబ్దపరిచ్ఛేద మనఁబడును. బాలవ్యాకరణమున నీ శబ్దపరిచ్ఛేదము తత్సమపరిచ్ఛేదము, ఆచ్ఛికపరిచ్ఛేదము నని రెండు పరిచ్ఛేదములుగా విభజింపఁబడి, సర్వనామప్రకరణ మాచ్ఛికపరిచ్ఛేదమునందలి భాగముగాఁ జూపఁబడినది. ఇందలి శబ్దపరిచ్ఛేదము నామప్రకరణము, సర్వనామప్రకరణము నని రెండు భాగములుగా విభజింపఁబడినది. నామప్రకరణమునఁ దత్సమ, దేశ్యములు రెండింటిని గూర్చిన విషయము చూపఁబడుచున్నది.

**౧. శబ్దములు విశేష్యములు విశేషణము లని ద్వివిధంబులు.**

ఉ. అయ్య, అన్న, అమ్మ, అక్క మొదలగునవి విశేష్యములు; తక్కినవి విశేషణములు.

౧. 'డు, ము, వు' మున్నగు ప్రత్యయములు చివరఁ జేరునవి శబ్దములు. ఇందు అవ్యయములును కొన్ని చేరి యున్నవి. ఇవి విశేష్యములు, విశేషణములు నని రెండు విధములు. వాని లక్షణము రెండవ సూత్రమున వివరింపఁబడును.

**౨. విశేష్యము నా విశేషణముచేఁ దెలుపఁబడు విశేషము గలది; విశేషణము నా జాత్యాదివిశేషములను దెలుపునది.**

౨. విశేషణపదముచేఁ దెలియఁజేయఁబడు విశేషము కలది విశేష్యమగును. జాతి మున్నగు విశేషములను దెలియఁజేయునది విశేషణము. 'అయ్య ధనవంతుఁడు' అని చెప్పినపుడు 'ధనవంతుఁడు' అనునది విశేషణము. ఏలయన- అది 'ద్రవ్యము కలిగియుండుట' అను విశేషమును - జాత్యాద్యంతర్గతమును తెలియఁజేయుచున్నది. ఈ విశేషణముచేఁ జెప్పఁబడిన విశేషము - ధనము కలిగియుండుట; అది గలిగి యుండుటచేత 'అయ్య' అనునది విశేష్య మగుచున్నది. అట్లే ముందును విశేషణ, విశేష్యభావమును దెలిసికొనునది.

## 3. విశేషణము జాత్యాదిభేదంబులచే షడ్విధంబు.

అవి—జాతిప్రయుక్త విశేషణము, క్రియాప్రయుక్త విశేషణము, గుణప్రయుక్త విశేషణము, ద్రవ్యప్రయుక్త విశేషణము, సంఖ్యాప్రయుక్త విశేషణము, సంజ్ఞాప్రయుక్త విశేషణము.

ఉ. ౧. జాతిప్రయుక్తవిశేషణమునకు—బ్రాహ్మణుఁడు.
౨. క్రియాప్రయుక్తవిశేషణమునకు—పోవువాఁడు.
3. గుణప్రయుక్తవిశేషణమునకు—నల్లనివాఁడు.
౪. ద్రవ్యప్రయుక్తవిశేషణమునకు—ధనవంతుఁడు.
౫. సంఖ్యాప్రయుక్తవిశేషణమునకు—ఒక్కఁడు.
౬. సంజ్ఞాప్రయుక్తవిశేషణమునకు—దేవదత్తుఁడు మొ.

3. 'జాతి-' మున్నగు భేదములచే విశేషణము ఆఱు విధములుగా విభజింపఁబడినది. జాతి యనఁగా తెగ; దాని ననుసరించి యేర్పడినది జాతిప్రయుక్త విశేషణము. క్రియ = పని; గుణము = స్వభావము; ద్రవ్యము = ధనము; సంఖ్య=లెక్కించుట; సంజ్ఞ=పెట్టుకొన్న పేరు. పైవాని ననుసరించి యేర్పడిన విశేషణము లాయా పేర్లతోఁ బ్రసిద్ధములు.

'సోమయ్య బ్రాహ్మణుఁడు' ఇచట 'బ్రాహ్మణుఁడు' అనునది బ్రాహ్మణత్వ జాతి ననుసరించి యేర్పడిన విశేషణము. అది 'సోమయ్య బ్రాహ్మణుఁడు-' అని సోమయ్యయందుఁగల విశేషమును-బ్రాహ్మణత్వమును తెలియఁజేయుచున్నది.

'పోవువాఁడు రామయ్య' అనునెడ 'పోవుట' అను క్రియ ననుసరించి యేర్పడుటచే 'పోవువాఁడు' విశేషణము. రామయ్య విశేష్యము.

'కృష్ణుఁడు నల్లనివాఁడు'-ఇచట 'నల్లఁదనము' ననుసరించి యేర్పడిన 'నల్లనివాఁడు' విశేషణము; దానిచే బోధింపఁబడు విశేషము గల 'కృష్ణుఁడు' విశేష్యము.

'సత్యసేనుఁడు ధనవంతుఁడు.' ఇచట 'ధనవంతుఁడు' ద్రవ్యప్రయుక్త విశేషణము.

'రాముఁడొక్కఁడు బలశాలి,' అనుచో 'ఒక్కఁడు' సంఖ్యాప్రయుక్త విశేషణము.

'అతఁడు దేవదత్తుఁడు' అనుచో 'దేవదత్తుఁడు' సంజ్ఞ ననుసరించి యేర్పడిన విశేషణము.

**౮. సంఖ్యాప్రయుక్త విశేషణ మేకాంతంబయి యుమహద్విశేష్యకమయ్యు, తదంశాంతం బయి మహదమహద్విశేష్యకమయ్యు, సమస్తంబు వ్యస్తంబు నగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతంబును, పూర్వపదంబు బహువచనాంతంబు నగు.**

తదంశము = ఆ యొకటియొక్క భాగము - అనఁగాఁ జాతిక లోనగునది.

ఉ. డెబ్బదియొక్క రథము, రథములు డెబ్బదియొక్కటి; రెండున్నర మానిసి, మానుసులు రెండున్నర; రెండున్నర రూపాయ, రూపాయలు రెండున్నర మొ.

౪. సంఖ్యాప్రయుక్తవిశేషణము = సంఖ్యావాచకము ననుసరించి యేర్పడిన విశేషణము. ఏకాంతంబయి='ఒకటి'-అను సంఖ్య చివరఁగలదియై-అనఁగా ఆ సంఖ్యతో ముగియునదై; అమహద్విశేష్యకమయ్యెన్=అమహ ద్వాచకశబ్దము విశేష్యముగా కలదై యున్నను; [స్త్రీ, తిర్యగ్జడములకంటె వేఱైన శబ్దములును, వాని విశేషణములును మహద్వాచకములు; స్త్రీవాచకము లను మహతీవాచకము లని వాడుక కలదు. సాధారణముగాఁ బురుషులను దెల్పు శబ్దములును, తద్విశేషణములును మహత్తు లనియు, స్త్రీలను దెల్పునవి మహతీవాచకము లనియుఁ, దక్కినవి అమహత్తు లనియు గ్రహింపనగును.] తదంశాంతం బయి=ఆ 'యొకటి' యొక్క భాగము - అనఁగా-అఱ, పాతిక, ముప్పాతిక మున్నగువానిం దెల్పుపదము చివరియందుఁ గల దయి; మహద మహద్విశేష్యకమయ్యెన్ = విశేష్యము మహద్వాచకము గాని, అమహ ద్వాచకము గాని కలదై యున్నను; సమస్తంబు = సమాసము పొందినది; వ్యస్తము=సమాసము పొందనిది; ఉత్తరపదంబు=రెండవ పదము; పూర్వ పదంబు=మొదటి పదము. ఏకవచనము చివరఁ గలది ఏకవచనాంతము; చివర బహువచనము గలది బహువచనాంతము.

ఇయ్యది 'విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ,విభక్తి, వచనంబు లగు' నను బాలవ్యాకరణసూత్రములోని 'వచనము' అనుదానికి సవరణము.

(1) ఏకాంతమగు సంఖ్యాప్రయుక్తవిశేషణము అమహద్వాచక మగు విశేష్యముతో సమాసము పొందునపుడు-ఆ విశేషణము పూర్వపదమై; విశేష్యముత్తరపదమై యుండును; అచటి విశేష్యము ఏకవచనమునందే యుండును. ఉదా:—'డెబ్బదియొక్క రథము.' ఇచట 'డెబ్బదియొక్క' అను

నది ఏకాంత మగు సంఖ్యాప్రయుక్త విశేషణము; ఇది 'రథము' అను అమహద్విశేష్యము తో సమసించినది; ఇచట 'డెబ్బదియొక్క' పూర్వపదము; 'రథము' ఉత్తరపదము. 'రథము' ఏకవచనాంతమై యున్నది. [ఇచట విశేష్యము త్తరపదమైయుండిన నేకవచనాంత మగుట విశేషము.]

(2) ఏకాంతమగు సంఖ్యాప్రయుక్తవిశేషణము అమహద్వాచకమగు విశేష్యముతో సమసింపక వ్యస్తముగా నున్నపుడు, ఆ విశేషణము ఉత్తరపదమై, విశేష్యము పూర్వపదమై యుండును. విశేష్యము బహువచనాంతముగా నుండును. ఉదా:—'రథములు డెబ్బదియొక్కటి.'

ఇచటి సంఖ్యావిశేషణము వ్యస్తము. అది ఉత్తరపదముగా నున్నది. దాని విశేష్యమగు అమహద్వాచకము 'రథములు' పూర్వపదమై బహువచనములో నున్నది.

(3) అఱ, పాతిక మున్నగు నంశములతో ముగియు సంఖ్యాప్రయుక్త విశేషణము మహత్తుగాని, అమహత్తుగాని అగు విశేష్యముతో సమసించునప్పుడు ఆ విశేష్యము ఉత్తరపదమై ఏకవచనాంతమై యుండును; విశేషణము పూర్వపదమై యుండును.

మహద్వాచకము విశేష్యముగా నున్నపుడు ఉదాహృతి—'రెండున్నరమానిసి.' ఇచటి విశేషణము ఏకాంశాంతము; అది 'మానిసి' అను మహద్వాచకముతో సమసించుచున్నది. కాన విశేష్య ము త్తరపదమై ఏకవచనాంతమైనది. విశేషణము పూర్వపదమైనది.

అమహద్వాచకము విశేష్యముగా నున్నప్పటి ఉదాహరణము—'రెండున్నరరూపాయ.' ఇచటి విశేషణము ఏకాంశాంతము; పూర్వపదము; దానితో సమాసముపొందిన 'రూపాయ' అమహద్విశేష్యము; ఏకవచనాంతము; ఉత్తరపదము.

(4) అట్టి, పాతిక మున్నగు నంశములతో ముగియు సంఖ్యా ప్రయుక్తవిశేషణమునకు మహత్తుగాని, అమహత్తుగాని విశేష్యమైనపుడు ఆ విశేషణము వ్యస్తమగునపుడు విశేష్యము పూర్వపదమై బహువచనాంతమై యుండును; విశేషణ ముత్తరపదమై యుండును. ఉదాహృతులు - మహద్వాచకము విశేష్యమైనపుడు మానుసులు రెండున్నర.' అమహత్తువిశేష్యమైనపుడు 'రూపాయలు రెండున్నర.' ఇచట విశేషణములు ఉత్తరపదములు, వ్యస్తములు కాని విశేష్యములు 'మానుసులు, రూపాయలు' పూర్వపదములు, బహువచనాంతములు.

## ౫. అయ్యాది యేకాంతంబు మహద్విశేష్యకంబు సమస్తంబు కాదు; వ్యస్తం బగుచో బహువచనాంతంబ యగు.

ఉ. పదునొక్కండ్రు రుద్రులు మొ. (చూ. సమాసపరిచ్ఛేదము. ౨౬. సూ.)

౫. అయ్యాది=సంఖ్యాప్రయుక్తవిశేషణము. ఏకాంతం బగు సంఖ్యాప్రయుక్త విశేషణము మహద్వాచక మగు విశేష్యముతో సమసింపదు. వ్యస్తముగా నున్న యా విశేషణము బహువచనమునందే యుండును.

ఉదా:-'పదునొక్కండ్రు రుద్రులు' ఇచట 'పదునొక్కండ్రు' అను సంఖ్యాప్రయుక్తవిశేషణము ఏకాంతము; 'రుద్రులు' అను మహద్వాచకము దీని విశేష్యము. కావున నియ్యెడ సమాసము కాలేదు. ఆ విశేషణము 'పదునొక్కండ్రు' బహువచనమునందే యున్నది.

ఇట 'పదునొక్క రుద్రులు' అని సమస్తపదముగా నుండరాదు. 'రుద్రులు పదునొక్కండు' అని విశేషణ మేకవచనాంతముగా నుండదు.

ఇచట 'పదునొక్కండ్రు రుద్రులు' అనియే కాక 'పది, ఒక్క' శబ్దముల నడుమ 'యుఁన్' చేరి "పదియు నొక్కండ్రు రుద్రులు" అను రూపము

నగు నని '(చూ. సమాసపరిచ్ఛేదము ౨౬)' అనుదానిచే సూచింపఁబడు చున్నది. సమాసపరిచ్ఛేదము ౨౬-వ సూత్రమున 'కొన్నియెడల నీ సమాసంబులు యణ్వర్ణ వ్యవహితంబులు నగు' నని చెప్పఁబడినది.

## ౬. విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు.

౬. ప్రధానంబు = ముఖ్యము; ఇతరంబు = విశేషణము; అప్రధానంబు = ముఖ్యము కానిది. వాక్యములో విశేష్యము ముఖ్యమైనది. విశేషణ మముఖ్యము. ఏల యన విశేషణము లేకున్నను విశేష్యము ప్రయోగార్హము; కేవలము విశేషణము ప్రయోగింప ననర్హము.

## ౭. ప్రధానంబు పశ్చాద్వాచ్యం బగు.

అన్వయక్రమమునందు విశేషణములను ముందు చెప్పి కడపట విశేష్యమును జెప్పవలె ననుట.

౭. ప్రధానంబు = ముఖ్య మగు విశేష్యము; పశ్చాద్వాచ్యంబు = వెనుకఁ జెప్పఁదగినది. అర్థము వివరించుపట్టున విశేషణమును దొలుత చెప్పి, యా పిదపనే విశేష్యమును జెప్పవలసి యున్నది. కాన విశేష్య మెప్పుడును వెనుకనే యుండఁదగినది.

'అగు, అవు, ఔ' అను పదములలో నేదియైన ననుప్రయుక్తమగు నపుడే విశేషణము ముందుగాఁ బ్రయుక్త మయి, యా పిదప విశేష్యము ప్రయోగింపఁబడుట సాధారణము. ఉదా:-'అప్రమేయుఁ డగు హరి; అప్రమేయుఁడవు హరి; అప్రమేయుఁడౌ హరి.' 'అగు' మున్నగునవి అనుప్రయుక్తములు కానపుడు విశేషణము వెనుకఁగూడ బ్రయోగింపఁబడు చుండును. ఉదా:-'అప్రమేయుఁడు హరి; (లేక) హరి అప్రమేయుఁడు.'

బాలవ్యాకరణమునందు 'ఏకవాక్యంబునం దొకానొకచో నందు తక్కిన సర్వపదంబులుం గ్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంబడును' అని క్రమనిరపేక్షత

చెప్పఁబడినది. కాని విశేషణ, విశేష్యములు క్రమసాపేక్షము లని తెలుపుట కీ సూత్రము కూర్పఁబడినది.

## ౧౭ ఒక్కచో విశేషణంబులును విశేష్యంబు లగు.

ఉ. 'నారదుం డి ట్లనియె.' మొ.

ర. ఒక్కొక్కయెడ విశేషణములుగా నుండఁదగినవియుం విశేష్యములుగా నుపయోగింపఁబడు నని సూత్రార్థము. 'నారదుం డి ట్లనియె-' ననుచోట సంజ్ఞా ప్రయుక్త విశేషణమైన 'నారదుఁడు' అనునది విశేష్యముగా గ్రహింపఁబడినది. 'ఇట్లనియె' అను క్రియ కయ్యది కర్తయగుచున్నది.

సంజ్ఞావాచకము సామాన్యముగ విశేష్యములే యగును. అట్టివానిని ప్రౌఢవ్యాకర్త విశేషణములుగా కూడ గ్రహించినాఁడు.

## ౧౮ ఒక్కొకచో విశేష్య విశేషణంబులు వ్యత్యస్తంబులు నగు.

ఉ. 'క. [1]నీ మాఱుదల్లి త్రిభువన, భామారత్నంబు గంధవతిపై.' హరి. పూ. ౨ ఆ. ౧౭౦.

ర. వ్యత్యస్తంబులు = తారుమారయినవి. విశేషణంబు తొలుతను, విశేష్యంబు తర్వాతను బ్రయోగింపఁబడవలె నని నియమ మున్నను, ఆ నియమము నతిక్రమించి విశేష్యము మొదటను, విశేషణము దాని పిదపను బ్రయోగింపఁబడుట కొన్నిచోట్లఁ గానవచ్చుచున్నదని సూత్రార్థము.

1. నీమాఱుఁదల్లి. పా.

'సీమాఱుదల్లి త్రిభువనభామారత్నంబు' అనుచోట 'మాఱుదల్లి' విశేష్యము; 'త్రిభువనభామారత్నంబు' విశేషణము. ఇచట విశేష్యము ముందు గను, విశేషణము దాని తర్వాతను ప్రయుక్తము లయినవి. 'త్రిభువనభామా రత్నం బయినట్టి సీమాఱుదల్లి' అని అన్వయక్రమము.

## ౧౦. తెనుఁగునం గొన్నిశబ్దములు విశేష్యవిశేషణంబు లుభయంబును నగు

కొన్ని యనఁగాఁ గీడు ప్రభృతులును, నల్లాదులును.

౧౦. అచ్చికములగు కొన్ని శబ్దములు విశేష్యములుగను, విశేషణములుగను గూడ ఉపయోగింపఁబడు నని యర్థము. అనఁగా 'కీడు' మున్నగు కొన్ని శబ్దములును, 'నల్ల' మున్నగునవియును గొన్నియెడల విశేష్యములు గను, కొన్నియెడల విశేషణములుగను ఉపయోగింపఁబడు నని అభిప్రాయము.

'కీడు' విశేష్య మగుట కుదాహరణములు - 'కృష్ణ కృష్ణ! యనంత! యే కీడు లేదు.' లక్ష్మి. ఆ. ౪. ప. ౧౧౮.

'తామ్రమాదిగఁ గలయట్టి ధాతుచయము, కొలిమి నిడి యూఁదఁ గీడెల్లఁ బోలియుంనట్లు' మార్కం. ఆ. ౩. ప. ౩౧౫.

'కీడు' విశేషణ మగుట కుదాహరణములు-'నీ వేమిట నిమ్మహాధ్వరంబు కీ డంటి?' భార. అశ్వ. ఆ. ౪. ప. ౨౧౮. 'వారల తలంపులు కీడు' భార. ఉద్యో. ఆ. ౩. ప. ౨౩౫.

'నల్ల' విశేష్యమగుట కుదాహరణము- 'అమ్మహాశ్వంబు ధవళదేహంబు నందు నల్ల గలిగిన నీ విప్పు నాకు దాసి, వగుము.' భార. ఆది. ఆ. ౨. ప. ౩౧. విశేషణ మగుట కుదాహృతి- 'ఈ నల్లతిరునామ మెచట దొరకె?' జైమిని. ఆ. ౩. ప. ౭౪.

## ౧౧. విశేషణంబులు కొన్ని వ్యవహితంబులు నగు.

ఉ. 'క. ఈ లోకంబున వెదకితి, [1]మే లెల్లెడఁ గాన వరుని.' నిర్వ. 3 ఆ. ౪౨.

౧౧. విశేషణములకును, విశేష్యములకును నడుమ నెట్టి వ్యవధానము లేక యుండవలె నని నియమము. వాని రెండిటికిని నడుమ ఇతర పదములు చేరక ఉండవలెను. కాని కొన్నియెడల నా రెండిటికిని నడుమఁ గొన్ని పదములు చేరుటయుఁ గల దని యీ సూత్రము వివరించుచున్నది. 'మే లెల్లెడఁ గాన వరుని' అను నుదాహరణమునకు 'అంతటను మేలైన వరుని గాన' నని యభిప్రాయము. ఇచటి విశేషణము 'మేలు'-విశేష్యము 'వరుని'. ఈ రెండిటికిని నడుమ 'ఎల్లెడఁ గాన' ననువానితో వ్యవధాన మున్నందున నిది పై సూత్రమున కుదాహరణ మగు నని ప్రౌఢవ్యాకర్తయాశయము.

కాని యీప్రయోగము సరియైనది కాదు. వ్రాతప్రతులలో నిర్వ్యేడ 'మేలిల్లెడు వరుని గాన'నని కలదు. 'మేలిల్లెడు' అనునది ధాతుజవిశేషణము; 'మేలిల్లు' ధాతువునుండి యేర్పడినది. 'మేలిల్లు-' క్రియగా నన్నెచోడుఁడు మున్నగు మహాకవుల ప్రయోగము లున్నవి. ఇది 'రంజిల్లు, భాసిల్లు'ల వంటిది. కాఁగా 'మేలిల్లెడు వరుని గాన' నని గ్రహించినచో విశేషణ, విశేష్యములకు వ్యవధానము లేకుండుటయు, విశేషణము ప్రాక్ ప్రయుక్తమై విశేష్యము పశ్చాత్ప్రయుక్తమగుటయుఁ సిద్ధించుటచే నెట్టి నియమభంగమును కానరాదు. కావున నీ ప్రయోగమునకై యీ సూత్రమును రచించుట వ్యర్థము. ప్రౌఢవ్యాకర్తకు సరియగు పాఠము లభింపమింజేసి, యతఁడు 'మే లెల్లెడఁ గాన వరుని' అనుదానినే గ్రహించుటచే నిట్లు సూత్రింపవలసి వచ్చినది. మఱియుఁ 'మే లెల్లెడ' ననునది కవ్యుద్దిష్టము కా దని తెలియుచున్నది. ఏల యున- 'ఈ

---

1. మేలిల్లెడు వరునిఁగాన. వ్రాఁత ప్రతి పా.

లోకంబున వెదకితిని. మేలైన వరుని కాన' నని కవి చెప్పును గాని, 'మేలగు వరుని ఎల్లెడను గాన' నని చెప్పఁడు. అట్లు చెప్పఁదలఁచినచో 'ఎయ్యెడఁ గాన' ననియే చెప్పును.

ఇచట మూలానుసారి యగు కుమారదేవపండితీయమును తదవస్థమే యని తెలియఁదగును.

౧౨. విశేషణంబులు కొన్నియెడల విశేష్యలక్షకంబు లగు.

ఉ. 'క. దేవతల కప్రియంబులు, గావించి మనుష్యులధమగతు లగుదు రిలన్, గావున వారికి నిష్టము, గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ.' (అప్రియంబులు = అప్రియ కార్యములును; ఇష్టము=ఇష్టకార్యములు.) భార. ఆర. ౨ ఆ. ౫౦. 'చ. పరదుపతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవ ధర్మపత్ని ధర్మరత నయోనిజన్ బ్రకృతిమానవభామినిగాఁ దలంచి దె, ప్పరములు [1]పల్కఁగాఁ దగునె?' (దెప్పరములు= దెప్పరపుమాటలను.) భార. సభా. ౨ ఆ. ౧౫౫. వ. బెట్టిదంబులంగాని చక్కఁబడఁడు.' (బెట్టిదంబులన్=బెట్టిదపు మాటలచేత.) భార. ఆర. ౬. ఆ. ౧౭3. మొ.

౧౨. విశేష్యలక్షకంబులు=విశేష్యములను తెలియఁజేయునవి; వాక్యమున విశేషణము లున్నపుడు విశేష్యవాచకములగు పదములు వేఱుగ నుండవలయును; కాని కొన్నిచోట్ల కేవలము విశేషణములే యుండుట కలదు. అట్టిచోట్ల ఆ విశేషణవాచకములే విశేష్యార్థములను గూడ చెప్పు నని గ్రహింపవలయును. ఉదాహరణములు స్పష్టములు.

1. పల్కఁగాఁదగునె ? పా.

**(౧౩) ఓశబ్దం బొక్కచో సంబోధ్యవాచకంబునకు ముం దితర శబ్దవ్యవహితం బయి కానంబడియెడి.**

ఒక్కచో ననఁగా సంబోధ్యవాచకము క్రియాజన్యవిశేషణపూర్వకం బగునప్పు డనియు, ఇతరశబ్దం బనఁగా ఆ క్రియాజన్యవిశేషణమునకు సంబంధించిన పద మనియు నర్థము.
ఉ. ఓ వినువీథినున్న ఖచరోత్తములార!' వీర. ౨ ఆ. ౧౨౮. 'ఓ తోయజనేత్రుఁ గాంచిన వధూమణి!' విజ. 3 ఆ. ౧౨౫.

౧౩. సంబోధ్యవాచకంబు=ఆమంత్రణమును దెల్పు పదము. ఇతరశబ్దవ్యవహితంబు=వేఱొక శబ్దముతోడి వ్యవధానము (అడ్డు) కలది. ఒకానొక స్థలమున సంబోధ్యవాచకమునకును, దానికిఁ బూర్వమునఁ బ్రయోగింపఁబడు 'ఓ' శబ్దమునకును నడుమ నితర పదములు చేరుచుండుటయుఁ గల దని సూత్రార్థము.

బాలవ్యాకరణమున 'ఓ యామంత్రణంబునం దగు' ననియుం, 'ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపఁబడు ననియుఁ జెప్పఁబడినది. మఱియుం 'ఓ' శబ్దము సంబోధ్యవాచకములకు ముం దవ్యవహితముగనే ప్రయుక్త మగుట ప్రసిద్ధము. పదాంతరముతోడి వ్యవధానము గల స్థలములును గొన్నియుండుటచే నట్టివానిని సాధించుటకై యీ సూత్రము చెప్పఁబడినది.

ఓ శబ్దమునకును సంబోధ్యవాచకమునకును నడుమ ఆ సంబోధ్యవాచకమునకు విశేషణమైన పద ముండునపుడే యీ సూత్రము ప్రవర్తించు ననియు, ఆ విశేషణము క్రియాజన్యవిశేషణమే యై యుండవలె ననియుం వివరణమున స్పష్టపఱుపఁబడుచున్నది. కాఁగా సంబోధ్యవాచకపదము క్రియాజన్యవిశేషణ సంబంధపదపూర్వకమై యుండునపుడు ఓశబ్దం బొ

క్రియాజన్యవిశేషణపదవ్యవహితమై యుండు నని వ్యాకర్త యభిప్రాయ మని తెలుచున్నది. 'ఓ వినువీథి నున్న ఖచరోత్తములార!' అనుచో 'ఓ-ఖచరోత్తములార!' అను శబ్దములను నడుమ 'వినువీథి నున్న' అను విశేషణము చేరినది. 'ఓ తోయజనేత్రుఁ గాంచిన వధూమణి!' అనుచో 'ఓ-వధూమణి' శబ్దములకు నడుమ 'తోయజనేత్రుఁ గాంచిన' అను విశేషణము కూర్పఁబడినది.

**౧౪. రోశబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు; అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి.**

ఉ. 'చ. కమలదళాక్షిరో వినవుగా గల యొక్కటి గంటి వేడుక౯.' ప్రభా. ౧ ఆ. ౧౨౨. 'చ. రమణిరో భృత్యు లందు నపరాధము గల్గిన నాయకుల్ స్వపక్షము దలపోసి యుగ్రతరశాసనముం దెగి చేయరు' భాగ. ౪ స్కం. ౭౮౮ మొ. (ఒకానొక యాధునిక గ్రంథమునందు 'అన్నరో', ఏనుంగురో' అని ప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణిక ప్రయోగములు కానంబడవు.)

౧౪. 'రో' అను శబ్దము సంబోధనమునందు స్త్రీవాచకశబ్దమునకుఁ బిదప నగును. ఆ శబ్దము హ్రస్వాంతమయి 'రొ' అనియు నగు నని సూత్రార్థము.

'కమలదళాక్షిరో!' మున్నగు ప్రామాణిక ప్రయోగములు కానవచ్చుచున్నను, వానిని బాలవ్యాకరణము సాధింపనందున తత్సమర్థనార మీ సూత్రము ప్రారంభింపఁబడినది.

'కమలదళాక్షిరో—'అనునది 'రో' అనుదానికి, 'రమణిరొ' అనునది 'రొ' అనుదానికిని ఉదాహరణములు. పయి ఉదాహరణములంబట్టియుఁ బ్రయోగాంతరములంబట్టియుఁ జూడఁగా-'రొ-రో' లు చివరఁ జేరిన శబ్దము

లకు ముందు ఆమంత్రణమున రావలసిన 'ఓ' శబ్దము సాధారణముగా రాదని చెప్పనగును.

ఈ 'రో, రోః' లు స్త్రీవాచకములకే యగు నని 'సూత్రమున నుండు టచే 'అన్నరో, వినుంగురో' మున్నగు ప్రయోగము లసాధువు లనియుం అయ్యవి ఆధునిక గ్రంథములందే యుండుటచే నగ్రాహ్యము లనియుం వివరణమునఁ జెప్పఁబడినది. కాని ప్రౌఢవ్యాకర్త సూచించిన యా యాధునిక గ్రంథము కూచిమంచి తిమ్మకవిరచితమగు అచ్చతెనుఁగు రామాయణము. పయి ప్రయోగము లందలి యరణ్యకాండములోనివి. [అన్నరో! యీసుమంతలేసి యగు నిద్దంపుం 'దిన్నియలుసాటి.' [ప. ౨౧.] 'కదు నలుగక యేచుంగురో!, పడఁతుక తెఱఁగు' [ప. ౯౦.] కాని, యచ్చతెనుఁగురామాయణము ప్రౌఢవ్యాకర్తమతమునఁ బ్రామాణికగ్రంథమే! పయి ప్రయోగములను మాత్రము గ్రహింపక, తనకుఁ దోఁచినవానిని మాత్రము ప్రౌఢవ్యాకరణకర్త గ్రహించుట వింతగ నున్నది. పయిసూత్రంబున 'రో శబ్దంబొందు సంబోధనంబున స్త్రీవాచక, స్త్రీసమంబుల కగు' నని సవరించినచో పయి ప్రయోగములును సుసాధ్యములగును. ఇయ్యది ఏకవచనమునందే కానఁబడుచున్నది.

**(౬) దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబు లగు సంబోధ్యవాచకశబ్దంబులమీఁద నేకవచనంబునఁ గాన శబ్దం బొందును, అల యను నవ్యయం బొందును గానం బడియెడి. అల దీర్ఘాంతంబు నగు.**

ఉ. 'ఎ. గీ. భవ్యరతి దేవతాచార పరమపుణ్య, ధర్మమేమఱకుండుమీా తల్లికాన!' నై. ౭. ఆ. ౯. 'మాసామికాన!' సా. ౧ ఆ. ౭౩. (ఈ కవి 'పాపజాతికాన' అని ప్రయోగించినాఁడు: అది విచార్యము 'ఉ. [1]అక్కల కన్యకాత్వ మిటు

1. అక్కట! కన్యకాత్వము. పా.

లాఁఱడివోవ నకారణంబ నీ, కెక్కడిచూలు వచ్చె?' నిర్వ. ౨. ఆ. ౨౪. 'చ. తొడిఁబడ నమ్మలక్క లని తూలుచు దీనత దోయి లొగ్గుచుఁన్.' ఆము. ౨ ఆ. ౫౯. 'క. వ్రేలెడు వెండ్రుక లిరుగడఁ, దూలఁగఁ [1]దల యూఁచుఁ దొప్పదొప్పన నోరిం, గేల నడిచికొను సెలవుల, లాలలు దొరఁగంగ నన్నలా యని యొఱలున్.' ఉ. హరి. ౪ ఆ. ౩౦౨.

౧౫. కొన్నిచోట్ల దేశ్యశబ్దములందు స్త్రీవాచకములు గాని, స్త్రీసమములు గాని యగు సంబోధ్యవాచక శబ్దములకు ఏకవచనమునందు 'కాన' అను శబ్దము చేరుట కలదు. కొన్నిచోట్ల 'అల' అను నవ్యయము చేరుట కలదు. కొన్నిచోట్ల ఈ యవ్యయము దీర్ఘాంతమై 'అలా' అని యగుటయుం కలదని సూత్రార్థము.

'తల్లికాన, అమ్మల, అన్నలా;' మన్నగు సంబోధనాంత పదములను బాలవ్యాకరణము సాధింపనందున, వానికి సాధుత్వము సిద్ధింపఁజేయుట కీ సూత్రము చెప్పఁబడుచున్నది.

'తల్లికాన' అనునది దేశ్యశబ్దముపై 'కాన' చేరుట కుదాహృతి. వేంకటకవి సారగనధరచరిత్రయందు 'మా సామికాన, పాపజాతికాన' అని ప్రయోగించియున్నాఁడు. అందు 'సామి'ని దేశ్యముగా గ్రహించి ప్రౌఢవ్యాకర్త 'సామికాన!' సాధువుగా నొప్పుకొని, 'పాపజాతికాన' అనునది యప్రామాణిక మను నభిప్రాయముతో నా ప్రయోగము విచార్య మని వ్రాసినాఁడు. ఒక కవి ప్రయోగించినవానిలో నొకటి ప్రామాణికమై, యింకొకటి తద్వ్యతిరిక్తమగుట వింత! సూత్రంబులో 'దేశ్యంబులం గొన్నియెడల' అను

1. దలయూఁచుఁ దొప్పదొప్పన నోరుం, గేల నడిచికొను సెలవుల, లాలలు దొరఁగంగ. పా.

టకు బదులుగాఁ 'గొన్నియెడల' అని గ్రహించి, 'దేశ్యంబుల' నను పదమును విడిచినచో నీ ప్రయోగము లన్నియును సుసాధ్యము లగును.

'అక్కలు! కన్యకాత్వ మిటు లాఱడివోవ' అనునది సంబోధ్యవాచకముపయి 'అల' చేరినందుల కుదాహృతి. కాని ఇట 'అక్కట! కన్యకాత్వ మిటు లాఱడివోవ' అను పాఠమున్నందునను, 'అక్కట!' అని యన్నను అర్థస్ఫూర్తికిఁగాని, ఛందస్సునకుఁగాని భంగము కలుగనందునను 'కవి ప్రయుక్త మిద్ది' యని నిశ్చయింప నవకాశము లేదు.

'తోడిఁబడ నమ్మలక్క లని తూలుచు దీనత'- అనునది 'అల' వచ్చుట కుదాహరణాంతరము. బాలవ్యాకరణమున 'స్త్రీవాచక, తత్సమ, సంబోధనాంతములకు సంధి లే' దని అకారసంధిని నిరూపించునపుడు చెప్పఁబడినది. సంబోధనాంతములను సంధి లేకుండుటయే శ్రేయము. సంధి చేసినచో సంబోధనప్రయోజనమే నశించును. కాని యియ్యెడ 'అమ్మలక్క లని'-అకార సంధి చేయఁబడినది.

'అన్నలా యని యొఱలున్'- అనునది 'అల' దీర్ఘాంతమగుటకు ఉదాహరణము.

'అల' పరమగునపుడు సంధి నిత్యమగు నని ప్రయోగములంబట్టి గ్రహించునది.

౧౬. హలవసానంబులు పరంబులగునపుడు లు రు వర్ణకంబుల యుత్వంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు.

ఉ. 'మ. వితతోల్కాశనిపుంజమొక్కొ యనఁగా వినీవ్థి నిక్షిప్తప, క్షతివాతాహతిఁ దూలి తూలశకలాకారంబులై వారిద, ప్రతతుల్ సాల్పడి నల్గడం జెదరఁగాఁ బాఱె న్మనోవేగుఁడై, పతగేంద్రుం డమృతాంతికంబునకుఁ దత్పాలుర్

భయంబందఁగన్.' భార. ఆది. ౨ ఆ. ౯౧. ఇట్లు 'భూసు రోత్తముల్, భూపాలురా.' మొ.

౨౭. హల్లుగాని, అవసానముగాని పరమగునపుడు 'లు-రు-' అను ప్రత్యయముల ఉకారమునకు లోపము వికల్పముగా నగు నని సూత్రార్థము.

'బాలవ్యాకరణమునందు' పదాంతంబులై యసంయుక్తంబు లయిన 'ను, లు, రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' నని ప్రకీర్ణపరిచ్ఛేదమునఁ జెప్పఁబడినది; కాని యా సూత్రవివరణమునందే 'ఇందు ను-రు లకుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు' అనియుఁ గలదు. 'మ్రానపడియె-వత్తురార్వురు' అని యుదాహృతులు నీయఁబడినవి. అట్లు కాక అవసానము పరమగునపుడు లు-రు-ల యుత్వలోపము కానవచ్చుచున్నందున నీ సూత్రము చెప్పఁబడినది. కాని యుదాహృత భారతపద్యములో 'వారిద ప్రతతుల్ సాల్పడి, - తత్పాలురా భయంబందఁగన్' అను చోట్ల రెంటను హల్లు పరమగునపుడే ఉత్వలోపము చూపఁబడినది. భూసురోత్తముల్, భూపాలురా-' అని సాధారణముగ నుదాహరింపఁబడినది. వానికిఁ బ్రామాణిక ప్రయోగములను జూపుట లెస్స. [చూ. నిర్వ. ౪. ఆ. ౮౪.]

**మహత్సమానార్థకశబ్దం బమహత్కర్త్య యుక్తం బయ్యుఁ దద్విశేషణక్రియలు మహత్కర్త్యయోగ్యంబులు విభాష నగు.**

ఉ. 'ఎ, గీ. మునినికాయ మెల్ల, వివిధపుణ్యకథలు విను వేడ్క నదనిఁబూజించిరి.' భార. ఆది. ౧ ఆ. ౨౭. 'క. గీర్వాణ ప్రభుఁ డాదిగ, గీర్వాణగణంబు కాలకేయులతోడన్, గర్వించి రణముచేసి ర, ఖర్వపరాక్రములు కడిమిఁ గడు నుద్ధతులై.' భార. అర. 3 ఆ. ౪౧. 'అయ్యిరువురు దెగలు పగలు గారే తమ

లోఁగ.' నిర్వ. ౩ ఆ ౯౬. 'పడ నడుతురు గన్న నిన్నుఁ బ్రమథగణంబుల్.' నిర్వ. ౪ ఆ. ౧౪ మొ. విభాష ననుటచే 'క. విషధరకుక్షి నసంఖ్యము, నిషాదగణ ముండి ధారుణీప్రజకుఁ గడుఁగ, విషమమును జేయు; వారి ని,మిషమున భక్షించి చనుమ మిత్రవిఘాతీ!' భార. ఆది ౨ ఆ. ౫౮. 'సీ. నెత్తమ్ము లే కొండ నెత్తములం దాడు విద్యాధరీకోటి విటులతోడ.' స్వా. ౪ ఆ. ౭౪. ఇత్యాదు లూహ్యంబులు.

౧౭. మహత్సమూహార్థకశబ్దంబు=మహద్వాచకములయొక్క సమూహమును దెలియఁజేయు పదము; తద్విశేషణక్రియలు = అమహద్విశేషణక్రియలు:. మహద్వాచకసమూహమును దెలియఁజేయు శబ్దములు అమహత్కార్యముతోఁ గూడియున్నను- ఆ యమహద్విశేషణము, క్రియలు అమహాత్ములకుఁ దగిన ట్లుండక మహాత్ములకుఁ దగినట్లే యుండు ననియు, ఇట్లుండుట వికల్ప మనియు, అమహద్విశేషణము క్రియలమహద్వాచకములకు యోగ్యములై కూడ నుండు ననియు సూత్రార్థము.

'మునినికాయ మెల్ల వివిధపుణ్యకథలు విను వేడ్క నతనిఁ బూజించిరి.' అని యుదాహృతి. ఇచట 'మునినికాయము' మహత్సమూహార్థకము ఏలయననిది మహాత్ములగు మునులయొక్క సమూహమును దెల్పు 'నికాయ' శబ్దముతోఁ గూడియున్నది. ఈ 'నికాయశబ్ద' మమహద్వాచక మగుటచే అమహత్కార్యయుక్తమై యున్నది. అయినను దాని క్రియ యగు 'పూజించిరి' అనునది మహద్వాచకకార్యమునకుఁ దగినదై యున్నది. [మునినికాయము 'పూజించె' నని యుండక 'పూజించి' రని యున్న దని గ్రహింపఁదగును.]

ఇట్లే 'గీర్వాణగణంబు గర్వించి కడునుద్ధతులై రణముచేసిరి' అను 'కడ ఉద్ధతులై' అను విశేషణమును, 'చేసిరి' అను క్రియయును మహత్కార్యయోగ్యములై యున్నవి. 'అయ్యిరు వెగలు పగఱ కారే' అనుచోట మహ-

త్సమూహార్థము. 'తెగలు' అమహత్తయినను, తద్విశేషణమగు 'పగఱ' అను పదియుం, క్రియ యగు 'కారే' అనునదియును మహత్కార్యయోగ్యము లయిరేయ యున్నవి.

'పడ నడతురు... ప్రమథగణంబుల్' అనునదియుం నిట్లే, మహత్సమూహార్థకము అమహత్కార్యయోగ్యము కాక, మహత్కార్యయోగ్యమగుట వికల్పము కాన అమహత్కార్యయోగ్యమగుటయుఁ గల దని తెలియం చున్నది. దాని కుదాహరణములు—'నిషాదగణము... విషమమును జేయం' డనుచోట క్రియ అమహత్తుగానే కలదు; 'విద్యాధరీకోటి విటులతోడ... ఆడున్...' అనుచో క్రియ. యమహత్తుగనే యున్నది. ఈ యుదాహృతిలో 'విద్యాధరీ కోటి' లోని 'కోటి' మహత్సమూహార్థకముగ గ్రహింపఁబడిన దనవలెను.

బాలవ్యాకరణమున 'విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబు లగు' నని చెప్పఁబడినది. తద్విరుద్ధములు కొన్ని ప్రయోగములు కాన వచ్చుచున్నందున నీ సూత్రము చెప్పఁబడినది.

కుమారదేవపండితీయమున మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్య యోగ్యంబు నగు నని యుదాహరించుచోట 'సెత్తమ్ము లాడు' నని చూపుట ప్రమాదము.

## (౧౮) జడపదంబులమీఁది తోడకు మెయి మైలు వికల్పంబుగ నగు.

ఉ. 'ఉ. అందఱుఁగూడి మోసలకు నర్థిమెయిం జను దెంచి.' నిర్వ. ౨ ఆ. ౫౩. 'చ. ముక్తి కున్ముఖత వహింపఁగా వలయు మోహముఁ బాయఁగఁద్రోచి భక్తిమైఁ.' లక్ష్మీ. ౪ ఆ. ౧౫౮. మొ.

౧౮. జడము లనఁగా చలనము లేనివి. అట్టి జడవాచకముమీఁద రావలసిన 'తోడ' అను తృతీయాప్రత్యయమునకు బదులుగా 'మెయి' గాని 'పై' గాని వికల్పముగా వచ్చు నని సూత్రార్థము.

'అందఱుఁ గూడి మోసలకు నర్థిమెయిం జనుదెంచి' అనుచోట 'అర్థిమెయిన్-' అనఁగా 'అర్థితో' అని యర్థము. ఇట్లే ద్వితీయోదాహరణము నందుఁగల 'భక్తిపైన్' అనుదానికి 'భక్తితోడ' నని యర్థము. ఈ 'మెయి, పై' లు రానపుడు 'తో, తోడలు' వచ్చు నని తెలియనగును.

**౧౯. కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులందక్కఁ దక్కిన మహాకవి ప్రయోగములందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టెడు.**

ఉ. 'సీ. *సంగరమునకు నుత్సవము సేఁగెడు క్రియ సొలవక చనియెదు శూరులార!' ఉ. హరి ౬ ఆ. ౧౮౦. 'ఉ. లాలనఁ గ్రొత్త బెబ్బులికళాసము వెట్టిరి యాసనంబుగాఁ, గోలయు సాధువైన యొక కోమటికిన్ నిషధేంద్రు బచ్చుకున్.' నై. ౬ ఆ. ౧౧౫. 'ఆ వెలఁదిసోయగంబు వీక్షింప వినుతింప, వేయి కన్ను లమరవిభుని కిచ్చి, రెండువేల జిహ్వ లండజాధీశ్వరు, కొసఁగఁబోలుఁ బంకజోద్భవుండు.' విక్ర. ౮ ఆ. ౧౬. 'ఉ. బలవంతపుఁ బాపము దెచ్చుకొంటి వేలా నగుఁబాటు కోర్చి.' భోజ. ౫ ఆ. ౯౫ మొ. (ఇట్టి ప్రయోగములంబట్టి యాగమశాస్త్ర మనిత్య మగుటవలనఁ దక్కినచోట్ల నకారాగమము రాకుండినను దోషంబు లే దనియు, కుత్స్నార్థదోషవిస్ఫురణంబు కలుగక పువర్ణాంతశబ్దములమీఁద నకారాగమము వచ్చుట కేతత్సూత్రారంభప్రవృత్తియై యుండును గాన నచ్చోటమాత్ర మయ్యది యత్యావశ్యక మనియుఁ దోఁచుచున్నయది.)

* సంగరం బనిన నుత్సవ. పా.

౮౯. షష్ఠీవిభక్తియందు 'కు' పరమగునపుడు నగాగమము (న)సాధారణముగ వచ్చుట కలదు. కవిత్రయమువారీ నియమమును పాటించిరి. కాని తక్కిన కవుల ప్రయోగములు కొన్ని నగాగమము రానివియుఁ గలవని సూత్రార్థము.

'కువర్ణకంబు పరంబగునపు డుకారబుకారములకు నగాగమం బగునని బాలవ్యాకరణము. ఆ సూత్రముంబట్టి నగాగమము నిత్యమని తెలియుచున్నది. కాని నగాగమము రాని ప్రయోగములు నున్నందున వానిని సాధించుటకీ సూత్రము చెప్పఁబడుచున్నది.

ఉదా- '...ఉత్సవమున కేఁగెడు క్రియ-' ఇచట ఉత్సవమున కేఁగెడు క్రియ' అని నగాగమము రావలసి యున్నను రాలేదు. 'నిషధేంద్రుబచ్చుకున్-' అనుచోట నగాగమము రానందున 'నిషధేంద్రుబుచ్చునకున్' అని కాలేదు. 'అండజాధీశ్వరు కొసఁగఁబోలు' అనుచోట నగాగమము రానందుననే 'అండజాధీశ్వరున కొసఁగఁబోలు' అని కాలేదు. 'నగుఁబాటు కోర్చి' అనునది నగాగమము వచ్చినచో 'నగుఁబాటున కోర్చి' అని యుండవలసియున్నది.

ఇట్టి ప్రయోగములు కానవచ్చుచున్నందున నగాగమము మున్నగు నాగమములను విధించు శాస్త్రము నిత్యము కాదనియు, కొన్ని యాగమములు ప్రయోగమునుబట్టి కొన్నియెడలఁ గానరాకున్నను దోషము లేదనియుఁ దెలియుచున్నది.

ఆగమశాస్త్ర మనిత్యమని యంగీకరించుచున్నయెడ పయి బాలవ్యాకరణ సూత్రముననే మీఁది ప్రయోగములు సుసాధ్యము లగుచున్నపుడు మఱల నీ సూత్రమును ప్రౌఢవ్యాకరణకర్త యేల చెప్పవలసి వచ్చినదని ప్రశ్నింపవచ్చును. నిజమే. పయిరీతి ప్రయోగములకొఱకై యీ సూత్ర

ముద్దేశింపఁబడలేదు. ఏతత్సూత్ర విధాన సామర్థ్యమున 'అష్టిలార్థము'తోఁచ కుండుట కయి 'ప' వర్ణాంత పదములకు షష్ఠిలోని 'కు' పరమగునపుడు మాత్రము తప్పక నగాగమము చేయవలె ననియు, లేనిచో నష్టిలార్థము తోఁచు ననియుం గ్రహింపవలసి యున్నది.

## ౨౦. కంటెవర్ణకము పరంబగునపుడును గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి.

ఉ. 'తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు.' భార. ఆది. ౪ ఆ. ౯౩. 'క. మనయింటిచేటు చూచితె, మనుకుల సత్తముఁడు తొలఁగె మైథిలినిఁ భూ, జనవాదంబు మహాత్ముల, యనఘచరిత్రమునకంటె నధికం బగుటన్.' నిర్వ. ౯ ఆ. ౫౨ పొ.

౨౦. 'కంటె' అనునది పంచమీవిభక్తిప్రత్యయము. అది పరముగా నున్నయెడలఁ గొన్నిచోట్ల నగాగమము (నకారము) వచ్చుటయుఁ గల దని సూత్రార్థము.

ఉకారాంత, ఋకారాంతశబ్దములకు 'కు' పరమగునపుడు నగాగమము సాధారణముగాఁ గనఁబడు నని బాలవ్యాకరణమునందలి సూత్రములం బట్టి తెలియుచున్నది. కాని 'కంటె' వర్ణకము పరంబగునపుడును నగాగమము కొన్నియెడలఁ గానవచ్చుచున్నది. అట్టివానిని సమర్థించుటకై యీ సూత్రము చెప్పఁబడుచున్నది.

ఉదాహరణములలో 'శతంబుకంటె-' అనుదానికి బదులుగా నగాగమము వచ్చి 'శతంబునకంటె' అయినది. 'అనఘచరిత్రముకంటె' అనుదానికి బదులుగ 'అనఘచరిత్రమునకంటె' అయినది. 'కొన్నియెడల' నని యనుటచే 'తత్సుతశతకంబుకంటె' మున్నగువానిలో నగాగమము లేకుండుటను గ్రహింపఁదగును.

**ఉదంతములగు సమహత్తుల కందువర్ణకము పరంబగు నపుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి.**

ఉ. 'చ. దేవ! నీ, వనిమిషనాయకత్వమునయం దభిషిక్తుఁడవై ముదంబుతో, ననుఁ బనిగొమ్ము' భార. ఆర. ౫ ఆ. ౨౨౬. 'క. విను పిండదానసమయం, బునయందును భక్తిపూర్వముగ దీనిఁ బఠిం, చిన నయ్యన్నం బమృతము, నెనయుఁ దురగమేధఫలము నిచ్చుఁ గృతాత్మా!' హరి పు. ౨ ఆ. ౧౪౭. 'సీ. పంతరించితి నిండుజవ్వనంబునయందు, హర్షనైషధకావ్యమాంధ్రభాష.' కాశీ. ౧ ఆ. ౭. 'క. జననాథ! నన్ను నడుగఁగఁ, జనుదెంచిన కార్యమేను సర్వంబు మనం, బున [1]యందు మున్న యెఱుఁగుదు, విను చెప్పెద నీకుఁ దగునె విడువఁగ భార్యన్.' మార్క. ౫ ఆ. ౧౮౩. 'ఉ. డక్కఁగ వ్రాసితిన్ మును పటమ్మునయందు సుశర్మపాపముల్.' పాండు. ౫ ఆ. ౮౦ మొ.

౨౧. చివరియందు హ్రస్వమైన ఉకారము గల శబ్దములు ఉదంతములు. ఆ యుదంతములగు సమహద్వాచకశబ్దములకు 'అందు' అను సప్తమీవిభక్తిప్రత్యయము పరమైనచోఁ గొన్నిచోట్ల నగాగమము కానఁబడుచున్న దని సూత్రార్థము.

'అనిమిషనాయకత్వమునయందు' మున్నగు ప్రయోగములయందు సప్తమీవిభక్తిప్రత్యయము పరమగునపుడు నగాగమము కనఁబడుచున్నది. 'కంటె' వర్ణకము పరమగునపుడేగాక, 'అందు' పరమగునపుడును ఈ యాగమ మున్నదని యీ సూత్రము తెలుపుచున్నది. 'అనిమిషనాయకత్వమునయందు,-

1. దివ్యదృష్టి నెఱుఁగుదు. పా.

పిండదానసమయంబునయందును, నిండు జవ్వనంబునయందు, మనంబున యందు, పట్టమ్మునయందు' అను ప్రయోగములయందు 'అందు' పరమగుచో నగాగమము కానఁబడుచున్నది.

కుమారదేవపండితీయమున నీ సూత్రమునకు వ్రాయఁబడిన వ్యాఖ్య సంగతముగా లేదు. మఱియు నందు 'ఇట్టి రూపములకై యిట్లు వేఱు సూత్రము వ్రాయనక్కఱ లే దని యెంచి సూరిగారు 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' నను సంధి. ౨౮ సూత్రమందలి 'సమాసం బునయం' దను ప్రయోగమునే వీనికి జ్ఞాపకముగఁ గూర్చిరి' అని కలదు. కాని బాలవ్యాకరణమునఁ బై సూత్రము 'సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు' ననియే కలదు. కాన దాని ననుసరించి యెట్టి కల్పనను జేయుట ఉచితము కాదు.

౨౨. తెనుఁగునం గొన్ని తత్సమదేశ్యశబ్దములకంటె బరంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకంబయి యిగా యను నొక్క శబ్దంబును, దానిపై డువర్ణకాదులునుం జూపట్టెడి; సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు. తుదిదీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు.

ఉ. ప్ర. బాలిగాఁడు, చిట్టిగాఁడు; సం. ప్ర. బాలిగా, బాలిగ; చిట్టిగా, చిట్టిగ, బాలిగానిఁ; బాలిగానిచేతఁ అని తక్కిన విభక్తు లూహ్యంబులు; ఇట్లు గోపాలిగాఁడు మొ.

౨౨. తెలుఁగులోఁ గొన్ని తత్సమశబ్దములయొక్కయు, దేశ్యశబ్దములయొక్కయుం ఏకవచనమున నీచత్వమును దెలుపునపుడు 'ఇగా' అను శబ్దము చేరును; దానిమీఁద 'డు' ప్రత్యయము మున్నగు విభక్తిప్రత్యయములు చేరుచుండును. సంబోధనప్రథమావిభక్తిలో 'డు' ప్రత్యయము రాదు. అందు 'ఇగా' లోని గకారముమీఁది దీర్ఘమునకు హ్రస్వము వికల్పముగా

నగును 'బాలిగాఁడు, చిట్టిగాఁడు-' మున్నగునవి ఉదాహరణములు. 'బాల+ఇగా+ఁడు' ఇది తత్సమమునకు 'ఇగా' అనునది, దానిపయి 'ఁడు' వచ్చుటకు ఉదాహరణము. 'చిట్టిగాఁడు' దేశ్యమున కుదాహరణము. 'బాలిగా, చిట్టిగా' అనునవి సంబోధనంబున 'ఁడు' రాకుండుట కుదాహృతులు. 'బాలిగ, చిట్టిగ-' అనునవి 'ఇగా' లోని 'గా' హ్రస్వమగుటకు ఉదాహరణములు. బాలిగానిన్, బాలిగానిచేతన్' మున్నగునవి మిగిలిన విభక్తులలో ద్వితీయకు, తృతీయకు నుదాహృతులు. 'గోపాలిగాఁడు' ప్రథమకు ఉదాహరణాంతరము. ఇపన్ని యందును నీచత్వమును సూచించున వనుట స్పష్టము.

## ద్విత్వయుక్తలాంతంబుమీఁది లులలకును రుర లాదేశంబు లగు.

ఉ. 'మ. అరరే[1] యల్లియ రామరాజు పెద తిమ్మాధీశు బాహాభయం, కరకౌక్షేయకధారఁ [2]బోరునఁ గడంకం ద్రెళ్ల వీరారిమ ల్లురకున్ మట్టి యగుం దదీయబలధూళుల్ సంగడాలో వియ, చ్చరకాంతాస్తనపాళి విన్ గరిడి నాశ్చర్యంబు చర్చింపఁగన్.' రామా. ౧. ఆ. ౫౯ మొ.

౹౩. ద్విత్వయుక్తలాంతంబు = ల్ల; అట్టి ద్విత్వలకారాంతముపై 'లు, ల' లున్నచో, అవి 'రు, ర'లుగా మాఱును.

బాలవ్యాకరణమున 'అదంతం బయి,దీర్ఘపూర్వలోపధం బయిన మహత్తుమీఁది విభక్తిలకారంబునకు రేఫం బగు' నని చెప్పఁబడినది. లకారమునకైన ఆ రేఫాదేశము దీర్ఘపూర్వలోపధంబైన మహత్తుమీఁదిదానికే గాని, ద్విత్వయుక్తలాంతముమీఁది లకారమునకు రానందున 'వీరారి మల్లురకున్'అనునిట్టి రూపములు సాధింపఁబడఁజాలవు వాని సాధుత్వమునకై యీ సూత్ర మారం

1. యయ్యలెరామరాజు. పా. 2. భోరునఁ గడంకంద్రవ్వ. పా.

ఛింపఁబడినది. ఇచట 'వీరారిమల్లురకున్-'అనుదానిని 'వీరారిమల్లులకున్'-అని దిద్దినచో ప్రాసభంగ మగును.

**(౨౮.) విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు.**

ఉ. 'విధో విధానే హ స్త్యన్నే ప్రకారే వేతనేఽపి చ.' అని పుంలింగంబునందు *అజయుఁడు. దీనికిఁ దత్సమంబునం బుంలింగరూపంబుతోనే ప్రయోగముగాని స్త్రీలింగరూపముతో లేదు. దంష్ట్రాశబ్దంబును బుంలింగముగాను గానంబడియెడి.

౨౮. 'విధా' శబ్దము సంస్కృతమున పుంలింగముగాఁగూడ నుండు నని సూత్రార్థము.

బాలవ్యాకరణమునందు 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' నను సూత్ర వివరణమునందు 'విధాశబ్దంబునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు-విధము' అని వ్రాయఁబడినది. అయ్యది పుంలింగంబు నగు నని యిట చెప్పఁబడుచున్నది.

'విధ' శబ్దము పుంలింగ మగుటకు 'విధో విధానే...' ఇత్యాది నిఘంటువు అజయుఁడనిచ్చి ఉదాహరింపఁబడినది. ఇది తత్సమమునందు స్త్రీలింగరూపముతోఁ బ్రయోగింపఁబడదు. 'విధము' అనియే యుండును గాని 'విధ' అని యుండదు. పుంలింగమైనను మహద్వాచకము కానందున 'విధుఁడు' అని (ఈ యర్థమున) కాదు. ఈశబ్దమువలెనే 'దంష్ట్రా' శబ్దము పుంలింగముగాను కనఁబడుచున్నది. దానిని చిన్నయసూరి స్త్రీలింగముగాఁ జెప్పెను.

**౨౯. అర్ఘాదులకడ నచ్చున కుత్వంబును, మీఁద పువర్ణకంబును వైకల్పికంబుగా నగు.**

---

* అజయుఁడు చెప్పెనని భావము. అతని నిఘంటువు నముద్రితము.

ఉ. అర్ఘువు, అర్ఘము; ధర్మువు, ధర్మము; వర్గువు, వర్గము. 'చ. అవని యరాజకం బయినయప్పుడు భూప్రజలందు సర్వధ, ర్మువులు దొలంగు దేవమునిముఖ్యులు వాయుదు రోలి వృష్టి లే, దవు మఱి యర్ఘువుల్ దఱుఁగునందురు కావునఁ గాలయాపనం, బవితథవాక్య! చేయక రయంబున రాజ్యము నిల్పుమి త్తఱిన్.' భార. ఆది. ౪ ఆ. ౨౪౮. వర్గువునందలి వువర్ణకం బొండె లోపించు. ఉ. వర్గు.

౨౫. 'అర్ఘ' మున్నగు శబ్దముల చివరి యచ్చునకు ఉకారమును, దాని తర్వాత 'వు' ప్రత్యయమును వికల్పముగా నగు నని సూత్రార్థము.

బాలవ్యాకరణమున పుంలింగములై మహద్వాచకములగువాని అత్వమునకు ఉత్వము విధింపఁబడినది. అర్ఘాదులు మహద్వాచకములు కానందున ఆ సూత్రముచే ఉత్వము రాదు. 'అర్ఘువు, ధర్మువు'-మున్నగు రూపములు వేఱొక విధమున సాధింపఁబడనందున వానికొఱకై యీ సూత్రము చెప్పఁబడుచున్నది. ఉకారాదేశ, వువర్ణకములు వికల్పములగుటచే ఇవి రానపుడు 'అర్ఘము, ధర్మము-' మున్నగు రూపము లగును. దీనికి 'సర్వధర్మువులు, అర్ఘువుల్-' అనునవి భారతమునందలి యుదాహరణములు. 'వర్గువు-' లోని 'వు' లోపించి 'వర్గు' అని యుండుటయుఁ గల దని వివరణమునఁ జూపఁబడినది

ఇయ్యెడ 'కుమారదేవపండితీయము'న 'పుంలింగమహద్వాచకనామంబుల తుది యత్వంబునకును, హలంతములకును ఉత్వము తత్స. సూ. ౨౧-౬౭ లచే బాలవ్యాకరణమున విహితము' అని చెప్పఁబడినది. అచట హలంతములకు విధింపఁబడినది ఉగాగమము కాని ఉత్వాదేశము కాదు.

(౨౬) రాహుబాహు శబ్దముల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు.

ఉ. 'రాహువు, రాహు; రాహువులు, రాహులు; బాహువు, బాహు; బాహువులు, బాహులు ఇత్యాదులు. 'సీ. . .అపమేఘమై యున్న యంబరమున, విద్యుత్సహస్రముల్ విలసిల్లె మఱి రాహు పర్వంబు గాకయు భానుఁ గప్పె.' భార. సభా. ౨ ఆ. ౨౯౯. 'తే. అగ్గలించి నాయొదుర బాహాప్పళించి, కడవఁజాలిన మల్లురఁ గాన నెందు.' భార. విరా. ౨ ఆ. ౭. మొ.

౨౬. రాహు, బాహు శబ్దముల 'వు' ప్రత్యయ మన్ని విభక్తు లందును వికల్పముగా లోపించి 'రాహు, బాహు' అని యుండుటయుఁ గల దని సూత్రార్థము.

చిన్నయసూరి ఊకారాంతశబ్దముల కన్ని వాచకములయందును 'వు' వర్ణకమును విధించుచు, వానికిఁ బ్రథమా బహువచనము మొదలుకొని వీ విభక్తి పరమయినను 'వు' వర్ణము బహుళముగా వచ్చు నని చెప్పెను. ప్రథమైకవచనమున సూత్రము 'వు' ప్రత్యయము తన్మతమున నిత్యము. కాని 'వు' ప్రత్యయము చేరని 'రాహు, బాహు' శబ్దములు కానవచ్చుచున్నందున వానిని సాధింప నీ సూత్రము చెప్పఁబడుచున్నది.

'. . .రాహు, పర్వంబు గాకయుం భానుఁ గప్పె' ననుచో పర్వదినము [అమావాస్య] కాకున్నను రాహువు సూర్యుని గప్పె నని యర్థము. కాన 'రాహు' ప్రథమైకవచనము; ఇచట 'వు' వర్ణకము రాలేదు. 'బాహాప్పళించి' అనుచో బాహువు చఱచి యని యర్థము. ఇచట 'బాహు' ప్రథమైక వచనము. 'వు' వర్ణకరహితము.

## విశ్వకర్ముఁ డనియు రూపంబు.

ఉ. 'సీ. విశ్వకర్ముని కూఁతు విశదలావణ్య సంయుజ్జ్వలఁ జేకొని మూర్తిఁబోయి.' హరి. ఉ. ౪ ఆ. ౪౫.

౨౭. 'విశ్వకర్ముఁడు-' అని కూడ రూపకము కల దని యర్థము. బాల వ్యాకరణమున 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' నని సూత్రింపఁబడినది. కావున నుత్వదుజ్ఞులు రానందున 'విశ్వకర్మ' అనియే కాని, 'విశ్వకర్ముఁడు' అని యుండదని చిన్నయసూరి యభిప్రాయము. కాని 'విశ్వకర్మునికూఁతు' నని హరివంశప్రయోగ మండుటచే 'విశ్వకర్ముఁడు' సాధు వని యీ సూత్రము వివరించుచున్నది.

**౨౮. దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు.**

ఉ. అక్కడ, ఇక్కడ, ఎక్కడ; అచ్చట, ఇచ్చట, ఎచ్చట మొ. ఆదిశబ్దముచేత ఇరులు, కేలు మొ. కొందఱు ఇరులు కేలు శబ్దములు బహువచనాంతము లందురు. అట్లు కాదు. 'ఇరులున నొంటిఁబోఁ బరసతి నెట్టుట.' విజ్ఞా. ప్రా. ౧౦౫. 'కలభాషిణి వేనలి యొకకేలఁ బట్టి వేఱొక్క కేల నొఱగత్తి పెఱికి.' కళా. 3 ఆ. ౧౧౯. 'సీ. ఉపధానవినిమయం బొండొండ చూపుటఁ బెఱకేలు లణఁకువఁ బ్రిదిలి బిగియ.' కవిక. ౪ ఆ. ౧౮౦.

౨౮. 'అక్కడ' మున్నగు దేశ్యములన్నియుం నిత్యైకవచనాంతములు-అనఁగా అవి యెప్పుడును ఏకవచనముననే ఉండును; వానికి బహువచన ముండదు' అని యర్థము.

బాలవ్యాకరణమున నిత్యైకవచనాంతము లేవో, నిత్యబహువచనాంతము లేవో వివరింపఁబడనందున అవి యిందు వివరింపఁబడుచున్నవి. ఈ సూత్రము మొదలు ౩౪-వ సూత్రమువఱకును గల ఈ సూత్రములలో నిత్యైకవచనాంతములు వివరింపఁబడుచున్నవి.

అక్కడాదులలో 'ఇరులు, కేలు' మున్నగునవియుఁ జేరి యున్నవి. వానిచివర 'లు' ఉండుటచే అదిబహువచనప్రత్యయ మనియు, ఆ పదములు

బహువచనాంతము లగు ననియుఁ గొందఱు భ్రాంతిపడుచున్నారు. ఆ రీతిని తలంచుట సరికా దనియు, 'లు' అనునది అచట శబ్దగతమే కాని బహువచన ప్రత్యయము కా దనియు వివరణమునఁ జూపఁబడుచున్నది.

'ఇరులున నొంటిఁబోఁ బరసలి సెట్టుట—' అనుచోట 'ఇరులు'బహువచనాంతమైనచోఁ'న' (ఏకవచనప్రత్యయము) అచట చేరి యుండఁజాలదు.

'కలభాషిణివేసలి, యొకకేలఁబట్టి వేఱొక్క కేల-అనుచో 'కేలు' బహువచనాంతమైనచో 'ఒక్క' అను విశేషణము కుదురఁజాలదు. '...బెఱ కేలు లణఁకువఁ బ్రిదిలి బిగియ-' అనుచోట 'కేలు' బహువచన మందు రేని దానిపై'లు'చేరుట పొసఁగదు. ('కేలు' శబ్దము నిత్యైకవచనాంతము కాదు.)

## ౨౯. సస్యవాచకశబ్దములును

ఉ. ఆరుగ, చోడి, వరి, కంది, పెసర, మినుము మొ.

౨౯. సస్యము (పైరు) అను నర్థమును దెలుపు శబ్దము లన్నియును నిత్యైకవచనాంతము లగును. ఆరుగ-చోడి-కంది-అనఁగా ఆరుగచేను, చోడిచేను, కందిచేను అని యర్థము. 'గింజలు' అను నర్థమున ఆరుగలు - చోళ్లు కందులు—' అని యుండవచ్చును.

## ౩౦. కతిపయ సంభారవాచకశబ్దములును

ఉ. ఆముదము, ఇంగువ, ఉప్పు, చింతపండు, చమురు, పసుపు మొ.

౩౦. కొన్ని సంభారవాచకశబ్దములు నిత్యైకవచనాంతములు; భోజనమున కుపయోగించు పదార్థసంచయము సంభారము. 'ఆముదము' మున్నగు వానిని 'ఆముదములు' అను రీతిని వాడరాదని భావము. కాని 'నేతులు, నూనెలు' అని బహువచనాంతములు కలవు.

## ౩౧. లోహవాచకశబ్దములును.

ఉ. ఇత్తడి, ఇనుము, కంచు, బంగారు, వెండి మొ.

౩౧. లోహములను దెల్పు శబ్దములు ఎల్లపుడు నేకవచనమునందే యుండును. ఉదాహరణములను ‘ఇత్తడులు, ఇనుములు, కంచులు, బంగారులు, వెండులు’ అని వాడరాదు.

## ౩౨. సమానార్థకము లయిన యీ డెన సరి సాటి లోనగు దేశ్యవిశేషణశబ్దములును.

ఉ. ‘క. స్వరములు సురములు శిరములుఁ, గరములుఁ బెందొడలు మెడలుఁ గన్నులు వెన్నుల్, సురుచిరపదములు రదములు, నిరుపురకుం జూడ నొక్కయీడై యునికిన్’ రా. కిష్కిం. ౧౯౨. ‘క. పతిఁ బడసి సుతులఁ బడయఁగ, నతివలు గోరుదురు కోరినట్టుల తనకున్, బతిఁ బడసి సుతులఁ బడసెను, సతులీ భార్గవికి భాగ్యసంపద యెనయే?’ భార. ఆది. 3. ఆ. ౧౭౧. ‘క. సురపతి యమ వరుణ ధనే, శ్వర కమలాసనుల దివ్యసభ లెల్ల నరే, శ్వర! చూచితి నవి దీనికి, సరిగా వత్యంతవిభవ సౌందర్యములన్.’ భార. సభా. ౧. ఆ. ౫౯. ‘ఉ. హేమధరాధరేంద్రమున కెంతయుఁ బెద్ద ధృతిన్ భుజంగమ, స్వామికి మేలు చేయి పటువాగ్విభవంబున బుద్ధిసంపదం, దామరచూలికిన్ సరి ప్రధానులు దక్కినవారు సాటియే, మామిడి వీరభద్రున కమాత్య శిఖామణి కివ్వసుంధరన్.’ నై. ౧ ఆ. ౨౮. మొ. [1]‘సరులు లేని దృక్ఖంజన శాబకములు’ అని యొకచోఁ బ్రయోగము కానఁబడుచున్నది. అది శబ్దాలంకారతత్పరత్వమునఁ బ్రౌఢముగాఁ జెప్పఁబడిన దని గ్రహింపవలయును.

౩౨. ‘ఈడు, ఎన, సరి, సాటి మొదలైనవి విశేషణములగు దేశ్యశబ్దములు. అవి ‘సమానము’ అను అర్థము నిచ్చును. అట్టివన్నియును ఏకవచనము

1. ఇయ్యది శ్రీనాథుని ప్రయోగము. నై. 3. ఆ ౯౦.

నందే యుండును. ఈ విశేషణములయొక్క విశేష్యములును, వానికి సంబంధించిన క్రియలును బహువచనమున నున్నను, ఇవి మాత్ర మేకవచనమునందే యుండు నని భావము.

'స్వరములు...రదములు, నిరుపురకుం జూడ నొక్క యీడై యుంనికిన్' ఇచట 'ఈడు' ఏకవచనము విశేషణము; స్వరములు...రదములు మున్నగు విశేష్యములు బహువచనాంతములు. '......సతు లీ భార్గవికి భాగ్యసంపద కెనయే?' ఇచట బహువచనాంతమగు 'సతులు' విశేష్యము, ఏకవచనాంతమగు 'ఎన' విశేషణము; 'అవి దీనికి సరి గావు' ఇచట 'అవి' బహువచనాంతము విశేష్యము, 'కావు' క్రియ బహువచనాంతము; 'సరి' విశేషణ మేకవచనాంతము.

'...ప్రధానులు సాటియే' ఇచట విశేష్యము ప్రధానులు' బహువచనాంతము; విశేషణము 'సాటి' ఏకవచనాంతము.

ఇట్లు 'సరి మున్నగునవి ఏకవచనాంతములైనను, 'సరులు లేని దృక్కంజనశాబకములు' అని శ్రీనాథుని ప్రయోగము బహువచనాంతము కానవచ్చుచున్నది. శ్రీనాథుఁడు శబ్దాలంకారమును గూర్చవలె నను కోరికతో 'సరి' శబ్దమును బహువచనాంతముగా నచటఁ బ్రయోగించి యుండవచ్చు నని ప్రౌఢవ్యాకరణకర్త యభిప్రాయము.

## 33. గుణరసవాచకములైన దేశ్యవిశేషణశబ్దములును.

ఉ. ఈకాళ్లు తెలుపు, ఆకాళ్లు నలుపు; ఈపండ్లు తీపు, ఆపండ్లు పులుపు మొ.

33. దేశ్యములగు గుణవాచకశబ్దములును, రసవాచకశబ్దములును విశేషణము లైనప్పు డవి యేకవచనమునందే యుండు నని సూత్రార్థము.

'ఈ కాళ్లు తెలుపు' అనుచో 'ఈ కాళ్లు' విశేష్యము బహువచనాంతము, విశేషణమగు గుణవాచకము 'తెలుపు' ఏకవచనాంతము. 'ఈ పండ్లు

తీపు' ఇచట విశేష్యము బహువచనాంతమైనను రసవాచకముగు విశేషణము 'తీపు' ఏకవచనాంతముగ నున్నది. ఇట్లే తక్కినవానిని గ్రహించునది.

**(౩౪) కొన్నియవ్యయంబులు బహువచనాంతతుల్యంబులు నగు.**

ఉ. అట్టు, అట్లు; ఇట్టు, ఇట్లు; ఎట్లు, ఎట్లు; నిచ్చు, నిచ్చలు మొ.

౩౪. కొన్నియవ్యయములు 'లు' అనునవి చివర నుండుటచే బహువచన భ్రాంతిని గొల్పును; అవి బహువచనాంతతుల్యము (సమానము) లగుం గాని బహువచనాంతములు కా వని సూత్రార్థము.

'అట్టు, ఇట్టు, ఎట్టు' మున్నగునవి ఏకవచనాంతములుగను, వాని రూపాంతరములగు 'అట్లు, ఇట్లు, ఎట్లు' మున్నగునవి బహువచనాంతములుగను గానవచ్చును. కాని అవి యవ్యయము లగుటవలన వానికి లింగ విభక్తి, వచనములు లే వని తెలిసికొనవలెను.

**౩౫. అందఱాద్యులు నిత్యబహువచనాంతములు.**

ఉ. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, పెక్కండ్రు, పలుగుండ్రు.

౩౫. నిత్యబహువచనాంతము లనఁగా ఎల్లపుడును బహువచనము నందే యుండునవి. ఇది మొదలు నాల్గు సూత్రములం దెయ్యవి నిత్యబహువచనాంతములో వివరింపఁబడును. ఇందు 'అందఱు' మున్నగునవి నిత్యబహువచనాంతము లని చెప్పఁబడినవి. వీని కేకవచనములు లేవు.

**౩౬. అదరులు లోనగుశబ్దములును.**

ఉ. అదరులు, అలువుళ్లు, ఎండువులు, మిడుఁగుఱులు మొ. ఇవి వృత్తియం దేకవచనాంతంబుల యగు. ఉ. అదరుటగ్గి మొ.

3౬. అదరులు మున్నగు శబ్దములు కొన్ని యెప్పుడును బహువచనాంతములుగనే యుండును. కాని సమాసవృత్తియందు అవి ఏకవచనాంతములగును. ఉదా.—అదరులు - (మిణుఁగురులు.) సమాసవృత్తిలో 'అదరు + అగ్గి = అదరుటగ్గి - (మిణుఁగురు సంబంధమగు నగ్ని యని యర్థము.)

## 3౭. తఱచుగ ధాన్యవాచకశబ్దములును

ఉ. ఆళ్లు, చోళ్లు, వడ్లు, కందులు, పెసలు, మినుములు మొ. తఱచుగ ననుటచే బియ్యము, జీలకఱ్ఱ ఇవి ధాన్యవాచకము లయ్యును నిత్యైకవచనాంతములే యని గ్రహింపవలయును.

3౭. ధాన్యములను దెలియఁజేయు శబ్దములు తఱచుగ బహువచనాంతములయి యుండును. ఉదా. ఆళ్లు, చోళ్లు - మొదలైనవి. ధాన్యవాచకము లగు శబ్దములు కొన్ని ఏకవచనాంతములు నుండు నని 'తఱచుగ' అని సూత్రమునఁ జెప్పుటవలన గ్రహింపవలసి యున్నది. బియ్యము, జీలకఱ్ఱ వాము మున్నగునవి నిత్యైకవచనాంతములు.

## 3౮. క్రీడావిశేషవాచకశబ్దములును.

ఉ. అచ్చనగాయలు, ఓమనగుంటలు, కనుమూసిగంతలు, గుజ్జెనగూళ్లు, బొమ్మపెండ్లిండ్లు, ఉప్పునఁబట్టెలు కుప్పిగంతులు, గొబ్బిళ్లు, దాఁగిలిమ్రుచ్చులు, పుట్టచెండ్లు, బిల్లగోళ్లు, సరిబేసులు మొ. ఒకానొక కవి యిందుఁ గొన్నిటి నేకవచనాంతములుగాఁ బఠించి యున్నాఁడు. అది విచార్యము.

3౮. కొన్నియాటలను దెల్పు పదములు నిత్యబహువచనాంతములు—అచ్చనగాయలు మున్నగునవి ఉదాహరణములు. ఉదాహృతములలోఁ గొన్నింటి నొక కవి యేకవచనాంతములుగాఁ జెప్పియున్నాఁడఁట! కాని యది యగ్రాహ్య మని యేతద్వ్యాకరణకర్త యభిప్రాయము.

**౩౯. తఱచుగా స్త్రీసమంబు లగు దేశ్యశబ్దంబులకుఁ గడపలఁ గొన్నింటి కేకవచనంబునం బూజ్యతయందు గారుశబ్దం బగు.**

ఉ. అయ్యగారు, అమ్మగారు, తల్లిగారు, తండ్రిగారు, రాజుగారు, రాణిగారు, సెట్టిగారు, నాయఁడుగారు, దేవిగారు మొ. 'చ. మామగా, రనుటయ*కాని మా దశరథావనిభర్తకు మీకు భేదమే?' ఉ. రా. ౫ ఆ. ౨౫౨ మొ. (నాయఁడుగారు, దేవిగారు-వీనికిఁ దఱచుశబ్దంబు శరణంబు.)

౩౯. సాధారణముగా స్త్రీసమములగు (ప్రథమైకవచనము ప్రత్యయములు లోపించునట్టి) దేశ్యశబ్దంబులకు చివరియందు-గౌరవార్థమునందు ఏకవచనమునందుఁ గొన్నిచోట్ల 'గారు' అనునది చేరుచుండు నని యర్థము.

'అయ్య, అమ్మ-' మున్నగు శబ్దములు స్త్రీసమములగు ఏకవచనాంత దేశ్యములు. కాని వానికి గౌరవార్థమున 'గారు' చేరి 'అయ్యగారు, అమ్మగారు' మున్నగు రూపము లైనవి. ఉదాహరణములలో 'రాజుగారు, రాణిగారు' అనియుం గలవు. దేశ్యశబ్దముచే 'వైకృతములను గ్రహించి - వైకృతములకును 'గారు' రావచ్చు నని తెలియనగును. కాబట్టి యవి యుదాహరింపఁబడె నని గ్రహించునది. 'రాజు' వైకృత మని కొందఱి సిద్ధాంత మిట స్వీకృత మనవలెను. 'రాణి' వైకృత మగుట స్పష్టము.

'నాయఁడుగారు, 'దేవిగారు' మొదలగువానిని వాడుట కలదు. 'నాయఁడు' స్త్రీసమము కాదు; 'దేవి' తత్సమము. ఇట్టివానిని సాధించుటకు సూత్రమున 'తఱచుగా' నని తొలుతనే చెప్పఁబడిన దని తెలిసికొనవలెను.

ఇయ్యెడ కుమారదేవపండితీయమున 'గారు'ను స్త్రీసమములకు మాత్రము విధించి యుదాహరణములలో అస్త్రీసమములగు 'నాయఁ' డను

*గాని మమ్ము గనినయ్యకు మీకును భేద మున్నదే! - పా.

డుజంతమును, దేవి యను 'స్త్రీవాచకమును జేర్చినాఁడు' అని యున్నది. ఇచట 'దేవి' యను తత్సమము చేర్పఁబడిన' దని చెప్పవలెను.

## ౪౦. ద్వితీయాదులందు రు రి యగు.

ద్వితీయాది విభక్తులయందు గారు శబ్దమునందలి రువర్ణము రివర్ణం బగు నని యర్థము. ఉ. అయ్యగారిన్, అయ్యగారితోన్, అయ్యగారికిన్ మొ.

౪౦. 'గారు' లోని 'రు' ద్వితీయ మున్నగు విభక్తులందు 'రి' గా మాఱు నని యర్థము. ఉదాహరణములు క్రమముగా, ద్వితీయకు, తృతీయకు, షష్ఠికి నీయఁబడినవి.

## ౪౧. డుమంతంబులగు తత్సమాది శబ్దంబులకుం గొన్నింటికి ద్వితీయాబహువచనంబులమీఁదం బూజ్యత్వయుండు గారునకు మాఱుగ వా రగు.

ఉ. శ్రీరాములవారు, వసిష్ఠులవారు, వ్యాసులవారు, స్వాములవారు, రాయలవారు మొ. శ్రీరాములవారికిన్, శ్రీరాములవారితోన్ ఇత్యాదు లూహ్యంబులు.

౪౧. ప్రథమైకవచనమున 'డు' చేరునవి డుమంతములు. అట్టి తత్సమములు మున్నగు కొన్ని శబ్దములకు గౌరవార్థమునందు ద్వితీయాబహువచనాంతరూపముగా నున్న లాంతమునకు 'వారు' అని చేరుచుండు నని యర్థము. 'శ్రీరాములవారు' మున్నగునవి ఉదాహరణములు. ఇవి ఏకవచనార్థమునే యిచ్చును. ఇచట 'స్వాములవారు' అనియు నుదాహరించుటం బట్టి డుమంతములు కాని వానికిఁగూడ నీ 'వారు' చేరుట కల దని గ్రహింప నగును.

## ౮౨ అర్థవిశేషంబునం దేకత్వంబునను గొన్ని శబ్దముల మీఁద వారు చూపట్టెడు.

ఉ. అయ్యవారు, (ఉపాధ్యాయుఁడు. పూజ్యుఁడగు బ్రాహ్మణుఁడు, అట్టి వేలుపు) అమ్మవారు. (స్త్రీదేవత. పూజ్యయగు బ్రాహ్మణస్త్రీ) 'ఎ. గీ చిత్రమిది యయ్యవారి సంసేవవేళ, నమ్మవా రుగ్గడించిరో యనుచు నడిగె' కళా. ౫ ఆ. ౮౬. దేవరవారు. (పూజ్యులగు మీరు)

౮౨. కొన్ని విశేషార్థములందు కొన్ని శబ్దములకు ఏకవచనము రావలసినచోటను 'వారు' అనునది కానవచ్చుచున్న దని సూత్రార్థము.

'అయ్య, అమ్మ' మున్నగువానికి గౌరవార్థముగ 'గారు' చేరు నని యిదివఱకుఁ జెప్పఁబడినది. కేవలగౌరవము కాక ఇంకను గొంత విశేషమగు నర్థమును వివక్షించునప్పుడును 'వారు' వచ్చు నని భావము. ఉదాహరణములు స్పష్టములు. '...యయ్యవారిసంసేవవేళ, నమ్మవా రుగ్గడించిరో—' అను నెడ అయ్యవారు = పూజ్యుఁడగు వేలుపు - బ్రహ్మ; అమ్మవారు = పూజ్యయగు స్త్రీదేవత - సరస్వతి' అని తెలియనగును.

## ౮౩. పూజ్యతయం దొక్కచో నామ,తదేతద్యుష్మదస్మ,చ్ఛబ్దంబుల యేకవచనంబునకు బహువచనం బగు ఆగుచో సంబోధ్యవాచకంబు బహువచనాంతంబు కాదు

ఉ. 'మద్గురువుల ... నడిగిన.' 'వారలు నన్ను వీవంశ మింకను క్షత్త్రవంశంబు గాఁ గల దనిరి.' కళా. ౫ ఆ. ౧౮౭. "క. వీరెవరయ్య; ద్రుపదమహారాజులె?" (ఇక్కడ నిందయందుఁ బూజ్యత.) భార. ఆది. ౬ ఆ. ౮౯. 'క. *మీరలు వీరల విద్యా,'

* వీరల యవిరలవిద్యా, పా.

పారము చను తెఱుఁగవలయు.' భార. ఆది. ౬ ఆ. ౩. 'శా. మాచిత్తంబున వేడ్కయుండు నది నీమాధుర్యధుర్యోరువా, గ్వైచిత్రిన్ సఫలంబు సేయుము.' కళా. ౧ ఆ. ౧౩. సంబోధ్య వాచకంబు బహువచనాంతంబు గామికి.-'క. ఆతఁడు, మీకుం బ్రియశిష్యుఁ డఁట యమిథ్యావచనా!' భార. ఆది. ౫ ఆ. ౨౮౦. 'మహితాత్మ! మీర లిమ్మహి నుండ.' కళా. ౧ ఆ. ౮౬ ఒక్కచో ననుటచే 'ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ.' భార. ఆది. ౫ ఆ. ౨౩౭. మొ.

౮౩. నామము, తచ్ఛబ్దము, ఏతచ్ఛబ్దము, యుష్మచ్ఛబ్దము, అస్మచ్ఛబ్దము-అను పయి శబ్దములకు గౌరవార్థమునందు ఏకవచనమునకు బదులుగా బహువచన మగును. అయినను సంబోధన ప్రథమైకవచనముమాత్రము బహువచనము కాదు. అది ఏకవచనమునందే యుండును.

మద్గురువుల నడిగిన-' ఇచట నామము నేకవచనమునకు బహువచనము. 'మద్గురువు నడిగిన' అని యర్థము. 'వారలు...దనిరి-' ఇచట 'వారలు' అనునది 'అతఁడు' అను తచ్ఛబ్దము నేకవచనముయొక్క బహువచనరూపము. 'ప్రథమాంతంబులగు...' నను బాలవ్యాకరణ కారకపరిచ్ఛేదమునందలి ౩౩-వ సూత్రముచే 'వారు' అనునది 'వారలు'గా మాఱినది. 'వీరెవ్వరయ్యా! ద్రుపద మహారాజులె' ఇచట 'వీరు' అనునది 'ఇతఁడు అను ఏతచ్ఛబ్ద ప్రథమైకవచనరూపమున కైన బహువచనము. నిందయందుఁ బూజ్యత యనఁగా వ్యాజస్తుతి - అధిక్షేపణము. సూత్రమునందలి 'పూజ్యత' అను దానిచే నిందయందలి పూజ్యతనుగూడ గ్రహింపవలె నని యర్థము. 'మీరలు వీరల...తెఱుఁగవలయు' ననుచో 'మీరలు' అనునది 'నీవు' అను యుష్మచ్ఛబ్ద రూపమునకు బహువచనము, ఇచటను బాలవ్యాకరణ కారకపరిచ్ఛేదము నందలి ౩౩-వ సూత్రముచే 'మీరు' అనునది 'మీరలు' గా అయిన దని

తెలిసికొననగును. 'మాచిత్తంబున...సఫలంబు సేయుము' అనుచోట 'నా' అను అస్మచ్ఛబ్దరూపమునకు 'మా' అనునది బహువచనము. '...మీకుం బ్రియశిష్యుఁడఁట యమిథ్యావచనా!' అనుచోట 'నీకున్-' అనుదానికి బదులు 'మీకున్' వచ్చినను దాని సంబోధనముమాత్రము ఏకవచనమునందే యున్నది. 'సంబోధ్యవాచకంబు బహువచనాంతంబు కాదు' అనుట కిది ఉదాహృతి. ఇట్లే 'మహితాత్మ! మీర లిమ్మహి నుండ' అనుచో 'నీవు' అనుదానికి 'మీరలు' అని బహువచనమైనను సంబోధ్యవాచకము మాత్రము 'మహితాత్మ!' అని ఏకవచనమునందే యున్నది.

పూజ్యతయం దిట్లేకవచనము బహువచనమగుట కొన్నిచోట్ల మాత్రము కనఁబడు నని 'ఒక్కచో' అనుదానివలనఁ దెలియుటచే ఏకవచనమునందే యుండు ప్రయోగములును గల వని గ్రహింపవలెను. 'ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ' నిత్యాదులందు గురువులయెడ గౌరవ మున్నను 'ఆచార్యులు ద్రోణులకున్ శిష్యుఁడ' నని కాలేదు.

## ౭౭. సంబోధ్య వాచకంబు బహువచనాంతం బయ్యుఁ గ్రియలమీఁది యమ్మాదు లేకవచనాంతంబుల యగు.

'ఆ. మన యశోద చిన్నిమగవానిఁ గనెనఁట, చూచి వత్త మమ్మ సుదతులార!' భాగ. ౧౦. స్క. పూ. ౧౮౭. మొ.

౭౭. 'సంబోధనమును దెలుపు పదము బహువచనాంతమై యున్నను, క్రియలపై నున్న 'అమ్మ' మున్నగునవి మాత్రము బహువచనాంతములు కాన ఏకవచనమునందే యుండునని యర్థము. '...చూచి వత్తమమ్మ సుదతులార!' అనుచోట 'సుదతులార!' అను సంబోధ్యవాచకము బహువచనాంతమైయున్నను, 'వత్తము' అను క్రియమీఁది 'అమ్మ' ఏకవచనాంతముగనే యున్నది. ఇచటి 'అమ్మ' సంప్రార్థనమున వచ్చినది. 'ఈ క్రియపై ప్రశ్నార్థము సిద్ధింప 'నమ్మ' చేర్పఁబడినది. 'చూచి వత్తమమ్మ=చూచివత్తమా?'

అను కుమారదేవపండితీయ మిచట చింత్యము. 'అష్మాదు'లను నాదిపదముచే 'అయ్య' మున్నగువానిని గ్రహింప నగును.

**౪౫. పూజ్యతాతిశయంబున యుష్మదర్థ బహువచనంబునకు మాఱుగా నాత్మార్థబహువచనంబు ప్రయుక్తం బగు.**

ఉ. స్వామీ! తాము దయచేయవలెను మొ.

౪౫. పూజ్యతాతిశయంబునన్ = ఎక్కువ గౌరవమునందు; యుష్మదర్థబహువచనంబునకున్='మీరు' నకు; ఆత్మార్థబహువచనంబు = 'తాము' అనునది. ఎక్కువ పూజ్యతను తెలియఁజేయునపుడు 'మీరు' అనుదానికి బదులు 'తాము' అనునది ప్రయోగింపఁబడు నని అర్థము.

'స్వామీ! తాము దయచేయవలెను' అనుచో 'మీరు దయచేయవలె' నని యర్థము. ఇట ౪౩-వ సూత్రముచే సంబోధ్యవాచకమునకు బహువచనాంతరాహిత్య మని యెఱుఁగునది.

**౪౬. సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దములకుం గొన్నియెడల బహుత్వం బగు.**

ఉ. మీయిల్లు, మాయిల్లు మొ 'మాయత్త పృథ్వీసమాన పృథాదేవి.' భార. ఆర. ౫ ఆ. ౩౦౬.

౪౬. స్వస్వామిభావాదికము సంబంధము. ఆ యర్థమున 'నీ-నా' శబ్దములకుఁ గొన్నిచోట్ల బహువచనము వచ్చి 'మీ, మా' అని యగును. ఇది సమాసవిషయము.

'మీయిల్లు' = నీయొక్కయిల్లు; 'మాయిల్లు' = నాయొక్క యిల్లు; 'మాయత్త...పృథాదేవి' = నాయొక్క అత్తగారైన...కుంతిదేవి.

**౪౭. కిమేకార్థకశబ్దంబులు క్రమంబున సజ్ఞాతవస్తూద్దేశ్య ప్రశ్నమునందును, నిర్దిష్టస్త్రీపురుషాన్యతర ప్రశ్నము నందును, నిర్దిష్టస్త్రీపురుషాన్యతర గ్రహణమునందును,**

## అనిర్దిష్టస్త్రీపురుషోద్దేశ్యవ్యాహారమునందును దఱచుగ బహువచనాంతం బగు.

ఉ. ఎవ రక్కడ? సీతారాము లిద్దఱిలో నెవరు మిక్కిలి కరుణ గలవారు? ఈ స్త్రీపురుషు లిద్దఱిలో దీని నొకరి కిమ్ము; ఒకరు పోయిన త్రోవ నొకరు పోరు; వారొక్కరె వచ్చిరి. ఇత్యాదులు గ్రాహ్యములు తఱచుగ ననుటచే 'సీతారాము లిద్దఱిలో సీత మిక్కిలి కరుణ గలదా? రాముఁడు మిక్కిలి కరుణ గలవాఁడా?' అని ఇత్యాదిరూపముగా వాక్యమును వ్యాసము చేసియుఁ జెప్పనగు నని తెలియవలయును [నీ వెవ్వరిత్యాది విశేషప్రయోగంబులుం గలవు. 'క. నీ వెవ్వ రేమిపనికై, యేచలనికిఁ బోవుచునికి యిది?' భార. విరా. ౧ ఆ. ౭౯౭. 'నీవు మునిసత్తమ యెవ్వఁడ వెట్టు లేను నీ, తనయుఁడనైతి మజ్జనని తా నది యెవ్వరు?' మార్క. ౫ ఆ. ౨౫౩. 'ఉ. వారలఁ జూచి [1]పల్కు రఘువర్యుఁడు మీ కిట జాతకర్మసం, స్కారము లెవ్వ రుక్తవిధిఁ జల్పి రొగిన్ ధనురాదిశాస్త్రవి, ద్యారతులైతి రెవ్వరికతంబున నేగతి యుద్ధచాతురిన్, నేరుచుకొంటి రెవ్వ రవనిం దలిదండ్రులపేరు నావుడున్' జై. ౬ ఆ. ౨౨౨. 'వ. ఆ బ్రహ్మచారిం జూచి మాయయ్య నీవె రెవ్వరని యడిగిన.' పర. ౩ఆ.౨౬౮ [2]'నాదుము మేఘవర్ణుఁడన్' జై. ౨ ఆ. ౨౬. కొన్నియెడల నెవ్వ రదిపూర్వకం బయి కానంబడియెడి 'సీ. అది యెవ్వరని ప్రతీహారు లెవ్వరినన్నుఁ దన్నుఁగాఁ దలఁచి చిత్తమున నులుకు' జై. ౩ ఆ. ౧౮ [3]'అది యెవ్వరే పిలిచెదరు నన్నది

---

1. పల్కె. పా. 2. పేరున మేఘనాదుఁడన్ పా. 3. అదె యెవ్వరే పిలిచెదరు నదేమొకో. పా.

యేమొ యరసి వచ్చెద నంచు సురిఁగె నొకతె.' కళా. ౭. ఆ. ౧౭౮. మొ.]

౪౭. కిమేకార్థకశబ్దంబులు = ఎవఁడు ఎవతె మున్నగునవి కిమర్థకశబ్దములు; ఒకఁడు ఒకతె మున్నగునవి ఏకార్థకశబ్దములు. అజ్ఞాతవస్తూద్దేశ్యప్రశ్నము = అది యేదైనదియుఁ దెలియని వస్తువునుగూర్చిన ప్రశ్న; నిర్దిష్టస్త్రీపురుషాన్యతరప్రశ్నము = నిర్దేశింపఁబడిన స్త్రీపురుషులలో నెవ్వరే నొక్కరింగూర్చి ప్రశ్నించుట; స్త్రీపురుషాన్యతరగ్రహణము = స్త్రీపురుషులలో నే యొక్కరినైనను గ్రహించుట; అనిర్దిష్టస్త్రీపురుషోద్దేశ్యవ్యాహారము = నిర్దేశింపఁబడని స్త్రీపురుషులలో నొక్కరింగూర్చిన సంభాషణము.

అజ్ఞాతవస్తువు నుద్దేశించి ప్రశ్నించినపుడుగాని, నిర్దేశింపఁబడిన స్త్రీపురుషులలో నొక్కరింగూర్చి ప్రశ్నించునపుడుగాని, 'ఎవఁడు ఎవతె' మున్నగు శబ్దములు సాధారణముగా బహువచనాంతములై యుండును.

స్త్రీపురుషులలో నొక్కరిని గ్రహించునపుడుగాని, అనిర్దిష్టులగు స్త్రీపురుషుల నుద్దేశించిన సంభాషణమునందుఁగాని 'ఒకఁడు, ఒకతె' మున్నగు శబ్దములు సాధారణముగా బహువచనాంతములై యుండును.

అజ్ఞాతవస్తూద్దేశ్యప్రశ్నమున కుదాహరణములు:—'ఎవ రక్కడ ?' ఇచట 'ఎవఁడు' (లేక ఎవతె) అనుదానికి బదులుగా 'ఎవరు' అను బహువచనాంతము వచ్చెను.

నిర్దిష్టస్త్రీపురుషాన్యతరప్రశ్నమునకు - 'సీతారాము లిద్దఱిలో నెవరు మిక్కిలి కరుణ గలవారు? అని యుదాహరణము. ఇచ్చటను మీఁదిరీతినే 'ఎవఁడు - (లేక ఎవతె)' అనుదానికి బదులుగ 'ఎవరు' అని వచ్చినది. 'ఈ స్త్రీపురుషు లిద్దఱిలో దీని నొకరి కిమ్ము' అనునది స్త్రీపురుషాన్యతరగ్రహణంబున ఏకార్థకశబ్దమునకు బహువచనము వచ్చుట కుదాహరణము. అనిర్దిష్టస్త్రీపురుషోద్దేశ్యవ్యాహారమున ఏకార్థకశబ్దమునకు బహువచనము వచ్చుటకు 'ఒకరు పోయిన త్రోవ నొకరు పోరు, వారొక్కరే వచ్చిరి' అని యుదాహరణము.

పై కిమేకార్థకశబ్దములు మీఁది యర్థములందు తఱచుగ బహువచనాంతంబు లగు నని చెప్పుటచే బహువచనము రానివియుఁ గల వని తేలుచున్నది. 'సీతారాము లిద్దఱిలో సీత మిక్కిలి కరుణ కలదా? రాముఁడు మిక్కిలి కరుణగలవాఁడా?' అని వాక్యమున వేర్వేఱుపదములతోఁ జెప్పుటయుఁ గలదు.

మీఁది యర్థములు లేనప్పుడుకూడఁ గొన్నియెడల కిమేకార్థకముల యేకత్వమునకు బహుత్వము కానవచ్చుచున్నది. ఈ యంశమే 'నీ వెవ్వ రిత్యాది విశేషప్రయోగంబులును గలవు' అనుదానిచే చెప్పఁబడుచున్నది. 'నీ వెవ్వ రేమి పనికై యేపలనికిఁ బోవుచునికి యిది?' అనునది ప్రశ్నార్థమున కుదాహరణము. '...మజ్జనని తా నది యెవ్వరు?' '...జాతకర్మ సంస్కారము లెవ్వ రుక్తవిధిఁ జల్పిరి?...' '...శాస్త్రవిద్యారతు లైతి రెవ్వరికతంబున?...' '...ఎవ్వ రవనిం దలిదండ్రుల పేరు...' 'మీపే రెవ్వ రని యడిగి...' అనునవియుఁ బైదానివలెనే ప్రశ్నార్థమున వచ్చిన బహువచనాంతములు.

ఇచట 'నామము మేఘవర్ణుఁడన్' అను నుదాహరణాంతరము జైమిని భారతములోనిది కానవచ్చుచున్నది. అది సరికాదు. 'పేరున మేఘవర్ణుఁడన్' అనునది ఇచట పాఠాంతరము. ఈ యుదాహృతి ప్రస్తుతమునకు సంబంధించినది కాదు.

కొన్నిచోట్ల 'ఎవ్వరు' అనుదానికి ముందు 'అది' అనునది చేరియుండుట కలదు. 'అది యెవ్వ రని...' 'అది యెవ్వరే పిలిచెదరు?...' మున్నగునవి దాని కుదాహరణములు.

**౬౭. దేశ్యంబునం గొన్నియెడల మహన్మహత్త్వార్థక బహువచనాంతనామంబులపై మరల బహువచనప్రత్యయంబులు చూపట్టెడు. అచ్చో వారు వీరు మీరు శబ్దంబుల యంత్యోకారంబున కకారం బగు.**

ఉ. వేడుకకాండ్రురు, కోడండ్రురు, వెలయాండ్రురు, పెక్కండ్రురు, చూపఱులు, ఒకరులు మొ. వారలు, వీరలు, మీరలు. 'క. ఆడెడువారల కిచ్చును, బాడెడువారలకు నిచ్చు బట్లకు నిచ్చుఁ, బాడబవరులకు నిచ్చును, వేడుకకాండ్రురకు నిచ్చు వివిధార్థంబుల్.' విక్ర. ౨ ఆ. ౧౬౪. 'క. సుందరి నా కోడండ్రుర, యం దభ్యర్హితవు నీవ.' భార. సభా. ౨ ఆ. ౨౫౭ 'సీ. *వెలయాండ్రురను గొండియలఁ బరిచారికాశ్రేణుల నొండొండ చెలులువట్టు.' హరి. ఉ. ౬ ఆ. ౧౩౮. 'క. పెక్కు దెఱంగులఁ బాడికిఁ, బెక్కండ్రురతోడ నొకఁడు పెనఁగఁగఁ గార్యం, బొక్కటి యగునేనియుఁ దాఁ బెక్కండ్రురతోడ నైనఁ బెనఁగఁగఁ జెల్లుఁ.' విజ్ఞా. వ్య ౬౦. 'ఎ. గీ. చూపఱుల చూడ్కి కొక వింతసొబ గొనర్చె.' కళా. ౭ ఆ. ౭౮ మొ.

౪౮. కొన్నియెడల దేశ్యము లగు మహదర్థకములును, మహత్యర్థకములును బహువచనాంతములై యున్నను, వానిపై మఱల బహువచనప్రత్యయములు చేరుట కలదు. అట్టిచోట్ల నున్న 'వారు, వీరు, మీరు, అను శబ్దముల చివరి ఉకారము అకారముగా మాఱును.

బాలవ్యాకరణమున 'ఒకానొకచో సామంబు సంశ్లిష్టబహువచనాంత తుల్యం బయి బహువచనంబు నొనయుం' నని సూత్రింపఁబడి 'కొడవళ్లులు-' మున్నగు రూపములు సాధింపఁబడినవి. బాలవ్యాకరణ సూత్రోదాహరణములం బట్టి చూడఁగా సంశ్లిష్టబహువచనాంతములకును, అందును అమహదర్థకములకును మాత్రము బహువచనమువయి బహువచనము వచ్చు నని చెప్పినట్లు అర్థమగుచున్నది. కాని చివర సంశ్లిష్టములు కాని శబ్దములకును మహన్మహత్య

*వెలయాండ్ర మఱి కన్నియలు. పా.

ర్థకములకును గూడ బహువచనముపయి బహువచనము వచ్చుట కల దని చూపుట కీ సూత్రము చెప్పఁబడుచున్నది.

'వేడుకకాండ్రురు.' వేడుకకాండ్రు-బహువచనాంతము; దీనిపై మఱల బహువచనము వచ్చి 'వేడుకకాండ్రురు' అయినది. 'కోదండ్రురు - చూపఱులు-' మున్నగునవి నిట్లే. 'వారు-వీరు-మీరు' అనువానికి బహువచనములు చేరఁగా-'రు'-'ర'గా మాఱి 'వారలు, వీరలు, మీరలు-' అగును. చిన్నయసూరి సర్వనామప్రకరణమున 'వారలు, వీరలు, మీరలు' అని బహువచనాంతములను చూపెనుగాని, వానిని సాధింపలేదు. కావున ఇందు అవి సాధింపఁబడినవి. వీనికిఁ బ్రయోగములు చూపఁబడుచున్నవి-'ఆడెడు...... వివిధార్థంబుల్-' అనుచో ఆడెడువారలకున్, పాడెడువారలకున్ వేడుకకాండ్రురకున్-'అనునవి బహువచనములపయి బహువచనములు వచ్చినరూపములు. ఇట్లే...సా కోదండ్రురయందు...' '...వెలయాండ్రురను-' 'వెక్కండ్రురతోడ' '...చూపఱుల...' అనునవియుం నని గ్రహించునది.

**౨౯. మత్తియుశబ్దేతరంబులయందును దఱచుగ నిత్యలోపంబు గానంబడియెడి.**

ఉ. కన్నియ, కన్య; దివ్వియ; దివ్య; కళ్లియము, కళ్యము; పళ్లియము, పళ్యము; వీడియము, వీడ్యము. 'సీ. నెయ్యపుఁగన్య, కల ననవాలుఁదూపుల జయించి.' రాఘ. ౧ ఆ. ౭. (చూ. శబ్దరత్నాకరము) 'తే. గువ్వ గ్రద్ద దివ్యా కుపుఁ బ్రువ్వ గూబ, యిల్లు సొచ్చిన శాంతి సేవింపవలయు.' భార. అను. ౭ ఆ. ౧౯౯. 'సీ. కళ్యాలఁ బదిలంబుగాని గుట్టం బులఁ గ్రొత్తముట్టున కియ్యకోలుపు వెరవు.' భార విరా. ౧ ఆ. ౬౫. 'ఉ. అంబుజబాంధవాన్వయనృపాగ్రణి! బోనము

నేఁడు సూర్యప్రాకంబున నాయితంబయిన కజ్జము భోజన శాలలోనఁ బ్రశ్యం బిడినారు పంకజదళాక్షులు రెండవజాము గంట ప్రేయంబడె నారగింప సమయం బని చెచ్చెర విన్న వించిరఁ,' కాశీ. ౫ ఆ. ౩౦౭. 'ఎ. గీ. తరుణధావనధగధగద్ద శనమణుల, హత్తుకొల్పిరి లేఁతవీడ్యములఁడాలు, పర్వదినములఁ బామరప్రమద లుదిత, నియమసంభావనారంభ నిభృతబుద్ధి.' పాండు. ౩ ఆ. ౭౪ మొ.

౪౫. 'ము త్తియ' శబ్దముకంటె వేఱగు శబ్దములందును సామాన్యముగ 'ఇయ' లోని ఇకారమునకు లోపము కన్పడుచున్న దని సూత్రార్థము.

బాలవ్యాకరణమున 'ఇయకు మాఱుగా నామాంతంబున కిత్వంబు బహుళంబుగా నగు' నని కలదు. మఱియు దాని వివరణమునందు 'ఇయశబ్దం బునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబు లందు మృగ్యంబు. ము త్తియశబ్దంబునందుమాత్ర మిత్వలోపంబు గానంబడి యెడి - ము త్తియము-ము త్తెము - ముత్యము' అని చెప్పఁబడినది. ము త్తియ శబ్దంబుకంటె వేఱగు శబ్దములయందుఁగూడ 'ఇయ' లోని ఇకారము లోపిం చుట ప్రయోగంబులందుఁ దఱచుగఁ గానంబడుచుండుటచే, ఆ విషయమును దెల్పుటకయి యీ సూత్రము చెప్పఁబడుచున్నది.

'కన్నియ-కన్య-' మున్నగునవి యుదాహరణములు. 'కన్య' అనునది 'కన్నియ'లోని ఇకారము లోపింపఁగా నేర్పడిన రూప మని యభిప్రాయము. 'కన్య' అనుచో శబ్దరత్నాకరమునఁ గ్రింది విషయము కలదు-'కన్య.ఊభ వై. విణ. క్రొత్త-' 'నెయ్యపుఁగన్యకలననవాలుఁదూపుల జయించి'(రామాయణార్థ మందు నెయ్యపుఁగన్యకల ననవాలుఁదూపుల ననియు, భారతార్థమందు నెయ్యపుఁగన్యకలకౕ ననవాలుఁదూపుల ననియుం ఛేదము.) రాఘ. అ. ౧. (ఇక్కడ రామాయణార్థమునందు సహితము కన్య యను శబ్దమును తత్సమము

గానే చెప్పి, యర్థమును సరిపఱుపవచ్చు నని కొందఱు చెప్పుదురు. కన్యా శబ్దము వికృతిని జెందినప్పుడే క్రొత్త యను నర్థము గలిగి తెనుఁగు ప్రయోగములందు సాధారణముగా వాడఁబడుచున్నది.సంస్కృతమునం దా యర్థము కలిగి వాడఁబడునట్లు కానము. సంస్కృతమునందు లేని యర్థములు వికృతి యందుఁ గలుగుట సహజము' అని. ఈ విషయ మంతయుం గమనింపవలె ననియే ఏతత్సూత్రవృత్తియందు '(చూ. శబ్దరత్నాకరము)' అని చెప్పఁబడినది.

'దివ్వియఱపుఁబ్రువ్వ...' (దివియ+అఱుపు+ప్రువ్వ) అనఁగా దీపము నార్పివేయుంపురుగని అర్థము.'దివియ' లోని వకారముమీఁది యిత్వము లోపించి 'దివ్య' అయినది. 'కళ్యాలఁబడిలంబు...'ఇచట 'కళ్లియాల' లోని ఇకారము లోపించి 'కళ్యాల'-అయినది. '...భోజనశాలలోన పళ్యంబిడి...' ఇచట 'పళ్లియంబు' లోని ఇకారము లోపించి 'పళ్యంబు' ఐనది. '...శ్వేత పీడ్యముల డాలు...' ఇచట 'పీడియము'లోని ఇకారము లోపించి 'పీడ్యము' అయినది.

౫౦. ఎద్దు దేవరశబ్దములకు లు ల లు పరంబు లగునపుడు దకారంబునకు డకారంబును డకారంబునుత్వంబు నకు లోపంబును వికల్పముగాను, రేఫమునకు ళకా రమును ళకారంబు నత్వంబునకు లోపంబును నిత్య ముగాను గ్రమంబుగ నగు.

ఉ. ఎద్దులు, ఎడ్డులు, ఎడ్లు; ఎద్దులన్, ఎడ్డులన్, ఎడ్లన్; దేవళ్లు, దేవళ్లన్ మొ.

౫౦. 'ఎద్దు' శబ్దమునకు 'లు, ల' అనునవి పరములుగా నున్నపుడు దకారమునకు డకారమును, ఆ డకారముమీఁది ఉకారమునకు లోపమును వికల్పముగా నగును; దేవరశబ్దమునకు 'లు, ల' అనునవి పరములగునపుడు దాని

రేఫమునకు శకారమును, ఆ శకారముమీఁది అకారమునకు లోపమును నిత్యముగా నగును.' అని సూత్రార్థము.

'ఎద్దులు-' ఇచట దకారము డకారముగా మాఱఁగా 'ఎడ్డులు' అగును. ఉత్వలోపము రాఁగా 'ఎడ్డు' అగును. డకారాదేశము వికల్పమగుటచే అది రానపుడు 'ఎద్దులు' అగును. 'ల' పరమగునపుడు నిట్లే 'ఎడ్డులన్, ఎడ్లన్, ఎద్దులన్' అగును.

'దేవర+లు అని యున్నపుడు రేఫమునకు ళకారాదేశము, దాని అత్వమునకు లోపమును నిత్యముగా రాఁగా 'దేవళ్లు' అగును. 'ల' పరమగుచో 'దేవళ్లన్' అగును.

---

## సర్వనామ ప్రకరణము

సర్వనామప్రకరణము—'ఆ, ఈ, ఏ' మున్నగు శబ్దములు సర్వనామములు; వానినిగూర్చి చెప్పు భాగము సర్వనామప్రకరణము. బాల వ్యాకరణమున సర్వనామముల రూపములు కొన్ని చూపఁబడినవి; కాని సాధింపఁబడలేదు. శ్రీసీతారామాచార్యులుగారు లోపము నీప్రౌఢవ్యాకరణమునఁ దీర్పఁ బూనుకొనిరి.

౫౧. **ఈ ఏ ఒక శబ్దములకంటెం బరంబయిన యంతశబ్దము నకారమునకు లోపం బగు. అగుచో నీ యేల దీర్ఘమునకు హ్రస్వమును, ఒకకు వర్ణవ్యత్యయ సంహితలు నగు.**

ఉ. ఇంత, ఎంత, కొంత. (చూ. డెబ్బది) శబ్దశాసనుఁడు 'తచ్ఛబ్దాతః' అని సూత్రించిన సూత్రమునందలి తచ్ఛబ్ద మంత ప్రభృతులకు నుపలక్షణ మని తెలియునది.

౫౧. 'ఈ, ఏ, ఒక' అను శబ్దములకుఁ దర్వాత 'అంత' అను శబ్దమున్నయెడల దాని అకారము లోపించి, ఈ, ఏ లు హ్రస్వము లగును. 'ఒక' అను దాని యక్షరములు ముందువెనుకలై సంధిని పొందును.

'ఈ+అంత' అకారలోపము: 'ఈ' కి హ్రస్వము 'ఇంత'; 'ఏ+అంత' అకారలోపము; 'ఏ' కి హ్రస్వము 'ఎంత.' ఒక+అంత. 'అంత'లోని అకార లోపము. 'ఒక+అంత' వర్ణవ్యత్యయ, సంహితలు='క+ఒ=కొ'; కొ+ంత = కొంత.' ఇచటి వర్ణవ్యత్యయము సులభముగా గ్రహించుటకై (చూ. డెబ్బది)' అని యుదాహరణము చూపఁబడినది. 'ఏడు+పది' అని యుండగా, అచటను అక్షరములు 'ముందువెనుకలై' సంహితను పొంది డు+ఏ+బది = 'డెబ్బది అయినది.

ఆంధ్రశబ్దచింతామణికర్త 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అని సూత్రించి' సా+అది' మున్నగుచోట్లఁ గల తచ్ఛబ్దసంబంధమగు అకారము లోపించు నని చెప్పుచు 'సాది' మున్నగురూపములను సాధించి యున్నాఁడు. ఆసూత్రము నందలి తచ్ఛబ్దముచే 'అంత' మున్నగువానిని కూడ గ్రహింపవలె ననియు, కాఁగా, ఆ సూత్రముచుబట్టియే 'అంత' లోని అకారము లోపించు ననియుం గ్రహింపవలె నని వివరణమున స్పష్టీకరింపఁబడినది.

౫౨. అమహదర్థంబున భిన్నవస్తుసముదాయం బర్థమగుచో
ఏకవచనంబున నంతాదుల తకారంబునకు న్నిరుక్త
నివర్ణం బగు

ఉ. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని.

౫౨. భిన్నవస్తుసముదాయంబు = సజాతీయ, విజాతీయ వస్తువుల (వేర్వేఱు రకముల వస్తువుల) సమూహము. అట్టి భిన్నవస్తుసమూహం బర్థమగు నపుడు అమహద్వాచకమున బహువచనమునఁగల 'అంత' మున్నగువానితకార మునకు'న్ని' అనునది ఆదేశమగును. 'అన్ని ధాన్యములు,' ఇచట వివిధము లగు

ధాన్యము లని యర్థము. 'అన్నిపాలు' మున్నగుచోట్ల భిన్నవస్తుసముదాయం బర్థము కాకున్నను 'అంత' అనునది 'అన్ని' అగుట కానఁబడుచున్నది.

౫౩. ఆ ఈ శబ్దములకును ఏశబ్దమునకును మహదర్థంబున నన్ని విభక్తులయందును వకారంబు నిత్యముగాను వైకల్పికముగాను ఆమహదర్థంబునం బ్రథమేతర విభక్తులయందు వచనద్వయంబునం గ్రమంబునం దకార వకారంబులు నిత్యముగాను బూర్వాగమంబు లగు.

ఉ. వాఁడు, వారు; వీఁడు, వీరు; వానికి, వారికి; వీనికి, వీరికి; వానిచేతఁ, వారిచేతఁ; వీనిచేతఁ, వీరిచేతఁ; వేఁడు, ఏఁడు; వేరు, ఏరు; వేనికి, ఏనికి, వేరికి, ఏరికి; వేనిచేతఁ, ఏనిచేతఁ మొ. 'తే. పిలిచి చారుల రావించి యిలయు దివియు, ముంచు కపివీరసేనల మించుఁ గాంచి, వీరిలో ముఖ్యు *లెవ్వారు వేఁడు రాముఁ, డతని యనుజన్ముఁ డెట్టివాఁ డనుచుఁ బలుక.' రామా. ౬ ఆ. ౧౯౨ మొ. దానికి, వానికి; దీనికి, వీనికి, దేనికి, వేనికి; దానిచేతఁ, వానిచేతఁ; దానియందుఁ, వానియందుఁ మొ. అను ప్రయుక్తంబు లగునపుడు వీని కీ రూపంబు లిట్లు యగు. ఉ. (చూ. మీఁదు).

౫౩. మహద్వాచకము లగు 'ఆ, ఈ' శబ్దములకు అన్ని విభక్తుల యందును వకారము నిత్యముగా ముందుగా ఆగమమగును. (ఆ ఈ ల ముందు

* లెవ్వార లేరి? పా.

వచ్చును.) అమహదర్థమునందు ద్వితీయాదివిభక్తులయందు ఏకవచనమున 'ద' కారమును, బహువచనమున 'వ' కారమును నిత్యముగా పూర్వాగమము లగును. 'ఏ' శబ్దమునకు మహదర్థమున అన్నివిభక్తులయందును వకారము వికల్పముగా ఆగమమగును. అమహదర్థమున 'ఏ' శబ్దమునకు ద్వితీయాది విభక్తుల ఏకవచనమునందు 'ద' కారమును, బహువచనమునందు 'వ' కార మును నిత్యముగా ఆగమము లగును.

'ఆ' శబ్దమునకు మహదర్థమున విభక్తులన్నింట నిత్యముగా 'వ' కారా గమము వచ్చుట కుదాహృతులు - 'వాఁడు - వారు; వానిఁ - వారిఁ; వానిచేతఁ - వారిచేతఁ;-' తక్కిన వ్రూహ్యములు. 'ఈ' శబ్దమునకు మహ దర్థమున అన్ని విభక్తులందును నిత్యముగా 'వ' కారాగమము వచ్చుట కుదా హృతులు - 'వీఁడు-వీరు, వీరిఁ, వీనిచేతఁ - వీరిచేతఁ;' - తక్కిన విభక్తుల యందు నిట్లే గ్రహించునది.

'ఆ' శబ్దమునకు అమహదర్థమున ద్వితీయాదివిభక్తులయందు ఏకవచన మున 'ద,' బహువచనమున 'వ' ఆగమములుగా వచ్చుటకు—(ద్వి. ఏ.) 'దానిన్;' (ద్వి. బ.) 'వానిన్;' (తృ. ఏ.) 'దానిచేతన్;' (తృ. బ.)' వాని చేతన్; (స. ఏ.) 'దానియందున్;' (స. బ.) 'వానియందున్.' 'ఈ' శబ్దము నకు అమహదర్థమున ద్వితీయాదులందు ఏకవచనమున 'ద' కారాగమము, బహువచనమున 'వ' కారాగమము వచ్చుట-(ద్వి. ఏ.) 'దీనిన్.' (ద్వి. బ.) 'వీనిన్.' ఇట్లే తక్కినవానిని గ్రహించునది.

'ఏ' శబ్దమునకు మహదర్థమున అన్ని విభక్తులయందును వకారము వికల్పముగా ఆగమ మగుటకు—ఉదాహరణములు - 'వేఁడు; ఏఁడు; వేరు, ఏరు; వేనిన్, ఏనిన్; వేరిన్, ఏరిన్; వేనిచేతన్, ఏనిచేతన్-' అనునవి; ఇట్లే తక్కినవియుండును.

'వీరిలో ముఖ్యు లెవ్వారు 'వేఁడు రాముఁడు...' అనుచోట 'ఏ' శబ్దమునకు వకారాగమము వచ్చి 'వేఁడు' అయినది.

'ఏ' శబ్దమునకు అమహదర్థమున ప్రథమేతర (ద్వితీయాది) విభక్తు లందు ఏకవచనమున 'ద' బహువచనమున 'వ' ఆగమములుగా వచ్చుట కుదాహృతులు - (ద్వి. ఏ.) 'దేనిన్' (ద్వి. బ.) 'వేవిన్.'

'ఆ, ఈ, ఏ' శబ్దము లనుప్రయుక్తము లగునపుడును పయి వకారా ద్యాగమములు వచ్చు నని ౫౮-వ సూత్రమునం దుదాహరింపఁబడిన 'ఏవాఁడు, ఏవారు' అను నుదాహరణములవలనఁ దెలియుచున్నది. [అను ప్రయుక్తము లనఁగా అనుసరించి ప్రయోగింపఁబడినవి - వేఱొక శబ్దము తర్వాత వచ్చు ననుట.]

[కుమారదేవపండితీయమున నిచటి మూలసూత్రము-'ఆ, ఈ శబ్దము లకును, ఏ శబ్దమునకును మహదర్థంబున నన్ని విభక్తులయందును వకారము నిత్యముగాను వైకల్పికముగాను, మహదర్థమునం బ్రథమేతరవిభక్తులయందు వచనద్వయంబునఁ గ్రమంబున తకారవకారంబులు నిత్యముగాను బూర్వా గమంబు లగును' అని గ్రహింపఁబడినది. చరమభాగము సమన్వయింపనందు నను, ఉదాహరణములు కుదురనందునను ఆ భాగము వ్యాఖ్యానరహితము గనే విడువఁబడినది.]

**౫౯. కొన్నియెడల మహదర్థంబున నేశబ్దంబునకు వాఁడు వారును, అహదర్థంబునం ద్రికంబున కది యవు లును స్వార్థంబున నేక బహువచనంబులు క్రమం బుగ ననుప్రయుక్తంబు లగు.**

ఉ. ఏవాఁడు, ఎవ్వాఁడు; ఏవారు, ఎవ్వారు; ఆయది, అయ్యది; ఆయవి, అయ్యవి; ఈయది, ఇయ్యది; ఈయవి, ఇయ్యవి; ఏయది, ఎయ్యది; ఏయవి, ఎయ్యవి.

౫౮. కొన్నిచోట్ల 'ఏ' శబ్దమునకు మహదర్థమునందు ఏకవచనమున 'వాఁడు' బహువచనమున 'వారు' అనుప్రయుక్తము లగును; అమహదర్థము

నందు 'ఆ-ఈ-ఏ' అను మూఁడిఁటికిని ఏకవచనమున 'అది', బహువచనమున 'అవి' అను ప్రయుక్తము లగును. అట్టివి స్వార్థమునందు అగు నని సూత్రార్థము.

స్వార్థ మనఁగా శబ్దమునకుఁ గల యర్థము-అనఁగా ప్రాతిపదికార్థ మని ప్రసిద్ధము. 'ఏఁడు' అన నేమి యర్థమో-'ఏవాఁడు, ఎవ్వాఁడు' అనిన నదియే యర్థము.

'ఏవాఁడు, ఎవ్వాఁడు' అనునవి 'ఏ' శబ్దమునకు ఏకవచనమునందు స్వార్థమున మహదర్థమునందు 'వాఁడు' అను ప్రయుక్త మగుటకును, 'ఏవారు, ఎవ్వారు' అనునవి నయి శబ్దము బహువచనమునకును ఉదాహరణములు.

'ఆయది, అయ్యది-ఈయది, ఇయ్యది-ఏయది, ఎయ్యది' అనునవి అమహత్తున స్వార్థమునందు ఏకవచనమున త్రికంబునకు 'అది' అను ప్రయుక్తమగుటకు ఉదాహృతులు - 'ఆయది, అయ్యది - ఈయది, ఇయ్యది-ఏయది ఎయ్యది'. వానికే బహువచనమునం దుదాహృతులు - 'ఆయవి, అయ్యవి - ఈయవి, ఇయ్యవి - ఏయవి, ఎయ్యవి.'

**౫౫.** **ఇట నే హ్రస్వం బగు; అగుచో వాదీర్ఘంబునకు హ్రస్వంబును ద్విత్వంబునకు లోపంబును విభాష నగు.**

ఉ. ఎవ్వఁడు, ఎవఁడు, ఎవ్వరు, ఎవరు.

౫౫. 'ఏవాఁడు, ఎవ్వాఁడు-ఏవారు, ఎవ్వారు' అనుచోట్లఁ గల ఏకారము హ్రస్వ మగును. అపుడు 'వా' దీర్ఘము హ్రస్వమగుటయును, 'వ్వ' లోని యొక వకారము లోపించుటయును వికల్పము' అని సూత్రాభిప్రాయము.

'ఏవాఁడు' లోని 'ఏ, వా'లు హ్రస్వములు కాఁగా 'ఎవఁడు' అగును. 'ఎవ్వాఁడు' లోని దీర్ఘము హ్రస్వము కాఁగా 'ఎవ్వఁడు' అగును. ద్విత్వలోపమున 'ఎవఁడు' అని యుండును. 'ఎవ్వరు, ఎవరు' అనువానిని నైరీతినే గ్రహింపవలెను.

బాలవ్యాకరణమునందలి 'త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వము బహుళముగా నగు; ద్విరుక్తం బగు హల్లు పరంబగునపుడాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వం బగు' నను సూత్రములచేత 'ఎవ్వఁడు, ఎవ్వరు' అను రూపములను సాధింప నగును. కాని 'ఎవఁడు, ఎవరు' అను రూపములు సిద్ధింపవు. వానిని సిద్ధింపఁజేయుటకై యీ సూత్రము చెప్పఁబడిన దని గ్రహింపనగును.

౫౬. **ఆ ఈ ఏ శబ్దములకుఁ బూజ్యతయందు మహదేకవచనంబునఁ దవర్ణాగమంబును, దాని దీర్ఘంబునకు వికల్పముగా హ్రస్వంబును, మహత్యేకవచనంబున వానికంటెఁ బరంబయిన అక అప అమ శబ్దంబుల తొలి యకారమునకు లోపంబును, తుది యకారంబున కెకారాదేశంబు నగు.**

ఉ. అతఁడు, ఆతఁడు; ఇతఁడు, ఈతఁడు; ఎతఁడు, ఏతఁడు; ఆపె, (ఆ+అప+ఎ), ఆమె (ఆ+అమ+ఎ), ఈకె (ఈ+అక+ఎ), ఈపె (ఈ+అప+ఎ), ఈమె (ఈ+అమ+ఎ), ఏకె (ఏ+అక+ఎ), ఏపె (ఏ+అప+ఎ), ఏమె (ఏ+అమ+ఎ).

౫౬. గౌరవార్థము వివక్షించునపుడు 'ఆ, ఈ, ఏ' అను శబ్దములు మహద్వాచకము లగునపుడు వాని యేకవచనమునందు 'త' అను వర్ణము వచ్చును; 'ఆ, ఈ, ఏ' ల దీర్ఘమునకు హ్రస్వము వికల్పముగా నగును. ఉదా - అతఁడు, 'ఆతఁడు - ఇతఁడు, ఈతఁడు - ఎతఁడు, ఏతఁడు.'

పయి శబ్దములు మహతీవాచకము లగునపుడు గౌరవార్థమున ఏకవచనమునందు - ఆ శబ్దములకంటె పరములగు 'అక, అప, అమ, అను శబ్దముల మొదటి అకారము (అక, అప అమ-ల లోని 'అ') లోపించును; చివరి అకారమునకు (క-ప-మ ల మీఁది అకారమునకు) ఎకారము ఆదేశముగా వచ్చును.

ఆ+అక-'అక' లోని 'అ' లోపించి 'క' మీఁది అకారము ఎకారము కాఁగా (క-కె-గా మాఱఁగా) 'ఆకె' అగును. ఇట్లే 'ఈ+అక=ఈ+క= ఈకె; ఏ+అక=ఏ+క=ఏకె. తక్కిన యుదాహరణములను మీఁదిరీతినే గ్రహింపవలెను.

ఇచట వివరణమున 'ఆకె (అ+ఒక+ఎ)' అని యీ రీతిగనే ఉదాహరణము లన్నియుఁ జూపఁబడినవి. అచటి కూడికగుఱుతు (+) ఎకారము ఆగమ మగునపుడే సరిపడును; ఆదేశమునకు సరిపడదు. ఇచటి ఎకారమాదేశముగాని, ఆగమము కాదు. 'ఎ' కు ముందున్న ఆ గుర్తు ప్రామాదికము.

౫౭. ఆ ఈ శబ్దములును ఏ శబ్దమును నమహదర్థంబునం బ్రథమావిభక్తి పరంబగునపుడు నిత్యముగాను వైకల్పికముగాను గ్రమంబున హ్రస్వంబు లగు.

ఉ. (చూ. మీఁది సూత్రము.)

౫౭. 'ఆ-ఈ' అను శబ్దములు అమహద్వాచకము లైనపుడు ప్రథమావిభక్తియందు నిత్యముగా హ్రస్వము లగును. 'ఏ' శబ్దము అమహద్వాచకమైనపుడు ప్రథమావిభక్తియందు వికల్పముగా హ్రస్వ మగును.

ఆ+ది=అది, ఆ+వి=అవి; ఈ+ది=ఇది; ఈ+వి=ఇవి, 'ఏ' శబ్దమునకు హ్రస్వము వికల్పము. ఏ+ది=ఎది, ఏది; ఏ+వి, ఎవి, ఏవి. వీని కుదాహరణములను మూలకారుఁడు ౫౮-వ సూత్రమున వివరింపనున్నాఁడు. కావుననే వివరణమునందు '(చూ. మీఁది సూత్రము)' అని చెప్పియున్నాఁడు.

౫౮. త్రికంబున కమహదర్థంబునం బ్రథమైకవచన బహువచనంబులం గ్రమంబుగ ది వి వర్ణకంబు లగు.

ఉ. అది, అవి; ఇది, ఇవి; ఎది, ఏది; ఎవి, ఏవి.

౫౮. 'ఆ-ఈ-ఏ' అను మూఁడును త్రిక మనఁబడును. ఆ త్రికమునకు

అమహాదర్థమునందు ప్రథమైకవచనమున 'ది', బహువచనమున 'వి' అను వర్ణకము లగును.

అ+ది = (హ్రస్వము) అది; అ+వి = అవి; ఇట్లే 'ఇది, ఇవి' అను నవియగును. ఏ+ది = (హ్రస్వము వికల్పము కాన) 'ఎది, ఏది' అగును. బహువచనమున 'ఎవి, ఏవి' అగును.

**౫౯. హ్రస్వవ్యస్తత్రికంబుమీఁది దివులకు ద్విత్వంబు నగు.**

**ఉ. అద్ది, అవ్వి; ఇద్ది, ఇవ్వి; ఎద్ది, ఎవ్వి. ఇట్లనుటచే అయ్యదీత్యాదులయందు ద్విత్వంబు కలుగ దని యూహింపవలయును.**

౫౯. హ్రస్వములై, సమాసము పొందక వ్యస్తముగా నున్న త్రికము మీఁద నుండు 'ది, వి' అనువానికి ద్విత్వము కూడ నగును. అనఁగా ద్విత్వము వికల్పముగా నగు నని యర్థము. 'అద్ది, అవ్వి' మున్నగునవి యుండావృతులు. ద్విత్వము రానప్పుడు 'అది, అవి' మున్నగు రీతిని కూడ నుండవచ్చు నని గ్రహించునది.

సూత్రమునందు 'వ్యస్తత్రికంబులమీఁది దివులకే ద్విత్వము వికల్పముగ నగు' ననుటచే సమస్తపదములగు 'అయ్యది' మున్నగువానియందు ద్విత్వము లే దనియు, కావున 'అయ్యద్ది' మున్నగు రూపములు సిద్ధింపవనియు గ్రహింపవలెను,

**౬౦. ద్వితీయైకవచన బహువచనంబుల రెంటను నివర్ణకం బగు.**

**ఉ. దానిన్; వానిన్; దీనిన్, వీనిన్; దేనిన్, వేనిన్.**

౬౦. 'అ, ఈ, ఏ' అను మూఁడింటికిని అమహాదర్థమునందు ద్వితీయావిభక్తిలోఁ ఏకవచన - బహువచనములు రెండింటను 'ని' అను ప్రత్యయ మగు

నని అర్థము. 'అ+నిన్=' (౧౩-వ సూత్రముచే ఏకవచనమున 'ద', బహు వచనమున 'వ' వచ్చును.) వానిన్, దానిన్. ఇట్లే తక్కినవానిని కూడ గ్రహింపవలెను.

౬౧. అయ్యాది తృతీయాదివిభక్తులు పరంబులగుచో నాగమంబుగా నగు.

ఉ. దానిచేతన్, వానిచేతన్ మొ.

౬౧. అయ్యాది=ని; 'తృతీయ' మొదలగు విభక్తులు పరములగునపుడు 'ని' ఆగమముగా అగుచుండును. ఇయ్యాది ఏకవచన, బహువచనములు రెండిం టను వచ్చు నని భావము. (ఏక) వానిచేతన్. (బహు) వానిచేతన్.

ప్రత్యయముపయి ప్రత్యయము వచ్చుట సాధారణము కానందున నిచట 'ని' ఆగమముగా వచ్చు నని చెప్పఁబడినది.

౬౨. అది యిది యెది యనువానికిఁ దృతీయాసప్తమ్యేక వచనంబులయందు దాన దీన దేన సనియు, వాని బహువచనంబులయందు వాన వీన వేన సనియు రూపంబు లగు.

ఉ. 'క. చనునెడ శ్రీరాముఁడు పావనవనిజరూప వైభవశ్రీ నుల్లంబున నిడి దాన విచిత్రాతనురాగ ప్రౌఢి వచ్చి తనుఁ బైకొనఁగన్.' రాఘు. ౨ ఆ. ౮౩. క. నలుఁ గాన మివ్వ నంబునఁ, గల వెప్పుడుఁ గాంతు ముగ్రకరులను సింహం, బుల ఋక్షంబుల నిది మర్త్యుల కవిషయ మాతపంబు దూఱదు దీనన్.' భార. అర. ౨ ఆ. ౧౦౬. 'క. కాననము గిరులు నదులును, నానాతీర్థములు భూజనంబులకెల్లన్, భూనుత సాధారణ ములు, వానను ధర్మములు సేయవచ్చు నిజేచ్ఛన్.' భార. ఆను.

౨ ఆ. ౩౯౫ 'ఏ. గీ. అనిన నలుగాలివాన గోవును నశేష, శబ్దములమంత్రమును లోహజాతిఁ గాంచ, నమును మనుజుల విప్రుఁడు సమధికత్వ, భాజనములండ్రు వేదప్రపంచవిదులు.' భార. శాంతి. ౧ ఆ. ౭౧. 'తే. కలవు నూఱులు వేలు లక్ష లును గోటు, లప్రమేయముల్ ఘనమాయ లధిప నాకు, వానఁ దగులకపోరాదు వనజభవున, కైన నభవునకైనను నన్యు లెంత?' లక్ష్మీ. ౪. ఆ. ౧౩౭. 'క. ధ్యానం బింద్రియ వృత్తులు, మానించు టహింస గురుసమర్చనవిధి ని,త్యానుష్ఠానము తపమును, [1]వీనం బరసేవ్యమెద్ది వినఁగా వలతుర్,' భార అను. ౪ ఆ. ౨౭౭. 'సీ. ఒక్కఁ డొక్కటిచేత నెక్కుచుఁ దఱుఁగుచుఁ ద్రిగుణంబు లును బ్రవర్తించు వీన, జనితంబులగుఁ బ్రీతి సంతాపమోహా ద్యు,లు.' భార. అను. ౫. ఆ. ౨౫౦. 'ఏ గీ. అని యొఱింగించి తులియు ని ట్లను నజుండు. [2]స్వేదబుద్బుదాండజములు జరా యుజములు' భార అశ్వ. ౨ ఆ. ౧౪౫. మొ. దేనన్, వేనన్ అనివానికిఁ బ్రయోగంబులు మృగ్యంబులు.

ఉ॥. 'అది, ఇది, ఎది' అనువానికి తృతీయా సప్తమ్యేకవచనము లందు 'దానన్, దీనన్, దేనన్' అనియు, వాని బహువచనములయందు 'వానన్, వీనన్, వేనన్' అనియు రూపంబు లగు నని యర్థము. పుం. శబ్దము లకుఁ బలు విభక్తులందు-'దానిచేతన్, దీనిచేతన్, దేనిచేతన్-దానియందున్, దీనియందున్, దేనియందున్' అని రూపము లుండును; 'దానన్, దీనన్, దేనన్-' అను రూపము లీ సూత్రముచే సాధింపఁబడుచున్నవి.

---

1. వీనఁ బరమసేవ్య మెద్ది ? పా.
2. స్వేద మద్భేదమండ మన్ వీనఁబుట్టు...జరాయుజములు పా.

వీనికిఁ బ్రయోగములు చూపఁబడుచున్నవి- 'దానన్-' కు మొదటి దుదాహరణము- 'క...శ్రీ నుల్లం; బున నిడి దానన్—' 'రెండవది దీనన్-' అనుదాని కుదాహృతి- 'క...మర్త్యుల కవిషయ మాతపంబుదూఱదు దీనన్'. 'వానన్-' అనుదానికి 'వానను - ధర్మములు సేయవచ్చు నికేచ్చన్.' అను మూఁడవది యుదాహరణము. నలుగాలివానగోవును...' అనునది 'వానన్' అనుదానికే ఉదాహృతి, '...వానఁ దగుల్లక పోరాదు వనజభవున, కైన...' అను నైదవ యుదాహృతియుం 'వానన్' అనుదానికే సమర్థకము. 'వీనన్-' అనుదానికి- 'క...వీనం బరసేవ్య మెద్ది? (వీనఁ బరమసేవ్యమెద్ది అను పాఠమే మేలైనది)...' అను నాఱవ యుదాహరణమును, '...ద్విగుణంబులను బ్రవర్తించు వీన...' అను నేడవ యుదాహృతియును; 'స్వేద ముద్భేద మండ మన్ వీనఁ బుట్టు...' అను కడపటి యుదాహరణమును బ్రమాణములు.

ఈ కడపటి యుదాహరణము మూలమున 'ఎ. గీ' అని యుటంకించి మఱియు నిట్లను నుండు, స్వేదబుద్భిదాండజములు జరాయుజములు...' అని ముద్రితమై యున్నది. కాని యీ పాఠము తప్పు. ఇట్టి పాఠమునే గ్రహించినచో అది ప్రస్తుతమున కప్రసక్తమగును. ఏలయన ఇందు కావలసిన 'వీనన్' లేనే లేదు. మఱియు నీ పాఠమున ఛందస్సు యతి భిన్నము లైనవి. 'స్వేదబుద్భిదాండజములు' అనుచో అర్థము లేదు. కావున 'స్వేద ముద్భేద మండమన్ వీనఁ బుట్టు' అను పాఠమునే గ్రహింపవలెను. కుమార దేవపండితీయమున తప్పు పాఠమే గ్రహింపఁబడినది.

మూలవివరణమునందు ప్రాథవ్యాకర్త 'దేనన్-వేనన్-' అనువానికిఁ బ్రయోగములను చూపలేదు. 'వానికిఁ బ్రయోగములు మృగ్యములు' అని యాయనయే వ్రాసి యుండుటవలన అట్టి ప్రయోగములు మిక్కిలి పరిశోధించి వెదకినఁ గాని లభ్యమ్ములు కావని తేలుచున్నది.

## ౬3. పదాద్యంతగతం బాశబ్దం బమహదర్థకంబు సమస్తంబు వ్యస్తంబు నయి కొన్నియెడల నర్థశూన్యం బగు.

ఉ. 'చ. తత్పురవప్రము పాదపీఠికా, శిరముల కొప్ప నర్చనలుచేసిన పువ్వులయవ్విధంబునన్.' భార. ఆది. ౧ఆ. ౭౬. [1]'పాడుగాపునాగతి.' కళా. 3 ఆ. ౨౭౨. 'మఱిబావులు నూఱిటి కంటె నొక్క సత్క్రతువది మేలు.' భార. ఆది. ౪ ఆ. ౯3.

౬3. అమహాద్వాచక మగు 'ఆ' శబ్దము సమాసమును పొంది పదము మొదట ఉన్నపుడు, కొన్నిచోట్ల అర్థము లేకయే-నిరర్థకమయియే యుండును; అట్లే అమహాద్వాచకమగు నా 'ఆ' శబ్దము వ్యస్తమయి పదముచివఱ నున్నపుడును నిరర్థకమయి యుండును.

'—పువ్వుల యవ్విధంబునన్...' '...పాడుగాపు నాగతి-' అను చోట్ల 'అవ్విధంబునన్, ఆగతి' అనునవి సమాసగతములగు 'ఆ' శబ్దములు; అమహత్తులు. అవి నిరర్థకములు. 'పువ్వులవిధంబునన్, పాడుగాపుగతి' అన్న ఎంత అర్థము వచ్చునో, తచ్ఛబ్దవిశిష్టములయి యున్నపుడు కూడ అంతే అర్థము వచ్చును. 'ఒక్క సత్ క్రతు వది మేలు-' అనునెడ 'అది' అను తచ్ఛబ్దము వ్యస్తము; అమహత్తు; 'సత్క్రతువు' అను పదమునకుఁ బిదప నున్నది. కావున నిరర్థకము. స 'త్క్రతువు మేలు' అనిన నెంత యర్థమో, 'సత్క్రతువది మేలు' అనినను అంతే యర్థము.

## ౯౪. తవర్ణకంబు స్త్ర్యర్థకం బగు.

౬౪. స్త్ర్యర్థకంబు=స్త్రీ అను నర్థమును తెలుపునది. 'త' అను ప్రత్యయము 'స్త్రీ' యను నర్థమును తెలియఁజేయునపుడు కొన్ని సర్వనామముల చివరఁ జేరుచుండు నని యర్థము.

---

1. పాడుకాపునాగతి; పాడుకాపులాగతి-పా. లు.

**౬౫. అయ్యాది యేకత్వంబున సమాసగతషష్ఠ్యంత యత్కి-మర్థకాన్యైకార్థకశబ్దంబులపయి నగు.**

ఉ. ఎవ్వరిత, ఎవరిత; ఒక్కరిత, ఒకరిత; ఒక్కొరిత, ఒకొరిత. (వీనికి ఎవరియొక్క యాఁడుది యనియు, ఒకరియొక్క యాఁడుది యనియు, ఒక్కయాఁడు దనియు నర్థములు)

౬౫. 'ఎవ్వరు ? అను ప్రశ్నార్థమిచ్చునది యత్కిమర్థకము. ఎవరో యొక రని యర్థ మిచ్చునది అన్యార్థకము. ఒక సంఖ్యనే నిరూపించునది ఏకార్థకము. కాఁగా- 'ఎవరు, ఒకరు' అను శబ్దములే యత్కిమర్థకాన్యైకార్థక శబ్దములు. 'ఆఁడుది' అను నర్థమునందు వచ్చు 'త' ప్రత్యయము సమాసమునందు షష్ఠ్యంతములగు మీఁది శబ్దములమీఁదనే - (ఎవరియొక్క యాఁడుది, ఒకరియొక్క యాఁడుది అను నర్థములందే) వచ్చునని యర్థము.

'ఎవ్వరియొక్క+ఆఁడుది' అనుచోట 'ఆఁడుది' అను నర్థమునందు 'త' వచ్చి 'ఎవ్వరియొక్క+త' అగును. ఇది షష్ఠీసమాసమునకు సంబంధించినది కాన సమాసమునందు 'యొక్క' లోపించి 'ఎవ్వరిత' అగును.

ఇట్లే 'ఒక్కరియొక్క+ఆఁడుది=ఒక్కరియొక్క+త' = 'ఒక్కరిత' అగును. తక్కినవిధం బిట్లే.

'ఎవ్వరు-ఒక్కరు-' అనువానికి 'యొక్క' పరమగునపుడు ఇత్వము వచ్చి 'ఎవ్వరియొక్క,' 'ఒక్కరియొక్క' అగును.

**౬౬. దానియత్వంబున కితైత్వంబులు పర్యాయంబున నగు. ఆదేశాత్వంబుమీఁది దాని కెత్వంబు రాదు.**

ఉ. ఎవ్వరితి, ఎవరితి; ఎవ్వరితె, ఎవరితె; ఒక్కరితి, ఒకరితి; ఒక్కరితె, ఒకరితె; ఒక్కొరితి, ఒకొరితి; ఒక్కొరితె, ఒకొరితె.

౬౬. దాని యత్వంబునకున్='ఆఁడుది' అను నర్థమున వచ్చిన 'త' వర్ణకముయొక్క అకారమునకు; ఇత్త్వైత్వంబులు = ఇకార, ఎకారములు; పర్యాయంబునన్ = ఒకటి రానప్పు డింకొకటిగా; ఆదేశౌత్వంబుమీఁదిదాని కిన్=ఒక్కాదుల కాదేశముగా వచ్చిన ఓత్వముమీఁద నున్న అకారమునకు.

ఆ 'త' వర్ణకముయొక్క అకారము ఇకారముగాఁగాని, ఎకారముగాఁ గాని మాఱును; కాని ఆదేశముగా వచ్చిన ఓకారమునకుఁ దర్వాత నున్న అకారమునకు మాత్రము ఎత్వము రాదు.

ఇకార-ఎకారములు వచ్చుటకు ఉదాహృతులు - 'ఎవ్వరితి, ఎవరితి; ఎవ్వరితె, ఎవరితె; ఒక్కరితి, ఒకరితి; ఒక్కరితె, ఒకరితె; ఒక్కొరితి, ఒకొరితి; ఒక్కరితె, ఒకొరితె. ఇకార-ఎకారములు రానపుడు ౬౫-వ సూత్రమునం దిచ్చిన రూపంబులు నుండును.

'ఎవరి+త' అని యున్నపుడు ౬౧-వ సూత్రముచే రేఫముమీఁది ఇకారము లోపించి ౬౫-వ సూత్రముచే ఓకారము ఆదేశముగా వచ్చును. అప్పుడు 'ఓర్త' అను రూప మగును. ఇచటి అకారము ఆదేశముగా వచ్చిన ఓకారమునకుఁ దర్వాత నున్నది కాన, ఎకారముగా మాఱలేదు. కాన 'ఓర్తె' అని కాదు.

ఇచట ముద్రిత ప్రతులలో మూలసూత్రమున 'ఆదేశౌత్వంబుమీఁది దాని కెత్వంబు రాదు' అని తప్పుగా నున్నది. అపుడు సమన్వయము కుదురదు.

## ౬౭. రేఫసంయుక్తం బగుచో నొక్కొక శబ్దంబులమీఁది తకారంబున కుత్వంబు నగు.

ఉ. (చూ మీఁదు.)

౬౭. రేఫసంయుక్తంబు=రేఫముతోఁ గలసికొనునది. 'ఒక్క, ఒక-' అను శబ్దములమీఁది తవర్ణకము రేఫముతోఁ గూడి యున్నయెడల, ఆ

తకారము మీఁది అకారము ఉకారముగాకూడ మాఱు నని యర్థము. ఇట్ల
గుట వికల్ప మని భావము.

వివరణమున దీని యుదాహరణమును దర్శ్యాతిసూత్రమున గమనింప
వలె నని '(చూ. మీఁదు)' అనుదానిచే సూచింపఁబడినది. ౮౯-వ సూత్ర
మున 'తవర్గకము పరమగునపుడు 'రి' లోని ఇకారము లోపించు' నని చెప్పఁ
బడుచున్నది. ఇకారము లోపించిన పిదపనే తకారము రేఫసంయుక్తమగుట
సంభవించును. అప్పుడు తకారముమీఁది అత్వమున ఉత్వమునగునని భావము.

ఒక్కరి (యొక్క) + త - ఇకారలోపము - ఒక్కర్ + త - అత్వమున
ఉత్వము - 'ఒక్కర్తు -' ఉత్వము రానపుడు 'ఒక్కర్త' అని యగును. ఉదా
హరణాంతరములను ౮౯-వ సూత్ర వివరణమున గమనించునది.

## ౮౯. తవర్ణకంబు పరంబగుచో రేఫంబుమీఁది యిత్తునకు లోపంబు విభాష నగు.

ఉ. ఎవ్వర్త, ఎవర్త; ఎవర్తి, ఎవ్వర్తి; ఎవ్వర్తె, ఎవర్తె;
ఒక్కర్త, ఒకర్త; ఒక్కర్తి, ఒకర్తి; ఒక్కర్తు, ఒకర్తు; ఒక్కర్తె;
ఒకర్తె; ఒక్కొర్త, ఒకొర్త; ఒక్కొర్తి, ఒకొర్తి; ఒక్కొర్తు,
ఒకొర్తు; ఒక్కొర్తె, ఒకొర్తె.

౮౯. 'త' ప్రత్యయము పరమగునపుడు రేఫముమీఁది ఇకారమునకు
లోపము వికల్పముగా నగును.

ఇకారలోపమునకు - 'ఎవ్వర్త' మున్నగునవి అన్నియు నుదాహరణ
ములు. తకారముమీఁది అకారమునకు ఇకారము, ఎకారము, ఉకారము
ఆదేశమగుటయు, అవి రానపుడు అకార ముండుటయు నీ యుదాహరణము
లందే స్పష్టము.

'రి' లోని ఇకారము ఈ సూత్రమునుబట్టి వికల్పముగా లోపించి
పయి రూపము లైనవి. ఇత్వలోపము రానపుడు 'ఎవ్వరితఎవరిత' మున్నగు
రూపములు నగును.

## ౧౯. కొన్నియెడల రేఫసంయుక్త తవర్ణకంబుముందటి యొక్కాదుల కోత్వం బాదేశం బగు.

ఉ. ఓర్త, ఓర్తి, ఓర్తు.

౧౯. కొన్నిచోట్ల రేఫముతోఁ గూడిన 'త' ప్రత్యయమునకు ముందున్న 'ఒక్క' మున్నగు శబ్దములకు ఓత్వము ఆదేశమగు నని యర్థము. ఇది వికల్పము.

'ఒక్కరి+త-' ఇత్వలోపము రాఁగా 'ఒక్కర్త' అగును. ఇట్టిచోట్ల రేఫసంయుక్తతవర్ణకమగు 'ర్త'కు ముందున్న 'ఒక్క'కు 'ఓ' ఆదేశము కాఁగా 'ఓర్త' అగును. తకారముమీఁది అత్వమునకు ౧౬-వ సూత్రముచే ఇత్వము వికల్పముగా రాఁగా 'ఓర్తి' అగును. ౧౭-వ సూత్రముచే ఉత్వము రాఁగా 'ఓర్తు' అగును. 'ఆదేశాత్వంబుమీఁదిదాని కెత్వంబురా' దని ౧౬-వ సూత్రమునందే యుండుటచే 'ఓర్తె' అనిమాత్రము కాఁజాలదు.

## ౨౦. ఎవ్వరితాదులందలి రివర్ణంబునకు లోపంబు విభాష నగు.

ఉ. ఎవ్వత, ఎవత; ఎవ్వతి, ఎవతి; ఎవ్వతె, ఎవతె; ఒక్కత, ఒకత; ఒక్కతి, ఒకతి; ఒక్కతె, ఒకతె; ఒకొక్కత, ఒకోత; ఒకొక్కతి; ఒకోతి; ఒకొక్కతె, ఒకోతె. [స్వార్థంబునం గప్రత్యయంబు రా ఎవ్వతుక, ఎవతుక; ఎవ్వర్తుక, ఎవర్తుక; ఒక్కతుక, ఒకతుక; ఒకొక్కతుక, ఒకోతుక; ఒక్కర్తుక, ఒకర్తుక; ఒకొక్కర్తుక, ఒకోర్తుక, ఓర్తుక అని రూపంబులు.]

౭౦. 'ఎవ్వరిత' మున్నగు శబ్దములలోని 'రి' వర్ణకము వికల్పముగా లోపించును.

'ఎవ్వరిత, ఎవరిత' 'రి' లోపింపఁగా 'ఎవ్వత, ఎవత' అగును. ఇట్లే తక్కినవియును.

'ఎవ్వర్తుక, ఎవర్తుక'-అనునవి 'ఎవ్వర్తు, ఎవర్తు' అనువానికి స్వార్థమునందు 'క' వర్ణకము రాఁగా ఏర్పడిన రూపములు. 'ఎవ్వతుక, ఎవతుక' మున్నగు నుదాహరణములనుబట్టి ఉత్వముకూడవచ్చు నని యనుకొనవలెను.

౭౧. నీ మీ నే మే హల్లులకు లోపంబు విభాష నగు.

ఉ. ఈవు, నీవు; ఈరు, మీరు; ఏను, నేను; ఏము, మేము.

౭౧. 'నీ-మీ, నే-మే, అనువానిలోని హల్లులు వికల్పముగా లోపించి, 'ఈ, ఏ' అను అచ్చులుగా ఉండుటయుఁ గల దని సూత్రార్థము. ఇది సర్వనామ విషయము. ఉదాహరణములు స్పష్టములు.

౭౨. బహుత్వంబున మేకు నే విభాష నగు.

ఉ. నేము, మేము.

౭౨. బహువచనమునందు 'మే' అనువానికి 'నే' అనునదియు వికల్పముగా ఆదేశ మగును.

౭౩. నిన్ను నన్నుఁ దన్ను-వీనియందలి ద్విత్వమునకేనియు, ద్విత్వయుక్త నువర్ణంబునకేనియు, మిమ్ము మమ్ముఁ దమ్ము - వీనియందలి ద్విత్వంబునకును లోపంబు వైకల్పికంబు.

ఉ. నినుఁ, నిఁ; ననుఁ, నఁ; తనుఁ, తఁ; మిముఁ, మముఁ, తముఁ. 'ఉ. నిఁ, నమ్మినవారి కెన్నఁడును నాశము లేదుగదమ్మ యీశ్వరీ!' భాగ. ౧౦ స్కం. ౧౭౫౨. 'నఁ నిలువంబెట్టితి. భాగ. ౧౧ స్కం. పూ. ౧౭౩౬. 'సీ. పనియేమి పంచినఁ బదపడి చేసెద ననక తఁ బంచిన యాత్మజంబు, చేయుచు.' భార. ఆది. 3 ఆ. ౧౧౦ మొ.

౭౩. 'నిన్నుఁ, నన్నుఁ, తన్నుఁ' - అనువానిలోని ద్విత్వము లోపించిన లోపింపవచ్చును. లేదా-ద్విత్వముతోఁగూడిన నువర్ణము (న్ను) లోపించినను లోపింపవచ్చును. 'మిమ్ము, మమ్ము, తమ్ము,' అనువానిలోని ద్విత్వము వికల్పముగా లోపించును.

'నిన్నుఁ' మున్నగువాని ద్విత్వలోపమున 'నినుఁ, ననుఁ, తనుఁ' అని యగును. ద్విత్వయుక్త 'ను' కు లోపము వచ్చిన 'నిఁ, నఁ, తఁ' అగును. 'మిమ్ము' మున్నగువాని ద్విత్వలోపమున మిముఁ, మముఁ, తముఁ' అగును. 'నిఁ-'కు ఉదాహృతి - 'నిఁ' నమ్మినవారి కెన్నటికి నాశము లేదుగదమ్మ యీశ్వరీ.' 'నన్'కు ఉదాహరణము-'నఁ' నిలువంబెట్టితి...' 'తఁ' అనుదానికి - 'తఁ' బంచిన యాత్మజంబ-' అనునది ఉదాహరణము.

## ౭౪. తాము తమరు తారు నగు.

స్పష్టము.

౭౪. 'తాము' అనుదానికి 'తమరు, తారు' అను రూపములు కూడ నుండు నని యర్థము. ఆ రెండు రూపములును ఈ సూత్రముచేతనే విధింపఁబడుచున్నవి.

'తా' అనునది ఆత్మార్థకశబ్దమున కేకవచనము. దానికి బహువచనము 'తాము' అనునది. అది ఎట్లును సిద్ధించుచున్నది. దానికే 'తమరు, తారు'

రూపాంతరములు. ఇచట 'తమరు' అనునదే తాము తమరు (?) (తారు)' లగునని సూత్రించిన బాగుండెడిది 'అను' కుమారదేవపండితీయము, ఆ యాశయము ననుసరించిన ప్రక్రియయుం చింత్యములు. 'తా' అనునదే యిచటి ప్రాతిపదిక.

**౭౫. నామపునర్గ్రహణంబున భిన్నంబు నభిన్నంబు నయి తచ్ఛబ్దార్థంబు తత్పర్యాయం బగు.**

ఉ. 'వాఁడె సురాసురులెల్ల నడ్డమై, వచ్చిననైన రాక్షస విదాహామునం గొనిపోవు నిన్ను.' భాగ. ౧౦. స్కం. పూ ౧౭౩౮. (వాఁడె భిన్నరూపము, ఆసుదర్శనాయుధుఁ డనుట అభిన్నరూపము; సుదర్శనాయుధుఁడు నామపదము.) 'ఎ-గీ. వివిధపుణ్యకథలు వినువేడ్క నతనిఁ బూ, జించిరి.' భార. ఆది. ౧ ఆ. ౨౭. (అతనిఁ భిన్నరూపము, అక్కథకు ననుట అభిన్న రూపము; కథకుఁడు నామపదము.) 'సీ. కలహంస పలికిన పలుకుల గణియించు వడి దానిపోయిన వలన చూచు,' భార. ఆర. ౩ ఆ. ౨౬. (దాని భిన్నరూపము. ఆ. కలహంస యనుట అభిన్న రూపము; కలహంస నామపదము) మొ.

౭౫. ఒకసారి చెప్పిన నామమునే మఱలఁ జెప్పుట నామపునర్గ్రహణము. ఆ పునర్గ్రహణమునకు (మాఱుగా) పర్యాయముగా 'ఆ' అను శబ్దము (తచ్ఛబ్దార్థము) ప్రయోగింపఁబడుచుండును. అయ్యది కొన్నియెడల భిన్నముగాను, కొన్నియెడల అభిన్నముగాను ప్రయోగింపఁబడుచుండును. ఈ యంశమే సూత్రమునఁ జెప్పఁబడెను.

అనఁగా—నామ పునర్గ్రహణమునందు ఆ నామముస్థానమున వేఱుగా తచ్ఛబ్దము ప్రయోగింపఁబడును లేదా ఆ నామపదముతోఁ గలిసి, నామమునకు ముందుగాఁ జేరును. అభిన్నపదము సమస్తపదమయి యుండు నని భావము.

భిన్నముగా నుండుట కుదాహరణము—'వాఁడె సురాసురు లెల్ల నడఁచె' అనుచోట 'వాఁడె' అనునది నామపర్యాయముగా తచ్ఛబ్దము వేఱుగాఁ బ్రయోగింపఁబడినది. 'ఆ సుదర్శనాయుంధుఁడు' అనినచో అభిన్న రూప మగును. ఇచట సుదర్శనాయుంధుఁడు' అను నామపదముతోఁ దచ్ఛబ్దము చేరుట స్పష్టము.

"వివిధపుణ్యకథలు వినువేడ్కఁ నతనిఁ బూజించిరి-' అనుచోట 'అతనిన్' అనునది నామపునర్గ్రహణమునఁ దత్పర్యాయముగా వచ్చిన తచ్ఛబ్దము; అది భిన్నముగాఁ బ్రయుక్తము. 'అక్కథకుఁ బూజించిరి' అని చెప్పినచో 'అక్కథకున్' అనునది అభిన్నరూపము. ఇచటి తచ్ఛబ్దము 'కథకుఁడు' అను నామపదముతోఁ జేరుట స్పష్టము.

'...వడి దానిపోయిన వలన చూచు.' అనుచోట 'దాని' అను తచ్ఛబ్దము భిన్నరూపముగాఁ బ్రయోగింపఁబడినది. 'ఆ కలహంస పోయిన వలన చూచు' అని చెప్పినచో అభిన్నరూప మగును.

## ౭౬. ఒక్కొకచో నామంబె యగు.

ఉ. 'సి. సురవరు లర్థులై చూచుచు నుండంగ నలు వరియించిన నాఁటియెగ్గు, దలఁచి యిట్టి యాపదలు చేసిరో వేల్పులమరకోపమునన యయ్యె నాకు, నీ వియోగదుఃఖము.' భార. ఆర. ౨ ఆ. ౧౧౩ మొ.

౭౬. కొన్నియెడల నామపునర్గ్రహణంబున నామమే మఱలఁ బ్రయోగింపఁబడు నని అర్థము. వెనుకటి సూత్రమునుబట్టి నామపునర్గ్రహణమునందు నామమునకుఁ బర్యాయముగా భిన్నరూపముగాఁ గాని, అభిన్నరూపముగాఁ గాని తచ్ఛబ్దమే ప్రయుక్తము కావలసి యుండఁగా - అట్లు కాక - నామముకూడఁ బ్రయోగింపఁబడవచ్చు నని యీ సూత్రము చెప్పుచున్నది.

'సీ. సురవరు లర్థులై చూచుచుండఁగ నలు వరియించిననాఁటి యొగ్గు, దలఁచి యిట్టి యాపదలు చేసిరో వేల్పులు...' అనుచోట 'సుర వరులు' అను దానిని మఱల గ్రహించునపుడు తచ్ఛబ్దము గాక 'వేల్పులు' అను నామపదమే గ్రహింపఁబడిన దని తెలిసికొనవలెను.

## ౭౭. నామ తదేతద్వ్యతిక్రమర్థంబులకుం బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యంత మగు పూర్వపరంబుగ నాత్మార్థం బభిహితం బగు.

ఉ. 'తా వచ్చె సుదర్శనాయుధుఁడు.' భాగ. ౧౦ స్కం. పూ. ౧౭౩౮. 'క. విదురుఁ డురువిషాగ్నులవలనన్, మానుగ నేమఱకుం డని, తాను బ్రబోధించె.' భార. ఆది ౬. ఆ. ౧౫౧. (ఇటఁ దాశబ్దము పాదపూరణార్థకము. 'వచ్చె సుదర్శనాయుధుఁడు-' 'విదురుఁడు బోధించె' అని యాత్మార్థవిరహితంబుగను జెప్పనగు) 'ఆ. అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిఁ గా, కున్నె యిట్లు సేయ నువిద కడఁగె.' భార. ఆర. ౨ ఆ. ౧౬౮. 'వ. అదియును దనకమ్మను జేశ్వరుం డపాయంబు సేయునకాఁ దలఁచి.' భార. ఆర. ౨ ఆ. ౧౮. 'క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు కీడు నిచ్చుఁ గర్తలు దనకున్, గర్మములు బ్రహ్మకైనను, గర్మరుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్' భాగ. ౧౦. స్కం. పూ. ౩౨ మొ.

౭౭. తదేతద్వ్యతిక్రమర్థకములు='ఆ-ఈ-ఏ' అను శబ్దములు. 'తా' అనునది ఆత్మార్థము. 'నామమునకును, మీఁది త్రికశబ్దములకు పునర్గ్రహణమునందు 'తాను' అను శబ్దము ప్రథమ మున్నగు విభక్తులతోఁ గూడినదై నామాదులకు ముందుగాని, వెనుకగాని చేరుచుండును' అని యర్థము.

'తా వచ్చి సుదర్శనాయంధుఁడు-' అనుచో 'తా' శబ్దము నామము నకు ముందుగా నామపునర్గ్రహణమున వచ్చినది. '...ఏమఱకుండని, తాను బ్రబోధించె'...''ననుచో 'తాను' అనునది నామమునఁ బర్యాయముగా వెనుక వచ్చుటకు ఉదాహరణము. 'అడవిఁ దన్నుఁ బాసి...యిట్లు సేయ నువిద కడఁగె' ననుచో 'తన్ను' అను నాత్మార్థశబ్దము 'ఉవిద'కు మాఱుగా ముందు వచ్చుటకు ఉదాహరణములు.

'అనియుంను దన కమ్మను జేశ్వరుం డపాయంబు సేయున కాఁ దలఁచి.' అనుచో 'తనకు...' అను నాత్మార్థము. 'అది' అను తచ్ఛబ్దమునకుఁ బర్యాయమై వెనుక వచ్చినది. '...కర్తలు దనకున్, గర్మములు బ్రహ్మకైనను, గర్తుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్ ?' అనుచోట 'తనకున్' అను నాత్మార్థము నామమునకుఁ బర్యాయముగా ముందు వచ్చినది.

## ౭౮. ఆత్మార్థం బొకానొకచో నామాస్మదర్థాభిధాయియు నగు.

ఉ. 'తే. తనకు మఱి తానె చుట్టంబు తానె తనకు, గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనఁగ, వనజనేత్ర! గాంధర్వవివాహ మతిర,హస్యమును నమంత్రకమును నగుచు నొప్పు.' (తనకుఁ=స్త్రీ కనుట) భార. ఆది. ౪ ఆ. ౫౭. 'క. తనతొంటికర్మరాశికి,ననుచరమై బహువికారమై మనము వడిన్, జను నింద్రియముల తెరువులఁ, దనువులు పెక్కైనఁ జెడవు తన కర్మంబుల్.' భాగ. ౧౦ స్కం. పూ. ౩౦. (తన=ప్రాణియొక్క) మొ. 'తన కిష్టుఁడున్ సహో,ధ్యాయుఁడు నైనవాఁడు.' (తనకున్= నాకు) భార. ఆది. ౧ ఆ. ౨౪. 'తనతనుచ్ఛాయ మస్తకహీనమై తోఁచె.' (తన తనుచ్ఛాయ=నాతనుచ్ఛాయ) జై. ౭. ఆ. ౧౩.

'నీవు చెప్ప నొడికంబుగఁ బూనిన యీ ప్రబంధముం, దన కిపు డంకితంబు ప్రమదంబుగఁ జేయుము.' (తనకుఁ = నాకు.) రుక్మాంగ. ౧. ఆ. 33. 'సీ. తమ సొమ్ము తమ కిచ్చె ధర్మరా జని మహీ, సురులు దానముసేయఁ జూచి నగరె?' (తమసొమ్ము = మాసొమ్ము, తమకుఁ = మాకు.) జై. ౧. ఆ. ౬౮ మొ.

౭౮. ఆత్మార్థంబు='తాను' అను శబ్దము 'ఒకానొకచో' అనఁగా కొన్నియెడల నని యర్థము. నామాస్మదర్థాభిధాయియుంన్ = నామము యొక్కయు, 'నా' శబ్దముయొక్కయు అర్థములను చెప్పునదియును; కొన్ని చోట్ల 'తాను' అనునదియును, దాని యితర రూపములును నామము యొక్కయు 'నా' శబ్దముయొక్కయు నర్థమున నుపయోగింపఁబడుచుండు టయుఁ గల దని యర్థము. ఉదాహరణములు స్పష్టములు. వానిలో మొదటి రెండును ఆత్మార్థము నామార్థాభిధాయి యగుటకును, తర్వాతి నాలుగును ఆత్మార్థము అస్మదర్థాభిధాయి యగుటకు నుదాహృతులు.

౭౯. కర్తృబహుత్వంబునఁ దనతనకుఁ దమతమయు నగు.

ఉ. 'క. తమ తమ పుత్త్రుఁడుగాఁ జి, త్తములం జేకొని దయను బృథగ్భావము లేక ముదంబునఁ బెంచిరి.' భార. ఆర. 3 ఆ. ౨౦౯ మొ.

౭౯. కర్తృబహుత్వంబునన్ = కర్తలు పెక్కులు ఉన్నపుడు. వాక్యమునందుఁ గర్తలు ఎక్కువగా నున్నపుడు 'తన తన' అనుదానికి 'తమ తమ' అనియు నగు నని యర్థము. 'తమ తమ' రానపుడు 'తన తన' అనియు నుండును.

'...తమ తమ పుత్రుఁడుగాఁ......పెంచిరి' అనుచోట 'పెంచి' రని కర్త లనేకములగుటచే 'తమ తమ' అని వచ్చెను. ఇది రానపుడు 'తన తన' అనియుఁ నుండును.

**౮౦. ఒక్కొక్కశబ్దంబుల యత్వంబున కొత్వంబు విభాష నగు.**

ఉ. ఒక్కఁడు, ఒక్కొఁడు; ఒకఁడు, ఒకొఁడు.

౮౦. 'ఒక్క, ఒక' అను శబ్దములపై నున్న అకారమునకు ఒకారము వికల్పముగా నగును. ఉదాహరణములు స్పష్టములు. ఒకారము రానపుడచట అకారము నిలుచును.

**౮౧. ఒక్కొకాదులకు డువర్ణకంబు పరంబగునపుడు మహదర్థంబున రు రువుగాగమంబులును, అవి పరంబగుచోఁ గకారమునకు లోపంబును, కకారాదులకు లోపంబు రా డువర్ణకమునకు ద్విత్వాయుక్త డువర్ణంబును, అమహదర్థంబునం గకారాదులకు లోపబిందువులును విభాష నగు.**

ఉ. ఒక్కరుఁడు, ఒక్కొరుఁడు; ఒకరుఁడు, ఒకొరుఁడు; ఒక్కరువుఁడు, ఒక్కొరువుఁడు; ఒకరువుఁడు, ఒకొరువుఁడు; ఒరుఁడు, ఒరువుఁడు; ఒడ్డు, ఒండు.

౮౧. 'ఒక్క, ఒక-' మున్నగు శబ్దముల తర్వాత 'డు' ప్రత్యయము ఉన్నపుడు - మహదర్థమునందు "రు-రువు' అను నాగమము లగును. ఆ 'రు-రువు'లు పరముగా ఉన్నపుడు 'క' అనుదానికి లోపం బగును; 'క' మున్నగునవి లోపింపఁగా 'డు' అనునది 'డ్డు'గా మాఱును; అమహద్వాచకమగునపుడు కకారాదులకు లోపము, నిండుసున్నయుఁ నగును. ఇవి యన్నియును వికల్పము లని సూత్రార్థము.

'ఒక+డు, ఒక్క+ఁడు' అని యుండఁగా 'రు - రువు' లు రాఁగా - 'ఒకరుఁడు-ఒకరువుఁడు-ఒక్కరుఁడు, ఒక్కరువుఁడు' అను రూపము లగును. ఒత్వముతోఁ గూడి యున్నపుడు 'ఒక్కొరుఁడు, ఒక్కొరువుఁడు, ఒకొరుఁడు, ఒకొరువుఁడు' అనియు నగును. కకారమునకు లోపము రాఁగా 'ఒరుఁడు, ఒరువుఁడు' అను రెండు రూపము లగును; అట్లు 'క' లోపింపఁగా 'డు' ద్విత్వమును పొందినపుడు 'ఒడ్డు' అగును. 'ఒక' అమహద్వాచకమగు నపుడు కకారాదులకు లోపము, బిందువు రాఁగా 'ఒండు' అగును. నుడితొలి హ్రస్వము మీఁద అర్ధబిందువు రాదు కావున నిచటి 'బిందు' పదముచే పూర్ణబిందువునే గ్రహింపవలెను. కకారాదిలోప, బిందువులు రానపుడు 'ఒకఁడు, ఒకొఁడు' మున్నగు రూపములు నుండు నని గ్రహించునది.

## ౮౨ టివర్ణం బమహదర్థంబున నొక్కఁడాదుల డువర్ణకంబునకు విభాష నగు.

ఉ. ఒక్కటి, ఒక్కొటి; ఒకటి, ఒకొటి.

౮౨. 'ఒక్క' మున్నగునవి అమహద్వాచకము లగునపుడు వాని 'డు' వర్ణకమునకు 'టి' అనునది వికల్పముగా నగును. ఉదాహరణములు స్పష్టములు. 'టి' రానపుడు 'ఒక్కఁడు, ఒక్కొఁడు, ఒకఁడు, ఒకొఁడు' అని యగును.

## ౮౩. ఎక్కటి యొక్కటి.

స్పష్టము.

౮౩. 'ఒక్కటి' అనుదానికి 'ఎక్కటి' అను రూపాంతర మీ సూత్రముచే విధింపఁబడుచున్నది. దీనింబట్టి 'ఒకటి-' అనునది 'ఎకటి' అని కాఁబోల దనియుం గ్రహింపనగును.

దీని కుదాహరణముగ శబ్దరత్నాకరమున 'ఎక్కటియై యెడ లెత్తె ననఁగ' లక్ష్మీ. ఆ. ౨ ప. 3. అని చూపఁబడినది. కుమారదేవపండి

తీయమున నీ యుదాహరణమే గ్రహింపఁబడినది; కాని యిచట 'ఒక్కటిరెండొ యొడ లొత్తె ననఁగ' అని పాఠము కలదు. కాన 'భీముఁ డా, నెక్కటి దాఁకె దిక్కరి సహింపక సింహముఁ దాఁకునట్లు...' అను (భార. ఆరణ్య. ఆ ౪. ప. ౧౨). అను నుదాహరణమును గ్రహించుట లెస్స.

## ౭౪. ఒకశబ్దం బొక్కచో నల్పార్థకం బగు.

'ఒక మున్నాలు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు.' భాగ. దస్కం. ౨౬౨. 'ఒకనూతేడుఁల్.' మార్కం. ౫ ఆ. ౭౦. 'ఏమొక కొండలము.' విక్ర. ౫ అ. ౨౦౧ మొ.

౭౪. 'ఒక' శబ్దము కొన్నిచోట్ల 'స్వల్పమైనది' అను నర్థమున వచ్చుట కల దని సూత్రార్థము. ఉదాహరణములు స్పష్టములు.

'ఒక శబ్దమే కాక రెండు, మూఁడు, నాలుగు-' మున్నగునవియుం ని ట్లల్పార్థమును దెలుపుట కలదు. ఉదా- 'రెండు మాటలు వినుము-మూఁడే పుల్కులు' మున్నగునవి.

## ౭౫. ఒకా నొకచో ననిర్దిష్టార్థమం దొక శబ్దమునకుం బూర్వాగమం బగు.

ఉ. ఒకానొకఁడు, ఒకానొకతె, ఒకానొకటి. ఒకచో ననుటచే ఒకఁడు, ఒకతె, ఒకటి. ఒక శబ్ద మొక్కాములకు నుపలక్షణము.

౭౫. నిశ్చయించి చెప్పని యర్థమే అనిర్దిష్టార్థము. ఆ యర్థమునందుఁ గొన్ని యెడల 'ఒక' శబ్దమునకు ముందుగా 'ఒకాన్' అనునది చేరుచుండును. (పూర్వాగమంబు = ముందుగా ఆగమముగా వచ్చుట.)

'ఒకాన్+ఒకఁడు = ఒకానొకఁడు, 'ఇట్టే' ఒకానొకతే' మున్నగు నవియగును. సూత్రమునందలి 'ఒక' శబ్దముచే 'ఒక్క' మున్నగువానినిగూడ గ్రహింపవలెను. ఈ యంశమే వివరణమునందలి 'ఒక శబ్ద మొకా్కదులకు నుగులక్షణము' అని వివరింపఁబడినది. ఉదా - 'ఒకానొక్కఁడు, ఒకానొక్కతె, ఒకానొక్కటి' మొదలగునవి.

## ౮౬. సర్వనామంబులకు మహదర్థంబునం దఱచుగ లులలకు రురలగు.

ఉ. ఎల్లరు, ఎల్లరన్; వారు, వీరు, వేరు మొ. తఱచుగ ననుటచే తాము, మేము; తమ్మున్, మమ్మున్, మిమ్ము ఇత్యాది రూపంబులు నగు నని యెఱుంగునది.

౮౬. 'ఆ, ఈ, ఏ, తా' మున్నగునవి సర్వనామశబ్దములు. ఇవి మహద్వాచకము లగునపుడు సాధారణముగా బహువచన ప్రత్యయములగు 'లు, ల' అనువానికి 'రు, ర' అనునవి క్రమముగా వచ్చు నని అర్థము.

'ఎల్లరు, ఎల్లరన్'- మున్నగునవి యుదాహరణములు. 'తఱచుగ' అని సూత్రమునందు చెప్పుటచే 'తాము, తమ్మున్-' మున్నగువానిలో రేఫాదేశము లే దని భావము. మహదర్థమునందే యీ యాదేశము వచ్చు ననుటచే 'పెక్కు' మున్నగువానికమహదర్థమునందు 'పెక్కులు' మున్నగు రూపములే అగు నని గ్రహింపవలెను.

## ౮౭. ఏఁడేలేదేవిశబ్దంబు లర్థవిశేషంబునం దీకారాంతంబు లగు.

ఉ. 'ఏఁడీ స్థా భలుమానికంబులకొాటారు.' అచ్చ. రా. అయో. కాం. ౮౯. 'ఛా రేరీ సిరి మూటకట్టుకొని పోవం

జాలిరే.' భాగ. ౫. స్కం. ౪౦౦. 'ఎది యేదీ యిది చాలఁ గ్రొత్త.' కళా. ౧ ఆ. ౯౨ మొ. హ్రస్వాంతంబులు నగు. ఉ. వాఁడేడి, వారేరి మొ. (అర్థవిశేషము ఎక్కడ, ఎక్కడ నున్నాఁడు ఇత్యాది.)

౬౫. 'ఏఁడు, ఏరు, ఏది, ఏవి—' అనునవి వాని కున్న యర్థముకు గాక విశేషార్థమును చెప్పునపుడు ఈకారాంతము లగుచుండు నని యర్థము. 'ఏఁడీ నాబలుమానికంబుల కొటారు' అనుచోట 'ఏఁడీ' అనఁగా ఎక్కడ నున్నాఁడు? అని యర్థము; ఆయర్థమున నిచట 'ఏఁడు' ఈకారాంతమయినది. 'వారేరీ......' మున్నగునవియు నిట్టే. ఈయి యర్థమునం దీ యీకారాంతములు హ్రస్వము పొందుటయుఁ గలదు. 'వాఁడేఁడి, వారేరి,' అనినను 'వాఁ డెక్కడ? వా రెక్కడ?' అనియే అర్థ మని గ్రహింపవలెను.

**౬౬. అంతాదులకు వారు పరంబగుచో వాకు లోపంబును రురలకు ఱుఱ లాదేశంబు నగు.**

ఉ. అందఱు, అందఱన్ మొ.

౬౬. 'అంత' మున్నగు శబ్దములకు 'వారు' అనునది పరముగా నున్న యెడల 'వా' లోపించును. 'రు-ర' అనునవి 'ఱు-ఱ' లుగా మాఱును.

'అంత+వారు'='వా' లోపింపఁగా అంత+రు' అగును. 'రు'-'ఱు'గా మాఱి ౬౭-వ సూత్రముచే తకారము దకారము కాఁగా 'అందఱు' అగును. ఇట్లే 'అందఱన్.' 'అంత, ఇంత, ఎంత, కొంత' అనునవి అంతాదులు.

**౬౭. వాలోపంబుతఱి వానితకారంబునకు దకారం బగు.**

ఉ. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు.

రఌ, 'అంత' మున్నగువానికిఁ దర్వాత నుండు 'వారు' లోని 'వా' లోపింపఁగా-అంతాదుల తకారము దకారముగా మాఱును. ఉదాహరణములు స్పష్టములు.

## ౯౦. ద్వితీయాదులం దసంయుక్తరవర్ణకంబు నత్వంబున కిత్వంబు తఱచుగ నగు.

ఉ. వారిఌ, వీరిఌ, వేరిఌ, ఒకరిఌ, వాండ్రిఌ, వీండ్రిఌ, వేండ్రిఌ, ఒకండ్రిఌ మొ. తఱచుగ ననుటచే ఇరువుర నిత్యాదులయం దిత్వంబు కలుగదు.

౯౦. అసంయుక్తరవర్ణకంబు = వేఱొక హల్లుతోఁ గూడి యుండని రేఫము. ద్వితీయ మున్నగు విభక్తులయందు తఱచుగా అసంయుక్తరేఫము మీఁది అకారము ఇకారముగా మాఱును.

అ+లన్-వకారాగమము. (౫౩-వ సూ.) రేఫాదేశము (౭౭-సూ.) వారన్-అకారమున కికారము. 'వారిన్'. ఇట్లే 'వీరిన్-' మున్నగునవియును. అసంయుక్తంబని యనుటచే 'వాండ్రన్' మున్నగుచోట్ల ఇత్వము రాలేదు.

సూత్రమందు 'రవర్ణకంబు' అనుటకంటె రేఫంబు అనుట యుక్తము. 'తఱచుగా-' అనుటచే 'ఇరువురన్' మున్నగుచోట్ల ఇత్వము రానందున 'ఇరువురిఌ' కాలేదు.

## ౯౧. రు, రవర్ణకంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమం బగు.

ఉ. ఇరుగురు, మూగురు, నలుగురు, అయిదుగురు, ఏగురు, ఆఱుగురు, ఏడుగురు, వేగురు, పదుగురు మొ. సాధా

రణంబుగ ననుటచే ఎనమండ్రు, తొమ్మండ్రు, ఇరువండ్రు, ముప్పండ్రు ఇత్యాదులందు రా దని యెఱుంగునది.

౯౧. 'రు-ర' అను ప్రత్యయములు పరముగా నున్నపుడు సంఖ్యా వాచకశబ్దములకుఁ దఱచుగా 'గు' అను నక్షరము రు-ల లకు ముందుగా ఆగమ మయి వచ్చును.

ఇరు + గు + రు='ఇరుగురు' 'మూఁడు + గు + రు' (౯౭-వ సూత్రముచే 'డు' లోపము) 'మూగురు'. ఇట్లే తక్కినవియు. ఈ 'గు', అను నాగమము సాధారణముగా వచ్చునని చెప్పుటచే ఇది రాని శబ్దములును కల వని తెలియ నగును. ఉదా:—'ఎనమండ్రు' ఇత్యాదులలో నయి ఆగమము రాలేదు.

౯౨. సంఖ్యావాచకంబులకు విభక్తి పరంబగునపుడు కొన్నింటి యంత్యాక్షరంబులకు లోపం బగు.

ఉ. మూగురు, నలుగురు, ఎనమండ్రు, తొమ్మండ్రు, ఇరువండ్రు, ముప్పండ్రు మొ. అక్షరంబుల కనుటచే ఎను బండ్రు లోనగువానియం దుపాంత్యవర్ణంబునకును లోపంబు. 'కొన్నింటి' యనుటచే అయిదుగురు, ఆఱుగురు ఇత్యాదులందు లోపంబు లేదు.

౯౨. సంఖ్యావాచకశబ్దముల తర్వాత విభక్తి యుండునపుడు కొన్నింటి చివరి యక్షరములు లోపించును.

మూఁడు + గురు = మూఁగురు; నాలుగు + గురు = నలుగురు; ఎనిమిది + ండ్రు=ఎనమండ్రు. (ఇచట 'ది' అనుదానికిలోపము (౧౦౧-౯౮-వ) సూత్రములచే నకార మకారములమీఁది ఇకారమునకు అకారము) ఇట్లే తొమ్మిది + ండ్రు=తొమ్మండ్రు; ఇరువది + ండ్రు = ఇరువండ్రు; ముప్పది + ండ్రు = ముప్పండ్రు.

ఈ సూత్రములో 'అంత్యాక్షరంబునకు లోపంబు' అని చెప్పక 'అంత్యాక్షరంబులకు' అని బహువచనమును చెప్పుటవలన కొన్నియెడల అంత్యాక్షరమునకు సమీపమున నున్న (ఉపాంత్య) వర్ణమునకును లోపము కలుగు నని గ్రహింపవలెను. కావుననే 'ఎనుబది+ంద్రు' అనుచోట 'రు' కు ప్రక్కగా లెక్కకొంత దూరముగానున్నను 'ది' లోపించి 'ఎనబంద్రు' అయినది. అంత్యాక్షరములకు, ఉపాంత్యములకును లోపము కొన్నిచోట్లనే కలుగును. లోపము లేని చోట్లును గలవు. 'అయిదుగురు, ఆఱుగురు' మున్నగుచోట్ల 'దు, ఱు' లకు లోపము లేదు.

## ౯3. రు రవర్ణకంబులు పరంబులగునపుడు కొన్నింటికి నిత్యముగాను, గొన్నిటికి వైకల్పికముగాను బిందు పూర్వక డకారంబు పూర్వాగమం బగు.

ఉ. ఎనమండ్రు, ఎనమండ్రన్; తొమ్మండ్రు, తొమ్మండ్రన్; ఇరువండ్రు, ఇరువండ్రన్; ముప్పండ్రు, ముప్పండ్రన్; నలువండ్రు, నలువండ్రన్; ఏఁబండ్రు, ఏఁబండ్రన్; అఱువండ్రు, అఱువండ్రన్; డెబ్బండ్రు, డెబ్బండ్రన్; ఎనుబండ్రు, ఎనుబండ్రన్, తొంబండ్రు, తొంబండ్రన్ మొ. పెక్కండ్రు, పెక్కండ్రన్; పెక్కురు; పెక్కురన్; పదుండ్రు, పదుండ్రన్; పదురు, పదురన్; పదుగుండ్రు, పదుగుండ్రన్; పదుగురు, పదుగురన్; వాండ్రు, వాండ్రన్; వారు, వారిన్ మొ.

౯3. 'రు-ర' అను ప్రత్యయములు పరముగా నున్నపుడు కొన్ని సంఖ్యావాచకములకు నిత్యముగాను, కొన్నిటికి వికల్పముగాను 'ండ్' అనునది ఆగమముగా వచ్చును. ఇది రు ర లకు ముందుగా వచ్చును. 'ఎనమండ్రు-' ఇదివఱకే వివరింపఁబడినది. తక్కినవియు నిట్టే. బిందుపూర్వక డకారాగమము

'ఎనిమిది' మున్నగువానికి నిత్య మనియు, 'పెక్కు' మున్నగువానికి వికల్ప మనియుం గ్రహించునది.

## ౯౮. బిందుపూర్వక డకారంబు పరంబగుచోఁ దుది యిత్వో త్వంబుల కత్వం బగు.

ఉ. ఉక్తము.

౯౮. 'ండ్' అనునది పరముగా నున్నపుడు, శబ్దము చివర నున్న ఇకారమును, ఉకారమును అకారములుగా మాఱును. ఉదాహరణము లీవఱకే ౯౩-వ సూత్రమునసే ఈయఁబడిన వనుట 'ఉక్తము' అనుదానివలన తెలియుచున్నది.

'ఎనిమిది+ండ్+రు'=ఇచట ఇత్వమున కత్వము. (ది లోపము-మి-అత్వము—౧౦౧ - చే 'ని' ఇత్వమున కత్వము). 'ఎనమండ్రు' అగును. పెక్కు+ండ్+రు. 'క్కు' లోని ఉత్వమున కత్వము 'పెక్కండ్రు'

## ౯౯. కొండొకచో ఱుఱువర్ణకములు పరంబగునపుడును నత్వం బగు.

ఉ. చూపఱు, చూపఱిఁ గని.

౯౯. కొన్నిచోట్ల 'ఱు-ఱి' లు పరమగునప్పుడును వానిముందుండు ఇకార - ఉకారములకు అత్వమగును.

'చూచు+వారు=చూపు+వారు.' ఇచట అంతాదులకు 'వారు' పరంబగుచో 'వా' కు లోపంబును, 'రు-ర లకు ఱు-ఱి లాదేశంబు నగు' నను సూత్రముచే 'చూపు+ఱు' అని కాఁగా-నీ సూత్రముచే అత్వము,'చూపఱు. ఇట్లే 'చూపఱిన్' అనునదియును.

**౫౬. పలుశబ్దంబునకు రురలు పరంబు లగునపుడు గువర్ణంబును, వలయుచో మీఁద బిందుపూర్వక డకారంబును విభాష నగు.**

ఉ. పలుగురు, పలుగురన్; పలుగుండ్రు, పలుగుండ్రన్ మొ.

౫౬. 'పలు' అను శబ్దమునకుఁ దర్వాత 'రు-ర' అను ప్రత్యయము లున్నచో 'గు' అనునది చేరును; ఆ 'గు' కుఁ దర్వాత 'ండ్' అనునది వికల్పముగాఁ జేరుటయుఁ గలదు.

'గు' వచ్చినపుడు 'పలుగురు పలుగురన్-' అగును. దానికిఁ దర్వాత బిందుపూర్వకడకారము వచ్చినపుడు 'పలుగుండ్రు, పలుగుండ్రన్' అనియు నగును. గాక 'వ' కారాదేశ మగునపుడు 'పలువురు, పలువురన్, పలువుండ్రు, పలువుండ్రన్' అనియు నగును.

**౫౭. ఇరు రెండున కాదేశం బగు.**

ఉ. ఉక్తము.

౫౭. 'రెండు' అను శబ్దమునకు 'ఇరు' అనునది ఆదేశముగా వచ్చును. దీని యుదాహరణము ౫౧-వ సూత్రమునందే ఈయఁబడుటచే 'ఉక్తము.' అని యిట చెప్పఁబడినది. 'ఇరుగురు-ఇరుగురన్'-అని అక్కడ నుదాహృతములు: వీనిని 'ఇరువురు, ఇరువురన్' అనియుఁ జెప్పవచ్చును.

**౫౮. ఒకానొకచో నిరుగురున కిద్దఱాదేశం బగు.**

౫౮. కొన్ని యెడల 'ఇరుగురు' అనుటకు బదులుగా 'ఇద్దఱు' అనియుఁ జెప్పవచ్చు నని అభిప్రాయము. 'రెండు+గు+రు = ఇరుగురు, ఇరువురు, ఇద్దఱు.'

**౯౯. విభక్తి పరంబగుచో మూఁడు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగా నగు.**

ఉ. ముగురు (శేష ముక్తము.)

౯౯. విభక్తి పరమైయున్నపుడు - అనఁగా విభక్తికి ముందున్న 'మూఁడు నాలుగు' శబ్దముల దీర్ఘమునకు హ్రస్వము బహుళ మని యర్థము.

'మూఁడు+రు' (౯౧-వ సూ. చే 'గు'; ౯౨-వ సూ. చే అంత్యాక్షరలోపము మూ+గు+రు. ప్రకృతసూత్రముచే హ్రస్వము. 'ముగురు' ప్రకృతసూత్రముచే హ్రస్వముమాత్రము విధింపఁబడినది. తక్కిన ప్రక్రియ యిదివఱకే చెప్పఁబడిన దని 'శేష ముక్తము' (మిగిలిన దిదివఱకే చెప్పఁబడినది) అని వివరణమునఁ దెలుపఁబడినది. 'నాలుగు+గు+రు=నలుగురు' నిట్లే.

**౧౦౦. ప్రాప్తహ్రస్వంబు లగు మూఁడేలనీఁడి వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగ నగు.**

ఉ. ఉక్తము.

౧౦౦. ప్రాప్తహ్రస్వంబులు = హ్రస్వమును పొందినవి.

'మూఁడు, ఏ' అను శబ్దములు హ్రస్వమును పొందినపిదప, వానితర్వాత నున్న అక్షరములకు ద్విత్వము బహుళముగా నగు నని యర్థము. ఉదాహరణ మిదివఱకే చెప్పఁబడినందున 'ఉక్తము' అని వివరణమునఁ జెప్పఁబడెను. 'ము+గురు = ముగ్గురు-' 'ఎవఁడు - ఎవ్వఁడు.-'

'బాహుళకముచే 'నలుగురు' లో ద్విత్వము రాదు' అని కుమారదేవపండితీయము. సూత్రమున ద్విత్వము మూఁడేలకే విహితము; నాలుగునకు విధింపఁబడనే లేదు. కాన నయి వివరణము ప్రామాదికము.

### ౧౦౧. ఎనిమిది నివర్ణంబున కత్వం బగు.

ఉ. ఉక్తము.

౧౦౧. 'ఎనిమిది' అను పదములోని 'ని' అనుదానికి అత్వము వచ్చును. ౫౪-వ సూత్రము ననుసరించి 'ఎనిమిది' యందలి 'మి' లోని ఇకారమునకు అత్వము విధింపఁబడి 'ఎనమండ్రు' అని ఉదాహరింపఁబడినది. (చూ. ౫౧-వ సూ.) నకారముమీఁది యిత్వమున కత్వము ఇంతవఱకు విధింపఁబడ లేదు. కావున నిచట చెప్పఁబడుచున్నది ఈ యుదాహరణ మీవఱకే చెప్పఁబడినందున 'ఉక్తము' అని వివరణమునఁ జూపఁబడినది.

### ౧౦౨. పది యిత్వంబున కుత్వం బగు.

ఉ. ఉక్తము.

౧౦౨. 'పది' అను శబ్దములోని దకారముమీఁది ఇకారమునకు ఉకారమగు నని యర్థము. దీని కుదాహరణము పూర్వమే చెప్పఁబడిన దని 'ఉక్తము' అనునది తెలియఁజేయుచున్నది.

'పది+రు'-౫౧-వ సూ. చే 'గు' ఆగమము 'పది+గురు' ౫౨-వ సూత్రమునుబట్టి వచ్చు అంత్యాక్షరలోపము క్వాచిత్క మగుట నిచట రాలేదు. ప్రకృత సూత్రముచే ఇత్వమున కుత్వము వచ్చి 'పదుగురు' అయినది.

### ౧౦౩. కొన్నియెడల నవ కగు కానంబడియెడి

ఉ. 'క. విన నేడగు పర్వము మే,లనగా ద్రోణాభిషేక మాదిగఁ గల య,య్యెనిమిది పర్వములను న, త్యనుపమమై ద్రోణపర్వ మమరుఁ సభలన్.' భార. ఆది. ౧ ఆ. ౪౭. 'క. అనుపమబలులగు కర్ణా,ర్జునవీరుల శౌర్యమహిమ శోభిల్లంగా, నెనిమిదియగు పర్వంబిది, యనఁ బరఁగుం గర్ణపర్వ మతి

హ్మాద్యంబై.' భార. ఆది. ౧ ఆ. ౪౯. 'చ. పదియగు వేయి నిండుటయుఁ బం క్తిముఖుండు మనంబునన్ ముదం, బొదవఁగ నిర్వికారమున నున్న శిరంబును గోయఁ జూచినన్.' నిర్వ. 3 ఆ. ౬౭. (ఇట్టియెడల అవ యనియే యుండవచ్చును. అయి నను గ్రంథములయందుఁ బాఠ మి ట్లగపడుచున్నది.)

౧౦3. పూరణార్థకమగు 'అవ' అనుదానికి మాఱుగా 'అగు' అనునది కొన్నిచోట్ల కానవచ్చుచున్న దని సూత్రార్థము. ఇట్టి ప్రయోగములు మహా. భారతమునందును విశేషముగఁ గలవు.

'...ఏడగు పర్వము...' ఇచట 'ఏడవ పర్వ' మని యర్థము.

'...ఎనిమిది యగు పర్వంబిది...' ఇచట ఎనిమిదవ అని యర్థము. '...పదియగు వేయి నిండుటయు...' పదియవవేయి అని యర్థము.

ఉదాహరణములందు 'అగు' అనుదానికి బదులుగ 'అవ' అని దిద్దినను ఛందోయతిప్రాసముల కెట్టి భంగము కలుగదు. అయినను 'అగు' అనుపాఠమే పెక్కుచోట్లఁ గానవచ్చుచున్నందున దానినే గ్రహింపవలసి యున్నది. ఈ యంశమే మూలవివరణమునందుఁ దెలుపఁబడినది.

## ౧౦౪. మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్నియెడల సమహాత్కార్యంబు చూపట్టెడి.

ఉ. 'వ. ఇందుఁ బౌలోమకాలకేయు లను నసురు లఱు వదివే లుందురు.' భార. అర. ౪ ఆ. ౮౧. సీ...జనవంద్యు, డగు ధర్మ - తనయుని బంతి నిత్యంబు బసిఁడి, పళ్లెరంబులఁ గుడ్చు బ్రాహ్మణు లతిపుణ్యు లెనిమిదివేలు సమిద్ధమతులుఁ యతులు పదివేలు వారల కనుదినంబు, నన్నపానంబులందు సహాయ నగుదు.' భార. అర. ౫ ఆ. 3౦౬. 'వ. కనకభూషణా

లంకృతు లయిన పరిచారకులు నూఱువేలు.' భార. ఆర. ౫ ఆ ౩౦౭ 'సీ. వారాకరంబులో వటపత్రశయనులౌ నబ్జనాభులు నూఱు నైదుపదులు' కాశీ ౬ ఆ. ౨౩౧. సీ. మూఁడర్బుదములు సముదగ్రదోర్బుజాటోప విజయధౌరేయులు వీరభటులు.' జై. ౫. ఆ. ౧౭౪. 'ఉ. వేఁడివెలుఁగు లోలిఁ బదివేలసహస్రము లున్నభంగి నెవ్వాఁడు వెలుంగు నట్టి బుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూర్తియై' భోజ. ౪ ఆ. ౩౫౧. (కొన్నియెడల ననుటచే పదివేవురు, నూఱు నేఁబండ్రు (లేక) నూటయేఁబండ్రు అని యిట్లు మహత్స్త్రియుక్తరూపంబులుం గల వని యెఱుంగవలయును కడపటి యుదాహరణముల యందలి సంఖ్యావాచకములు తత్సమములు గాన వాని కట్టి రూపములు మూఁడర్బుదముల సంఖ్యలవారు, పదివేల సహస్రముల సంఖ్యలవారు అని యేర్పడుచున్నవి.)

౧౦౪. మహద్వాచకశబ్దములకు విశేషణములుగా నున్న సంఖ్యావాచకములు కొన్నిచోట్ల అమహద్వాచక కార్యములను బొందుచుండును.

'...అసురు లఱువదివే లుందురు' ఇచట విశేష్యము 'అసురులు.' విశేషణము 'అఱువదివేలు' అమహద్వాచకము; '...బ్రాహ్మణు లతిపుణ్యులెనిమిదివేలు...యతులు పదివేలు...' ఇచట 'బ్రాహ్మణులు, యతులు' విశేష్యములు మహద్వాచకములు; 'ఎనిమిది వేలు, పదివేలు' విశేషణము లమహద్వాచకములు. ఇట్లే '...పరిచారకులు నూఱువేలు...', '...అబ్జనాభులు నూఱు నైదుపదులు' 'మూఁడర్బుదములు...వీరభటులు' 'వేఁడివెలుంగులు...పదివేలసహస్రములు...' అను నెడలను గ్రహించునది.

'కొన్నియెడల' ననుటచే నీ సంఖ్యావిశేషణములు మహద్వాచకములుగా నుండు ననియుం దెలియుచున్నది. కాన 'పదివేవురు, నూఱునేఁబండ్రు' మున్నగురీతిని రూపంబు లగును.

**౧౦౫. ఔపవిభక్తికాంతంబు లగు చేయి నేయి లోనగు శబ్దంబుల యాద్యచ్చునకు హ్రస్వంబును, మీఁది హల్లునకు ద్విత్వంబును బ్రథమైకవచనంబునందు వైకల్పికంబుగ నగు.**

ఉ. చేయి, చెయి, చెయ్యి; నేయి, నెయి, నెయ్యి మొ. ఇతర స్థలంబులయందు - ఉ. చేతితోఁ. చేతికిఁ; నేతితోఁ, నేతికిఁ మొ.

౧౦౫. 'ఇ-టి-తి' ఔపవిభక్తికములు; అవి చివరఁ గలవి ఔపవిభక్తికాంతములు. 'చేయి, నేయి' మొదలగు శబ్దములు ఔపవిభక్తికాంతములు. అట్టి శబ్దముల మొదటి యచ్చులకు హ్రస్వమును, తరువాతి హల్లునకు ద్విత్వమును వికల్పముగాఁ బ్రథమైకవచనమునం దగును. 'చేయి - హ్రస్వము, ద్విత్వము) చెయ్యి (ద్విత్వము వికల్ప మగుటచే) 'చెయి' అని మూఁడు రూపము లగును. ఇట్లే - 'నేయి - నెయ్యి, నెయి.'

ఇట్లు హ్రస్వ, ద్విత్వములు ప్రథమైకవచనమునందుఁ దప్ప తక్కిన చోట్ల రావు. కావుననే 'చేతితోన్, చేతికిన్, నేతితోన్, నేతికిన్' అనునవి 'చెత్తితోన్, చెత్తికిన్, నెత్తితోన్, నెత్తికిన్' అనురీతిని కాని, చెతితోన్, చెతికిన్, నెతితోన్, నెతికిన్' అని గాని కాఁజాల వని గ్రహించునది.

కుమారదేవపండితీయమున '...ద్విరుక్తం బగు హల్లు పరంబగునపుడు అచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వం బగు' నను చాల. సమా. సూ. ౧౩ చే హ్రస్వము వచ్చును' గాన 'చేయి, చెయి, చెయ్యి' యను రూపత్రయమును సరసముగా సిద్ధించును' అని యిచ్చోట వ్రాయఁబడినది. ద్విత్వవిధాన మావశ్యకమై యున్నందున నీ సూత్రమును విధింపవలసివచ్చినది.

## ౧౦౬. ఊరుచోటు మేన్వాదులు స్లుగ్విషయంబులు.

ఊరు లోనగువానికిఁ దృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాన 'ఔపవిభక్తికనామ్నా మత్వం స్యా త్సప్తమీ తృతీయార్థే.' అను సూత్రమున కవి విషయములు గాక 'కేషాంచి దుదంతానాం నేతి విభక్తా వునో లుక్స్యాత్.' అను సూత్రమునకు విషయంబు లగుచున్న వని యెఱుంగవలయును.

౧౦౬. 'ఊరు, చోటు, మేను' మున్నగు శబ్దముల ఉకారముతోడి నకారమునకు ('ఉన్' కు) లోపము కలుగును; ఈ లోపము చింతామణియందలి 'కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునో లుక్ స్యాత్' (కొన్ని ఉకారాంత శబ్దములకు సప్తమీ విభక్తియందలి 'న' పరమగునపుడు 'ఉక్' లోపించును) అను సూత్రము ననుసరించి వచ్చినది; కాని 'ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' (ఔపవిభక్తికశబ్దములకు సప్తమ్యర్థమునందును, తృతీయార్థమునందును అత్వము వచ్చును) అను సూత్రమువలన రాలే దనియు నర్థము.

బాలవ్యాకరణమునందు చింతామణియందలి 'ఔపవిభక్తికనామ్నా' మను సూత్రము ననుసరించి 'ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగా నగు' నని సూత్రించి 'గోరను గీఱెఁ; ఊరనున్నాఁడు; గొడ్డట నఱికెను' మున్నగు నుదాహరణము లీయఁబడినవి. ఇచట 'ఊరన్' అనునపుడు సప్తమ్యర్థమే స్ఫురించును; తృతీయార్థమున కవకాశము లేదు; ఇట్లే 'చోటు, మేను' అనువానిని 'చోటన్' మేనన్' అని మార్పఁగా సప్తమ్యర్థమే వచ్చును; తృతీయార్థము రాదు; కాన నిట్టి నీ సూత్రమునకు విషయములు కా వనియు, వీనికి సూత్రాంతరమువలన నత్వము విధింపనగు ననియు నెంచి ప్రౌఢవ్యాకర్త 'కేషాంచి దుదన్తానా' మిత్యాది సూత్రము

ననుసరించి యిట్లు నిర్వచించెను. దీనింబట్టి 'ఊరు' మున్నగువానికి 'న' పరమగుచో ఉన్లోపము కలుగుటచే 'ఊరు+నన్ = ఊర్ (ఉన్)+అన్ = ఊరన్' అగును. ఇట్లే 'చోటు+నన్ = చోట్ (ఉన్)-అన్ = చోటన్' 'మేను+నన్=మేన్ (ఉన్) అన్=మేనన్' అగును.

బాలవ్యాకరణమునందలి 'ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగా నగు' నను సూత్రమునందలి బహుళగ్రహణముచేతనే ఊరు మున్నగువానికి తృతీయార్థతను వారింపనగు నని కుమార దేవపండితీయాదుల యభిప్రాయము. కాని 'ఊర నున్నాఁడు' అని యుదాహరించిన చిన్నయసూరి 'దీనికిఁ దృతీయార్థము లే' దని వ్రాయకుండుటయు, చోటు, మేనుల ప్రశంస యెత్తకుండుటను బట్టి యచటి 'బహుళ' పదమునకు మన యిచ్చవచ్చిన యర్థమును గ్రహింపక చిన్నయసూరి గ్రహించినట్లు వికల్పార్థమునే గ్రహించుట శ్రేయము.

## ౧౦౭. సద్రుతం బంతశబ్దంబు తన తమ పూర్వకంబు స్వాయమర్థకం బగు.

ఉ. తనయంత, తనంత; తమయంత, తమంత. 'చ. వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్ ?' స్వా. ౨ ఆ! ౬౬ మొ.

౧౦౭. సద్రుతం బంతశబ్దంబు=ద్రుతాంతమైన 'అంత' శబ్దము— 'అంతన్' అనునది; స్వాయమర్థకంబు=తనంత తాను అను నితర సాపేక్షారహితత్వము; 'తన, తమ' అను వానికంటెఁ బరముగా నున్న 'అంతన్' అనునది ఇతరాపేక్షారహితమగు స్వాయమర్థమును తెల్పును.

'తనయంత-తనంత-' 'తమయంత-తమంత'-'తనంతఁ దా వలచి...' ఇచట 'తనంత' స్వాయమర్థమునే తెల్పుచున్నది. 'ఇతరులు కోరకయే తనంతఁ దా వచ్చిన వనిత చులకన' యని యచటి యర్థముకదా !

**౧౦౮. షష్ఠ్యంత తదేతద్వ్యష్మదస్మదాత్మశబ్దపూర్వకంబు లగు ప్రథమాంత తదాదిశబ్దంబు లవధారణార్థకాంతంబులు తెఱచుగ స్వయమర్థకంబు లగు.**

ఉ. వానికి వాఁడె, వీనికి వీఁడె; నీకు నీవె, నాకు నేనె; తనకుఁ దానె, వారికి వారె మొ. తఱచుగ ననుటచే తను దాన, తారు దారె ఇత్యాదులు గ్రాహ్యములు. 'సీ. పౌర లెత్తి ఘనసార తరువులఁ దను దాన తొరఁగిన పచ్చకప్పురపు రజము.' స్వా. ౨ ఆ. ౫౫. 'క. తను దా నాపూర్ణ ప్రభల వెలయు.' పర. ౧ ఆ. ౨౨ మొ.

౧౦౮. షష్ఠ్యంత తదేతద్యుష్మదస్మదాత్మశబ్దములు = 'వానికి, దానికి-వీనికి, దీనికి - నీకు, నాకు, తనకు-' అనునవి; ప్రథమాంతత దాదిశబ్దంబులు= 'వాఁడు, అది-వీఁడు, ఇది-నీవు నేను తాను' అనునవి; అవధారణార్థకాంతంబులు=నిశ్చయార్థకశబ్దము, చివరఁ గలవి; 'వానికి, వీనికి మున్నగు షష్ఠ్యంత శబ్దములకుఁ దర్వాత వాఁడు, వీఁడు మున్నగు ప్రథమాంతశబ్దములు, తమ చివర అవధారణార్థములు కలవై 'వాఁడె, వీఁడె' మున్నగురీతి నుండునపుడు-అవి సాధారణముగా స్వయమర్థకము లయి యుండు' నని సూత్రార్థము.

'వానికి వాఁడె' అనఁగా 'వాఁడే స్వయముగా' అని యర్థము. ఇట్లే తక్కినవియును. 'పౌరలెత్తి ఘనసారతరువులఁ దనుదాన...' అనుచో 'తనంత తా' నని స్వయమర్థకము; 'తను దా నాపూర్ణ-' ఇచట అవధారణార్థకము లేదు.

**౧౦౯. కొన్నిమొడల షష్ఠ్యంత తదాదిశబ్ద పూర్వకంబులు గాకయు నవి స్వయమర్థకంబు లగు.**

ఉ. వాఁడే వచ్చెను - వాఁడు తనంత వచ్చె ననుట - ఇత్యాదు లెఱుంగునది.

౧౦౯. అవి = ప్రథమాంత తదాదిశబ్దములు; కొన్నిచోట్ల 'వాఁడు, వీఁడు' మున్నగు ప్రథమాంతశబ్దములకు ముందు షష్ఠ్యంతములగు 'వానికి, వీనికి' మున్నగునవి లేకున్నను, ఆ ప్రథమాంతము లవధారణార్థకములం గలిగి యున్నచో స్వాయమర్థకము లగును. ఉదా. స్పష్టము.

## ౧౧౦. షష్ఠ్యంత తదేతద్యుష్మ దస్మ దాత్మ శబ్ద పూర్వకం బంతట శబ్దంబు పృథగర్థకం బగు.

ఉ. వానియంతట వాఁ డున్నాఁడు మొ.

౧౧౦. 'అంతట' అనుదానికి ముందు షష్ఠ్యంతతదాదిశబ్దములు - అనఁగా 'వాని, వీని, నీ, నా, తన' అనునవి ఉండునపుడు—ఆ 'అంతట' శబ్దము 'వేఱైన' అను నర్థమును (ప్రత్యేకము నను నర్థమును) తెలుపును. ఇది సమాసమగునపుడే వచ్చును. ఉదాహరణము స్పష్టము.

## ౧౧౧. ఆదరార్థంబునం ద్విరుక్తి యగు.

ఉ. కృష్ణకృష్ణ, హరిహరి మొ.

౧౧౧. చెప్పినదానినే అవ్యవహితముగఁ దిరిగి యుచ్చరించుట ద్విరుక్తి యగును. (రెండు సారు లుచ్చరించుట ద్విరుక్తి యని యా శబ్దమున కర్థము.) ఏ యే యర్థములందు శబ్దములు ద్విరుక్తము లగునదియుం నీ సూత్రము మొదలు నాలుగు సూత్రములందు వివరింపఁబడుచున్నది. గౌరవము (మర్యాద) అర్థమగునపుడు శబ్దమునకు ద్విరుక్తి కలుగు నని సూత్రార్థము. 'కృష్ణకృష్ణ! హరిహరి!' అనుచో ఆదరము స్పష్టము.

## ౧౧౨. అత్యంతార్థంబునందు నగు.

ఉ. ఘోరాఘోర, కటకటా మొ కనికని, వినివిని మొ.

'తద్గుణౌఘముల్, విని విని.' కళా. ౬ ఆ. ౨౦౯ మొ.

౧౧౨. అత్యంతార్థ మనఁగా భృశార్థము- 'మిక్కిలి' అను నర్థము. ఆ యర్థమునందును శబ్దము ద్విరుక్తమగును. 'ఘోరాఘోర!' మున్నగునవి ఉదాహృతులు. 'తద్గుణౌఘములఁ విని విని' అనుచో మిక్కిలి-ఎక్కువగా విని' అని యర్థము. అట్లే 'ఘోరాఘోర!' అనునది మిక్కిలి యాశ్చర్యమును, 'కటకటా!' అనునది మిక్కిలి విచారమును 'కనికని' అనునది మిక్కిలిగాఁ జూచుటను తెలియఁజేయుచున్నవి.

## ౧౧౩. కొన్నియెడలం ద్వరితానాదరార్థంబుల రెంటను నగు.

ఉ. లేలెమ్ము, పోపొమ్ము మొ.

౧౧౩. కొన్నిచోట్ల తొందరపాటునందును, అనాదరమునందును— రెండర్థములందును ద్విరుక్తి యగును. 'లేలెమ్ము-' 'త్వరగా' 'లెమ్ము' అను నర్థమున ద్విరుక్తి. 'పోపొమ్ము' అనునెడ అనాదరార్థమునందు ద్విరుక్తి. లేదా- 'లేలెమ్ము' అనాదరమును దెలుపును; 'పోపొమ్ము' తొందరపాటును దెలుపును.' అనియుం జెప్పవచ్చును. కాఁగా పయి ఉదాహరణములు రెండర్థములను తెలుపును.

## ౧౧౪. కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబు లయి యదంతంబులు నగు.

ఉ. ఒండొండ, తరతరమ. (ఇట నర్థవిశేషము క్రమముగా ననుట.)

౧౧౪. కొన్నిశబ్దములు పయి యర్థములందే కాక విశేషమగు నర్థమునందును ద్విరుక్తము లగును. అనఁగా ద్విరుక్తి లేనపుడు ఉన్నయర్థముకంటె వేఱగు నర్థమును దెల్పునపుడు ద్విరుక్తము లగు ననుట. అట్టియెడ రెండవపదము అకారాంతమై యుండు నని యర్థము.

'ఒండొండ' ఇచట 'ఒండు' అనఁగా ఒకటి యని యర్థము. అయ్యది ద్విరుక్తమగునపుడు 'క్రమముగా' అను అర్థము వచ్చినది; మొత్తముపై

శబ్దము అకారాంత మయినది. ద్విరుక్తము కాని 'తర' శబ్దమునకు 'పురుషాంతరము' మున్నగునవి అర్థములు; ద్విరుక్తమయి ఆ శబ్దము 'క్రమముగా' అను నర్థము చెప్పుచు అకారాంతమై 'తరతరమ' అని మాఱినది.

౧౧౫. నామపదంబు లార్యాద్యర్థపరకంబు లయి వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకంబు లగు.

ఉ. 'ఆ. నన్ను నే కార్థసమవేతుఁ, బాడియయ్య ! యిట్టి పనికిఁ బనుప,' భార. ఆర. ౨ ఆ. ౩౬. 'అర్హమయ్య!' ఉ. హరి. ౬ ఆ. ౧౮౦ మొ.

౧౧౫. 'అయ్య' మున్నగునవి ఆర్యాద్యర్థకంబులు. నామపదములకుఁ బిదప 'అయ్య' మున్నగు పదములు చేరి, ప్రశ్నార్థకము లయి యున్నచో వ్యతిరేకార్థమును తెలుపు నని సూత్రార్థము.

'...పాడియయ్య !— న్యాయమా ? అని యర్థము - న్యాయము కా దని యభిప్రాయము. 'అర్హమయ్య!'-'తగునా?' తగదని వ్యతిరేకార్థము.

౧౧౬. నామసర్వనామంబులకును గళ లగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థవిశేష పాదపూరణంబులయందు నుశబ్దంబు తఱచుగ నగు. కళలగు ననుదంతశబ్దంబులమీఁద నయ్యది యువర్ణపూర్వకంబుగ విభాష నగు. మఱియు నది శేషషష్ఠియందు యొక్క_లోపించునపుడు లాగమాంత బహువచనంబు మీఁదను సముచ్చయమునం జూపట్టెడి.

లాగమాంత మనుట మీామాది పర్యుదాసార్థ మని గ్రహించునది.

ఉ. (౧) సముచ్చయమునందు నామపదములకు :— అన్నయుం దమ్ముండును, సతియుం బతియును, వాఁడును వీఁడును, చిన్నెయును వన్నెయును, నన్నును నిన్నును, తన చేతను, మనచేతను, భూరిదక్షిణామహాక్రతువులయు మొ. అవ్యయములకు—చెప్పకయుఁ జూపకయు. వేసియు వ్రేసియు మొ. (౨) అర్థవిశేషమందు నామపదములకు—'చ. పెం,పున జమదగ్నిసూనుఁడును బోలఁడు నిన్నని విందు వింటినే,ర్పున.' భార. ఆది. ౫ ఆ. ౨౨౨ 'శా. బానసమునం దిచ్చోటనే కాదు న,న్నేవీటఁ మిగులంగ నెవ్వఁడును లేఁ డే భంగులం జూచినఁ.' భార. విరా. ౧ ఆ. ౨౧౮. 'క. తన పూర్వతపః స్థానం, బని యనురాగమున బదరినంతయుఁ జూడఁ, మనమునఁ దలపోసి యొకం,డును మధ్యేరాత్రమునఁ గడుం గుతుకమునఁ. 'వ. అచ్చోట వసియింపం జని.' హరి. ఉ. ౫ ఆ. ౧౫౮. [1]క. ధీరమతు లిట్లుచేసిన, వా రెవ్వరుఁ గలరె ?' భార. ఆది. ౭ ఆ. ౨౪౭. 'చ. ఎంతయుం, దనరుఁ జళుక్యమన్మథుఁడు.' భార. ఆది. ౧ ఆ. ౫. 'చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి.' భార. ఉద్యో. 3 ఆ. ౫౨. క...'మెఱుఁగల విలాస విభ్రమలక్ష్ములల్, దక్కుటయును నొక యొఱపై, నెక్కొన.' స్వా. ౪ ఆ. ౬౯. మొ. అవ్యయములకు:—'సీ. అమృతాశనంబు సేయకయును దేవ! నా కజరామరత్వంబు నందుటయును.' భార. ఆది. ౨ఆ. ౧౦౭. 'క— 'పం క్తికంధరు నెట్లుం,జంపఁగఁ జాలక ,రోషము, పెంపునఁ గారాగృహామునఁ బెట్టఁగఁ బంచెఁ.' నిర్వ. ౭ ఆ. ౬౨. 'క. *వాటు

* పాటునన మూర్ఛవోయెం, బోటరి. పా.

వడి మూర్ఛవోయిం, బోటరి దైత్యుండు దెలిసి' ఉ. హరి. ౪ ఆ. ౨౩౫ మొ. (౩) పాదపూరణమునందు నామ పదములకు:—'అందఱుక్ వివశులై.' భార. ఆది ౫ ఆ. ౨౫౮. 'రేయిపగలు నిద్రయు [1]నెప్పుడెఱుఁగక.' భార. అర. ౧ ఆ. ౨౬. 'ఇవ్వీరుల కగు నభీష్ట [2]మిదియు మొదలుగాక్.' భార. ఆది. ౮ ఆ. ౫౯. చ. 'భాసిలుఁ దత్పురికోట మిక్కిలిక్, మహిమను.' కళా. ౧. ఆ ౮. 'ఎ. గీ. మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు'. స్వా. ౨ ఆ. ౯. 'విపంచి నిన్న మొదలుక్ నీ వంటమింజేసి.' స్వా. ౩ ఆ. ౫౭. మ. 'ఇమ్మిహికాహార్య మునం జరింతు మెప్పుడుక్.' స్వా. ౨ ఆ. ౪౫. ఇట్లు 'అంతయు పెద్దయు, తద్దయు' మొ. అవ్యయములకు—'ఆధారము లేకను.' (లేకను = లేకయును.) భార. ఆది. ౨ ఆ. ౧౪౨. 'ఊఱడకం దిగిచి' (ఊఱడకక్ = ఊఱడకయును) భార. ఆది. ౪ ఆ. ౧౯. 'ఎ-గీ. అనిలుఁ డను దూత వోయి తోడ్కొనియుఁ దెచ్చె.' భా. ఆది. ౩ ఆ. ౧౫౬. 'సీ. కమలాప్తుఁ [3]డుదయింపకయు మున్న బుటుకున-మునుఁగు సంగమతీర్థమునకు నేఁగి.' పాండు. ౫ ఆ. ౨౮౬. 'క ఏ నొకటి విన్నవించెద, దానవకులమథన! పెద్ద తడవుననుండిం, బూని వినిపింపఁగల పని.' ఉ. హరి. ౫ ఆ. ౨౯౩. మొ తఱచుగ ననుటచే నుశబ్దము కొన్నిటి కొక ప్పుడు వచ్చును. ఒకప్పుడు రా దని యర్థము గ్రహింపవలెను. దీని కుదాహరణములు: పాదపూరణమునందలివి. విభాష నను

1. నేర్పుసెఱుఁగక. పా.
2. మిది మొదలుంగాన్. పా. 3. ఉదయింపకయ. పా.

ట్టచే నుశబ్దము కొన్నియెడల యువర్ణపూర్వకముగానే వచ్చు ననియు, కొన్నియెడల యువర్ణపూర్వక మయ్యును, గాకయు వచ్చు ననియు నర్థము పరిగ్రహింపవలయును. యువర్ణపూర్వకముగానే వచ్చుటకు—ఉ అనుటయు మొ. యువర్ణపూర్వక మయ్యును గాకయు వచ్చుటకు—ఉ. 'సీ. ఎంతయు సంయమవంతుఁడు సహదేవుఁ డధ్యాత్మవిద్య నారాధ్యుఁ డెంత, నన ఘుండు ధౌమ్యుండు.' భార. సభా. ౫ ఆ. ౨౮౨. 'ఎ-గీ. తమ్మికొలను ప్రవేశించు తలిరుఁబోండ్ల, విలసనము లెంతనెంతయు వింతలయ్యె' కళా. ౬. ఆ. ౨౨౮. 'రగడ. చేటునకె యగుఁ జాలుచేఁ గలుగుమే లెంత.' స్వా. 3 ఆ. ౮౪. 'క. ఒక గృధ్ర *మెంతఁ బ్రియమున, నొక చర్మముఁ గఱచికొలుచు నుడు [1]పణమున రా.' భోజ. ౪ ఆ. ౨3. 'తే. అమరులెల్లను జల్లిరి [2] సుమము.' లెంత.' అధ్యా. బాల. కాం. ౧౪౨. 'సీ. నిమపునఁ దూర్పును బడమరనై రెండు, కడల నంభోనిధిఁ గదిసియుండు.' భార. భీష్మ. ౧ ఆ. ౨౧. 'లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే?' (కొమ్మన్ = కొమ్మయును.) వసు. 3 ఆ. ౧౭3. 'పురారిం జేర లేఁడు.' (పురారిన్ = పురారియును.) ఉ. హరి. ౬ ఆ. ౬౫. 'తప మిట్టిదిం గలదె' (ఇట్టిదిన్ = ఇట్టిదియును,) నిర్వ. ౫ ఆ. ౨౨ 'నీ వేమిని వేగిరపడక.' (ఏమిని = ఏమియును.) హరి పూ. ౮ ఆ. ౧౧౦. 'అల భీమనాథునకు [3]నప్పటియుం బ్రణమిల్లి' రుక్మాం. ౧ ఆ. 33. 'చ. వెజ్జిదిజె రోఁ, కలి దలఁజొట్టు

* మెండిపోయిన, యొక చర్మము. పా.

1. పథమున పా. 2. సుమము లెంతో. పా. 3. నర్పణతం. పా.

మన్న క్రియగా నొక కొందలు దాల్తు రప్పటికిఁ, గలుషపథ ప్రవర్తనమె.' కళా. ౨ ఆ. ౧౦౧. 'ఉ. ఓడ యొకింత యేనియు సుయోధను చిత్తమునందు లేదు.' భార. ఉద్యో. 3 ఆ. ౧౦౪. 'క. అమరఁగ జూదంబు నీకు [1]నభిమత మేనిన్.' భార. ఆర. ౨ ఆ. ౨౨౧. 'మఱిం, దెనుఁగుంగబ్బము లెన్ని యేనియును.' (మొదటిరూపము మఱియును.) ప్రభా. ౧ ఆ. ౬ 'ముక్తుండు వెండిఁ విపులఁ బొడమనీ.' (మొ. రూ. వెండి యును.) పాండు. 3 ఆ. ౧౨౮. మొ.

౧౦౬. (1) నామములయొక్కయుం, సర్వనామములయొక్కయుం, కళలగు నవ్యయములయొక్కయుఁ గడపట - సముచ్చయార్థమునందుఁగాని, లేదా ఏదేనొక విశేషార్థమును జెప్పునపుడుగాని, లేదా—ఏ యర్థము లేక కేవలము పాదపూర్తి చేయుంట కుపయోగించినపుడు గాని సామాన్యముగా 'ను' అను శబ్దము చేరుచుండును. (2) ఉకారాంతములు కాని కళల వయి, 'ను' గాని 'యుంను' అనునది గాని చేరుచుండును. (3) సంబంధార్థమును దెల్పు షష్ఠియందు 'యొక్క' లోపింపఁగా 'ల' చివర నుండు బహువచన ములవయి సముచ్చయార్థమునందు 'ను' కనఁబడుచున్నది అని సూత్రము నభిప్రాయము.

సూత్రమునందు 'లాగమాంతము' లనుట 'మీ, మా' మున్నగువానిని నిషేధించుటకొఱ కని గ్రహింపవలెను. 'మీ,మా'లు బహువచనమున వచ్చిన వయినను వానిమీఁద 'ను' రా దని యభిప్రాయము.

(1) సముచ్చయార్థమునందు ఉదంతములగు నామపదములకు 'ను' చేరుటకును, అనుదంతములకు 'యుంను' చేరుటకును ఉదాహరణములు— 'అన్నయుం, దమ్ముండును, సతియుం, బతియును...' వయిచోట్ల 'అన్న, సతి, పతి' అను ననుదంతములకు 'యుంను' 'తమ్ముండు' అను ఉదంతమునకు

1. నప్రియమేనిన్. పా.

'ను' వచ్చుట గ్రహింపఁదగును. వివరణమునందలి 'నామ' పదముచే సర్వ నామమును గ్రహింపవలెను. కావుననే 'వాఁడును, వీఁడును; తన చేతను, మన చేతను' అనునవి ఉదాహరణము లగును. 'చిన్నియును, పన్నియును' అను దంతముల కుదాహరణములు. 'భూరిదక్షిణమహాక్రతువులయును' అనునది 'భూరి... క్రతువులయొక్క' అను శేషష్ఠిలో యొక్క లోపించునపుడు సముచ్చయార్థమున 'ను' వచ్చుట కుదాహరణము: 'క్రతువుల' అనుదంత మగుటచే 'ను' కు ముందు 'యు' చేరిన దని యెఱుఁగవలెను.

(2) సముచ్చయార్థమునందు అవ్యయముల కుదాహరణములు— 'చెప్పకయుఁ, జూపకయు; ఏసియు; వ్రేసియు-' ఇచటి యవ్యయము లన్నియు అనుదంతము లగుటవలన 'యు' కూడఁ జేరినది.

(3) అర్థవిశేషమందు నామ, సర్వనామముల కుదాహృతులు— '...జమదగ్నిసూనుఁడును బోలఁడు...' 'మిగులంగ నెవ్వఁడును 'లేఁడు... ...యొకండును మర్త్యరాత్రమున...' 'ధీరమతు లిట్లు చేసినవా రెవ్వరుఁ గలరె?...' 'ఎంతయుం దనరు...' 'అనుటయుఁ బిన్ననవ్వు నగి' '... దక్కుటయును నొక యొఱపై ..' మయిచోట్ల వరుసగా 'సమానుఁడు, ఎవ్వఁడు, ఒకండు, ఎవ్వరు, ఎంత, అనుట, దక్కుట' అనునవి విశేషార్థమున న్వంతము లగుట గ్రహింపఁదగును.

(4) అర్థవిశేషమునం దవ్యయముల కుదాహరణములు—'అమృతాశ నంబు సేయకయును...' కంక్తికంధరు నెట్టుం జంపఁగఁజాలక...' '... మూర్ఛవోయిం బోటరి దైత్యుండు...' ఇట 'చేయకయును = చేయకుండఁ గనే (యును). 'ఎట్టున్ = ఏ విధముగా నైనను; మూర్ఛవోయిన్ = మూర్ఛ పోయియు' నను విశేషార్థమును. ఇందు 'మూర్ఛవోయిన్' అనుచో అను దంతముపయి 'యు' చేరకుండుట విశేషము. ఇచట 'మూర్ఛవోయెన్' అని, పాఠాంతరము కలదు. ఆ పాఠమునను సమన్వయము కుదురకపోదు; లేదా

'పాటువడి మూర్ఛవోయియు.' అని యున్న డసినను ఆనవచ్చును. కాన నియ్యుదాహరణము చింత్యము.

(5) పాదపూరణమున నామ, సర్వనామముల కుదాహృతులు—'అందఱున్ వివశులై' (అందఱు అనినఁ జాలును.) 'రేయిపగలు నిద్రయు నెప్ప డెఱుఁగక' నిద్ర యనినఁ జాలును.)

'...ఇదియు మొదలుగాన్' (ఇది మొదలుగా అనినఁ జాలును.) 'ఇది మొదలుంగాన్' అను పాఠమున 'మొదలుఁగాన్' అనినఁ జాలు ననియు, అప్పుడును 'ను' పాదపూరణార్థ మనియు నెఱుఁగునది. 'మిక్కిలిన్ మహిమను' ('మిక్కిలి' అనినఁ జాలు.) 'మున్ను ముచ్చిచ్చును విరాళిఁగొన్న చోటు.' (ఇచట 'ముచ్చిచ్చు' అనిన చాలు నని యభిప్రాయము. కాని 'ముచ్చిచ్చుకూడ విరాళిని గొన్న స్థల'మని విశేషార్థము నిట చెప్పవచ్చును.) 'విపంచి నిన్న మొదలున్...' '(మొదలు అనిన జాలును.) '...చరింతు మెపుడున్' (ఇచట 'ఎపుడు, చాలును.) 'అంతయుఁ, పెద్దయు, తద్దయు' అనునవి యువర్ణరహితము లయి యుండినం జాలును.

(6) అవ్యయములు పాదపూరకములైనపుడు 'ను, యును'లు చేరుట. కుదాహరణములు—'ఆధారము లేకను-' ఇచట 'లేక' యుండినఁ జాలును; 'లేక' అనుదంత మగుటచే 'యును' చేరవలసి యుండఁగా 'ను' ను మాత్రము చేర్చుట విశేషము. 'ఊరడకం దిగిచి' అనుచోట 'ఊరడక' అని యుండినఁ జాలును.

ఇచట 'ఊరడకయును' అనుటకు బదులుగా 'ఊరడకను' అనుట విశేషము. '...తోడ్కొనియుఁ దెచ్చె' ('తోడ్కొని' చాలును,) '...ఊదయింపకయు మున్న...' (ఊదయింపకమున్న' అనుటకు) '...పెద్దకడవుననుండిం బూని...' ('కడవుననుండి బూని' అనుటకు) ఇచట 'యు' రాకుండుట విశేషము.

'ను' అనునది తఱచుగ వచ్చునని సూత్రమునఁ జెప్పఁబడుటచే అది రానివియును గొన్ని కల వని గ్రహింపవలెను. అట్టివి పాదపూరణార్థమున నిచ్చిన యుదాహరణములలోఁ గొన్ని కల వని సూత్రకారుఁడే వివరించు చున్నాఁడు.

'ఇదియుం మొదలుగాన్, ఉదయింపకయుం మున్న' అనునవి 'ను' రామికిని, తక్కినవి 'ను' వచ్చుటకు నుదాహరణము లని యభిప్రాయము.

సూత్రమునందు 'కళ లగు ననుదంతశబ్దములమీఁద నయ్యాది యుంవర్ణ పూర్వకంబుగ విభాష నగు' నని 'విభాషను' గ్రహించుటచే అనుదంతములో 'యుం' రానివియుఁ గల వనియుఁ గొన్నియెడల 'యుం' వికల్పముగా వచ్చు ననియుం నర్థ మని గ్రహింపవలెను. ఈ యంశమే వివరణములోని 'విభాష' 'ననుటచే' మున్నగు వాక్యము వివరించుచున్నది.

'యుం' వికల్పముగా వచ్చుటకు ఉదాహృతులు—'ఎంతయుం...... ఎంత ననఘుండు' (ఇచట మొదటి 'ఎంత' కు యుం వచ్చి రెండవదానికి రాలేదు.) '...విలననము లెంత సొంతయుం వింతలయ్యె.' మొదటి 'ఎంత'కు యుం రాలేదు; రెండవదానికి వచ్చినది). 'చేటునకె...మే లెంత' [ఇచట 'యుం' రాలే దని యుదాహరింపఁబడినది; 'చూలుచేఁ గలుగు మేలు ఎంత యును చేటునకె యగు' నని యర్థమును గ్రహించి ప్రాథవ్యాకర్త దీని నుదహరించి యుండనోపును; కాని యిచట 'చేటునకే యగునట్టి చూలు వలనఁ గలుగు మే లేమాత్రము?' అనియే వ్యాఖ్యాత లందఱు నర్థము వ్రాసిరి. అట్లు కుదురుచుండఁగా ఇచట 'ఎంతయును' అను నర్థమున 'ఎంత' ప్రయోగింపఁబడిన దన నక్కఱలేదు.]

'ఒక గృధ్ర మెంతఁ బ్రియమున...' (ఇచట 'యుం' రాలేదు) ఇచట 'ఒక గృధ్ర మెండిపోయిన యొక చర్మము' నని పాఠము కలదు. దానిని గ్రహించినచో నిచట 'యుం' కుఁ బ్రసక్తి యుండదు. 'అమరులెల్లను జల్లిరి

సుమము లెంత' ('ఎంతయుం' నను అర్థమున) '...తూర్పును పడమరనై...' (పడమరయునై యనుటకు.) '...లేఁజిగురుఁగొమ్మం జేవ...' (లేఁజిగురుఁగొమ్మయును అనుటకు) 'పురారిన్ జేరలేఁడు' (పురారియును అనుటకు) 'తప మిట్టిదిన్ గలదె?' (ఇట్టిదియును అనుటకు) 'నీ వేమిని వేగిరపడక...' (ఏమియును అనుటకు) '...అల భీమసాధునకు నప్పటియుం బ్రణమిల్లి...' ('యుం' వచ్చుట కిది యుదాహృతి-'అప్పటియును=మఱియుం' నని యర్థము.) '...దాల్తు రప్పటిన్...' ('అప్పటి' కి 'యుం' రాని రూపము. ఇచ్చటను 'మఱియుం' ననియే అర్థము.) 'ఓట యొకింతయేనియుం సుయోధను-చిత్తమునందు లేదు' ఇచట 'ఒకింతయేనియుం' నని 'యుం' వచ్చినవి ) 'అమరఁగ 'జూదంబు నీకు నభిమత మేనిన్' (అచట 'ఏనియును' అనుటకు బదులు 'ఏనిన్' కలదు; 'యుం' రాలేదు.) 'మఱిం దెలుఁగుంగబ్బములు...' ఇచట 'యుం' రాలేదు; మఱియుం ననుటకు 'మఱిన్' వాడఁబడినది;) 'ముక్తుందు వెండిన్ విపులఁ బోడమనీ' (ఇచట 'వెండియును' అనుటకు బదులు 'వెండిన్' వాడఁబడినది.)

శేషషష్ఠియందు 'యొక్క' లోపించినపుడు లాగమాంత బహువచనంబుమీఁద సముచ్చయార్థమున 'ను' వర్ణము చూపట్టెడు ననుటకుఁ బ్రయోగము - 'వారివ ధమ్మిల్లభారావకలితది - వ్యామోదవనపుష్పదామములయుం' (భార. అది. 3 ప. ౧౯౬.) అనునది. దీనికి కుమారదేవపండితీయమున 'రెండు కడల సంభోనిధిఁ గదిసియుండు' నని యుదాహరింపఁబడినది. ఇది యుదాహరణము కాఁజాలదు. మఱియుం నీ పాఠము సరికాదు. 'నిడుపునఁ దూరుపుఁ బడమటలయి రెండు కడలు సంభోనిధిఁ గదిసియుండు' నని (భార. భీష్మ. అ. ౧. ప. ౨౧.) సరియగు పాఠము. ఇదియే శబ్దరత్నాకరమున గ్రహింపఁబడినది.

ఇది శబ్దపరిచ్ఛేదము.

---

# కారకపరిచ్ఛేదము

కర్మ మున్నగునవి కారకములు: వానింగూర్చి తెలియఁజేయుం భాగ మగుటచే నిది కారకపరిచ్ఛేద మనఁబడుచున్నది.

## ౧. కారకంబు లనం గర్త్రాదులు.

అవి యాఱు.—కర్మకారకము, కర్తృకారకము, కరణకారకము, సంప్రదానకారకము, అపాదానకారకము, అధికరణకారకము, క్రియాన్వయమును గలిగించునది-అనగాఁ గ్రియాన్వయము కలది యని కారకశబ్దార్థము.

౧. కర్మ మున్నగునవి కర్త్రాదులు. అవి కారకము లనఁబడును. అవి ఆఱు. ధాత్వర్థమగు ఫలమున కాశ్రయమగునది కర్మ; ధాత్వర్థవ్యాపారమున కాశ్రయము కర్త; క్రియాసిద్ధిని బ్రకృష్టోపకారక మగునది కరణము, త్యాగోద్దేశ్యము సంప్రదాయము; అపాయ, భయాదులందు వచ్చునది అపాదానము; ఔపశ్లేషికాద్యాధారము అధికరణము.

అనభిహిత కర్మయందు ద్వితీయ, అనభిహిత కర్తృకరణములయందు తృతీయ వచ్చును; కర్త్రాదు లభిహితము లగునపుడు ప్రథమ వచ్చును; సంప్రదానమున చతుర్థి, అపాదానమునఁ బంచమి, ఆధారమున సప్తమియు వచ్చును. షష్ఠీవిభక్తి కారకము కాఁజాలదు.

క్రియాన్వయము పొందునది-అనఁగా క్రియాన్వయము కలది కారకమని యర్థము. కర్తృ, కర్త్రాద్యర్థములం దా యా విభక్తులతోఁ గూడిన పదములు, కర్తృకర్త్రాదిరూపముల నా యా క్రియలతో సమన్వయించును. కావున క్రియాన్వయము నందు నవి యగును. లేదా—కర్తృకర్త్రాద్యర్థము

లందు విభక్తులు ప్రకృతులకుఁ జేరి, క్రియచేఁ జెప్పఁబడు వ్యాపారమును, వానికిఁ గర్తృత్వాదులఁగూర్చి క్రియాన్వయమును సుద్బోధించును గాన ఇవి క్రియాన్వయమును కలిగించున వగును. షష్ఠీవిభక్తి కెట్లును క్రియతో సంబంధము లేనందున నది కారకము కాఁజాలదు. 'రామునియొక్క ఇంటిని చూడుము' - అనుచోఁ గ్రియకును, 'రామునియొక్క' అను షష్ఠికిని ఎట్టి సంబంధము లేదుకదా!

ఇయ్యెడ కుమారదేవపండితీయమున 'అపాదానం బనఁగా ఔపశ్లేషిక, వైషయికాభివ్యాపకంబులని త్రివిధంబులగు నాధారము' అనుట ప్రామాదికము.

## ౨. ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱించియు ననుప్రయుక్తం బగు.

ఉ 'క. మముగుఱిచి నామగోత్ర, క్రమమున విూ రర్చ సేయఁగా.' హరి. పూ. ౨ ఆ. ౯౧. సముచ్చయగ్రహణము కూర్చి జ్ఞాపకార్థము.

౨. దేనింగూర్చి విధింపఁబడునో, అది యుద్దేశ్యము. అట్టి యుద్దేశార్థమునందు ద్వితీయావిభక్తికి తక్కిన ప్రత్యయములతోఁబాటు 'గుఱించి' అనునదియు, (ఆ ద్వితీయాప్రత్యయముల పిదప) ప్రయోగింపఁబడును. బాలవ్యాకరణమున ద్వితీయలో 'నువర్ణంబు ద్వితీయ' అని మాత్రము విధింపఁబడినది. చింతామణిలో 'కూర్చి - ల ను - నయో భవేద్ద్వితీయా' అని ద్వితీయలో 'కూర్చి' ప్రత్యయము చేర్పఁబడి, అది కర్మప్రవచనీయమున శబ్దము చివరఁ జేరు నని నియమింపఁబడినది. 'కూర్చి' కి మాఱుగా 'గుఱించి' అనియుఁ బ్రయోగములు కానవచ్చుచున్నందున తత్సాధనకై యీ సూత్ర మారంభింపఁబడినది.

'మము గుఱిచి...' అనుచోట 'మమ్ముద్దేశించి' అని యర్థము. ఇచట 'మము' ద్వితీయాంతము; దాని కనుప్రయుక్తముగా 'గుఱిచి' వచ్చినది. సూత్రమునందు 'గుఱించియుం' నని సముచ్చయము(యుం) గ్రహింపఁబడినది.

దీనింబట్టి 'కూర్చి' అనునదికూడ ఉద్దేశార్థమున వచ్చు నని భావము. దీని కుదాహరణము:—'నిన్నుకూర్చి యేతెంతు నీ వున్నకడకు' భార. శాంతి. 3 ఆ. 33౨.

## 3. అయ్యాది వ్యవహితంబు నగు.

ఉ. 'సీ. అబ్జాసనుఁడు తన్ను నర్థితో గుఱిచి యజించుట గోరి సృజించె సురల.' హరి. పూ. ౨ ఆ. ౯౮.

3 అయ్యాది = గుఱిచి యనునది. ఈ 'గుఱిచి' అనుదానికిని ద్వితీయాంతశబ్దమునకును నడుమ వేఱొకపదము చేరి వ్యవధాన ముండుంటయుం గల దని యర్థము. 'అబ్జాసనుఁడు తన్ను నర్థితో గుఱిచి...' ఇచట 'తన్నున్' అను ద్వితీయాంతమునకును, 'గుఱిచి' అనుదానికిని నడుమ 'అర్థితో' అను పదము చేరినది. దానివలన పై రెంటికిని వ్యవధాన మేర్పడినది.

## ౪. కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థక వర్ణకంబులకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు.

ఉ. ఏకవిప్రసంబోధనఁజేసి' భార. ఆది ౧ ఆ. ౧౨౪. 'అభీష్టవరంబు లిచ్చుటంజేసి.' భార. ఆర. ౨ ఆ. 'అసహ్యవిషోగ్రధూమకేతనహతిఁజేసి.' భార. ఆది. ౧ ఆ. ౧౨౩. 'బహువేద ఘోషములఁజేసి.' భార. ఆర. ౧ ఆ. ౧౧. 'సంప్రయోగమునఁజేసి,' 'దీననుజేసి.' భార. సభా. ౧ ఆ. ౫౪. 'తే. ఇందఱును నిన్నిభంగుల నిడుమ కుడువ, వలసె ధర్మతనూభవువలనఁ జేసి.' భార. విరా. ౨ ఆ. ౨౨౫. 'తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మయ్యెడు నని తెలియవలయు. ఈ యర్థ

మునకు 'ఇతరత్ర చ ద్వితీయా.' అను స్థాననియమ శూన్య విధియు నవకాశ మిచ్చుచున్నది.' ఉ. 'ఎ-గీ. తండ్రి, పనుపుఁ జేసి ముద్దిమి గొని జవ్వనం బిచ్చెఁ, బూరుఁ డను సుతుండు భూరియశుఁడు.' భార. ఆది. 3 ఆ. ౬౫. 'సీ. వెలఁబెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి దాశకన్యాకేళితప్పుఁజేసి' స్కా. ౨ ఆ. ౭౩. మొ. ఇట్లనుటచే 'ఇవ్విధము నాననముల్ గలవార.' నిర్వ. ౪ ఆ. ౮౭. (అనునిట్టి ప్రయోగములును నిర్దుష్టము లగుచున్నవి.)

౪. 'చేత' విభక్త్యర్థకవర్ణకంబు లనఁగా తృతీయార్థమున వచ్చిన ద్వితీయాప్రత్యయములు, (జడవాచకములకు) తృతీయార్థమున వచ్చిన ద్వితీయాప్రత్యయములకును, సామాన్యముగ నుండు 'వలన' వర్ణకంబునకును ప్రక్కను 'చేసి' అనునది తఱచుగాఁ జేరుచుండు నని సూత్రార్థము.

చిన్నయసూరి 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళముగా నగు'నని సూత్రించి యున్నాఁడు. అందు తృతీయార్థమున వచ్చు ద్వితీయకుఁ 'జేసి' అనుప్రయుక్త మగును; అట్లే జడాజడము లన్నింటికిని వచ్చు 'వలన' ప్రత్యయముప్రక్కను 'చేసి' చేరుచుండును. ఇట్లు చేరుట తఱచుగా నగును.

'పికవిప్రసంబోధనఁజేసి...' ఇచట 'సంబోధనన్-' అనఁగా 'సంబోధనచేత' అని యర్థము. 'సంబోధనఁజేసి' అనునదియు నా యర్థమునే తెల్పును. ఇట్లే 'ఇచ్చుటంజేసి = ఇచ్చుటచేత,' 'హాతిఁజేసి = హాతిచేత.' తక్కినవియు నీ విధముననే. '...ధర్మతనూభవువలనఁజేసి' అనఁగా ధర్మతనూభవువలన' అనియే యర్థము; ఇచట 'వలనకు' 'చేసి' అనుప్రయుక్తమైనది.

తృతీయార్థమున ద్వితీయ వచ్చు నని చెప్పిన చిన్నయసూరి తద్వివరణమున 'బాహుళకంబుచే నికార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు' నని తెలిపెను. కాన నుదంతముల కేకవచనమునందు తృతీయార్థమున

ద్వితీయ రా దని యాతని యాశయమైనట్లు స్పష్టము. కాని ఉకారాంతముల కును ఏకవచనమునందు తృతీయార్థమున ద్వితీయయు, అను ప్రయుక్తమగు 'చేసి' యుం గానవచ్చు చున్నందున తత్సిద్ధికొఱకు ఈసూత్రమున 'తఱచుగ' అని ప్రవేశపెట్టఁబడిన దని 'తఱచుగ ననుటచే-' మున్నగు వివరణమున కర్థము. ఈ వ్యాకర్త యిట్లు చెప్పుటకు చింతామణిలోని 'ఇతరత్ర చ ద్వితీయా' అను సూత్ర మవకాశమిచ్చుచున్నది. ఏల యన అచట 'ద్వితీయ తక్కినచోట్లఁగూడ వచ్చు నని చెప్పఁబడినది; కాని ఇట్టి చోట్ల వచ్చును; ఈ స్థానమున రాదు' అని నియమింపలేదు. కావుననే 'తండ్రిపంపుఁజేసి ..' మున్నగునవి కుదురుచున్నవి. 'పంపుఁజేసి=పంపుచేత' అని యర్థము. 'పంపు' ఉకారాంతము; ఏకవచనము; కాన దానికిని 'తృతీయార్థమున ద్వితీయయు, 'చేసి' యుం వచ్చినవి. '......తప్పుఁజేసి' అనఁగా '...తప్పుచేత' అని యర్థము. ద్వితీయ యితరస్థలములందును వచ్చు నని చింతామణికారుఁడు చెప్పుటచేతనే 'ఇవ్విధము నాననముల్ కలవారు అనుచో ప్రథమార్థమున నేకవచనమున ఉకారాంతమునకు ద్వితీయ వచ్చుట పొసఁగినది.

౫౭. అయ్యది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి.

ఉ. 'సీ. వలరాజు సచివులవడువున బెడఁగగు కర్కశ స్తనములఁ గరము వాఁడి, చూడ్కుల నతిరాగసురుచిరాధరముల మదవిలాసాలస మందగతుల, వక్త్రాలకంబుల వలుఁదపిఱుందుల దర్పగద్గదభాషితములఁజేసి.' భార. ఆది ౧ ఆ. ౭౮. (ఇటఁ జేతవిభక్త్యర్థక 'ల' వర్ణకముపై నెల్లెడల నుండవలసిన చేసి యొక్కచోటనే యున్నది.)

౫౭. అయ్యది = చేసి; ఈ 'చేసి' యను ననుప్రయుక్తము కొన్నియెడల పెక్కుచోట్లకు మాఱుగా నొక్కచోటనే వచ్చు ననియు, అదియే తక్కిన వానికిని ఆ యర్థమును కలుగఁజేయుననియుం నర్థము.

ఉదాహరణమునందలి 'కర్కశస్తనములఁ, గరము వాఁడి చూడ్కు-లు...' మున్నగువానికి 'కర్కశస్తనములఁజేసి, కరమువాఁడి చూడ్కులఁజేసి ...' అను నీ రీతిని 'చేసి' చేరవలసి యున్నది. అయినను అన్ని చోట్లను జేరక చివర మాత్రము 'గద్గదభాషితములఁజేసి' అను నొక్కచోటనే చేరినది. అట్లయినను అది తక్కినవానియెడను సమన్వయించుచున్నది.

## ౬. ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేకప్రయోగంబునుం జూపట్టెడి

ఉ 'తే. స్తంభగతరత్నపుత్త్రిక తనదు బోఁటి, యని విలోకించి తోడ మాటాడకునికి, నలుగడలు చూచి తెలిసి యచ్చెలువ బెదరి, వెడల *నుంకింపఁ జేసమ్మి యొడిసి పట్టె.' (తోడన్ = తనతోడ) రామా. ౪ ఆ. ౧౫౮.

౬. 'తోడ' అనునది 'తృతీయావిభక్తిప్రత్యయము. ప్రత్యయము లెప్పుడును ప్రాతిపదికల చివరఁ జేరియే ప్రయోగింపఁబడుచుండును. వానికి ప్రత్యేక ప్రయోగార్హత లేదు. అయినను 'తోడ' అనుదానికి మాత్రము ప్రకృతితో సంబంధములేక ప్రత్యేకముగాఁ బ్రయోగము కనఁబడుచున్నదని భావము. '...తోడ మాటాడకునికి' అనుచోట 'తోడ' ననఁగా 'తనతోడ' అని యర్థము. ఆ యర్థమున 'తోడ' అనునది ప్రయుక్తము. 'కూర్చి, తోడ, వలన-' మున్నగు ప్రత్యయములు 'కూర్చు, తోడు, వలను' మున్నగువాని వలన చేర్పడిన రూపము లనియుఁ, దొలుత నవి ప్రకృతులుగానే యుండి క్రమముగ ప్రత్యయములైన వనియుం భాషాతత్త్వశాస్త్రజ్ఞుల సిద్ధాంతము. ఆ సిద్ధాంతమునుబట్టియుం 'తోడ' మున్నగువానికి ప్రత్యేక ప్రయోగార్హత కల దని తోఁచుచున్నది.

---

*నూహింపఁ జేదమ్మి. పా.

**౭. కొన్నియెడల సుశబ్దప్రయోగమునం దోడకు లోపం బును, వ్యవహితత్వంబును బహుత్వంబునం గానం బడియెడి.**

ఉ. 'ఎ. గీ. అతనికిఁ బరలోక, విధుల శాస్త్రదృష్టి వెలయఁజేసె, నాపగాతనూజుఁ డఖిలబాంధవులయు, బ్రాహ్మణు లయుఁ దోడ భానునిభుఁడు.' భార. ఆది. ౪ ఆ. ౨౧౫. 'క. నెమ్మిని ధర్మజు నలువురు, దమ్ములుఁ దమ వస్త్రములయుఁ దమ శస్త్రవరూథమ్ములతోడను సకలహితమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్.' భార. సభా. ౨ ఆ. ౨౯౧. మొ.

౭. సముచ్చయార్థము మున్నగునర్థములందు వచ్చు 'సు' చేరునపుడు శబ్దము చివర నుండు 'తోడ' లోపించుట కొన్నియెడలఁ గలదు. శబ్దము చివర 'సు' చేరునపుడు కొన్నిచోట్ల 'తోడ' శబ్దముతో వ్యవధానము పొందుట కలదు. ఇట్లు జరుగుట బహువచనమునందే కానవచ్చుచున్న దని సూత్రమున కర్థము.

'...ఆపగాతనూజుఁ డఖిలబాంధవులయు బ్రాహ్మణులయుఁదోడ...' 'బాంధవులయు' ననునపుడు 'సు' ప్రయోగమున 'తోడ' లోపించినది. (ఇచట 'బాంధవుల' అని అనుదంతమగుటచే 'సు' కు ముందు 'యు' చేరిన దని గ్రహింపవలెను.)

'బ్రాహ్మణులయుఁదోడ' అనునపుడు 'సు' ప్రయోగమున 'తోడ' వ్యవహితమైన దని తెలిసికొనవలెను. '...తమ వస్త్రములయుఁ దమ శస్త్ర వరూథమ్ములతోడను...' అనుచోడ 'సు' ప్రయోగమున 'వస్త్రముల' మీఁది 'తోడ' కు లోపము.

'సుశబ్దవిరహితముగను నిట్టి ప్రయోగ మున్న దని యిచట కుమారదేవ పండితీయమున వ్రాయఁబడినది. దానికి 'అధికుల హీనులతోడనైన గొఱగా

దధిపా! (ఉద్యో. ౨ ఆ. ౪౬.) అని యుదాహరింపఁబడినది. 'చేసి' వలె నిదియుఁ బెక్కుచోట్ల కొక్క 'తోడ' అగు నని గ్రహించుట లెస్స.

**౮. ఒకానొకచోఁ దోడకుఁ దోడుత యని రూపాంతరంబును గలదు; అయినను దానికివలె దీని కితర కార్యంబు గలుగదు.**

ఉ. 'చ. పగతురచేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే?' భాగ. ౧౦. స్కం. పూ. ౧౭౫౬. మొ.

౮. 'తోడ' కు బదులుగా 'తోడుత' అనునది కొన్నిచోట్లఁ బ్రయోగింపఁబడుచుండు ననియు, 'తోడ' కు వచ్చు లోపము, వ్యవహితముగా నుండుట మున్నగు నితరకార్యములు మాత్రము 'తోడుత' కు రా వనియు నర్థము '...ప్రాణముతోడుత...' అనఁగా 'ప్రాణముతోడ' అని అర్థము.

**౯. చతుర్థికిం బొంటెవర్ణకంబు నగు**

ఉ. 'క. అనఘుల శాస్త్రవిధిజ్ఞుల, ననురక్తులఁ బితృపితామహక్రమమున వచ్చిన విప్రుల మంత్రులఁ గా, నొనరించితె కార్యసంప్రయోగముపొంటెన్?' భార. సభా. ౧ ఆ. ౨౬. పక్షమునఁ గార్యసంప్రయోగముకొఱకు మొ.

౯. చతుర్థీవిభక్తియందు 'పొంటె' అను ప్రత్యయము కూడ వచ్చు నని సూత్రార్థము. బాలవ్యాకరణమునందు 'కొఱకు, కయి, ప్రత్యయములు వచ్చు నని చెప్పఁబడఁగా నీ సూత్రము 'పొంటె' అనునదియు వచ్చు నని బాలవ్యాకరణమును సవరించుచున్నది. '—కార్యసంప్రయోగముపొంటెన్' అనఁగా 'కార్యసంప్రయోగముకొఱ' కని యర్థము. ఈ 'పొంటె' రానపుడు 'కొఱకు' వచ్చు నని వివరణము, 'పక్షమున...' మున్నగు వాక్యమువఁ దెలుపుచున్నది.

## ౧౦. ఉండిపదంబు పరంబగుచో వలన కందువర్ణకమట్లు నవర్ణకంబు నగు.

ఉ. 'క......సనత్కుమారుఁడు మహీశ! జనుదెంచె బ్రహ్మలోకంబుననుండి.' భార. ఆది. 3 ఆ. ౯౧. పొ.

౧౦. 'ఉండి' అను శబ్దము పరముగా నున్నపుడు 'వలన' అను పంచమీవిభక్తి ప్రత్యయమునకు 'న' అను సప్తమీవర్ణకము చేరుచుండును. 'అందు' అనునది మాత్రము 'వలన' కుఁ బదులుఁ జేరుట కలదు; దానివలెనే 'న' కూడ రావచ్చు నని యర్థము.

'...చనుదెంచె బ్రహ్మలోకంబుననుండి' అనుచోట 'ఉండి' పరమగునపుడు 'వలన' స్థానమున 'న' వచ్చినది. 'న' రానపుడు బ్రహ్మలోకంబువలన నుండి, బ్రహ్మలోకంబందుండి, 'బ్రహ్మలోకంబునందుండి' అనియుం నుండవచ్చును.

బాలవ్యాకరణమున 'ఉండిశబ్దము పరంబగునపుడు 'వలన'కు ద్వితీయాసప్తములు ప్రాయికముగా నగు'నని సూత్రించినను, సప్తమిలో 'అందు' నకు మాత్ర ముదాహరణముల నిచ్చి 'న' కు ఇచ్చుట మానివేయఁబడెను. కాన 'న' తోడి ప్రయోగము లసాధువు లను భ్రాంతి కలుగవచ్చును. ఇట్టి భ్రాంతిని తొలఁగించుటకయి యీ సూత్రము వ్రాయఁబడినది.

## ౧౧. వలన కాదేశంబులగు ద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు.

ఉ. ద్వితీయమీఁది యుండికి—'క. విచ్చేయు మదితిగర్భముఁ, జెచ్చెర వెలువడుము మహాత్మ!' భాగ. ౮ స్కం. ౫౦౪. పొ.—సప్తమిమీఁది యుండికి—'ఆ. రక్తంబు, వదనగహ్వరమున వెడలవాలు.' భాగ. ౧౦ స్కం. పూ. ౧౩౬౩. 'స్త్రీ

ఉడుపథంబున జాలు నుడుపప్రతతిభాతి మెడ హారముల పెన పుడమిఁ దాఁక.' పాండు. ౫ ఆ. ౨౬౭. 'నూతిలో, వెలువడఁ గోమలిం దిగిచె.' భార. ఆది. 3 ఆ. ౧౪౪. 'క. నలుఁ దొల్లి యాక్రమించిన, కలి కర్కోటకవిషంబుఁ గ్రక్కుచు నొడలన్, వెలువడి.' భార. అర. ౨ ఆ. ౧౭౮. 'ఉ. హెచ్చిన సంభ్రమంబున ననేకులు బ్రద్దలవార లెక్కడన్, వచ్చిరొ యిమ్మెడి రా కొలువువారి,' కళా. ౨ ఆ. ౭౦. మొ. (గర్భమున్=గర్భము నుండి, ఎక్కడన్ = ఎక్కడనుండి. ఇట్లింతట నూహ్యంబులు.) బహుళగ్రహణముచే 'నందు' మీఁది యుండికి లోపంబు కలుగ దని యెఱుంగునది. ఈ సూత్రము నిట్లు చెప్పుటకు నంద్వితర సప్తమ్యర్థక వర్ణకంబులమీఁది యుండికి లోపంబు వచ్చుట ప్రయోజనంబు.

౧౦. 'వలన' అను పంచమీవిభక్తిస్థానమున వచ్చిన ద్వితీయకుఁగాని, సప్తమికిఁగాని పరముగా నున్న 'ఉండి' పదము లోపించిన లోపింపవచ్చు నని యర్థము.

'ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయా, సప్తములు ప్రాయికముగా నగు' నను బాలవ్యాకరణసూత్రము ననుసరించి ద్వితీయయు, సప్తమియు 'వలన'కు ఆదేశముగా వచ్చును. అట్టి ద్వితీయాసప్తములకుఁ బిదపఁ గల 'ఉండి' అను పదము బహుళముగా లోపించును.

ద్వితీయమీఁది యుండి లోపించుట కుదాహరణము.— '...అదితి గర్భముఁ జెచ్చెఱ వెలువడు మహాత్మ !—' (అదితిగర్భమునుండి యని యర్థము). సప్తమిమీఁది యుండి లోపించుట కుదాహరణములు—'రక్తంబు వదనగహ్వరమున వఱదవాఱ—' (వదనగహ్వరముననుండి యని యర్థము.)

'...మెడ హారములపెన...' (మెడనుండి హారములపెన యని యర్థము.) నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె.' అనుచోట 'నూతిలోనుండి' అని యర్థము. [ఇయ్యెడ 'నూతిలో' అనునది సప్తమ్యంత మను నభిప్రాయమున నీ యుదాహరణ మీయఁబడినట్లు తోఁచుచున్నది. కాని 'లో, లోపల'లు షష్ఠీ ప్రత్యయము లనియే వ్యాకరణములందుఁ గలదు. ఈ వ్యాకర్త యయినను 'లోపల' సప్తమ్యర్థమున వచ్చు నని చెప్పి యుండలేదు. సప్తమిలోని యుండి లోపించుటకుఁ గాక, షష్ఠికి 'ఉండి' ని విధించి, అది లోపించుటయుం గల దని యీ యుదాహరణము నిచ్చిన మేలై యుండెడిది.] '...ఒడలన్' వెలఁవడి—' 'ఒడలినుండి' యని యర్థము. '...ఎక్కడన్, వచ్చిరొ...' (ఎక్కడనుండి వచ్చిరో యని యర్థము.)

సూత్రమునందు 'బహుళము' అని చెప్పుటవలన కొన్నిచోట్ల 'ఉండి' లోపింప దని తెలిసికొననగును. కాఁగా పంచమ్యర్థమున వచ్చిన 'అందు'అను దానితర్వాతి 'ఉండి' కి లోపము రా దనియుం, 'న' వర్ణకమునకుఁ బైనున్న దానికే లోపము వచ్చుననియుం గ్రహింపవలెను. 'అందు' కంటె నితరము లగు సప్తమీ ప్రత్యయములు ముందుగా నున్నపుడే 'ఉండి' లోపించు ననుట యీ సూత్రమునకుఁ బ్రయోజన మని మూలకారుని యభిప్రాయము. కాన సప్తమిమీఁద = అంద్వితరసప్తమ్యర్థకవర్ణంబులమీఁద' అని యర్థము చేసికొనవలసి యున్నది.

## ౧౨. కొన్నియెడల హేతువునం దన్నంత క్రియలమీఁదను బట్టి వర్ణకంబు విభాష నగు.

ఉ. 'తే. బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవసరమున, నెట్టు సమకూరు వీరికి నీప్రభావ, మీవు గలుగంగఁబట్టిగా కిందువదన,' కాశీ. 3 ఆ. ౨౨. పక్షంబునఁ గలుగుటంబట్టి మెం.

౧౨. 'అన్' అనునది చివరియందుఁ జేరు క్రియలు అన్నంత క్రియలు. కొన్నిచోట్ల హేత్వర్థమునందు అన్నంత క్రియలమీఁదఁగూడ 'పట్టి' అను ప్రత్యయ మగును.

'పట్టివర్ణకంబు హేతువులగు గుణ క్రియల కగు' నని బాలవ్యాకరణ సూత్రము. ఆ సూత్రమున కీయఁబడిన క్రియల యుదాహరణములలో నన్నియుం భావార్థకటవర్ణకాంతములే ఉండుటంబట్టి అన్నంత క్రియలపయి 'పట్టి' వర్ణకము రాదేమో యను భ్రాంతి కలుగుచున్నది. తన్నివారణార్థ మీ సూత్రము చెప్పఁబడుచున్నది.

'...ఈవు కలుగంగఁబట్టిగా కిందువదన-' ఇచట 'పట్టి' వర్ణకము 'కలిగిన హేతువున' అను నర్థమునందు అన్నంత క్రియ యగు 'కలుగంగ' అనుదానిపయి వచ్చినది. ఇది రానపుడు 'కలుగుటంబట్టి' అనియుం నుండు నని వివరణమే తెలుపుచున్నది.

**౧౩. షష్ఠీస్థానికం బగు కువర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ ద త్తదర్థంబులం జూపట్టెడి.**

ఉ. ద్వితీయకు—వేఁటకుఁ బోయిరి, పొలముల కేఁగెను. పక్షంబున 'వేఁటఁ [1]బోయిరి' భార. ఆర ౬ ఆ. ౧౫౮. 'అవ్విభుండు [2]పొల మేఁగెను,' వి. పు. ౭ ఆ. ౨౬౧. మొ. ఇట నొకా నొకచోఁ గొఱకు కయివర్ణకంబులు నయ్యెడి, ఉ. 'చ. అతఁ డొక నాఁడు వేఁటకొఱకై తను నేలినవారు వేడ్కతోఁ, బోతముగఁ బైన మాటఁ గని.' భల్లా. 3 ఆ. 'అడవికి వేఁటకై యరిగి.' పాండు. ౫ ఆ. ౧౮. 'చ. చిరముగ బ్రహ్మకుం దపముచేసి.' భార. ఆది. ౨ ఆ. ౧౩౮. పక్షంబున బ్రహ్మనుగూర్చి తపముచేసి

---

1. వేఁట వోయిరి. పా. 2. అవ్విభుం, డే పొలమేఁగెనో. పా.

ము. తృతీయకు—'క. లోకోత్తరచరితుం డగు, నా కావ్య తనూజ నీకు నారాధ్యను.' భార. ఆది. 3 ఆ. ౧౩౫. 'ఆసురుల కును బూజనీయులు.' హరి. పూ. ౨ ఆ. ౬౦. ము. పక్షమున నీచే నారాధ్యను ము. 'చ. అరిమదభేది నీకు విషమాజిముఖంబుల మార్కొనంగ నో, పరు నరు లెవ్వరుఁ హరి కిభంబులు మార్కొనునయ్య!' భార. ఆ. ౪ ఆర. ౮౮. 'అంగపతి కెదిరించెన్.' కళా. ౮ ఆ. ౬౫ ము. పక్షమున నీతో మార్కొన నోపరు, హరితో మార్కొనునయ్య, అంగపతితో నెదిరించెఁ; (ఇట అర్థభేదము విశేషము) పంచమికి—'క. విలువిద్య నీకు నొరు ల, గ్గలముగ లేకుండ.' భార. ఆది. ౫ ఆ. ౨౪౫. పక్షమున నీకంటె నగ్గలముగ. (అగ్గలము—ఇది అన్యార్థాదిగణ గణ్యం బని యెఱుంగవలయు.) సప్తమికి—'కోమలి నీ కనురక్త.' భార. ఆర. ౨ ఆ. ౨౧౬. పక్షమున నీయం దనురక్త. 'శా. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే ?' స్వా. ౨ ఆ. ౬౪. పక్షమున నీయందుఁ దక్క. 'ఆ. అహివిషంబుచేత ననయంబు దగ్ధుండ, నైతి నింక నాకు *ననఘ! సైపు' భార. ఆర. ౨ ఆ. ౧౭౯ ము. పక్షమున 'నావిషయమున సైపు.' చతుర్థికి నుదాహరణంబులు పూర్వవ్యాకరణంబులం జూచునది.

౧౩. షష్ఠీస్థానికంబు=షష్ఠీవిభక్తిస్థానమునందు వచ్చినది; ద్వితీయాది విభక్తులకు మాఱుగా, ద్వితీయాదులు వచ్చునట్టి యర్థమునందు షష్ఠియందు వచ్చెడి 'కు' వర్ణకము కొన్ని యెడలఁ గానవచ్చుచున్న దని సూత్రార్థము. అనఁగా కొన్నిచోట్ల కువర్ణకాంతపద మున్నను, అది ద్వితీయాది విభక్తుల యర్థమును దెలుపు నని భావము.

---

*నలుగవలదు. పా.

'కు' ద్వితీయకు మాఱుగా వచ్చుట కుదాహరణములు.—వేఁటకుఁ బోయిరి; పొలమున కేఁగెను.' ఇచట 'వేఁటంగూర్చి పోయిరి; పొలముం గూర్చి యేఁగెను' అని అర్థము. పక్షంబున = 'కు' రాసవు దనుట. 'ఆ విభుండు పొలఁమేఁగెను-' (ఇచటి ప్రథమ ద్వితీయార్థమున వచ్చినది గాన, నీ యుదాహరణము ద్వితీయావిభక్తి కీయఁబడినది.) 'పొలమేఁగెను' = 'పొలముంగుఱించి యేఁగె' నని యర్థము. ఇట = ద్వితీయార్థమున; ద్వితీయార్థమునఁ గొన్నిచోట్ల 'కొఱకు, కయి' అను చతుర్థీవిభక్తిప్రత్యయములును వచ్చు నని యభిప్రాయము. '...వేఁటకొఱకై ..' '...వేఁటకై' అనుచోట్ల 'కొఱకు, కై' అనునవి 'వేఁటంగూర్చి' అను ద్వితీయార్థమున వచ్చినవి.

'...బ్రహ్మకుం దపము చేసి ..' (బ్రహ్మంగూర్చి తపముచేసి యని యర్థము.)

తృతీయకు మాఱుగా 'కు' వచ్చుట కుదాహరణములు.— 'నీకు నారాధ్యుఁడు' (నీచే నారాధ్యుఁ డని యర్థము.) 'అసురులకును బూజనీయులు' (అసురులచేతను బూజనీయు లని యర్థము.) '...నీకు విషమాజిముఖంబున మార్కొనంగ నోపరు నరు లెవ్వరున్,' మారి కిభంబులు మార్కొనునయ్య' ('...నీతో విషమాజిముఖంబున మార్కొనంగనోపరు నరు లెవ్వరున్ - మారితో నిభంబులు మార్కొనునయ్య' అని యర్థము;) 'అంగపతి కెదిరించెన్' (అంగపతితో నెదిరించెన్ అని యర్థము.)

ఇట అర్థభేదము విశేషము:—'కు' వచ్చినపుడు ఒక యర్థము వచ్చుననియు, తో, తోడలు వచ్చినచో వేఱొక యర్థము వచ్చుననియుం నీ వాక్యమున కభిప్రాయము. 'కు' వచ్చినపుడు నీపైకి వచ్చుటకు పగవారికి సాధ్యము కా దనురీతి నర్థము వచ్చును. 'తో' వచ్చినపుడు 'నీవు శత్రువుల పైకిఁ బోఁగా ఎదుట నిలుచుటకు వారికి సాధ్యము కా దను నర్థము గ్రాహ్యము. ఇ ట్టర్థభేదములను గ్రహించునది.

చతుర్థ్యర్థమున 'కు' వచ్చుట కిందు ఉదాహరణము లీయఁబడలేదు. అయ్యవి బాలవ్యాకరణముననే ఉన్నందున నీ వ్యాకర్త వాని నుపేక్షించి యుండవలెను. 'జనకుండు రామునకుం గన్యనిచ్చెను.' (రామునికొఱకని యర్థము.) 'పురుషార్థంబునకు యత్నింపవలయు' (పురుషార్థముకొఱ కని యర్థము.) పైవి రెండును చతుర్థి కుదాహృతులు. 'కు' ప్రత్యయము పంచమ్యర్థమున వచ్చుట కుదాహృతి- '...నీ, కగ్గలముగ...' (నీకంటె నని యర్థము.) 'కు' రానపుడు 'కంటె' అనునదియుం వచ్చును. [బాలవ్యాకరణమున 'కంటెవర్ణకం బస్యార్థాదియోగజం బగు పంచమి కగు. అన్యము, ఇతరము, పూర్వము, పరము ఉత్తరము ఇత్యాదు లన్యాదులు' అని చెప్పఁబడినది. ఇచట 'అగ్గలము' అను నర్థమున పంచమి వచ్చుట యెట్లని ప్రశ్న కలుగవచ్చును. కాని అన్యార్థాదులు ఆకృతిగణమగుటవలన-అచటి 'ఇత్యాదులు' అను పదముచే 'అగ్గలము' ను కూడ గ్రహింపవలసి యున్నది. ఈ యంశయే 'అగ్గలము-ఇది అన్యార్థాది గణగణ్యం బని యెఱుంగవలయు' నని వివరణమునఁ జెప్పఁబడినది.]

సప్తమ్యర్థమునందు 'కు' వచ్చుటకు- 'కోమలి నీ కనురక్త' (నీయందనురక్త యని అర్థము.) 'ఈ పాండిత్యము నీకుఁ దక్కమఱి యొందేఁ గంటిమే' (నీయందుఁదక్క మఱియొందేఁ గంటిమే అని యర్థము) '...నాకు ననఘ! సైపు' (నావిషయమున అని యర్థము) పూర్వవ్యాకరణములన్ = బాలవ్యాకరణాదులందు నని యర్థము అయ్యవి యిదివఱకే చూపఁబడినవి.

## ౧౮. వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకం బగు.

ఉ. వీప్సయందు—'మ్రాని మ్రానికి నరిగి యరిగి, యడుగు' భార. ఆర. ౨ ఆ. ౯౮. 'ఇండ్లిండ్లకు' కళా. ౭ ఆ. ౫౯. మొ. కాలపరిమితియందు—'క. కొండొక సేపునకుఁ దెలిసి.' హరి. ఉ. ౧ ఆ. ౧౩౨. 'క. నెట్టన వర్షావధికిం, బెట్టం

గల యప్పనములు పెట్టియు.' వి. పు. ౭ ఆ. ౧౦౪. 'ఎ-గీ. అలిగి పార్థునిశిర మాఱునెలల కుర్విఁ, ద్రెళ్ళ శపియించి దేవి యదృశ్య యయ్యె.' జై. ౪ ఆ. ౭౪ పె.

౧౪. ఒకటివెనుక నొకటి వ్యాపింప నిచ్చు వీప్స; అట్టి వీప్స యర్థమగు నపుడును, కాలపరిమితియందును నామములకుఁ జివర 'కు' వచ్చును. 'మ్రాని మ్రానికిన్, ఇంట్లింట్లకు' మున్నగునవి యందాహారణములు. 'కొండొక నేపునకున్, వర్షావధికిన్, ఆఱునెలలకున్-' అనునవి కాలపరిమితి కుదాహరణములు.

"బాల-లోని 'ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' నను సూత్రముచే 'మ్రానికిన్ మ్రానికిన్' అని యున్నప్పుడు విభక్తి లోపము రాఁగా 'మ్రానిమ్రానికిన్' అను రూపము సిద్ధించుచునే యున్నది. కావున నీ సూత్రము పిష్టపేషణము." అని కుమారదేవపండితీయకారు లియ్యెడ వ్రాసిరి. కాని బాలవ్యాకరణసూత్రము సంధివిషయకము; ఇచటి సూత్రము విభక్త్యర్థవిషయకము. 'కు' ఎక్కడ వచ్చునదియు నీ సూత్రము తెలియఁజేయుచుండఁగా 'పిష్టపేషణ' మనుట విచార్యము. అందే మఱియు నిట 'కాలపరిమితి యందలి క్వాగమమునకును బాల యందలి బాహుళకముచే గ్రహణము గల్గును.' అని వ్రాయఁబడినది. పయిదాని యభిప్రాయము బోధపడదు. బాలవ్యాకరణమున 'కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు' నని మాత్రమున్నది. క్వాగమమునకుఁ గాని, బాహుళకమునకుఁ గాని యట ప్రసక్తి లేదు.

**౧౫. ధాతుజవిశేషణ భావార్థకపూర్వావ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు.**

ఉ. (౧ లో ౧.) ధాతుజ విశేషణపూర్వ వ్యవహిత కర్తృపద ప్రథమకు.—'వ. బాహుకు రథంబుగడపు నేర్పున కచ్చెరువడి.' భార. అర. ౨ ఆ. ౧౭౦. 'తన మునుపడ్డ బన్న

ములు' భార. ఉద్యో. 3 ఆ. ౧౦౨. 'చ. కని తనయున్ను గన్నటులు గామికి విస్మయవారిరాశిలో, మునుఁగుచు.' హరి. ఉ. ౬ ఆ. ౧౧౨. 'నాయెునర్పం బూనిన కళాపూర్ణోదయంబు.' కళా. ౧ ఆ. ౧౦౫. (౧ లో ౨, ధాతుజవిశేషణపూర్వావ్యవహిత కర్తృపదప్రథమకు- 'అన్నలభూపాలకు పోయినవలను.' భార. ఆది. ౨ ఆ. ౧౮౯. 'వ. వానిపన్నిన వృషభగోమయ భక్షణంబు చేసి.' భార. ఆది. ౧ ఆ. ౯3. 'తే. ఎఱుకగలఁడేని మఱి శక్తుఁడేని నన్య, లన్యులకు హింస గావించునపుడు దానిఁ బూని వారింపకున్న నప్పురుషుఁ డేఁగు, హింసచేసినవారల యేఁగుగతికి.' భార. ఆది. ౭ ఆ. ౧౪౫. 'వ. అపార పారావారపర్యంతమహీతలంబునందు నా చూడని రాజు లెవ్వరును లేరు.' భార. ఆర. ౨ ఆ. ౧౯. 'తే. ఆ జరత్కారుఁ గని చెప్పుమయ్య వాని, నెఱుఁగుదేని మాపడియెడు నీయవస్థ' భార. ఆది ౨ ఆ ౧౪౪. 'వ. నీచేయు వేదన నన్నుం దాఁకనోపదు.' భార ఆది. ౨ ఆ. ౧౦౮. 'సీ. హంసచేఁ దన వినినంతకంటెను రూపవిభవాతిశయముల వెలుఁగుదాని'. భార. ఆర. ౨ ఆ. 3౯. (౨ లో ౧). భావార్థక పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు —[1]వ. మన పుట్టి బుద్ధి యెఱుఁగుట మొదలు.' హరి. పూ. ౫ ఆ. (౨లో౨) భావార్థకపూర్వావ్యవహితకర్తృపద ప్రథమకు.—'క. పరీక్షి, జనపాలుచనుటఁ గృశుఁ డను, మునివలన నెఱింగి.' భార. ఆది. ౨ ఆ. ౧౬౯ మొ. తెలుచుగ ననుటచే బాహుకుండు రథంబు గడపు నేర్పునకు' ఇత్యాదు లెఱుంగునది. 'క. మేము పఠింపని శాస్త్రమువలె మాపఠింపని శ్రుతులేఁ?' అను. ౬ ఆ. 3౨ మొ.

౧౫. ధాతువువలన ఏర్పడు విశేషణము ధాతుజవిశేషణము. 'ట' చివర వచ్చునది భావార్థకము; కర్త్రర్థమును దెలుపు పదముమీఁది ప్రథమ కర్తృపద ప్రథమ. నాలుగు విధములుగా నుండు కర్తృపదప్రథమలకు తఱచుగా షష్ఠీ విభక్తియందలి 'యొక్క' వర్ణకము వచ్చును. ఆ నాలుగును-

(1) ధాతుజవిశేషణపూర్వవ్యవహితకర్తృపదప్రథమ=ధాతుజ విశేషణమునకు ముందుండి, ఆ విశేషణముతోఁ గొంత వ్యవధానము కలిగి యుండునది-అనఁగా ఆ విశేషణమునకుఁ గొంత దూరముగా నుండునది యనుట.

ఉదా:—'బాహుకు రథంబు గడపు నేర్పున కచ్చెరువడి' ఇచట 'గడపు' ధాతుజవిశేషణము; దానికి ముందుఁ గల కర్తృపదప్రథమ 'బాహుకుఁడు.' విశేషణమునకును, ప్రథమకును నడుమ 'రథంబు' అను పదముతో వ్యవధాన మున్నది. కాన, ప్రథమకు 'యొక్క' వచ్చినది; అది ౧౬-వ సూత్రముచే లోపించినందున 'బాహుకు' అని మాత్రము కానవచ్చుచున్నది.

'తన మునుపడ్డ బన్నములు' ఇచట 'పడ్డ' విశేషణము; 'తాను' కర్తృపదప్రథమకు 'ముసు' అను పదముతో వ్యవధాన మున్నది; కాన షష్ఠిలోని 'యొక్క' వచ్చినది. 'తన మునుపడ్డ బన్నములు, అయినది. 'తన మున్ను గన్నటులు' ఇచటను 'తాను' కు 'తన' అని 'యొక్క' షష్ఠి. 'నా యొనర్పం బూనిన' (నేను-అనుదానికి యొక్కషష్ఠి వచ్చి 'నా' అయినది.)

(2) ధాతుజవిశేషణ పూర్వావ్యవహితప్రథమ - ధాతుజవిశేషణమునకు ముందుండి, ఆ విశేషణముతో నేమాత్రపు వ్యవధానము లేక (అవ్యవహిత పూర్వమైయుండు) ప్రథమ. ఉదా:—'అన్నలభూపాలకు పోయినవలను...' (ఇచట 'పోయిన' విశేషణము. దాని కవ్యవహితముగా ముందు కర్తృపదప్రథమ 'నలభూపాలకుండు' అని యుండుటచే, అది యొక్కషష్ఠిని పొంది, ౧౬-వ సూ. చే అది లోపించి 'నలభూపాలకు' అయినది. 'వాని పన్నిన వృషభ గోమయభక్షణంబు చేసి' (పన్నిన-విశేషణము. వాఁడు - అవ్యహితపూర్వకర్తృపద ప్రథమ. దానికి యొక్కషష్ఠి వచ్చి యది

లోపించి 'వాని' అయినది.) '...హింస చేసినవారల యేఁగుగతికి' (ఏఁగు - విశేషణము; హింస చేసినవారలు అవ్యవహితపూర్వకర్తృపదప్రథమ. దీనికి 'యొక్క'షష్ఠి వచ్చి, అది సమాసమున లోపించి 'వారల' అయినది.) ఇయ్యెడ కుమారదేవపండితీయమున 'వారల యేఁగు గతికి' నను భారతోదాహరణమున తచ్ఛబ్దాంత్యోత్తును అవధారణార్థకముగ 'గతి' కనుచోట నన్వయించుకోవల సినదానింగా స్థైతము కొననగును.' అని వ్రాయఁబడినది. కాని 'హింసచేయం వార లేఁగుగతికే యేఁగు' ననుట సమన్వయపద్ధతి. అవధారణము వివక్షిత మగుచో నది 'గతికి' అనుచోట 'గతికే' అనియే యుండుట యుచితము. కాన 'వారల' అనునది షష్ఠ్యంతమే యననగును. '...నా చూడనిరాజు లెవ్వరును లేరు' (నేను చూడని రాజు లెవ్వరును లే రని యర్థము. ఇచటి 'నేను' ధాతుజవిశేషణపూర్వావ్యవహిత కర్తృపద ప్రథమ; కాన దానికి 'యొక్క'షష్ఠి వచ్చి ౧౬-వ సూత్రముచే అది లోపించి 'నా' మిగిలినది.) '...మా పడిరెడు నీ యవస్థ...' (మేము-పడిరెడు నీ యవస్థ యని యర్థము. దీనిని వెనుకటివలెనే గ్రహించునది.) 'నీ చేయుం వేదన...' (నీవు చేయుం వేదన యని యర్థము) '...తన వినినంతకంటెను...' (తాను విని నంతకంటెను అని యర్థము. ఇట 'వినిన' విశేషణము. 'తన' కర్తృపదప్రథ మకు వచ్చిన యొక్కషష్ఠి లోపింపఁగా మిగిలిన రూపము.)

(౩) భావార్థక పూర్వవ్యవహిత కర్తృపదప్రథమ=భావార్థకమునకు ముందుండి, కొన్ని పదములతోడి వ్యవధానము కలిగిన కర్తృపదప్రథమ ఉదా:—'మన పుట్టి బుద్ధి యెఱుఁగుట మొదలు' (ఇచట 'ఎఱుఁగుట భావార్థ కము; దానికి ముందున్న కర్తృపదము 'మనము.' దానికిని, భావార్థకమునకును నడుమ 'పుట్టి బుద్ధి' అను పదములు చేరి వ్యవధాన మేర్పడినది. కాన నిచటి 'మనము' అను ప్రథమకు 'యొక్క'షష్ఠి వచ్చి, యది (౧౬-వ సూ.) లోపించి 'మన' అని మిగిలినది.)

(1) భావార్థకపూర్వావ్యవహిత కర్తృపదప్రథమ=భావార్థకమునకు ముందుండి ఇతర పదములతోడి వ్యవధానము లేక యుండు కర్తృపదప్రథమ. ఉదా.—'పరీక్షిజ్జనపాలు చనుట కృశుఁడను...' (ఇచట 'చనుట' భావార్థకము. దానికి అవ్యవహితముగ పూర్వమున నున్న కర్తృపదము 'పరీక్షిజ్జనపాలుఁడు.' దానికి 'యొక్క' షష్ఠి వచ్చి (౧౬-వ సూ. చే) లోపించి 'పరీక్షిజ్జనపాలు' అయినది. ఈ సూత్రమునందు 'తఱచుగ' ననుటచే యొక్కషష్ఠి రాక ప్రథమ యుండు రూపములును కల వని గ్రహించునది. 'మేము పఠింపని శాస్త్రములే?...' ఇచట ధాతుజవిశేషణమునకు ముందున్న కర్తృపదము ప్రథమాంతముగానే యుండుట గమనింపఁదగును.

## ౧౬. యొక్కకు లోపంబు బహుళంబు.

ఉ. 'ఉ. *ఇమ్ముగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశుబిం, బమ్మున నుద్భవం బయిన భారతవాగమృతంబు కర్ణరం, ధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదురు.' భార. ఆది. ౧ ఆ. 22. 'ధర్మజు నలువురు దమ్ములు' భార సభా. ౨ ఆ ౨౬౧. 'తే. ఇరుల గెలిచిన యంతఃపురేందుముఖుల, కురులు మరుఁడను వేఁటకాఁడురులు వేసి, మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని, సరులు లేని దృక్ఖంజనశాబకములు.' నై. 3 ఆ. ౯౦. 'సీ. వారివ ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద వనపుష్పదామములయు.' భార. ఆది. 3 ఆ. ౧౫౬. (వారివ = వారివేఁరైన. ఇక్కడ నిది షష్ఠ్యంతమునకు విశేషణము గనుక ప్రథమ.) 'ఎ-గీ. అపుడు సమ్మెటకోలల యంకుశముల, చేఁబకోలల వ్రేటుల. (సమ్మెటకోలలయొక్కయు, అంకుశములయొక్కయు, చేఁబకోలలయొక్కయు వ్రేటులచేత నని యర్థము. ఇట అంకుశ

* ఇంబుగ... జంబున... ధ్రంబను... పా.

ములవ్రేటుల ననఁగా లక్షణచేఁ బోటుల నని యెఱుంగునది.)
భార. ద్రోణ. 3 ఆ ౪౮. 'క. నరగోమృగసింహంబుల, కరుణము
లగు రోగవేగకలితాక్రోశ, స్వరములు పెక్కయ్యె.' హరి.
పూ. ౬ ఆ. ౪౯. 'క. తాతల తండ్రుల తరమున, నేతెంచిన
వృత్తి దక్క.' విజ్ఞా. వ్య. ౫౦. బహుళగ్రహణముచే 'ధాతుజ
విశేషణ భావార్థకముల ముందటి కర్తృపదంబులయొక్కకు
నిత్యంబుగ లోపం బని యెఱుంగవలయును.

౧౬. 'యొక్క' అను షష్ఠీవిభక్తిప్రత్యయమునకు లోపము కనఁబడు చున్న దని యర్థము. సమాసమగునపుడు విభక్తిప్రత్యయములు లోపించుట ఎట్టును సహజము. కాని వ్యస్తములగు పదములచివర నుండు 'యొక్క' ప్రత్యయము లోపించిన ప్రయోగములు కానవచ్చుటచే వానిని సాధింప నీ సూత్ర మారంభింపఁబడినది.

'...ఎవ్వనియేని ముఖామృతాంశుబింబమ్మున-' (ఇచట ఎవ్వని యొక్క యేని అని అర్థము. ఇచట 'యొక్క' లోపించినది) 'ధర్మజు నలువురు తమ్ములు' (ధర్మజునియొక్క నలువురు తమ్ము లని యర్థము.)

'...మనుజవిభుని సరులు లేని దృక్కంజనశాలకముల' (మనుజవిభుని యొక్క సరులులేని - అని యర్థము.) 'వారివ ధమ్మిల్లభారావకలిత...' (వారి యొక్క ధమ్మిల్లభారావకలిత...అని యర్థము.) ఇచట 'వారివ-' అనుచోట షష్ఠి యెట్లు వచ్చినదియుఁ వివరణమున 'ఇక్కడ నిది షష్ఠ్యంతమ్మునకు విశేషణము గనుక ప్రథమ'అని చెప్పఁబడుచున్నది.ఈపరిచ్ఛేదమునందలి'ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని ప్రథమ చూపట్టెడి' (సూ. ౨౧) అను సూత్రముచే షష్ఠ్యర్థమునఁ బ్రథమ వచ్చె నని భావము.

'అపుడు సమ్మెటకోలల యంకుశముల చేఱుకోలల వ్రేటుల' (సమ్మెట కోలలయొక్కయుం, అంకుశములయొక్కయుం, చేఱుకోలలయొక్కయు వ్రేటుల

చేత నని అర్థము.) ఇచట 'ప్రేటు' లనునది కోలలు మున్నగువానివిషయమునఁ గుదురును గాని 'అంకుశము' లనుదానికిఁ గుదుర దనియుం, అంకుశముయొక్క పోటు లగును గాని, ప్రేటులు కావనియు సందేహము కలుగవచ్చును; ఇచట లక్షణావ్యాపారమున 'ప్రేటు'లనుదానికి పోటులు' అను నర్థమును గ్రహించిన సమన్వయము కుదురును. ఈ యంశమే వివరణమున 'ఇట అంకుశములప్రేటు లనఁగా లక్షణచేఁ బోటు లని యెఱుంగునది' అనుదానిచేఁ జెప్పఁబడినది.

'నరగోమృగసింహంబుల కరుణములగు...' (నరగోమృగసింహంబుల యొక్క కరుణములగు...' అని యర్థము.) 'తాతల తండ్రుల తరమున...' (తాతలయొక్కయు తండ్రులయొక్కయు తరమున అని యర్థము.)

ఈ సూత్రమున 'లోపము బహుళ' మని చెప్పఁబడినది; కావున నీ లోపము కొన్నిచోట్ల నిత్యముగను, కొన్నిచోట్ల వికల్పముగను వచ్చు నని యర్థము. ఈ సూత్రమున నుదాహరించిన యుదాహరణములలో యొక్కకు లోపము వికల్పము; ౧౫-వ సూత్రముచేత ప్రథమార్థమున విధింపఁబడిన యొక్కషష్ఠికి మాత్రము లోపము నిత్యముగా నగును.

## ౧౭. ఒక్కచో నుదంతం బగు నజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి.

ఉ. 'ఉ. ఏపునఁ గిట్టి యేనుఁగున నేనుఁగు వైచుచు రాజి వాజిచే, రూపడఁగంగ మోఁదుచును.' రా. యు. కా. ౭౭. (దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు.)

౧౭. కొన్నిచోట్ల హ్రస్వమగు ఉకారము, చివరయందుఁ గల శబ్దములు జడవాచకములు కాకున్నను, వాని తృతీయయందును 'న' వర్ణకము కనఁబడుచున్నదని యర్థము.

బాలవ్యాకరణమునందు 'ఉకారాంత జడంబునకు నవర్ణకంబగు' నని శష్ఠమియందు 'న' విధింపఁబడినది. ఉకారాంతమగు అజడమునకు తృతీయా

విభక్తియందుఁ గూడ సవర్ణకము కానవచ్చుటచే ఈ సూత్రము విధింపఁ బడినది.

'...ఏనుఁగున సేనుఁగు వైచుచు' అనఁగా 'ఏనుఁగుతో ఏనుఁగును వైచుచు' నని యర్థము. ఇట్టి ప్రయోగములు మిక్కిలి విరళముగా నుండు నని 'దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు' అను వచనముచేఁ దెలియఁ జేయఁబడుచున్నది.

## ౧౮. కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి.

ఉ. తృతీయకు—'ఎ-గీ. అతని దోర్మధ్యసరసి నోలాడుచున్న, ఘనతర స్తనచక్రవాకముల నలరు, నంబ నసురేంద్రకూఁతు-రింపారఁ గనియె.' హరి. ఉ. ౭ ఆ. ౭౦. సప్తమికి—'ఎ-గీ. బలిమిఁగొనిన ధనము పదివేల *యొంటెలఁ, బెఱిగి రాఁగ వైరిభీకరుండు, వచ్చె నకులుఁడు.' భార. సభా. ౧ ఆ. ౨౬౭. 'మనుజుల విప్పిండు.' (చూ. శబ్ద. ౬౨ సూ. ఉ.) భార. శాంతి. ౧ ఆ. ౭౧ మొ.

౧౮. కొన్నిచోట్ల జడవాచకములు కాని శబ్దములకును, తృతీయా, సప్తమీవిభక్తుల బహువచనమునందు ద్వితీయావిభక్తి కానవచ్చుచున్న దని యర్థము.

బాలవ్యాకరణమునందు 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' నని చెప్పఁబడినది. కాని జడభిన్నములగు శబ్దములకుఁ గూడ తృతీయాసప్తమ్యర్థములందు బహువచనమునందు ద్వితీయ కానవచ్చుటచే నీ సూత్రమును వ్రాయవలసి వచ్చినది.

* లొట్టియల్ పెఱిగి.

తృతీయ కుదాహృతి '...ఘనతరస్తనచక్రవాకముల నలరు...' (ఘనతరస్తనచక్రవాకములచే నలరు నని తృతీయార్థమునందు ద్వితీయ వచ్చినది; చక్రవాకములు జడభిన్నములు.)

సప్తమి కుదాహరణము:—'...పదివేలయొంటెలఁ బెఱికి రాఁగ...' (పదివేలయొంటెలయం దని యర్థము.)

ఇచట 'పదివేల లొట్టియల్ పెఱిగి రాఁగ' అని పాఠము కలదు. అపుడు పదివేలయొంటెలు, ఆ ధనమును మోసికొని వచ్చె నని యర్థము. "పెఱికి రాఁగ' అను ముద్రితపాఠమున అర్థము పొసఁగదు.

'మనుజుల విప్రిందు' (మనుజులయందు విప్రిం దని యర్థము.) ఈ యుందాహరణము శబ్దపరిచ్ఛేదమునందలి ౬౨-వసూత్రమున నుదాహరింపఁ బడియున్న దని "(చూ. శబ్ద. ౬౨. సూ.)' అను వివరణము తెలుపుచున్నది.

## ౧౯. కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానంబడియెడి.

ఉ. 'చ. అనిలజవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱిం, చిన పరికాఁడువో లెఁ గురుసింహావరూథము నిట్లు క్రమ్మఱిం, చునె?' భార. ఆది. ౪ ఆ. ౨౦౫. 'తన వారణేంద్ర ముక్కురుకులవీరుమీఁద నెసకొల్పిన.' భార. ఆర. ౬ ఆ. ౨౨౭. 'తత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁబంపుచుఁ౯.' జై. ౫ ఆ. ౧౭౩. మొ.

౧౯. జడవాచకము కాని శబ్దముయొక్క ద్వితీయకును గొన్నియెడల ప్రథమ కానవచ్చుచున్న దని యర్థము.

బాలవ్యాకరణమునందు 'జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' నని చెప్పఁబడినది. అజడముల ద్వితీయకును ప్రథమ వచ్చుట మహాకవి

ప్రయోగము లంబట్టి స్పష్టపడుటచే నట్టివానిని సిద్ధింపఁజేయ నీ సూత్రము వ్రాయఁబడినది.

'అనిల జవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱించిన పరి కాఁడు వోలె...' (అనిల జవంబునం బఱచు నమ్మదనాగమును ఎదిర్చి క్రమ్మఱించిన పరికాఁడువోలె అని యర్థము.) ఇట 'మదనాగము అజడము. దాని ద్వితీయకును ప్రథమ వచ్చినది. 'తన వారణేంద్ర మక్కురుకులవీరు మీఁద...' (తన వారణేంద్రమును అని యర్థము. ఇచటను అజడము ద్వితీయకుఁ బ్రథమ.)

'తత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁబంపుచున్-' (తత్క్రతుహయోత్తమము నొక్కెడ నని యర్థము. ఇచటను జడభిన్నమునకు ద్వితీయార్థమునఁ బ్రథమ.)

## ౨౦. ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు.

ఉ. '*వాహీకము నాఁగఁ బరఁగు తీర్థమాడి మేధాసమన్వితు లగుదురు.' భార. అర. ౨ ఆ. ౨౭౮. 'చ. వ్రతములు లేనివారు నుపవాసపరాఙ్ముఖులైనవారు దుర్మతులు విహీన శౌచులుఁ గ్రమంబునఁ దీర్థము లాడనోపరు.' భార. అర ౨ ఆ. ౨౮౩. 'ఉర్విం గల్గు తీర్థంబులెల్లను నే నాడుచు.' హరి. పూ. ౫ ఆ. ౧౨. 'ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన శరములు, నెఱఁకు లాడి.' భార. అర. ౧ ఆ. ౩౧౪. 'చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై.' భార. శల్య. ౧ ఆ. ౬. 'ఆవమిడిన బగిలిపోవుటయు.' భార. స్త్రీ. ౧ ఆ. ౩౪. 'ఎ-గీ. [1]ముట్టి కంద [2]ముల్ వడి, గత్తి పెట్టిపెట్టి.' హరి. పూ.

---

* మేధికంబు నాఁ బరఁగు తీర్థ. పా.

1. ముట్టికండముల్ వడిఁ గత్తిపెట్టు పెట్టి. పా.

2. ములను గత్తి.

౬ ఆ. ౧౬౫. 'శా. భావంబుల్ భయ ముజ్జగించి చోరుఁడీ భవ్యాద్రిఁ జా టందఱుం.' హరి. పూ. ౮ ఆ. ౧౬౫. 'మ. కనుగొంటిం బరమేష్ఠిఁదోట్టి సురసంఘుం బేకతం బుండఁగన్.' హరి. పూ. ౫ ఆ. ౮౨. 'ఎ - గీ. లీలఁ బేరోలగం బున్న నీలవర్ణు.' ఉ. హరి. ౪ ఆ. ౧౪౧. శార్ఙ్గగుణగాఢరవంబు నభంబు నిండఁగాన్.' నిర్వ. 3 ఆ. ౨. 'అదియుఁ మేనుచ్చి.' రా. ఆర. కాం. ౨ ఆ. ౫౯. 'జనయిత్రి చిచ్చుఁజెకిన.' జై. ౮ ఆ. 3౬. 'తే. పంకము గొరిజ దిగఁబడఁ బఱవ లేవు, మన్ను లివ్వేళ రేగటి మన్ను లందు.' స్వా. ౪ ఆ. ౨౦. మొ. పఠాంతరమునఁ దీర్థమందాడి మొ. ఇట్టిప్రయోగముల చేత 'అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా' అను శబ్దశాసనుల సూత్రము సార్థకమగుచున్నది.

౨౦. కొన్నిచోట్ల జడవాచకశబ్దముల సప్తమికిఁ బ్రథమావిభక్తికూడ నగు నని యర్థము.

బాలవ్యాకరణమున నాయాయి సందర్భముల ననుసరించి ద్వితీయాదులకును, షష్ఠికిని బదులుగ ప్రథమావిభక్తి వచ్చు నని చెప్పఁబడినది. కాని సప్తమికి ప్రథమ విధింపఁబడలేదు. సప్తమ్యర్థమునందును ప్రథమ కాన వచ్చుటంజేసి, దానిని సిద్ధింపఁజేయ నిట్లు సూత్రింపఁబడినది.

'......తీర్థమాడి మేధాసమన్వితు లగుదురు' తీర్థమందాడి [స్నానమొనర్చి] మేధాసమన్వితు లగుదురు.) '...తీర్థము లాడనోపరు' (తీర్థములం దాడ నోపరు). '...తీర్థంబు లెల్లను నే నాడుచు' (తీర్థములందెల్ల నేనాడుచు)'...శరములు నెఱఁకులాడి' (శరములు నెఱఁకులందాడి) '...మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ (మోమునందు బాష్పజలపూరము గ్రమ్మఁగ).

'ఆవ మిడినఁ బగిలిపోవుటయు' (ఆవమం దిడినఁ బగిలిపోవుటయు) '...కంద ముల్ వడిఁ గత్తి వెట్టివెట్టి-' (కందములందు వడిఁ గత్తివెట్టివెట్టి ('భావంబుల్ భయ ముజ్జగించి చొరఁడీ భవ్యాద్రిచా టందఱున్.' (భావంబులందు భయ ముజ్జగించి చొరఁడీ భవ్యాద్రిచాటున నందఱున్) '...సురసంఘం బేకతం బుండఁగన్' (సురసంఘం బేకతమున నుండఁగన్.) 'లీలఁ జేరోలగంబున్న నీలవర్ణు' (లీలఁ జేరోలగంబున నున్న నీలవర్ణు) 'గుణగాఢరవంబు నభంబు నిండఁగాన్' (గుణగాఢరవంబు నభంబునందు నిండఁగాన్) 'అదియున్ మేనుచ్చి' (అదియున్ మేన నుచ్చి) 'జనయిత్రి చిచ్చుఱికిన' జనయిత్రి చిచ్చున నుఱికిన) 'పంకము గొరిజ దిగఁబడఁ బఱవలేవు...' (పంకమునందు గొరిజ దిగఁబడఁ బఱవలేవు).

పయి విధముగా సప్తమ్యర్థమునఁ బ్రథమ వచ్చు నని చెప్పుటకుఁ జింతామణియందలి సూత్ర మాధారము. అందు 'అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా' అనుచు ఒకానొకప్పుడు ఒక విభక్తి రావలసినచోట నింకొక విభక్తియుఁ వచ్చుట నంగీకరించుచున్నది. ఈ యంశమే వివరణమునందలి 'ఇట్టి ప్రయోగములచేత——' మున్నగు వాక్యమున వివరింపఁబడుచున్నది.

**౩౧. ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి.**

ఉ. 'పార్థివ, ప్రాగ్రసరుండు ధర్మసుతుప న్నిది నీకు నలంఘ్యము' భార. ఆర. ౫ ఆ. ౪౧౬. 'లసదగణ్యగుణౌఘ [1]విచిత్రుఁ డమ్మహాత్ముచరితంబులు.' హరి. ఉ. ౫ ఆ. ౪౯. 'ఉత్ఫుల్లలోచనుఁ డా విష్ణుమూర్తితో.' హరి. ఉ. ౫ ఆ. ౧౭౬. 'విస్ఫురన్మహా, విక్రముఁడైన దేవుఁడు త్రివిక్రము సొమ్ములు' హరి. ఉ. ౬ ఆ. ౧౩౫. మొ.

---

1. విచింత్యుఁడమ్మహాత్ముని చరితంబులు. పా.

౭౧. సమాసాంతర్గత విశేష్యంబులు = సమాసమునఁ జేరియున్న విశేష్యములు: కొన్నియెడల విశేష్యపదములు సమాసములయందుండినచో, వాని విశేషణముల షష్ఠికిని ప్రథమయే వచ్చు నని యర్థము.

బాలవ్యాకరణమున 'ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు' నని సూత్రింపఁబడి 'సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద' నని యుదాహరణ మీయఁబడినది. ఉదాహరణములంబట్టి విశేష్యము సమాసమున నితర పదములతోఁ జేరక, ప్రత్యేకముగ నున్నప్పుడే యిట్టి కార్యము జరుగు నని సందేహము కలుగవచ్చును. అట్టి సందేహము బోఁగొట్టి' విశేష్యము సమాసాంతర్గతమయి యున్నప్పుడును దాని విశేషణము షష్ఠికిని ప్రథమ రావచ్చు నని యీ సూత్రము విధించుచున్నది.

'పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతు పన్నిది-' ఇచట విశేష్యము 'ధర్మసుతుఁడు; అది 'పన్ను' తో సమసించి ధర్మసుతుపన్ను' అని సమాసాంతర్గతమయినది; దానివిశేషణము 'పార్థివప్రాగ్రసరుండు' అనునది. 'ధర్మసుతు' షష్ఠ్యంతము కావ, దాని విశేషణము షష్ఠ్యంతముగానే యుండవలసి వచ్చుచున్నది. కాని యీ విశేషణముషష్ఠికిఁ బ్రథమ రావచ్చు ననుటచే 'పార్థివప్రాగ్రసరుండు' అయినది. 'లసదగణ్యగుణౌఘవిచిత్రుఁ డమ్మహాత్ము చరితంబులు-' (ఇచట 'అమ్మహాత్ము చరితంబు' నను సమస్తపదమున విశేష్యమంతర్గతము. దాని విశేషణమగు 'లసదగణ్యగుణౌఘవిచిత్ర' శబ్దము షష్ఠికిఁ బదులు ప్రథమను పొందినది. 'ఉత్ఫుల్లలోచనుఁ డా విష్ణుని మూర్తితో' (ఇచట 'విష్ణుని' విశేష్యము-సమాసగతము; దాని విశేషణమగు 'ఉత్ఫుల్లలోచన' శబ్దమున షష్ఠికి బదులు ప్రథమ.) '...దేవుఁడు త్రివిక్రముసొమ్ములు' ('త్రివిక్రము సొమ్ములు' అను సమాసములోని 'త్రివిక్రము' విశేష్యము. దాని విశేషణమగు దేవశబ్దమునకు ప్రథమ వచ్చినది.)

## ౨౨. కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి.

ఉ. 'చ. అహీనబాహుబలసారఘనుల్ మధుకైటభాది దైత్యపతుల నెల్లఁ ద్రుళ్లడఁచె.' నిర్వ ౬ ఆ. ౧౨. 'క. తండ్రీ! ఘటోత్కచుఁడు మీ; 'తండ్రి గలుగఁగాదె తల్లి ద్రౌపది తోడన్, దండ్రుల హరిదీశ్వరులైన, మండ్రు వొగడఁదెచ్చె గంధమాదనమునకున్.' జై. ౧ ఆ. ౯౭. మొ. 'పక్షివిశేషణా నామ్' అను బహువచనసారస్య మిట్టి ప్రయోగముల కుత్పాదకముగా నున్నయది. మఱియు నేతద్విశేషంబు లనేక విధంబులు గలవు గాని ప్రామాణిక ప్రయోగములు దొరకమిం జేసి యవి యనాదృతంబులయ్యె.

౨౨. కొన్నిచోట్ల విశేషణముల చివర రావలసిన ద్వితీయ మున్నగు విభక్తులకును ప్రథమ యగు నని యర్థము.

బాలవ్యాకరణమున 'భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు' నని వ్రాయఁబడినది. భవత్యర్థకముతోడి వ్యవధానము లేకున్నను (అయి మున్నగునవి చేరకున్నను) విశేషణముల ద్వితీయాదులకుఁ బ్రథమ యీ సూత్రముచే విధింపఁబడుచున్నది.

'అహీన బాహుబలసార ఘనుల్ మధుకైటభాది దైత్యపతుల నెల్లఁ ద్రుళ్లడఁచె' ననుచోట 'బలసారఘనుల్-' అని ఘనులను' అను ద్వితీయకు బదులు ప్రథమ.

'తల్లి ద్రౌపదితోడన్...' అనుచో 'తల్లియగు ద్రౌపదితో' నని యర్థము. ఇట భవత్యర్థకము లేకున్నను 'తల్లితో' అను తృతీయకు బదులుగా 'తల్లి' అని ప్రథమ.

ఆంధ్రశబ్దచింతామణి 'షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యాత్' అని చెప్పుచు విశేషణములచివరఁ గల షష్ఠికిఁ బ్రథమ యగునని విధించుచున్నది. ఆ సూత్రమునందు 'విశేషణస్య' అని యేకవచన మున్నను సరిపోవుచుండఁగా 'విశేషణానామ్' అని బహువచనమును జెప్పుటవలన - అనఁగా బహువచన సామర్థ్యమువలన షష్ఠ్యంతవిశేషణములకే కాక తక్కిన విభక్తులు చివరఁ గలవానికిఁ గూడ ప్రథమ వచ్చు నని గ్రహింప వీలగుచున్నది. దానిం బట్టియే విశేషణముల ద్వితీయాదులకును ప్రథమ వచ్చు ననుచు నీ సూత్రము కూర్పఁబడినది. ఇట్లొక విభక్తి కింకొక విభక్తి యగుట మున్నగునవి ప్రయోగములనుబట్టి చిత్రవిచిత్రములుగా కానవచ్చుచుండును. కాని ప్రామాణిక ప్రయోగములం దట్టివి మృగ్యము లగుటచే - మహాకవుల గ్రంథముల ననుసరించియే యట్టివానిని గ్రహింపనగును.

**౨౩. క్రియాన్వయంబున రెండు పదంబులకు స్వస్వామిసంబంధము గలచో సంబంధిపదంబుషష్ఠికి ద్వితీయ యగు.**

ఉ. 'క. కొన్ని వెడమాటలాడుచు, నన్ను నతఁడు చెట్టవట్టినన్.' భార. విరా. ౨ ఆ. ౨౭౪. 'ఉ. కట్టియ వైచె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రిలేఁ, బట్టిని.' భార. శల్య. ౧ ఆ. ౩౭౭. 'మ. రాముతమ్ముఁ గలవుం, డిరుమూఁడమ్ములఁ జాపముం దునుము.' జై. ౬ ఆ. ౨౧౮. 'క. నరసూను నపుడు. కర్ణజుఁ, డిరుమూఁడు శిలీముఖంబు లెద సించిన.' జై. ౭ ఆ. ౧౯ మొ.

౨౩. అధికారికిని, అతని సొత్తునకును గల సంబంధము స్వస్వామిసంబంధము. అట్టి సంబంధ మున్నపుడు రెండు పదముల కన్వయము కలుగునెడ సంబంధి (అధికారి) పదముయొక్క షష్ఠికి ద్వితీయా విభక్తి యగు నని యర్థము.

'...నన్ను నతఁడు చెట్టవట్టినన్' (నాయొక్క...చెట్ట పట్టినన్-అని యర్థము. నాయొక్క-అనుటకు బదులు 'నన్ను' అని ద్వితీయ వచ్చినది.) '...సెన్నుదురు గాడ భవత్తనయుండు మాద్రిలేఁబట్టిని' (మాద్రి లేఁ బట్టి యొక్క... సెన్నుదురు గాడ - అని యర్థము. ఇచట 'లేఁబట్టియొక్క' అను షష్ఠికి బదులు ద్వితీయ వచ్చినది.)

పయి స్థలములు రెండింటను గల సంబంధము అవయవావయవిభావము; కాని స్వస్వామిభావము కాదు. అయినను పై ప్రయోగము లుదాహరింపఁబడుటచే సూత్రమునందలి స్వస్వామిసంబంధము అవయవావయవిభావమునకును నుపలక్షక మని గ్రహింపవలసి యున్నది.

'రాముతమ్ముఁ లవుం డీరు మూఁడమ్ములఁ జాపముం దునుమ'- (రాముతమ్మునియొక్క...చాపముం దునుమ అని యర్థము. ఇట స్వస్వామి సంబంధము కలదు. చాపమున కధికారి రాముతమ్ముఁడు. అచట రావలసిన షష్ఠికి ద్వితీయ వచ్చినది.)

'నరసూను నపుడు కర్ణుఁ డీరుమూఁడు శిలీముఖంబు లెద సించిన' (నరసూనునియొక్క...ఎద చించిన యని అర్థము. ఇచట అవయవావయవి సంబంధము; స్వస్వామిసంబంధము కాదు. అయినను షష్ఠికి బదులు 'నర సూనున్' అని ద్వితీయ వచ్చినవి.)

పయి యుదాహరణము లన్నింటను అవయవికిని అవయవమునకును, స్వామికిని అతని సొత్తునకును (అనఁగా ఆ యర్థములను దెలుపు పదములకు) వ్యవధానము కొంత కలదు. కావుననే సూత్రమున 'రెండు పదంబులకు క్రియాన్వయంబున' అని చెప్పఁబడినదే; కాని అవ్యవహిత పూర్వాపర భావము చెప్పఁబడలేదు.

**౨౮. ఒక్కచో ద్వితీయాంత విధేయవిశేషణంబునకుం బ్రథమయు నగు.**

ఉ. 'ఉ. ఎవ్వనిం, బ్రాకట ధర్మతత్త్వవిదు బ్రాహ్మణ ముఖ్యుఁ బురోహితుండుగాఁ, జేకొనువారము.' భార. ఆది. ౭ ఆ. ౧౫౫. 'క. రయమున మ్రింగుదు గాలము, క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికిఁ జన క,గ్నియుఁబోలె లో దహించును, భయరహితా వాని నెఱుఁగు బ్రాహ్మణకులుఁగాఁ.' భార. ఆది. ౨ ఆ. ౬౦. మొ.

౨౪. ద్వితీయాంత మగు విధేయవిశేషణమునకు ప్రథమయును వచ్చును; అనఁగా విధేయవిశేషణము ద్వితీయాంతముగాను, ప్రథమాంతముగాను కూడ ఉండు నని యర్థము. విధేయవిశేషణము ప్రథమాంత మగుట కుదాహరణము—'...బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ, జేకొను వారము' (పురోహితునిగాఁ జేకొనువార మని యర్థము; 'పురోహిత' శబ్ద మిచట విధేయవిశేషణ మగుటచే దాని ద్వితీయకుఁ బ్రథమ వచ్చినది.) విధేయవిశేషణము ద్వితీయాంతముగా నుండుట కుదాహరణము—'భయ రహితా, వాని నెఱుఁగు బ్రాహ్మణకులుఁగాన్' (ఇచట 'బ్రాహ్మణ కులుగాన్' అను విధేయవిశేషణము ద్వితీయాంతముగానే యున్నది.)

**౨౫. కొన్ని యెడల విధేయవిశేషణమొండ బహువచనాంతం బయి విశేష్యంబులు పెక్కిటి కన్వయయోగ్యం బగు.**

ఉ. 'క ఇది దక్షిణాపథంబున, కిదియు విదర్భాపురమున కిది కోసల కిం, దిది యుజ్జయినికిఁ దెరువులు, మది నిన్నిటిలోన నరుగ మన కెద్ది యగుఁన్?' భార. ఆర. ౨ ఆ. ౬౯. బహువచనాంతము కాక యేకవచనాంతమైనచోఁ దెరువు లై దుండవలెను.

౫౯. ఒండ=ఒకటియే. కొన్నిచోట్ల నొక్కటే విధేయవిశేషణము బహువచనాంతముగా నుండి, పెక్కు విశేష్యములతో నన్వయింపఁదగినదై యుండు నని యర్థము.

'ఇది దక్షిణాపథంబున కిదియుఁ విదర్భాపురమున, కిది కోసల కిం దిది యుజ్జయినికిఁ దెరువులు-' అను నిచ్చట 'తెరువులు' విధేయవిశేషణము-బహువచనాంతము; విశేష్యములు 'ఇది' అను నాలుగును, 'ఎద్ది' అనునది యును; 'తెరువులు' అనునది బహువచనాంత మగుటచే పయి వానితో సమన్వయించుచున్నది.

ఇచట 'తెరువులు' అని బహువచనాంతముగాఁ గాక ఏకవచనాంతముగా నున్నచో 'ఇది దక్షిణాపథంబునకుఁ దెరువు; ఇదియుఁ విదర్భాపురమునకుఁ దెరువు; ఇది కోసలకుఁ దెరువు; ఇం దిది యుజ్జయినికిఁ దెరువు; మది నిన్నిటిలోఁ నరుగ మన కే తెరువు అగున్' అని 'అయిదు తెరువు'లను వాడవలసి యుండును.

ఇచట కుమారదేవపండితీయమున 'ఈ (1) తెరువు దక్షిణాపథంబునకు (2) తెరువు, ఇదియుఁ విదర్భాపురమునకుఁ (3) దెరువు, ఇది కోసలకుఁ (4) దెరువు, ఇం దిది యుజ్జయినికిఁ (5) దెరువు, అని యుండు ననుట' అని వ్రాయఁబడి యున్నది. ఇది సంగతముగా లేదు.

## ౫౬. కొన్నియెడల విభక్తిపరిణామంబు గ్రాహ్యంబు.

ఉ. 'ఈ, తనితో సాటి యనంగ మేలన.' (మేలన=ఈతని కంటె మేలన, ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పు గలిగె నని తెలియవలయును.) నిర్వ. 3 ఆ. ౬౧ మొ.

౬౬. విభక్తిపరిణామంబు=విభక్తి మాఱుట; గ్రాహ్యంబు=ఊహింపఁదగినది. అనఁగా కొన్నిచోట్ల విభక్తి మాఱవలసి యుండుటను గ్రహింపవలె నని అర్థము.

'ఈతనితో సాటి యనఁగ మే లన' = ఈతనితో సాటి యనఁగా ఈతనికంటె మే లనఁగా; (ఇచట 'సాటి' అనుదాని కనుకూలముగ 'ఈత నితో' అని తొలుత తృతీయ వచ్చినది; 'మే లన' అనుదానితో సమన్వ యించునపుడు ఆ తృతీయను పంచమిగా మార్చి 'ఈతనికంటె' అని చెప్పి అన్వయింపవలెను.)

## ౨౭. తచ్ఛబ్దాంతము లగు ధాతుజవిశేషణంబులమీఁద నరు చూపట్టదు.

ఉ. 'శా. ఏ యే దేశములం జరించితిరి మీ రే యే గిరుల్ చూచినా, రే యే తీర్థములందుఁ గ్రుంకిడితి రేయే ద్వీప ముల్ మెట్టినారు.' స్వా. ౧ ఆ. ౬౮ మొ.

౨౭. తచ్ఛబ్దాంతంబు లగు ధాతుజవిశేషణంబులు = చూచినారు, మెట్టినారు మున్నగునవి. అట్టి వానిమీఁద 'అరు' అనునది కనఁబడ దని యర్థము. 'చూచినారరు; మెట్టినారరు' అని యుండ రా దనుట. ఉదాహర ణము స్పష్టము.

ఇది కారకపరిచ్ఛేదము.

---

# సమాసపరిచ్ఛేదము

సమాస మనఁగా సంయోగదశయందుఁ గలిగెడు విభక్తిలోపాత్మకపద స్వరూప సంగ్రహము. (ఇది లుక్సమాస విషయము.)

సమాస మనఁగా సంక్షేపము. రెండు పదములను గాని, అంతకంటె ఎక్కువ పదములనుగాని కలుపునపుడు వానినడుమఁ గల విభక్త్యాదులకు లోపము కలుగుచుండును. కాన అ పదముల కలయిక సంగ్రహరూప మగుటచే సమాస మనఁబడును. అట్టి సమాసములఁ గూర్చి వివరించు గ్రంథభాగ మగుటచే దీనికి 'సమాసపరిచ్ఛేదము' అను పేరు కలిగినది.

సమాసము లీ వ్యాకరణమున ముత్తెఱఁగుల విభజింపఁబడినవి. (1) లుక్సమాసము. (2) అలుక్ సమాసము. (3) లుగలుక్ సమాసము. (1) సమాసమును బొందు పదముల చివరి విభక్తులు లోపించి యేర్పడు సమాసము లుక్సమాసము. (2) సమాసము బొందు పదముల చివరి విభక్తులు లోపింపనిది అలుక్సమాసము. (3) కొన్నిపట్ల విభక్తి లోపించుట, కొన్నియెడల లోపింపకుండుట అను రెండు పద్ధతులను కలది లుగలుక్ సమాసము.

సమాస మనఁగా:—ఈ వాక్యమున లుక్ సమాసస్వరూపము వివరింపఁబడుచున్నది. రెండు గాని, అంతకంటె ఎక్కువ పదములుగాని సంయోగము బొందినపుడు (కలియఁనపుడు) విభక్తులు లోపించిన పదముల యొక్క సంగ్రహస్వరూపము సమాసము. అనఁగా లుక్ సమాస మని యర్థము.

౧. షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాష నగు.

ఉ. 'ఎలజవ్వనంబున *విలసనంబు.' భార. ఆది. 3 ఆ. ౨౭. 'యోగక్షేమంబున తెఱఁగు.' భార. ఉద్యో. ౧ ఆ. ౨౭౪. 'అరదంబున యురవడికిన్.' నిర్వ. ౬ ఆ. ౧౨౯ వ.

౧. షష్ఠీతత్పురుషసమాసములందు 'న' అను నాగమము వికల్పముగా నగు నని యర్థము. కాఁగా 'న' గాగమము వచ్చిన రూపములు, రాని రూపములును ఉండు నని భావము.

బాలవ్యాకరణమున 'షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమం బగు' నని నుగాగమము విధింపఁబడినది. కాని ఈ సూత్రము అట్టి నియమము లేక శబ్దముల కన్నింటికిని 'న' ఆగమముగా వికల్పముగా వచ్చునని చెప్పుచున్నది.

'ఎలజవ్వనంబున విలసనంబు' (ఎలజవ్వనముయొక్క విలసనం బని యర్థము. 'ఎలజవ్వనంబు విలసనంబు' అనియుం నుండవచ్చును.) 'యోగక్షేమంబున తెఱఁగు' (యోగక్షేమముయొక్క తెఱఁగని యర్థము. పక్షంబున 'యోగక్షేమంబు తెఱఁగు') 'అరదంబున యురవడికిన్' (అరదంబుయొక్క యురవడికి నని యర్థము. నగాగమము రానపుడు-'అరదంబు నురవడికిన్.')

**౨. కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని ద్వ్యక్షరాదంత స్త్రీపుంసంజ్ఞావాచకంబగు పూర్వపదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు.**

అంతట ననఁగా సాంస్కృతికాదులు మూఁట నని యర్థము.

ఉ. రామాశాస్త్రి, సుబ్బాశాస్త్రి, రామానాయఁడు, సుబ్బానాయఁడు, రామారెడ్డి, సుబ్బారెడ్డి, ఎల్లాసెట్టి, వీరా

* విలసనమును. పా.

సెట్టి, కుప్పాసామి, వీరాసామి, రామారాయఁడు, సుబ్బారాయఁడు, రామారావు, సుబ్బారావు, ఎఱ్ఱాప్రెగ్గడ, చిన్నాదేవి మొ. బహుళంబుగా ‖ ననుటచే రామరాయఁడు, సుబ్బరావు, ఎఱ్ఱప్రెగ్గడ యిత్యాదులందు దీర్ఘంబు వైకల్పికంబు. కృష్ణశాస్త్ర్యాదులందు దీర్ఘంబు కలుగదు.

వి. బిరుదాద్యుత్తరపదంబు = బిరుదువాచకము మున్నగు పదములు రెండవ పదముగాఁ గలది. ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞావాచకంబు = రెండక్షరములు గలిగి, స్త్రీయొక్క గాని, పురుషునియొక్క గాని పేరు తెలుపు అకారాంతపదము. కాఁగా - కర్మధారయసమాసములోని మొదటి పదము రెండక్షరములు కలదై, స్త్రీపురుషుల పేర్లను దెలుపుచు, రెండవ పదము బిరుదు మున్నగువానిం దెలుపుచు నున్నపుడు మొదటిపదము చివరి అకారమునకు సాంస్కృతికాచ్ఛికమిశ్రసమాసములు మూఁడింటను దీర్ఘము బహుళముగా నగునని యర్థము.

'రామ+శాస్త్రి' - ఇది కర్మధారయము. తొలిపదము అకారాంతమగు పురుషుని నామము; రెండక్షరములు కలది; రెండవ పదము బిరుదవాచకము. కావున నిందలి మొదటిపదముచివర దీర్ఘము వచ్చి 'రామాశాస్త్రి' అయినది. 'సుబ్బాశాస్త్రి' మున్నగునవియు నిట్లే.

సూత్రమున 'బహుళముగా నగు' ననుటచే నీ దీర్ఘము కొన్ని యెడల నిత్యమనియు, కొన్ని యెడల వికల్పమనియు, కొన్ని యెడల రానే రా దనియు గ్రహింపవలెను. మీఁదివానిలో రామానాయుఁడు, ఎల్లాసెట్టి, వీరాసామి మున్నగునవి నిత్యముగ దీర్ఘము వచ్చుట కుదాహరణములు. రామారాయఁడు, సుబ్బారావు, ఎఱ్ఱాప్రెగ్గడ మున్నగునవి వికల్పముల కుదాహృతులు. వానిని 'రామరాయఁడు, సుబ్బరావు, ఎఱ్ఱప్రెగ్గడ' అనియుం వ్రాయవచ్చును. 'కృష్ణశాస్త్రి' మున్నగునవి దీర్ఘము రాకుండుట కుదాహరణము లగును.

కుమారదేవపండితీయమున నిచటి వివరణమును విమర్శించుచు 'కృష్ణశాస్త్రీత్యాదులందు దీర్ఘంబు కలుగ దనుచున్నాఁడు. 'కృష్ణారెడ్డి, కృష్ణాపత్రిక' ఇత్యాది వ్యవహారములు కలవు' - అని వ్రాయఁబడినది. 'కృష్ణారెడ్డి' అనుచో దీర్ఘము రా దని ప్రౌఢవ్యాకర్త చెప్పలేదు; అతఁ డిచ్చిన యుదాహృతులలో 'రెడ్డి' ఉత్తరపదముగాఁ గల వన్నియుం దీర్ఘాంతములుగనే యున్నవి. ఇఁక 'కృష్ణాపత్రిక' సంస్కృతసమాసము; ఇందలి తొలి పదము స్త్రీలింగము; కాన నది ఎట్లును దీర్ఘాంతమే. దాని కీ సూత్రముతోఁ ప్రసక్తియే లేదు.

**(3) ఇటఁ బూర్వపదంబునత్వంబున కిత్వంబు బహుళంబుగ నగు.**

ఉ. సుబ్బినాయఁడు, ఎల్లిసెట్టి మొ. రామిసెట్టి, సుబ్బిసెట్టి యిత్యాదులం దిత్వంబు నిత్యంబు.

3. ఇట = బిరుదాద్యుత్తరపద కర్మధారయమునందు; ఈయి సూత్రమునకు విషయ మగు చోట్ల మొదటిపదము చివరఁ గల అకారమునకు బహుళముగా ఇకార మగు నని సూత్రార్థము. ఇచటను బహుళగ్రహణముచే 'సుబ్బినాయుడు, ఎల్లిసెట్టి' మున్నగువానియం దిత్వము వికల్పము. కాన అది రానిపక్షమున దీర్ఘము నొంది 'సుబ్బానాయఁడు, ఎల్లాసెట్టి' కావచ్చును. 'రామిసెట్టి, సుబ్బిసెట్టి' మున్నగువానియం దిత్వము నిత్యము.

**౪. కొన్నియెడల నిచ్చో ననా పా మాయాగమంబు లగు.**

ఉ. తిక్కనసోమయాజి, నన్నపార్యుఁడు, కృష్ణమనాయఁడు, నన్నయభట్టు మొ.

౪. ఇచ్చోన్ = ౩-వ సూత్రమునకు విషయమగు చోట - బిరుదాద్యుత్తరపదకర్మధారయమున ననుట. ఇట్టియెడఁ గొన్నిస్థలములందు అన అప-అమ-అయ అనునవి మొదటి పదమునకుఁ జివర ఆగమములుగా వచ్చును.

('సూత్రమునందలి 'నా - పా - మా - యా' అనువానిచే న - ప - మ - య -' లను హ్రస్వములను గ్రహింపవలెను. 'ఒకచోఁ హ్రస్వంబు దీర్ఘం బగు' [సంజ్ఞా. 3. సూ.] నను సూత్రముచే అవి దీర్ఘాంతము లయినవి.' అని కొందఱిమతము. అది సరికాదు.) ఉదా - 'తిక్క + అన + సోమయాజి = తిక్కన సోమయాజి; నన్న + అప + ఆర్యుఁడు = నన్నపార్యుఁడు; కృష్ణ + అమ + నాయఁడు = కృష్ణమనాయఁడు; నన్న + అయ + భట్టు = నన్నయభట్టు.

**౫. పైయాగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబు లగు.**

ఉ. రామన్నసెట్టి, తిమ్మప్పనాయఁడు, కృష్ణమ్మపంతులు, మల్లయ్యశాస్త్రి మొ. కృష్ణమ్మ యనుచోఁ 'అమ్మ' ప్రేమసూచకం బని యెఱుంగునది. 'ఉ. ఆ నరసింగభూపతి ప్రియం బెసఁగం [1]బినకొండమాంబయం, దానమితాఖిలాంహితసమాజుఁ దనూజునిఁ గాంచె బంధుపం, తానసురావనీజు సముదంచితభోగ బిడౌజు సూరిమ్మై, త్రీనవభోజు భానునిభతేజుని గృష్ణమరాజు నున్నతిన్.' కళా. ౧ ఆ. ౭౮ ఘొ.

౫. పై యాగమంబులు = 'అన, అప, అమ, అయ' లు; ఇవి కొన్నియెడల ద్విత్వమునుగూడ పొంది యుండును. 'రామన్నసెట్టి' మున్నగునవి ఉదాహరణములు.

'కృష్ణమ్మపంతులు' అనునది మహద్వాచకము; ఇచటఁ గల 'అమ్మ' అనునది ప్రేమను సూచించును; కాని స్త్రీత్వమును సూచింపదు. కాన నియ్యది స్త్రీవాచక మని భ్రాంతి నొందరా దని 'కృష్ణమ్మ అనుచోఁ అమ్మ ప్రేమసూచకం బని యెఱుంగునది' అని వివరింపఁబడినది. 'అమ్మ' కు రూపాంతరమగు 'అమ' పుంవాచకముగ నున్న దనుటకుఁ బ్రయోగము చూపఁబడు చున్నది. ఇచట 'కృష్ణమరాజు నున్నతిన్' అనుచోఁ 'కృష్ణమరాజు' మహదర్థ మగుట స్పష్టము.

---

1. బినకొండమాంబయం. పా.

ప్రౌఢవ్యాకర్త 'కృష్ణమపంతులు, కృష్ణమ్మపంతులు' మున్నగు రూపములను సాధించుటకయి, తొలుత 'అమ్మ' మున్నగువానిని పూర్వపదాంతాగమములుగా విధించి, పిదప వానికి ద్విత్వమును విధించియున్నాఁడు. కాని ద్విత్వవిధాన మక్కఱలేకయే 'అన్న, అప్ప, అమ్మ, అయ్య' అను శ్రేష్ఠతావాచకములతో (సంధి. ౧. సూ.) నిత్యసంధి చేసినయెడల 'రామన్నసెట్టి, తిమ్మప్పనాయఁడు, కృష్ణమ్మపంతులు, మల్లయ్యశాస్త్రి, నన్నయ్యభట్టు' మున్నగునవి సాధింప వీలగును. అట్టియెడ నీ సూత్ర మనావశ్యక మగును. మఱి 'అన్నాదులలోని ద్విత్వము బహుళముగా లోపించు' నని సూత్రించినచో కృష్ణమనాయఁడు, నన్నయభట్టు' మున్నగునవి కుదురును. బాహుళక మగుటచేఁ గొన్నియెడల ద్విత్వలోపము నిత్యము కాన 'నన్నపార్యుఁడు మున్నగునవియు సురక్షితము లగును.

౬. కర్మధారయం బియ్యాది మిశ్రంబు సిద్ధసమాస-బట్ల యగు.

ఇట్లనుటచేఁ బూర్వపదంబు లుప్తవిభక్తికం బయి యవికృతాంతం బగు నని యెఱుంగవలయు. ఉ. కృష్ణరాయఁడు, రామరావు మొ.

౬. ఇయ్యాది, కర్మధారయంబు=ఈ కర్మధారయము-బిరుదాద్యుత్తరపదమయి, పూర్వపదము స్త్రీపురుషసంజ్ఞారూపమయిన దనుట. 'కృష్ణరాయఁడు' మున్నగు నిట్టి మిశ్రసమాసము సిద్ధసమాసమువలె నుండు నని యర్థము.

అనఁగా సిద్ధసమాసమున పూర్వపదము చివరి విభక్తి లోపించి ఆ పదము చివర ఎట్టి మార్పును కలుగక యుండునట్లు ఇచటను విభక్తిలోపాభావము, అవికృతాంకత ఉండు నని (కల్గు నని) భావము.

'కృష్ణుఁడు+రాయఁడు' (కృష్ణుఁ డను రాయఁడు) విభక్తిలోపము వికారాభావము. 'కృష్ణరాయఁడు' 'రాముఁడు+రావు' రాముఁ డను రావు.)

విభక్తిలోపము, వికారాభావము. 'రామరావు.' ఇయ్యెడ 'రామారావు' మున్నగురీతినిగూడ నుండవచ్చును. చూ. (సమాస. ౨. సూ. వివరణము.)

**క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడంబలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలఁ గర్మధారయం బగు.**

ఉ. క్రొంబులకలు. 'క్రొంబులకల్ జనించె సభకుణ్.' ఉ. రా. ౬ ఆ. ౧౩౬. క్రొన్నారాచములు. 'క. క్రొన్నారాచములు మూఁడు గొని నుదు రేయణ్.' రా. ఆర. కాం. ౧ ఆ. ౨౩౦. నెమ్మనము. 'చ. అనుపమయోగశీల నమృతాంబుధియం దుదయించు దేవు నె, మ్మనమున నావహించి.' లక్ష్మి. 3 ఆ. ౯౩౪. పెన్నగము. 'పడు పెన్నగములు సంచలించె.' రా. అర. కాం. ౨ ఆ. ౩౩౬. ముంగోపము. 'ఆ. మొగముఁ బోడువ లేని ముంగోప మీఁక నెప్పుడు.' ఉ. రా. 3 ఆ. ౭. వింజామరము. ఎ-గీ. రమణ శ్రీదేవి వింజామరంబు వీవ.' శేష. ౫ ఆ. సగరాజ్యము 'నా సగరాజ్యము' రా. కిష్కిం. కాం. ౫౫౦ మొ.

౭. క్రొత్తాదులు, లుప్తశేషంబులు = ఆద్యక్షరశేషమునకు లోపము రాఁగా మిగిలిన క్రొత్త మున్నగునవి-'క్రొ'-మున్నగునవి అని అర్థము. అట్టివి దేశ్యములతోఁ గర్మధారయము అగునట్లు తత్సమములతోడను సమసించును.

బాలవ్యాకరణము 'క్రొత్తశబ్దమునకు...' (సంధి. ౩౮. ౩౯. సూ.) మున్నగు సూత్రముల కీయఁబడిన ఉదాహరణములనుబట్టి చూడఁగా అయ్యవి దేశ్యములతోడనే సమసించు నను భ్రాంతి కలుగుచుండును. అట్టి భ్రాంతిని పోఁగొట్టుచు 'క్రొత్త' మున్నగునవి తత్సమములతోఁగూడ కర్మధారయము లగు నని చూపుట కీ సూత్రము వ్రాయఁబడినది.

'క్రొత్త + పులకలు = క్రొంబులకలు' (ఆద్యక్షరశేషమునకు, నుగాగమము, ద్రుతకార్యము.) ఇచట 'పులకలు' తత్సమము. 'క్రొత్త + నారాచములు = క్రొన్నారాచములు' (ఆద్యక్షరశేషముమీఁది హల్లున కిట ద్విత్వము.) ఇచట 'నారాచములు' తత్సమము. 'నెఱ + మనము = నెమ్మనము' (అన్యంబులకు సహిత మిక్కార్యంబు కొండొకచోఁ గానంబడియెడి నను బాలవ్యాకరణ సూత్రముచే ఆద్యక్షరశేషముమీఁది హల్లునకు ద్విత్వము. ఇచట 'మనము' తత్సమము) 'వెను + నగము = వెన్నగము' (ఇచట మీఁదిరీతినే.) 'ముందు + కోపము = ముంగోపము' (ఇదియు నట్టిదే.) వీఁచు + చామరము = వింజామరము 'వెల్ల + చామరము = వింజామరము' అని కొందఱు. (ఇచట ఆద్యక్షరశేషము నెత్వమున కిత్వ మగుటయు విశేషము. 'చామరము' తత్సమము.)

'నగము + రాజ్యము = నగరాజ్యము [క్రొత్త శబ్దముకంటె నితరము లగు శబ్దముల తత్సమములతోఁ గర్మధారయ మగుటకు మాత్ర మిది యుండావృతి యగును; తక్కిన యుండావృతులలో వలె నిట నాద్యక్షరము శేషించి యుండలేదు; కావున నిట నుగాగమ, ద్విత్వములకుఁ బ్రసక్తి లేదు. 'వృత్తియందు దీనికి ('నగము' నకు హల్లు పరమగుచో వికల్పముగ నంత్య వర్ణలోపు' మని శబ్దరత్నాకరమునఁ జెప్పఁబడినది.]

## ౮. ధాతుజవిశేషణంబులు తథార్థకావ్యయంబుతోడం గర్మధారయం బగు.

ఉ. 'భూసురోత్తముల్, వేదముల్ సదువునట్లు' భార. ఆది. ౫ ఆ. ౧౮౫. 'కడుం బెద్దదవ్వు పోయినయట్లు.' భార. ఆది. ౧ ఆ. ౧౧౬. మొ.

౮. 'అట్లు' అనునది తథార్థకావ్యయము. ధాతుజవిశేషణమునకుఁ బయి అవ్యయముతో కర్మధారయసమాస మగు నని యర్థము.

'...వేదముల్ చదువునట్లు' (చదువు+అట్లు = చదువునట్లు.) ఇచట 'చదువు' ధాతుజవిశేషణము; 'అట్లు' తథార్థకావ్యయము. వీనికి సంధియందు 'ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణంబున కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు' నని నుగాగమము. పోయిన+అట్లు=పోయినయట్లు.' (అకారసంధి బహుళమగుటచే నిచట సంధి రాలేదు. 'పోయినట్లు' అనియు నుండవచ్చును.

## అట్టి యిట్టి యెట్టి విశేషణంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు.

ఉ. 'క. విమలతపోవిభవంబునఁ, గమలజునట్టిండు.' భార. ఆది. ౨ ఆ. ౨౧౯. 'ఆ. ఇట్లు *గాన నెఱుఁగ మే మేవ్వురము నతం, డిట్టిఁడగుట' భార. శాంతి. ౧ ఆ. ౧౦. 'ఎట్టిఁడు నా నిజేశుఁడు.' (ఎట్టిఁడు నాహృదీశుఁ డనుట యుక్తము) రా. సుం. కాం ౨౫౮. మొ. పక్షమున అట్టివాఁడు మొ.. తెనుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబులు.

౯. 'అట్టి, ఇట్టి, ఎట్టి' అను విశేషణములకుఁ దర్వాత నున్న 'వాఁడు, వారు' అనువానిలోని వకారమునకు (అచ్చుతోఁ గూడినదానికి - 'వా' అనుదానికి) లోపము వికల్పముగా నగు నని యర్థము.

'కమలజునట్టి+వాఁడు = కమలజునట్టిండు' ఇచట 'వా' లోపింపఁగా 'నట్టిఁడు' అగును. హ్రస్వముమీఁది ఖండబిందువు పూర్ణబిందువుగాఁగూడ నగును గాన ఛందస్సునకయి ఇచట పూర్ణబిందువు వచ్చినది, 'కమలజునట్టిఁడు' అనియు నుండవచ్చును; పక్షంబున 'కమలజునట్టివాఁడు' అనియు నుండును.

'...అతం డిట్టి+వాఁడు+అగుట=అతం డిట్టిఁ డగుట'-(ఇచట 'వా' లోపించినవి. 'ఎట్టి+వాఁడు=ఎట్టిఁడు' ఈ యుదాహరణమున ఎట్టిఁడు నా

* గాఁగ నెఱుఁగ మే మేవ్వురము. పా.

నిజేశుఁడు' అనుట పొసఁగదు. నిజేశుఁ డనిన 'నా ఈశుఁడు' అని యర్థము. కాన మఱల 'నా' చేర్చి 'నా నిజేశుఁడు' అనుట సమంజసము కాదు. ఈ యభిప్రాయముననే వ్యాకర్త '(ఎట్టిఁడు నా హృదీశుఁ డనుట యుక్తము'), అని వ్రాసి యున్నాఁడు; హృదీశుఁ డనఁగా హృదయేశ్వరుఁ డని యర్థము.

సాధారణముగా సంస్కృతమున విశేషణములు కూడ విశేష్యములం బోలి లింగవిభక్తివచనములు కలిగి యుండును. తెలుఁగున మాత్రము తఱచుగ విశేషణములు నిర్విభక్తికములే యయి యుండు ననియు 'అట్టి, ఇట్టి, ఎట్టి, కల, ఉన్న (ధాతుజవిశేషణము)' మున్నగునవి నిర్విభక్తికములుగానే యున్నవనియుం, సందర్భము వచ్చినది కాన వివరణమున 'తెలుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబులు' అని చెప్పఁబడినది.

ఈ తచ్ఛబ్దవకార (వా) లోపము 'అట్టి' మున్నగువానిమీఁదనే గాక లాఁతిచోటను (ధాతుజవిశేషణములపై) గానవచ్చుచున్నది.

'ఎఱుక గలరె మగువ లెందు' (భార. ఆది. ౨ వ. 33.) (కల + వారె = కలరె.)

## ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు.

ఉ. 'రాముఁ డలుకన్ ముయ్యేడుమారులన్ రణప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెన్ బల్విరన్.' భార. ఆది. ౧ ఆ. ౭౮. 'ముయ్యాఱు మార్గముల.' రా. యు. కాం. ౧౧౭౫. 'దీని ముమ్మడుఁగగు గణము.' భార. ఆది. ౧ ఆ. ౮౦ మొ. ఆంధ్రశబ్దచింతామణియందుఁగల 'ఇదమద' సిత్యాది సూత్రమందలి యదఃప్రభృతులు వ్యర్థము లగుచు న్వేతరంబులకును నక్కార్యం బగు నని తెలుపుచున్నవి.

౧౧. 'ముయ్యేఁడు' మున్నగువానియందు 'మూఁడు+ఏడు' అని యున్నపుడు 'మూ' అనుదానికి హ్రస్వము, ప్రక్కనున్న యక్షరమునకు ద్విత్వమును నిత్యముగా నగు నని యర్థము.

'మూఁడు+ఏడు - (డు లోపము) మూ+ఏడు (యడాగమము) మూ+యేడు - ('మూ' హ్రస్వము, 'య' ద్విత్వము) 'ముయ్యేఁడు.'

బాలవ్యాకరణమునందు 'సమానాధికరణం బగు నుత్తరపదంబు పరం బగునపుడు మూఁడు శబ్దము 'డు' వర్ణకంబునకు లోపంబును, మీఁది హల్లు నకు ద్విత్వంబు నగు' ననియు, 'ద్విరుక్తం బగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వం బగు' ననియు సమానపరిచ్ఛేదమునఁ జెప్పఁ బడి యున్నది. ఆ యెడల 'విభాష' అని లేకున్నను, అచట మీఁదిసూత్రము నుండి 'విభాష' ననువర్తింపఁ జేయుటచే 'ముల్లోకములు, ముజ్జగములు' కాక 'మూఁడులోకములు, మూఁడు జగములు' ననియుఁ రూపములు సాధువు లగుచున్నవి. 'ముయ్యే' డ్వాదులందు హ్రస్వద్విత్వముల నిత్యముగ రావలసి యున్నందున నీ సూత్రము చెప్పఁబడినది. '...ముయ్యేఁడు మాఱుల్...' మున్నగునవి యీ విషయమునఁ బ్రమాణము లగు ప్రయోగములు. 'ముయ్యాఱు మార్గణముల' (మూఁడు+ఆఱు+మార్గణముల,) 'దీని ముమ్మడుఁగగు గణము...' (మూఁడు+మడుఁగు+అగు గణము).

ఈ యెడ కుమారదేవపండితీయమున 'అచ్చు పరమగునపుడు హ్రస్వద్విత్వములు నిత్యము లని గ్రాహ్యము' అని వ్రాయఁబడినది. కాని ముయ్యే డ్వాదులలో హలాద్యుత్తరపదములును కలవు. అజాదిపదమునే గ్రహించినచో 'ముమ్మడుఁగు' లిత్యాదులు కుదురకపోవును.

ఆంధ్రశబ్దచింతామణియందు - ఇదమదనేతద్వ్యత్తచ్ఛబ్దా శ్శబ్దాంతరాన్వయే బహుళమ్, హ్రస్వం ప్రపద్య దీర్ఘాత్ ద్విత్వ ముపర్యక్షరస్య జనయంతి' అని హ్రస్వద్విత్వముల విధానము కలదు. పయి సూత్రమునందలి

'ఇదమ్, అదస్, ఏతత్-' అను మూఁడును సమానార్థములు; ఆ మూఁడింటికిని తెలుఁగున 'ఈ' శబ్దమే బోధకము. కాఁగా 'ఇదమ్' అని చెప్పిన సూత్రము ననే సరిపోవుచున్నందున మఱల 'అదస్, ఏతత్' అను శబ్దములు వ్యర్థము లగుచు త్రికముకంటె నితరములగు శబ్దములకుఁ గూడ నీ హ్రస్వ, ద్విత్వములు రావచ్చు నని సూచించుచున్నవి. ఈ విషయము నే, వివరణమునందలి 'ఆంధ్ర శబ్దచింతామణియందుఁ గల—' మున్నగు వాక్యము తెలియఁజేయుచున్నది.

## ౧౧ సమాసఘటితం బీ శబ్దం బొక్కెచో సూచనార్థకం బగు.

ఉ. 'క. ఈ యున్న పౌష్య పాలికిఁ, బోయి.' (ఈయున్న= ఇదిగో నున్న యని యర్థము.) భార. ఆది. ౧ ఆ. ౧౧౬. మొ.

౧౧. సమాసఘటితంబు=సమాసమున నున్నది. సమాసమునసున్న 'ఈ' శబ్దము కొన్నియెడల నేదేని వస్తువును, వ్యక్తిని సూచించునదై యుండు నని యర్థము. కాని "ఈ యున్న" అనుచో సమీపార్థమే తోఁచుచున్నది. ఆ యర్థమే ప్రసిద్ధము. 'ఈ యున్న = ఈవిధముగా నున్న' అను నర్థము సందర్భోచితమని తత్త్వబోధిని.

వివరణమున 'ఈయున్న = ఇదిగో నున్న యని యర్థము.' అని వ్రాయఁబడినది. అదిగో, ఇదిగో మున్నగునవి ద్రుతాంతములే యని యీ వ్యాకర్తమతము. ఈతని శబ్దరత్నాకరమునందు నిట్లే యున్నది.

## ౧౨. ధ్వన్యనుకరణశబ్దంబులు కొన్నింటి కిందు నిగాగమం బగు

(ఇందుఁ = కర్మధారయమునం దని యర్థము.)

ఉ. 'గనగనని నిప్పులు.' స్వా. ౪ ఆ. ౬౦. 'క. తళతళని తరణి మెఱుఁగులు.' స్వా. ౫ ఆ. ౧౦౦. 'నిగనిగని కుందనపుఁ దగడు.' స్వా. ౪ ఆ. ౧౧౭. మొ.

౧౨. ఈ కర్మధారయసమాసమునందుఁ గొన్ని ధ్వన్యనుకరణశబ్దముల చివర 'ని' ఆగమముగా వచ్చు నని యర్థము. ఉదాహరణములు స్పష్టములు.

గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకుఁ బరుషంబులు పరంబులగునపుడు బిందు వగు

ఉ. కమ్మఁదేనె, కమ్మందేనె మొ. 'మరు వాలారుశరంబులం దొరఁగు క; మ్మందేనె.' నై. ౨ ఆ. ౯౯.

౧౩. కొన్ని గుణవాచకవిశేషణముల చివర వచ్చు నిగామమునకుఁ బరుషములు పరమగునపుడు బిందువు కూడ వచ్చునని యర్థము. 'బిందు' శబ్దముచే నిచ్చట పూర్ణ, ఖండబిందువులను రెండింటిని గ్రహింపనగును.

బాలవ్యాకరణమున 'గుణవాచకంబు లగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు' నని చెప్పఁబడినది. కొన్ని యెడల గుణవాచకములకు నిగామమునకు బదులు బిందువు కూడఁ గాన వచ్చుటచేతనే నీ సూత్రము చెప్పఁబడుచున్నది. బిందువు నిగాగమస్థానమున వచ్చినది. పరుషములకు సరళాదేశము మున్నగు కార్యములు జరుగుటయం నుదాహరణములను బట్టియే గ్రహించునది. 'కమ్మ + తేనె=కమ్మనితేనె; కమ్మఁ నె,దే కమ్మందేనె' అని మూఁడు రూపములు నుండు నని అర్థము.

౧౪. గుణవాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కెడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి.

ఉ. 'నసి చక్కఁగఁ బ్రియుండు వర్ధిలుటకై.' కాశీ. ౨ ఆ. ౭౩.

౧౪. గుణవాచక మగు శబ్దము క్రియావిశేష మైనయెడల ఒకా. నొకచో 'న' వర్ణకమునకు బిందువు వచ్చుట కనఁబడుచున్నది.

'బాలవ్యాకరణమున 'నవర్ణకంబు గుణవచనంబు లగు నల్లాదుల కగు' నని చెప్పఁబడినది. దానింబట్టి 'నల్లన - చక్కన' మున్నగు పదములు సిద్ధించును. కొన్నియెడల నవర్ణకమునకు బదులుగా బిందువు కనఁబడుచున్నందున

నీ సూత్రము కావలసి వచ్చినది. ఇట్టు బిందువు కానవచ్చుట ఆ గుణవాచకము క్రియావిశేషణ మగునప్పుడే యని యెఱుఁగునది.

'నసి చక్కఁగఁ బ్రియుండు......' అనుచోఁ దొలుత 'నసి చక్కనగ...' అని యుండినది. నకారస్థానమున పూర్ణబిందువు వచ్చినది. ఇది క్రియావిశేషణ మగుట స్పష్టము. 'చక్కనగ, చక్కఁగ' అనియుం రూపము లుండవచ్చును.

## ౧౫. ఒకానొకచో గుణవాచక ధాతుజవిశేషణంబు లవయవ విశేష్యపూర్వకంబులై యవయవితో సమసించెడి.

ఉ. * 'ఒడలు తెల్లని తురగోత్తమువాలంబు.' (ఒడలు తెల్లని=తెల్లని యొడలు గల యని యర్థము.) భార. ఆది. ౨ ఆ. 3౪. 'తనువు మీనొప్పెలవల్చు జాలరిదాన.' (తనువు మీనొప్పెల వల్చు = మీనొప్పెల వల్చు తనువు గల యని యర్థము.) భార. ఆది. 3 ఆ. ౪౧.

౧౫. గుణవాచకధాతుజవిశేషణంబులు = గుణవాచకములు, ధాతుజ విశేషణములును, అవయవవిశేష్యపూర్వకంబులై = తమముందు అవయవవాచకములగు విశేష్యములు (నామవాచకములు) కలవై.

అవయవవాచకములగు విశేష్యముల తర్వాత—(వాని ననుసరించి) ఉన్న గుణవాచకములు గాని, ధాతుజవిశేషణములు గాని, అవయవవాచకముతో సమాసము పొందు నని సూత్రార్థము. కాఁగా—క్రమముగా అవయవి వాచకమగు విశేష్యము, గుణవాచకము (లేక ధాతుజవిశేషణము), అవయవివాచకము నుండునపుడు ఆ గుణవాచక, ధాతుజవిశేషణములతో అవయవికి సమాస మగు నని భావము.

---

* ఉల్ల తెల్లని. పా.

'ఒడలు తెల్లని తురగోత్తమువాలంబు-' ఇచట 'ఒడలు' అవయవ వాచకము; 'తెల్లని' గుణవాచకము; 'తురగోత్తము' అవయవవాచకము. కాన తెల్లని (తెల్లనైన) 'తురగోత్తము' నని సమాసము వచ్చినది. ఇదియే ('ఒడలు తెల్లని=తెల్లని యొడలు గల)' అను వివరణము స్పష్టము చేయఁబడినది.

'తనువు మీన్బోలవల్చు జాలరిదాన-' అనుచోట 'తనువు' అవయవ వాచకము; దాని తర్వాతిది "మీన్బోలవల్చు' ధాతుజవిశేషణము; అది 'జాలరిదాన' నను అవయవితో సమసించినది. 'మీనొప్పెలవచ్చు (నట్టి) జాలరి దాన' అని సమాసము. దీనిచే '(తనువు మీన్బోల వల్చు = మీన్బోలవల్చు తనువు గల యని యర్థము)' అను వివరణము తెల్పుచున్నది.

ఇచట నొక విషయమును గమనింపవలెను. 'తెల్లని తురగోత్తము వాలంబు' అనుటకన్న 'ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు' అనుట సరసము కాదు. సంప్రదాయమును కాదు. ఇయ్యెడ 'ఉల్ల తెల్లని...' అను పాఠాంతర మున్నది. 'ఉల్ల అనునది అంత దూరము, అంత దగ్గఱ కాని ప్రదేశ మును దెల్పును. ఈ పాఠమును గ్రహించినచో నిది పయి సూత్రమునకు ఉదాహరణము కాఁజాలదు.

ఇఁక 'తనువు మీనొప్పెల వచ్చు జాలరిదాన' అనుచోట 'తనువున' అను సప్తమ్యర్థమున ప్రథమ వచ్చిన దని (చూ. కారక. ౨౦. సూ.)చెప్పినచో నీ సూత్ర మక్కఱలేకయే ఆ ప్రయోగమును సాధింపవచ్చును. కాఁగా ఉదాహరణములు రెండును ప్రకారాంతమున సుసాధ్యము లగుటచే నేత త్సూత్రము అనావశ్యక మని చెప్పవలసి వచ్చుచున్నది.

## ౧౬. తమ్ముఁగుఱ్ఱలు, చిలుకమొకరి యిత్యాదులు విశేష్య పూర్వపద కర్మధారయంబులు.

ఉ. 'తమ్ముఁగుఱ్ఱలు నీవుఁ, దగ విపినంబున కరిగితిరి." భార. ఆర. ౭. ఆ. ౪౧౩. 'క. ప్రభావతి,మోదము వెలిఁ జిలుకఁ జిలుక మొకరిం బలికె.' శుక. ౨ ఆ. ౮౯ మొ.

౧౬. తమ్ముఁగుఱ్ఱలు-చిలుకమొకరి మొదలగునవి పూర్వపదము విశేష్యముగా నున్న కర్మధారయ లగు నని సూత్రార్థము.

కర్మధారయసమాసమున విశేషణము తొలుతను, విశేష్యము దాని తర్వాత నుండి సమసించుచుండును. 'నల్లగలువ, సుందరపురుషుఁడు' మొదలగునవి అ రీతినే యున్నవి. కాని కొన్నియెడల విశేష్యము తొలి పదముగాను, విశేషణము మలిపదముగాను ఉన్నందున నీ సూత్రమును చెప్పవలసి వచ్చినది. 'తమ్ముఁగుఱ్ఱ-' ఇచట 'కుఱ్ఱ' విశేషణము; 'తమ్ము' విశేష్యము. 'చిలుక మొకరి' అనుచో 'మొకరి' విశేషణము. 'చిలుక' విశేష్యము.

'తమ్ముఁగుఱ్ఱ' అనుచో 'తమ్ము' అనుదానికి ద్రుతమును విధించు సూత్రము ప్రత్యేకముగ లేదు. కాన నీ ప్రయోగము ననుసరించి పరుష సరళములు పరములగునపుడు ఉదంతస్త్రీసమములకు బాలవ్యాకరణమున విధింపఁబడిన నుగాగమము స్త్రీసమములు కానట్టి ఉదందములకుఁగూడ వచ్చునని అనుకొనవలెను.

## ౧౭. ఆ యీ త్యాది ఘటితంబులు విశేషణోభయపద కర్మధారయంబులు.

ఉ. ఆ యీ నేరములు. 'ఈ యా దేశం బననేల?' స్వా. ౧ ఆ. ౬౮. 'ఎత్తిన పెంచిన వారి.' విక్ర. ౬ ఆ. ౧౧౦. 'కలిగిన యొప్పని దోషములు.' విజ్ఞా. ఆచా. ౧౦౭. 'కొట్టిన దిట్టిన యాతఁడు.' భోజ. ౬ ఆ. ౧౫. 'చలి తెలి మంచుతుంపరలు.' భాను. 3 ఆ 'వడచల్లని చల్లనిగాడ్పు.' రామా. ౧ ఆ. ౧౫౧. 'తియ్యబెల్లిమాటలు.' క్షేత్రయ. 'తొంగలి తఱచు ఱెప్పల.' భార. విరా. ౨ ఆ. 3౭. * 'తొలిప్రాఁతకుప్పసంబు.' జై. ౬ ఆ. ౪౨. 'నిడువాలికన్నులు.' (వాలిక = వాఁడి) భోజ. ౫ ఆ. 3౧. 'పెనునిట్టతాఁడు.' జై. ౨ ఆ. ౪౧. మొక్కపోయిన [1]వెలిఁగొమ్ము

* తన ప్రాఁతకుప్పసంబూడ్చు. పా. 1. వలికొమ్ముదోయి. పా.

దోయి' హరి. ఉ. ౭ ఆ. ౬౨. 'విన్నకన్నయర్థము.' కళా. ౮ ఆ. ౨౦౦. 'క్రొమ్మించు లేఁజెక్కుటద్దంబు.' నై. ౨ ఆ. ౧౧౩. 'తెలి నునుసోగ వెన్నెలల.' రామా. ౨ ఆ. ౬౯. మొ

౧౭. ఆ యీ త్యాది ఘటితంబులు = 'ఆ - ఈ' మున్నగు వానితోఁ గూర్పఁబడినవి. విశేషణోభయపదకర్మధారయములు = రెండు పదములును విశేషణములుగాఁ గల్గిన కర్మధారయములు.—అనఁగా విశేష్యములకు ముందు 'ఆ, ఈ' మున్నగు రెండు విశేషణము లున్న సమాసములును కలవనియుఁ, ఇట్టివి విశేషణోభయపదకర్మధారయము లని చెప్పఁబడు ననియు నర్థము. సాధారణముగా విశేషణ మొక్కటియే కానవచ్చుచున్నందున, నీ సూత్రము చెప్పఁబడినది.

బాలవ్యాకరణమున 'ఉపమాన పూర్వపద కర్మధారయము' మాత్రము చెప్పఁబడినందున విశేషణోభయపదకర్మధారయము కూడ నుండు నని యీ సూత్రము దానిని సవరించుచున్నది.

'ఈ యాదేశం బననేల?' (ఇచట 'ఈ, ఆ' రెండును విశేషణములు; 'దేశంబు' విశేష్యము; 'ఎత్తిన, పెంచిన వారి' (ఎత్తిన, పెంచిన విశేషణములు.) 'కలిగిన, యొప్పని దోషములు' (కలిగిన, యొప్పని విశేషణములు.) తక్కినవియుఁ నిట్టే.

ఉదాహరణములనుబట్టి విశేషణద్వయమునకుఁ బిదప విశేష్య ముండవలసి యున్నట్లు తెలియుచున్నది; కాని కొన్నియెడల విశేష్యపదరహితముగ విశేషణములు మాత్ర ముండుట కలదు. 'నులివెచ్చ-' ఇట్టివి విశేషణోభయపదకర్మధారయ మగును.

**౧౮. కొన్నియెడల విశేషణోభయపదంబులు త్రికక్రియాజన్యవిశేషణ ఘటితంబులు సందర్భయోగ్యపదవ్యవహితంబు లగు.**

త్రిక క్రియాజన్య విశేషణ ఘటితంబులు - త్రిక క్రియాజన్య విశేషణోభయ ఘటితంబులు, కేవల క్రియాజన్య విశేషణ ఘటితంబులు నని ద్వివిధములు. ఉ. 'క. ఈ కన్నులు తెలివని శిశు, వే కీ డొనరించె నీకు.' భోజ. ౬ ఆ. ౩౫౬. 'గీ. నెలులు గల మరునీలంపు టురులసిరుల, నరులుగొనఁజాలి నరులను మరులు గొలుపు; నిరులు గెలిచిన తుమ్మెదగఱులఁ దెగడు, కురుల నులి దీర్చి విరు లిడి కొప్పు వెట్టి.' భాగ. ౧౦ స్కం. ఉ. ౨౮౨. 'ఎ-గీ. గగన మను రుద్రభూమి నేకతమ తిరుగు, నదరు లుమి నెదు కొఱవిదయ్యంబు వీఁడె.' నై. ౨ ఆ. ౧౨౨ 'చ. నే, బలిమిఁ గుబేరునిం గెలిచి బాగుగఁ గొన్న రవిప్రకాశమై, యలరుచున్న పుష్పకమునందు రమింపుము కోర్కు లారఁగన్.' రా. ఆర. కాం. ౨ ఆ. ౧౯౭. 'ఎత్తెడునట్టి యొఱ్ఱగాఁ గాఁగిన మడ్డుచందము' ప్రభా. ౫ ఆ. ౬౦. 'సీ. ఆనకదుందుభి ననరాని వినరాని దుర్వాక్యసూచులఁ దూలపుచ్చె' వి. పు. ౭ ఆ. ౩౧౨. 'క. చిక్కని చక్కని నున్నని, క్రుక్కని తోలూడ్వఁబడని ఛల్లి సెగలచే, నొక్కఁబడని దండంబులు, తక్కక యుపనయనవేళఁ దాల్పఁగవలయున్.' విజ్ఞా. ఆచా. ౨౨. మొ. (ఇట్టి ప్రయోగములు కవిత్రయమువారి గ్రంథములయందు దొరకినవి కావు.)

౧౭. విశేషణోభయపదంబులు=విశేషణోభయప[illegible]కర్మధారయములు; త్రిక క్రియాజన్యవిశేషణఘటితంబులు = త్రిక క్రియాజన్యవిశేషణములతోఁ గూర్పఁబడినవి. రెండు క్రియాజన్యవిశేషణములతోఁ గూర్పఁబడినవియును, సందర్భయోగ్య పదవ్యవహితంబులు=ఆ యా సందర్భమునకుఁ దగినట్టి పదములతోడి వ్యవధానము కలవి.

త్రిక, క్రియాజన్యవిశేషణోభయపద ఘటితములును, (లేక) కేవల క్రియాజన్యవిశేషణఘటితంబులు నగు కొన్ని విశేషణోభయపద కర్మధారయములందు విశేషణములు అవ్యవహితములుగాఁ గాక, సందర్భయోగ్యపదములతోడి వ్యవధానము కలిగి యుండును. అనఁగా-ఆ విశేషణద్వయమునకు నడుమ సందర్భమునకు సరిపడిన యితర పదములు చేరుట కల దని యర్థము.

'ఈ కన్నులు తెఱవని శిశు వే కీ డొనరించె నీకు?'- ఇచట 'ఈ, తెఱవని' విశేషణములు; అందు 'ఈ' త్రికము; 'తెఱవని' క్రియాజన్యవిశేషణము; 'శిశువు' విశేష్యము. ఇయ్యది త్రిక, క్రియాజన్యవిశేషణోభయపద కర్మధారయము; ఇచట 'ఈ, తెఱవని' అను విశేషణములకు నడుమ 'కన్నులు' అను సందర్భయోగ్యమగు పదము ప్రవేశించినది; కాన 'ఈ, తెఱవని' అను విశేషణములకు వ్యవధానము కలిగినది.

'సెలులుఁగల...కురుల...' అనుచోట 'కొలుపు, తెగడు-' అనునవి క్రియాజన్యవిశేషణములు; 'కురుల' విశేష్యము. విశేషణముల కిచ్చట 'ఇరులు గెలిచిన తుమ్మెదగఱులన్-' అను పదములతో వ్యవధానము కలిగినది.

'గగన మను...కొఱవిదయ్యంబు వీఁడె!' అనుచెడ 'తిరుగు, ఉమిసెడు' వనునవి క్రియాజన్యవిశేషణములు. వానికి 'అదరులు' అను సందర్భయోగ్యపదముతో వ్యవధాన మున్నది.

'నీ బలిమి...కోర్కు-లారఁగన్-' ఇచట 'కొన్న, అలరుచున్న' అనునవి క్రియాజన్యవిశేషణములు. వానికి 'రవిప్రకాశమై' యను పదముతో నడుమ వ్యవధానము కలిగినది.

'ఎత్తెడునట్టి యొట్టిగాఁ గాచిన మద్దుచందము'-'ఎత్తెడునట్టి, కాచిన' విశేషణములు 'ఎట్టిగా' అను పదముతో వానికి వ్యవధానము కలిగినది.

'అనకదుందుభి నసరాని వినరాని దుర్వాక్యములచేఁ దూలపుచ్చె' ఇచట 'అనరాని, వినరాని' అనునవి క్రియాజన్యవిశేషణములు. వీనికి పదాం

తరములతోడి వ్యవధానము లేనందున నిది ౧౭-వ సూత్రమున నుదాహార ణము కాఁదగును. లేదా-'రాని, రాని, అనునవే విశేషణము లని గ్రహించి, ఆ రెండును 'విన' తో వ్యవహితము లని సమాధానము చెప్పనగును. కాని యీ సమాధానము సరసము కాదు.

'చిక్కని...దాల్పఁగవలయున్-' ఇచటి 'తోలూడ్వఁబడని, నొక్కఁ బడని' అను విశేషణములకు 'ఘుల్లిసెగలచే' అను సందర్భయోగ్యపదముతో వ్యవధాన మేర్పడినది.

పయి ప్రయోగము లన్నియును కవిత్రయేతరులగు కవుల గ్రంథముల లోనివే. కావుననే యిట్టివి కవిత్రయమువారి గ్రంథములలో కానరాలే దని వివరణమునఁ జెప్పఁబడినది.

## ౨౫. అలరుఁబోఁడీత్యాదు లుపమానపూర్వపద కర్మధార యంబులు.

ఇటఁ బోఁడి పరఁబగుచో నెల్లెడల నుమ్మగు. ఆదిపదం బుచే తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిబోఁడి, ఇగురుఁబోఁడి, చిగురుఁ బోఁడి, తలిరుఁబోఁడి, పువ్వుఁబోఁడి; పూవుఁబోఁడి, పూఁబోఁడి యిత్యాదులు గ్రాహ్యంబులు, (అలరు+పోఁడి) దీనికిఁ బువ్వవలె మనోజ్ఞురాలైన దని యర్థము. ఇట్లంతట నెఱుఁగవలయు.

ఉ. 'మ. చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతిస్త్రీ లెవ్వరే నిందు లేఁరుగదా.' కళా. 3 ఆ. ౧3౧. 'శా. ద్రోవదక; దీయంబోఁడి వరింపఁగా వసుధ కేతేఁ జూచు నాది త్యులో.' పాంచా. 3 ఆ. 'వేల్పుంబువుంబోండ్లు.' య. ౧ ఆ. ౭౮. 'క. యౌవనము కలిగినప్పుడ, పూవుంబోఁడులకుఁ బతుల భోగంబులుగాక.' కళా. ౪ ఆ. ౭౯ మొ.

త్రిక, క్రియాజన్యవిశేషణోభయపద ఘటితములును, (లేక) కేవల క్రియాజన్యవిశేషణఘటితంబులు నగు కొన్ని విశేషణోభయపద కర్మధారయములందు విశేషణములు అవ్యవహితములుగాఁ గాక, సందర్భయోగ్యపదములతోడి వ్యవధానము కలిగి యుండును. అనఁగా-ఆ విశేషణద్వయమునకు నడుమ సందర్భమునకు సరిపడిన యితర పదములు చేరుట కల దని యర్థము.

'ఈ కన్నులు తెఱవని శిశు వే కీ డొనరించె నీకు?'- ఇచట 'ఈ, తెఱవని' విశేషణములు; అందు 'ఈ' త్రికము; 'తెఱవని' క్రియాజన్యవిశేషణము; 'శిశువు' విశేష్యము. ఇయ్యది త్రిక, క్రియాజన్యవిశేషణోభయపద కర్మధారయము; ఇచట 'ఈ, తెఱవని' అను విశేషణములకు నడుమ 'కన్నులు' అను సందర్భయోగ్యమగు పదము ప్రవేశించినది; కాన 'ఈ, తెఱవని' అను విశేషణములకు వ్యవధానము కలిగినది.

'నెఱులుంగల...కురుల...' అనుచోట 'కొలుపు, తెగడు-' అనునవి క్రియాజన్యవిశేషణములు; 'కురుల' విశేష్యము. విశేషణముల కిచ్చట 'ఇరులు గెలిచిన తుమ్మెదగఱులన్-' అను పదములతో వ్యవధానము కలిగినది.

'గగన మను...కొఱవిదయ్యంబు వీఁడె!' అనుచెడ 'తిరుగు, ఉమిసెడు' వనునవి క్రియాజన్యవిశేషణములు. వానికి 'అదరులు' అను సందర్భయోగ్యపదముతో వ్యవధాన మున్నది.

'నే బలిమి...కోర్కులారఁగన్-' ఇచట 'కొన్న, అలరుచున్న' అనునవి క్రియాజన్యవిశేషణములు. వానికి 'రవిప్రకాశమై' యను పదముతో నడుమ వ్యవధానము కలిగినది.

'ఎత్తెడునట్టి యొట్టిగాఁ గాచిన మడ్డుచందము'-'ఎత్తెడునట్టి, కాచిన' విశేషణములు 'ఎట్టిగా' అను పదముతో వానికి వ్యవధానము కలిగినది.

'అనకదుండుభి నసరాని వినరాని దుర్వాక్యసూచుతఁ దూలపుచ్చె' ఇచట 'అనరాని, వినరాని' అనునవి క్రియాజన్యవిశేషణములు. వీనికి పదాం

శరములతోడి వ్యవధానము లేనందున నిది ౧౭-వ సూత్రమున నుదాహర ణము కాఁదగును. లేదా-'రాని. రాని, అనునవే విశేషణము లని గ్రహించి, ఆ రెండును 'విన' తో వ్యవహితము లని సమాధానము చెప్పనగును. కాని యీ సమాధానము సరసము కాదు.

'చిక్కని...దాల్పఁగవలయున్-' ఇచటి 'తోలూడ్వఁబడని, నొక్కఁ బడని' అను విశేషణములకు 'ఘల్లిసెగలచే' అను సందర్భయోగ్యపదముతో వ్యవధాన మేర్పడినది.

పయి ప్రయోగము లన్నియును కవిత్రయేతరులగు కవుల గ్రంథముల లోనివే. కావుననే యిట్టివి కవిత్రయమువారి గ్రంథములలో కానరావే దని వివరణమునఁ జెప్పఁబడినది.

## ౧౯. అలరుఁబోఁడీత్యాదు లుపమానపూర్వపద కర్మధార యంబులు.

⊕

ఇటఁ బోఁడి పరఁబగుచో నెల్లెడల నుమ్మగు. ఆదిపదం బుచే తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిబోఁడి, ఇగురుఁబోఁడి, చిగురుఁ బోఁడి, తలిరుఁబోఁడి, పువ్వుఁబోఁడి; పూవుఁబోఁడి, పూఁబోఁడి యిత్యాదులు గ్రాహ్యంబులు, (అలరు+పోఁడి) దీనికిఁ బువ్వవలె మనోజ్ఞురాలైన దని యర్థము. ఇట్లంతట నెఱుఁగవలయు.

ఉ. 'మ. చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతిస్త్రీ లెవ్వారే నిందు లేఁరుగదా.' కళా. 3 ఆ. ౧౩౧. 'శా. ద్రోవదీ; దీయంబోఁడి వరింపఁగా వసుధ కేతేఁ జూచు నాది త్యులో.' పాంచా. 3 ఆ. 'వేల్పుంబువుంబోండ్లు.' య. ౧ ఆ. ౭౮. 'క. యౌవనము కలిగినప్పుడ, పూవుంబోఁడులకుఁ బతుల భోగంబులుగాక.' కళా. ౪ ఆ. ౭౯ పొ.

౧౯. 'అలరుఁబోఁడి' మున్నగు పదములు తొలిపదము ఉపమాన వాచకముగాఁ గల కర్మధారయసమాసము లగు నని యర్థము.

చిన్నయసూరిగారు 'అలరువంటి మేను కలది' అను నర్థము గ్రహించి బహువ్రీహి యని చెప్పుచు 'మేను' నకుఁ 'బోఁడి' అను నాదేశమును విధించుచు 'బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబుమీఁది 'మేను' నకుఁ బోఁడి యగు' నని సూత్రించి యున్నారు. అయ్యెడ 'అలరు + పోఁడి' మున్నగుచోట్ల బాలవ్యాకరణసంధిసూత్రము (౨౫) ననుసరించి నుగాగమము వచ్చి రూపసిద్ధి యగును; కాని యనుదంతములగు 'ననఁబోఁడి' మున్నగునవి సిద్ధింపనేఱవు. మఱియుం 'పోఁడి' అనునది 'మేను' అనుదాని యర్థము నిచ్చు ననుటకంటె 'రమ్యము' అను నర్థమున వాడఁబడె ననుట సమంజసము. ఈ యాశయముననే ప్రౌఢవ్యాకర్త యిట్లు సూత్రింపవలసి వచ్చెను.

'అలరు + పోఁడి' = పూవువలె మనోజ్ఞురాలైన దని యర్థము. ఇచట చింతామణియందలి 'నుమ్యాచతః' అను సూత్రసంప్రదాయము ననుసరించి 'పోఁడి' పరమగునపుడు నుమాగమము కూడ నిచ్చుటనే విధింపఁబడుచున్నది. పిదప ద్రుతకార్యము రాఁగా 'అలరుఁబోఁడి' సిద్ధించును. 'ననఁబోఁడి' మున్నగునవియుం నిట్టే.

'చిగురుంబోఁడి యెఱుంగుదే!-' అనుచో ద్రుతము పూర్ణబిందు వైనది. ఇట్టే తక్కిన ప్రయోగములయందును ద్రుతమునకుఁ బూర్ణబిందుత్వము గ్రాహ్యము.

**౨౦. ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు.**

ఉ. 'క. తక్కిన సైన్యము లనిలోఁ, జిక్కి పరాఙ్ముఖతఁ దోలఁగ శివుఁడును భీతిన్, బొక్కుచు నలసతమెయి న, ద్దిక్కు దిరిగి నిలిచి యాపులించుచునుండెన్.' ఉ. హరి. ౬ ఆ. ౬౨౮.

ఉ. అస్త్రౌకనిజ ప్రభావములు సూపెడు గద్దియమీఁద నెక్కి

ము,ల్లోకము దాన యేలుగతి లోలవిలోచన యేమి చెప్పుదుఁ.'
పారి. ౧ ఆ. ౭౯. 'ముమ్ముహూర్తమునకు' జై. ౭ ఆ.
౨౩ మొ.

౨౦. తత్సమమునకు, ఆచ్ఛికమునకును గలుగు సమాసము మిశ్రము. కొన్ని యెడల మిశ్రద్విగువు ఏకవచనాంతమై యుండు నని యర్థము.

బాలవ్యాకరణమున 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు; మిశ్రంబునకుఁ గాదు.' అని మిశ్రద్విగు వెప్పుడును బహువచనాంతముగానే యుండు నని తెలుపఁబడినది. కాని ఏకవచనాంతము లగు మిశ్రద్విగువులు కవిప్రయోగములందుఁ గానవచ్చుటచే వానిని సాధించుట కీ సూత్రము చెప్పఁబడినది.

'...నల్దిక్కు దిరిగి నిలిచి...' ఇచట 'నల్దిక్కులు' అని యుండఁదగ 'నల్దిక్కు' అని కలదు. '...ముల్లోకము దాన యేలుగతి...' ఇచటను ద్విగు వేకవచనమే; 'ముమ్ముహూర్తము' నిట్టే. పయిచోట్ల మొదటిపద మాచ్ఛికము. రెండవ పదము తత్సమము. కాన నివి యన్నియును మిశ్రద్విగువులు.

## ౨౧. వారార్థకశబ్దంబు లద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యాపూర్వకంబు లగు.

ఉ. ఒకతడవ; ఒకతూరి, ఒకతేప, ఒకమాటు, ఒకసారి. రెండు తడవలు, ఒకతడవకు, రెండుతడవలకు మొ. అద్విరుక్తంబనుటచే తేపతేపకు; తఱచుగ ననుటచే తడవకు ఇత్యాదు లెఱుంగునది.

౨౧. వారార్థకశబ్దములు = తడవ, తూరి, తేప మున్నగునవి అద్విరుక్తంబులు = ద్విర్భావము పొందనివి.

తడవ, తూరి, తేప మున్నగు శబ్దములు ద్విరుక్తములు కానియప్పుడు వానికి ముందు సంఖ్యావాచకములు తఱచుగా చేరుచుండు నని అర్థము.

ఉదాహృతులలో 'ఒక తడవ' మున్నగు వారార్థకముల ముందు 'ఒక' మున్నగు సంఖ్యావాచకములు చేరినవి. ద్విరుక్తము లగునపుడు 'తేప తేపకు' అని యీ రీతి నుండును. అయ్యెడ 'ఒక తేపతేపకు' మున్నగు రీతి నుండవు. సూత్రమునందు 'తఱచుగ' అని యుండుటచే సంఖ్యావాచకము చేరక 'తడవకు' అనియు నుండును.

**౨౨. ఒకండ్వాదులు పరంబులగుచోఁ దఱచుగ నుక్ బదికగు.**

ఉ. పదునొకండు, పదునొకం(డ్రు); పదుమూఁడు; పదు మూఁగురు; పదునాలుగు, పదునలుగురు; పదునేను, పదునేగురు; పదునాఱు, పదునాఱుగురు; పదునేడు, పదునేడుగురు: పదునెని మిది, పదునెనమం(డ్రు), తఱచుగ ననుటంజేసి పదియాఱు, పదా ఱిత్యాదిరూపంబులు గ్రాహ్యంబులు. 'క. పోరులఁ గర్ణుండు పదాఱవ, కళకు సమానుండు గాఁడు కవ్వడితోడన్.' భార. అర. ౨ ఆ. ౨౯౩ పొ.

౨౨. 'ఒకండు' మున్నగునవి పరములుగా నున్నప్పుడు తఱచుగా 'పది' అనుదాని చివర 'ఉన్' అనునది చేరుచుండు నని సూత్రార్థము. 'పది + ఉన్ + ఒకండు = పదునొకండు, పది + ఉన్ + ఒకం(డ్రు) = పదునొకం(డ్రు); పది + ఉన్ + మూఁడు = పదుమూఁడు; పది + ఉన్ + మూఁగురు = పదు మూఁగురు. (హల్లు పరమగుచో 'ఉన్' లోని నకారమునకు లోపము.) పది + ఉన్ + నాలుగు = పదునాలుగు; పది + ఉన్ + నలుగురు = పదునలుగురు; ఇట్లే తక్కినవియును. ఈ సూత్రమున 'ఉన్' ఆగమము తఱచుగ నగు నని చెప్పఁబడుటచే ఒక్కొక్కపుడు రాకపోవుటయును గల దని యర్థము. కాన 'పది + ఆఱు' అనుచో నీ యాగమము రాక, 'పదాఱు, పదియాఱు' అనియు నగును. '...పదాఱవకళకు సమానుండు కాఁడు...' అనుచో నీ 'ఉన్' ఆగమము రాకుండుటను గ్రహించునది.

**౨౩. పదికి రెం డిరు దొమ్మిదులు పరంబులగునపుడు బిందు పూర్వక డకారంబును, ద్విరుక్తనివర్ణంబును, బిందు వును గ్రమంబుగ దివర్ణంబున కగు.**

ఉ. పండ్రెండు, పన్నిరుగురు, పన్నిద్దఱు; పందొమ్మిది, పందొమ్మండ్రు.

౨౩. 'రెండు, ఇరు, తొమ్మిది' అనునవి పరముగా నున్నయెడల 'పది' కిఁ గ్రమముగా 'ది' స్థానమున 'ండ్' 'న్ని' 'ం' అనునవి ఆదేశము లగును. ఇచటి బిందుపదముచే పూర్ణబిందువునే గ్రహింపవలయును. (నుడి తొలిహ్రస్వముమీఁద [అఁట, యిఁక, చుఁడులందుఁదప్ప] అర్ధబిందు వుండ దను సంగతి తెల్లము.

(1) పది+రెండు - (దిస్థానమున 'ండ్.') ప+ండ్+రెండు = పండ్రెండు; (2) పది+ఇరుగురు (దిస్థానమున 'న్ని) ప+న్ని+ఇరుగురు = పన్నిరుగురు. (ఇచట అపదాది స్వరసంధి-నిత్యము) పది+ఇద్దఱు = పన్నిద్దఱు. (ఇచట ఇరుగురున కిద్ద అని యాదేశము. (శబ్ద. ౯౦. సూ.) (3) పది+తొమ్మిది=(దిస్థానమున పూర్ణబిందువు ప+ం+తొమ్మిది-సరళాదేశము. పందొమ్మిది.)

'పందొమ్మిది' అనునది బాలవ్యాకరణమున 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' నను సూత్రమున నుదాహరణముగా నీయఁబడినది. కాని యయ్యది నియమబద్ధమగు విధి కానందునను, 'పండ్రెండు, పన్నిరుగురు' మున్నగువాని కొఱకెట్లును సూత్రరచన యావశ్యకమగుటను ఈ విధిని చెప్పుటయు, 'పందొమ్మిది' ఈ సూత్రము ననుసరించి సాధింపఁబడుటయు నెంతయు సమంజసము.

**౨౪. పది యుత్తరపదం బగుచో నేను దొమ్ముల నుమ్ములకు బిందువు ప, పని కెనును, ఏడునకు వర్ణవ్యత్యయం**

**బును, ఆ పరుషంబునకు సరళంబును క్రమంబుగ నగు.**

ఏఁబది, ఏఁబండ్రు; తొంబది, తొంబండ్రు; ఎనుబది; ఎనుబండ్రు; డెబ్బది, డెబ్బండ్రు మొ.

౫౮. 'పది' అనునది ఉత్తరపదంబై (రెండవ పదమై) యుండునపుడు 'ఏను' లోని 'ను' స్థానమున బిందువు వచ్చును; 'తొమ్మి' లోని 'మ్మి'కి బిందు వగును. 'ఎని' అనుదానికి 'ఎను' ఆదేశ మగును; 'ఏడు' అను దానిలోని యక్షరములు ముందు వెనుక లగును-అనఁగా-ఏడు-'డే' అగును. ఈ యాదేశములు వచ్చునపుడు 'పది' లోని పరుషము సరళ మగును.

'ఏను+పది'-నుస్థానమున బిందువు; ఈ బిందువు దీర్ఘముపయి వచ్చునది గాన అర్ధబిందువే యగును; సరళాదేశము. 'ఏఁబది' అగును.

'ఏను+పది+రు-' బిందువు; సరళాదేశము. శబ్ద. ౯౩-సూ. బిందుపూర్వకడకారాగమము. 'ఏఁబండ్రు.'

తొమ్మి+పది, తొమ్మి+పండ్రు - 'మ్మి' కి బిందువు; సరళాదేశము. 'తొంబది' తొంబండ్రు.' (ఇచటి బిందువు నుడి తొలి హ్రస్వముమీఁది దగుటచే పూర్ణబిందువే వచ్చిన దని గ్రహింపవలెను. ఇచటి 'తొమ్మి' తొమ్మిది లుప్తశేషము.)

ఇయ్యది బాలవ్యాకరణమున 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' నను సూత్రముచే సాధింపఁబడినది. కాని ఇచట నియమబద్ధముగఁ బ్రక్రియ చూపఁబడినది.

ఎని+పది. (ఇచట 'ఎని' ఎనిమిదిలో లుప్తశేషము. 'ఎని' కి 'ఎను' ఆదేశము. సరళాదేశము). 'ఎనుబది'. ఇట్లే 'ఎని+పండ్రు=ఎనుబండ్రు.'

'ఏడు+పది'-వర్ణవ్యత్యయము. డే+పది; (సమాస. ౧౫-వ సూ. చే హ్రస్వము; సరళాదేశము. 'డెబది' శబ్ద. ౧౦౦-సూ. చే ద్విత్వము) డెబ్బది.' అగును. ఏడు+పండ్రు = డెబ్బండ్రు. అనునదియు నిట్లే.

ఇచట కుమారదేవపండితీయమునందు 'తొమ్మి' అనునది 'తొమ్ము'గా గ్రహింపఁబడి, దాని ననుసరించియే వివరణము వ్రాయఁబడినది. సూత్రము లోని 'ఏనుదొమ్ముల నుమ్ములకు' అనుచో 'ఏను; తొమ్మి' అనువాని 'ను,మ్మి'- అను వానినే గ్రహింపవలెను; (ఏనుదొమ్మి+లు = ఏనుదొమ్ములు; ను, మ్మి+ లు = నుమ్ములు - బహువచనము పరము కాఁగా ఇకారము ఉకారముగా మాఱినది.)

**౨౫. పది యుత్తరపదం బగుచోఁ బూర్వపదంబు దీర్ఘంబు నకు హ్రస్వం బగు. ఏనునేకు రాదు.**

ఉ. ముప్పది; ముప్పండ్రు; నలువది, నలువండ్రు; అఱు వది, అఱువండ్రు మొ.

౨౫. 'పది' రెండవ పదముగా నున్నపుడు పూర్వపదమునం దున్న దీర్ఘము హ్రస్వముగా నగును. 'ఏను' హ్రస్వము కాదు.

'మూఁడు+పది-' బాలవ్యాకరణమునందలి సమాస. ౧౭. సూ. చే సమానాధికరణం బగు నుత్తరపదంబు పరమగుచో 'మూఁడు' శబ్దము డు లోపము; ప్రకృతసూత్రముచే హ్రస్వము. 'ము+పది' (శబ్ద. ౧౦౦ సూ. చే ద్విత్వము.) 'ముప్పది' అగును. ఇట్లే 'ముప్పండ్రు.'

నాలు+పది ('నాలు' అనునది 'నాలుగు' గువర్ణము లోపించిన రూపము.) గసడదవాదేశము. (బాల. సంధి. ౧౩. బహుళగ్రహణముచే నిచట గసడదవాదేశము నిత్యమని గ్రహింపనగును.) హ్రస్వము. 'నలువది.' ఇట్లే 'నలువండ్రు' అనునదియును.

'అఱు+పది-' హ్రస్వము - గసడదవాదేశము—'అఱువది' అగును. "అఱువండ్రు' కూడ నిట్టే.

'ఏను+పది' అనుచో హ్రస్వము రానందున 'ఏఁబది' అనియే యుండును. 'ఎబ్బది' అని కాదు.

**౨౬. కొన్ని యెడల నీ సమాసపదంబులు యువర్ణ వ్యవహితంబులు నగు.**

ఉ. 'అక్కర. వనమునఁ బదియురెండేడు లజ్ఞాతవాసమొక్కేడు, జనపదంబున నుండి.' భార. ఆది. 3 ఆ. ౧౯. 'తే. ద్రోహులగు వేలుపులలోన దొరసియున్న, పదియునొక్కండ్రు రుద్రులఁ బాఱవిడిచె' కాశీ. ౭ ఆ. ౮౬. మొ.

౨౬. ఈ సమాసపదంబులు = సంఖ్యావాచకములతోడి సమాసపదములు; యువర్ణవ్యవహితంబులై = 'యుం' అను నక్షరముతోడి వ్యవధానము కలవయి. అనఁగా- 'పండ్రెండు; పదునొక్కండ్రు' మున్నగు సమాసపదముల నడుమ 'యుం' చేరి, ఆ సంఖ్యావాచకములు వేఱుగా నుండునట్లు చేయుం నని యర్థము.

'పదియుం రెండేడులు-పదియుం నొక్కండ్రు' అనునవి 'యుం' వ్యవహితము లగుట స్పష్టము. 'వ్యవహితంబులు'నని చెప్పుటచే 'పండ్రెండేడులు-పదునొక్కండ్రు' మున్నగు రూపములు నగును.

**౨౭. కలకంఠుఁడు బహువ్రీహి.**

(చూ. సంజ్ఞా. ౯ సూ. ఉ.) దీని నహోబలపతిపండితుఁడు. మిశ్రబహువ్రీహి యనెఁ గాని యది య ట్లగుట దుర్ఘటము.

౨౭. 'కలకంఠుఁడు' అనునది బహువ్రీహిసమాస మగును గాని, మిశ్రబహువ్రీహి కా దని యర్థము.

'కలకంఠుఁడు' తద్భవ మగు నని తద్భవములందు నలఘురేఫము కల దని చెప్పుచు ఉదాహరణ మీయఁబడినది. అది తద్భవమయినను, అనాంధ్రవర్ణమగు తకారముతోఁ గూడియుండుటచే అనింద్యగ్రామ్యమగునని ప్రౌఢవ్యాకర్తమతము. ఇతని శబ్దరత్నాకరమున నిట్టే చూపఁబడినది. అహోబల

పండితుఁ డిది మిశ్రబహువ్రీహి యగుననెను. మిశ్రబహువ్రీహియైనయెడల ఇది అగ్రామ్యము కావలసి వచ్చును; అనింద్యగ్రామ్యము కాకపోవలసి వచ్చును. అథర్వణుఁడు 'మహాకవిప్రయోగ మగుట నిది గ్రామ్యా' మనెను. ఇయ్యది యనింద్యగ్రామ్య మనుటయే యుఁచిత మని ప్రౌఢవ్యాకర్త యాశయము.

ఇయ్యది యనింద్యగ్రామ్యమనుటలో బాల, ప్రౌఢ వ్యాకరణకర్తల కభిప్రాయభేదము లేకున్నను, తద్భవములం దలఘురేఫము కలదా? లేదా?' అను విషయమున అభిప్రాయభేద మున్నదనియుఁ, సంజ్ఞాపరిచ్ఛేదములో తదర్థమయి 'కఱకంఠుఁడు' ఉదాహృతమయ్యె ననియుఁ గ్రహింపవలసి యున్నది.

## ౨౮. కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్యస్వరంబునకు దీర్ఘంబునుం జూపట్టెడు.

ఉ. 'అన్నాదమ్ములు.' ఉ. హరి. ౪ ఆ. ౧౫౭. 'అప్పాచెల్లెండ్రు.' నిర్వ. 3 ఆ. ౯౬. 'తల్లీదండ్రులు.' భల్లా ౪ ఆ.

౨౮. మహద్ద్వంద్వంబునన్=మహద్వాచకములతోఁగూడిన ద్వంద్వమునందు; పూర్వపదాంత్యస్వరంబునకున్ = మొదటిపదము చివర నున్న అచ్చునకు.

మహద్వాచకములతోఁగూడియున్న ద్వంద్వసమాసమున తొలిపదము చివర నున్న అచ్చునకు దీర్ఘముకూడ రావచ్చునని సూత్రార్థము. సూత్రమునందలి మహత్పదముచే మహతీవాచకములను కూడ గ్రహింపవలయును.

'అన్నాదమ్ములు, అప్పాచెల్లెండ్రు, తల్లీదండ్రులు' అనుచో మొదటిపదముచివరి యచ్చునకు దీర్ఘము వచ్చినది.

## ౨౯. ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమంబగు. అగుచో వా ముఁవర్ణకంబునకు లోపం బగు.

ఉ. 'అంద[1]చందములు.' అని. ౫ ఆ. ౬౩. 'వెచ్చసచ్చ ములు.' వేం, పంచ. ౧ ఆ. ౭౬౩. మొ.

టీ. కొన్నియెడల ద్వంద్వసమాసమునందలి తొలిపదము నపుంసకసమానమయి యుండును. అప్పుడు ఆ పదము చివరి 'ము'వర్ణకము లోపించును.

'అచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు'నని బాలవ్యాకరణమునఁ జెప్పఁబడినది. స్త్రీసమమే కాక క్లీబసమమును ద్వంద్వమగు ననుచు నీ సూత్రము చెప్పుచున్నది. అట్టిక్లీబసమశబ్దముల చివర నున్న 'ము' ప్రత్యయమునకు లోపమును కూడ నీ సూత్రము విధించుచున్నది.

'అందము + చందములు = అందచందములు; (అందము క్లీబసమము. 'ము' లోపము.) 'వెచ్చము + సచ్చములు = వెచ్చసచ్చములు. (వెచ్చము క్లీబసమము. 'ము' లోపము.)

## ౩౦. ద్వంద్వం బప్రాణివాచక కృదంతశబ్దఘటితం బేకవచనాంతంబు నగు.

ఉ. కూడుగుడ్డ. 'కూరగాయ.' జై. ౮ ఆ. ౯౬. 'దరిడాపు.' భోజ. ౨ ఆ. ౬. 'రేవగలు' రామా. ౨ ఆ. ౧౨. [2]'తాఁకు దగులు.' హరి. ఉ. ౫ ఆ. ౯౦. నుశబ్దంబుచేఁ గూరగాయ లిత్యాదులు బహువచనాంతంబులు నగు నని యెఱుంగ వలయు.

౩౦. ప్రాణిని బోధింపని కృదంతశబ్దముతోఁ గూడియున్న ద్వంద్వసమాసము ఏకవచనాంతముగాఁ గూడ ఉండును.

బాలవ్యాకరణమున 'ద్విగువున కేకవచనంబు ప్రాయికముగా నగు'నని చెప్పఁబడినది; అప్రాణివాచకమగు కృదంతముతోఁ గూడి యున్నపుడు

---

1. నందములు. పా. 2. తాఁకుదగులు. పా.

ద్వంద్వముకూడ నేకవచనమునం దుండు నని యీ సూత్రము వివరించు చున్నది. 'కూరగాయ' మన్నగునవి యుదాహరణములు. ఇవి 'కూరగాయలు' మన్నగు బహువచనాంతములుగాఁ గూడ నుండును. ఈ యంశము సూత్రమం నందలి 'ను' అను సముచ్చయార్థకమే తెలియఁజేయుచున్నది.

## ౩౧. భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు.

టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు.

ఉ. 'ఔగాములు.' (ఔట+కామి.) పర. 3 ఆ. ౨౯౦. 'చెల్లుచెల్లములు.' (చెల్లుట+చెల్లమి) వేం. పంచ. ౧ ఆ. ౭౬3. 'వచ్చురాములు.' (వచ్చుట+రామి) పాండు. ౪ ఆ. ౬౬. 'వినివినములు.' (వినికి+వినమి.) సా. ౨ ఆ. ౭౭ మొ. (వినికి=వినుట.)

౩౧. భావద్వంద్వ మనఁగా భావార్థమున వచ్చిన ప్రత్యయములు చేరిన కృదంతశబ్దముల కగు ద్వంద్వము; అందు మొదటిపదము చివర నుండు 'ట' అను ప్రత్యయము లోపించును.

'ట' అనునది భావార్థమున వచ్చు కృత్ప్రత్యయము ఈ 'ట' ప్రత్యయము తక్కిన భావార్థక ప్రత్యయము లన్నిటికిని గ్రాహకము. కాన 'ఇక' మన్నగువానికి కూడ లోపము కలుగు నని చెప్పవలెను.

భావార్థకపదములతోఁ గూడిన ద్వంద్వములలో నొకటి భావార్థకము. వేఱొకటి వ్యతిరేకభావార్థకము నుండుట సాధారణము. ఉదాహరణము లన్నియు నట్లే యున్నవి. కాన నిచట భావార్థకము లనఁగా, భావార్థకములు, వ్యతిరేక భావార్థకములు కూడ నగు నని తెలియవలెను.

ఉదాహరణములు స్పష్టములు. 'వినికి' అనుదాని 'కి' లోపము టవర్ణకంబు కృత్ప్రత్యయంబున 'కుపలక్షణ' మగుటచేఁ గలిగినది. కాన 'వినివినములు' అయినది.

## 32. ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు.

ఉ. 'పుట్టుగ్రుంకుగట్టు.' య. ౫ ఆ. ౩౦. 'తోవదమ్మివిందు.' రామా. 3 ఆ. ౭౫. 'విన్నకన్నది.' వి. పు ౨ ఆ. పుట్టుగ్రుంకు గట్టనఁగా పుట్టుగట్టు, క్రుంకుగట్టు. ఇట్లింతట నెఱుంగునది.

32. పూర్వపదాంత్యావయవంబునకున్ = మొదటిపదము చివర అవయవముగా ఉండుదానికి, లోపంబొండెన్ = లోపమైనను; అనఁగా—ద్వంద్వసమాసమునందుఁ దొలిపదము చివరి యవయవమునకు లోపము వచ్చిన రావచ్చు నని యర్థము. లోపము రాకున్నను రాకపోవచ్చు నని భావము. 'పుట్టుగ్రుంకుగట్టు-' (పుట్టుగట్టు+క్రుంకుగట్టు) ఇచట తొలిపదము చివరి 'గట్టు' లోపించినది; 'తోవదమ్మివిందు' (తోవవిందు+తమ్మివిందు) ఇచట 'విందు' లోపించినది. 'విన్నకన్నది' (విన్నది+కన్నది.) ఇచట 'ది' లోపించినది.

## 33. ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రమంబును, అందలి పూర్వపదంబు క్లీబసమంబునుగఁ గానఁబడియెడి.

ఉ. అవసరమక్కఱలు. 'క. అవసరమక్కఱలం దైౖ, దుష్కక్షములందు వేఁటదోఁటలయందున్, దప్పులైన పాఁతలెంకల, మప్పుటన్ మముఁ జూడు మోపినప్పుడైనన్.' రామా. ౨ ఆ. ౯.

33. కొన్నిచోట్ల ద్వంద్వసమాసము మిశ్రమగును. అనఁగా - తత్సమాచ్ఛికపదములు సమాసము పొందును. అప్పుడు అందులోని మొదటిపదము నపుంసకసమము నగుచుండు నని సూత్రార్థము.

'అవసరము + అక్కలు = అవసరమక్కలు. ఇచట అవసరశబ్దము తత్సమము; అక్కలు అచ్చికము. రెంటికిని సమాసమగుట నిది మిశ్రము. పూర్వపదము చివరి వర్ణము సమాసమున లోపించినను, అది క్లీబసమ మగు నని చెప్పుటచే 'ము' చేరినది.

ఇయ్యెడ కుమారదేవపండితీయమున 'అవసరమక్కలు = కాలపుం బనులు; కైదువుకర్జము = ఖడ్గకార్యము-ఈ ప్రయోగములు రెండును మిశ్రద్వంద్వములనక, 'షష్ఠీతత్పురుషము లని చెప్పరాదా ?' అని వ్రాయఁబడి యున్నది. సందర్భ సమన్వయపద్ధతులంబట్టి అఁట ద్వంద్వమే యుచిత మని మూలాభిప్రాయము. మఱియు 'కైదువుకర్జము' లనునది మిశ్రద్వంద్వ మని యనుకొనుట వింతగ నున్నది. మూలకారుఁ డట్లు చెప్పలేదు. 'అవసరమక్కలు' అను నొక్కటియే ఇచటి సూత్రమున కుదాహరణము.

## ౩౮. ఒక్కొకచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తరపదంబొంటితోడను, వాని పెక్కింటితోడను నన్వయించెడి.

ఉ. క. 'రావణుకంఠము దెగి దేహము ధరణిం బడియె.' భార. ఆది. ౨ ఆ. ౧౯. 'క. ఒక్కొక కన్నును జెవియును, జెక్కును జను బొడ్డు మూఁపుఁజెలువగు చేయుం, బ్రక్కయుం బిఱుఁదును గాలును, నక్కజముగ మనుజశకల మప్పు డుద యించెన్.' సభా. ౧ ఆ. ౧౪౪. 'క. పరుల ధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం, బెరియఁగ నసహ్యపడు న, న్నరుఁడు దెవులు లేని వేదనంబడు నధిపా !' భార. ఉద్యో. ౨ ఆ. ౫౮. 'క. నాయింటం బదికడవల, నేయిం బెరుఁగుం బాలుఁ ద్రావె నీప్రియతనయుం, డు.' హరి. పూ. ౫ ఆ. ౨౧౫.

౩౮. సమాసగతపూర్వపదంబు=సమాసమునందలి తొలిపదము; వ్యవహితోత్తరపదంబు=వ్యవధానము గల యుత్తరపదము కలది. ఒంటితోడను= ఒక్క యుత్తరపదముతోను. వాని పెక్కింటితోను = తత్సంబంధములగు పెక్కు పదములతోను. అనఁగా - సమాసమునందలి పూర్వపదమును పదాంతర వ్యవధానముగల యుత్తరపదమును సమన్వయము పొందు ననియు, ఆ సమన్వయ మొక్క పదముతోఁగాని, తత్సంబద్ధములగు పెక్కు పదములతోఁగాని యుండవచ్చు ననియు నర్థము.

'రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె' ననుచో రాహువు యొక్క కంఠము తెగి రాహువుయొక్క దేహము ధరణిపైఁ బడె' నని యర్థము. ఇచటి సమాసగత పూర్వపదమగు 'రాహు' పదము, 'తెగి' అను పదముతో వ్యవధానము కల ఉత్తరపదమగు 'దేహము' తో సమన్వయించుచున్నది. ఆ ఒక్కపదముతోడనే యిచటి సమన్వయ మున్నది.

'ఒక్కొక కన్నును...గాలును...' ఇచట సమాసగతపూర్వపదము 'ఒక్కొక' అనునది; అది 'చెవి చెక్కు' మున్నగు పెక్కింటితో సమన్వయము పొందును 'ఒక్కొక చెవి, ఒక్కొక చెక్కు, ఒక్కొక చన్ను—' మున్నగు నర్థము నిచ్చుచున్నది. ఇచటి యుత్తరపదములు వ్యవహితములగుట స్పష్టము.

'పరుల ధనమునకు......బలమునకు...' అను నెడ సమాసపూర్వపదమగు 'పరుల' అనునది 'విద్యాపరిణతి, తేజము, బలము' అను నుత్తరపదములతో సమన్వయమును పొంది 'పరుల విద్యాపరిణతికి, పరుల తేజమునకు; పరుల బలమునకు' అను నర్థము నిచ్చుచున్నది. '...పదికడవల నేయిఁ, బెరుఁగుఁ, బాలు' అనుచో 'పదికడవల నేయి, పదికడవల పెరుఁగు, పదికడవల పాలు' అని యర్థము. 'పదికడవలు' అనునది 'పెరుఁగు, పాలు' అను వానితోను సమన్వయించినది. ఇచట సమాసగతపూర్వపదముగా—'పదికడవలు' అనుదానిని గ్రహింపవలెను. లేదా—'పూర్వపద మనఁగా పూర్వపదసమూహ మనియు నర్థమని యైన ననుకొనవలెను.'

**3౫. కొన్నియెడల సిద్ధసమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి.**

ఉ. 'బహువేదఘోషములఁజేసి నిర స్తసమ స్తకిల్బిషో, త్కరు లగుచున్న ధన్యులు.' భార. ఆర. ౧ ఆ. ౧౧. 'వారి యస్మదీయోరుచమూసమూహములు.' హరి. ఉ ౨ ఆ. ౧౦౫. 'అఖండితరూపవిలాససంపద౯, వంచిత పంచబాణుఁ డగువాని.' నై. 3 ఆ. ౪౦. 'అం దొకటిచే జనితాధరపీడయై' కళా. ౫ ఆ. ౨౭. మొ.

3౫. కొన్నిచోట్లయందు సిద్ధసమాసముయొక్క నడుమనున్న పదములతో ఇతర పదములు అన్వయమును పొందుట కానవచ్చుచున్నది. (ఇట్టి సమన్వయముననే ఏకదేశాన్వయ మని అందురు.)

ఇట్టి సమన్వయపద్ధతి వ్యాకరణశాస్త్రజ్ఞసమ్మతము కాదు; మొత్తము పయి సమస్తపదము పదాంతరముతో సమన్వయింపవలెను గాని, సమాసము నందలి పదైకదేశముతో అన్వయింపరాదు. అయినను, అట్టి ప్రయోగములు కానవచ్చుచున్నందున తద్రక్షణార్థ మీ సూత్రము వ్రాయఁబడినది.

'బహువేదఘోషములఁజేసి నిరస్తసమస్తకిల్బిషోత్కరు లగుచున్న ధన్యులు-' అనుచోట 'నిరస్త......త్కరులు' అనునది సమస్తపదము. ఇయ్యది కేవల సంస్కృతపదములకైన సమాస మగుటచే సిద్ధసమాస మగుచున్నది. ఇందలి యేకదేశమగు 'నిరస్త' అనుదానితో తద్భిన్నపదం బగు 'బహువేదఘోషములఁజేసి.' అనునది సమన్వయించుచున్నది. 'ఎక్కువైన వేదఘోషములచేత (నిరస్త=) పోఁగొట్టఁబడిన' అని యర్థము. 'బహువేద ఘోషములఁజేసి......కిల్బిషోత్కరు' లని మొత్తము సమాసముతో సమన్వయింప వీలుకాదు.

'వారి యస్మదీయోరుచమూసమూహములు' అనుచోట 'వారి' అనుదానికి సమాసపదములోని యేకదేశమగు 'ఉరు చమూసమూహములు' అనుదానితో నన్వయము.

'అఖండితరూపవిలాససంపదన్ వంచితపంచబాణుఁడగువాని-' అనునెడ సమాసమునందలి ఏకదేశమగు 'వంచిత' అనుదానితో అఖండితరూపవిలాస సంపదన్' అను పదమున కన్వయము.

'అందొకటిచే జనితాధరపీడయై' అనునెడ 'ఏకదేశమగు' 'జనిత' అను దానితో 'ఒకటిచే' అనుదానికి సమన్వయము.

౩౬. ఆచ్ఛికసమాసంబులం దఱచుగ వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యవైకల్పికముగాఁ బెక్కులు గానంబడియెడి

ఉ. 'అందాఁక (అంత+దాఁక); ఇట్లు ఇందాఁక; ఎందాఁక. అచ్చుతెల్పు (అచ్చము+తెల్పు), ఆఁదోఁక (ఆవు+తోఁక), ఆవల (ఆ+వలను); ఇట్లు ఈవల. ఇబ్బంది (ఇరు+పంది), ఇరుసెవి (ఇరుగు+చెవి), ఉద్దరి (ఉద్ద+దరి), ఎడవంక (ఎడమ+వంక); ఇట్లు వలవంక. ఎగుదల (ఎగువ+తల), ఇట్లు దిగుదల, ఏట వాలు (ఏటము+వాలు), కప్పురవీడెము (కప్పురము+వీడెము), కవ్వడి (కవ+వడి), కుఱుమాపు (కుఱుచ+మాపు), గందవొడి (గందము + పొడి), గుండ్రకడుపు (గుండ్రము + కడుపు), గొబ్బండు (గొప్ప+పండు), చిత్తరుబొమ్మ (చిత్తరువు+బొమ్మ); చిమ్మనగ్రోవి (చిమ్మనము + క్రోవి), చిఱుచప్పుడు (చిఱుత + చప్పుడు), చెంద్రకావి (చెంద్రము + కావి); ఇట్లు చందురకావి. చనుమఱి (చను+మఱకి), చప్పరమంచము (చప్పరము+

మంచము). చొక్కసగతులు (చొక్కము+సగతులు), తెగు దారి (తెగువ+దారి); దట్టకెంపు (దట్టము+కెంపు), దొంతర (దొంతి+తరఁగ), నడురేయి (నడుము+రేయి), నాన్నాళ్లు (నాలుగు+నాళ్లు), నాటకసాల (నాటకము+సాల), నిక్కల (నిక్కము+కల), నిడుమోము (నిడుద+మోము), నెత్తపలక (నెత్తము+పలక), పసిపట్టు (పసిమి+పట్టు), పెందుఱుము (పెనుపు+తుఱుము), పెత్తనము (పెద్ద+తనము); పొంగట్టు (పొన్ను+గట్టు). బాపురె (బాపు+పురె), బెబ్బులి (పెద్ద+పులి), బెల్లమండెఁగ (బెల్లము+మండెఁగ), బొందళము (బొంత+దళము), బోనపుట్టిక (బోనము+పుట్టిక), మిండతపసి (మిండఁడు+తపసి), ముంగల (ముందు+కలను); ఇట్లు వెనుకల. ముయ్యేడు (మూఁడు+ఏడు); ఇట్లు ముయ్యాఱు మొ. మోసల (మొగ + సాల), వలిపవెన్నెల (వలిపము+వెన్నెల), వలచెవి (వలను+చెవి), వాతెఱ (వా+తెఱపి); వాలురమ్ము (వాలు+అమ్ము), వేఁగురుఁజుక్క (వేఁగు+చుక్క), సగపాలు (సగము+పాలు) సాఁబాలు (సాము+పాలు), సుంకసరకు (సుంకము+సరకు), ఇత్యాదు లూహ్యంబులు ఇందు ఆఁదోఁకేత్యాదులు కొన్నిటి యందు వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యము లనియు, అందాఁకేత్యాదులయందు వైకల్పికములనియు నెఱుంగవలయు. వీని కొన్నొక్కటికిఁ బ్రయోగంబులు పెక్కులు గలవు గాని గ్రంథవిస్తరభీతిచే నవి యుదాహరింపఁబడవయ్యెను.

3౽ వర్ణలోపము = అక్షరములు పోవుట; వర్ణాగమము=అక్షరము లెక్కువగా వచ్చుట; వర్ణాదేశము = ఒక వర్ణమునకు బదులు వేఱొకటి వచ్చుట; వర్ణవికారము = ఇకరవిధమైన మార్పు; అచ్చతెలుగుపదముల కగు

సమాసములందు మీఁది వర్ణలోపాదులు కొన్నియెడల నిత్యముగా వచ్చుట కలదు; కొన్నిచోట్ల వికల్పముగా వచ్చుట కలదు. ఇవి యిట్లు పెక్కువిధములుగ నుండును.

'అందాఁక' మున్నగువానియందు వర్ణలోపము; 'ఇబ్బంది, గొబ్బందు, దట్టకెంపు, దొంతర, పెత్తనము, ముయ్యేడు, ముయ్యాఱు' మున్నగువెడల లోపము, ఆదేశముకూడ వచ్చుట గ్రామ్యము. 'కెందుఱుము, పొంగట్టు', మున్నగునవి ఆదేశమున కుదాహృతులు. 'వాలురిమ్ము, వేఁగురుఁజుక్క' ఆగమమున కుదాహరణములు.

'మిండతపసి' అనుదాని నిట నుదాహరింపనక్కఱలేదు; 'మిండఁడు+తపసి' సమాసమగునపు డెట్లును 'మిండతపసి' అని యగుచునే యుండును.

## అలుక్సమాసము

## 32. కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు.

ఉ. 'కువలయంబునవారు.' భార. ఆది. ౨ ఆ. ౨౨౪. 'వారణావతమునవా రెల్ల.' భార. ఆది. ౬ ఆ. ౧౪౮. 'క. ధరణి, తలనాథ! పురుషునకు నిమ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్.' భార. ఆర. ౨ ఆ. ౭౪. 'నిజకులంబునవారి కెల్ల.' హరి. పూ. ౧ ఆ. 'క. అనఘ యణుహుఁ డే వంశం, బున వాఁడు?' హరి. పూ. ౨ ఆ. ౧౫౯ మొ. నుశబ్దంబుచేఁ గువలయంబునందలి వారు మొ.

అలుక్సమాసము—'లుక్' అనఁగా లోపము; (రెండు పదములకు) సమాసమగునపుడు విభక్తిప్రత్యయములు లోపించుచుండును. అట్లు విభక్తిప్రత్యయములు లోపింపకుండుటయుఁ కలదు. విభక్తిప్రత్యయములు లోపింపని సమాసములే అలుక్సమాసము లగును.

32. సప్తమీవిభక్తి ప్రత్యయమగు 'న' అనునది కొన్నిచోట్ల సప్తమీ తత్పురుషసమాసమునందు లోపింపక నిలుచు నని యర్థము.

'కువలయంబునవారు' అనఁగా 'కువలయమునందలివా' రని యర్థము. ఆ యర్థమున వచ్చిన 'న' లోపింపక నిల్చియుండుటచే 'కువలయంబున వారు' అయినది. ఇట్లే 'వారణావతమునవారు, చిత్తమున దుఃఖంబుల్, ఏ వంశంబున వాఁడు' అనునవియును.

సూత్రమునందు 'నవర్ణకంబును అగు' నని సముచ్చయార్థక ముండుటచే 'అందు' అనునదియు లోపింపక నిలుచు ననియు, దానికి 'అంద్వాదుల కలిగాగమంబు సమాసమునం దగు' నను బాలవ్యాకరణసూత్రముచే అలిగాగమము వచ్చి 'కువలయమునందలివారు' మున్నగు రూపములు నగు నని గ్రహించునది.

## లుగలుక్సమాసములు

33. అట్లు పోలెబలెవలెశబ్దంబు లివార్థకంబులు. ఉపమేయము ప్రథమాంతమగునపు డట్లు పరంబగుచో నుపమానంబు లగు నామతదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియు, పోలెబలెలు పరంబు లగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు, నస్మదర్థప్రభృతులకు ద్వితీయయు, వలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు, నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలయం దెద్దియే నొక్కటియుఁ గ్రమంబుగ నగు. ఉపమేయము ద్వితీయాద్యంత మగునపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబుల కుపమేయ విభక్తుల యగు. పోలినయెడఁ దచ్ఛబ్ద మేతదాదులకు నుపలక్షణముగా గ్రహించునది. అట్లు కదణ్యాదులకు గ్రాహకము.

ఉ. క్రమముగఁ జూచునది. ఉపమేయము ప్రథమాంత మగునపుడు నారాయణునట్లు. 'ఉ. పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నారాయణునట్లు.' భార. ఆది. ౧ ఆ. ౨౪. (ఉదాహరణములు కొన్ని కొంత కొంత వ్రాయఁబడును గాన వానిని సందేహము దీఱ నా యా గ్రంథములం దక్కడక్కడఁ దుదముట్టఁ జూచుకొనునది.) బకునియట్లు. 'తే. మనుజ, [1]భక్షణంబు చేసితిరేని బకునియట్లు, చత్తురు.' భార. ఆది. ౬ ఆ. 3౦౪ ఇట్లు నలునట్లు మొ. 'జలధరసమితి [2]యట్లు.' భార. ఆర. ౨ ఆ. ౧౧౦. 'గజమునట్లు' 'ఆ. పుత్రదారబంధుమిత్రసక్తుఁడు రొంపిఁ, బడిన గజమునట్ల యెడరు నొందు.' భార శాంతి. ౬ ఆ. 3౧౮. ఇట్లు, వానియట్లు, నాయట్లు, నీయట్లు, తనయట్లు. 'చంద్రికయుఁ జంద్రుండువోలె.' కళా. ౪ ఆ. 3౬. పేఁవోలె, అమృతమువోలె. 'క. అని పలికెడు చెలిపలుకులు, తన కమృతమువోలె హృదయతాపము నడఁపఁగ.' కళా. ౬ ఆ ౨౭౪. [3]'పరికాఁడువోలె.' భార. ఆది. ౪ ఆ ౨౦౬. 'పాములవాఁడువోలె;' కాశీ. ౨ ఆ. ౮౭. 'నన్నుఁబోలె, నిన్నుఁబోలె 'శా. కానీరా యిటువంటినీతము లనేకంబుల్ నినుం బోలె వి, న్నానేనుఁగ.' శశాం. 3 ఆ. ౬౯. ఇట్లు తన్నుఁబోలె మొ. - రాముఁడుబలె. 'వేల్పుబలె.' కళా. ౮ ఆ ౧౮3. 'తామరపాకునీరుబలె' హరి. 3 ఆ. 'గోరుబలె' కళా. ౭ ఆ. ౨౬౦. ఇట్లు వాఁడుబలె, నన్నుబలె, నిన్నుబలె, తన్నుబలె మొ. రామునివలె, వానివలె; నావలె;

1. భక్షణము చేసితిర యేని. పా. 2. యట్ల. పా. 3. పరికాఁడవోలె. పా.

నన్నువలె,నీవలె, నిన్నువలె, తనవలె, తన్నువలె. బహుత్వంబున బకులయట్లు, చంద్రులువోలే, రాములుబలె, రాములవలె. మొ. 'క. పూరుపురూరవులట్లు భగీరథరఘుపతులయట్లు.' భార. ఆర. ౨ ఆ. ౨౮౫. 'ఎ.గీ. పరిభవంబులఁ, బడితి [1]నిట్టి నన్నుఁ బాండవుల్ సూచుచు, నుండి రొరులువోలె నుక్కడక్కి.' భార. ఆర. ౧ ఆ. ౧౩౬. 'క. మాయట్లిడుమలఁ, బడిన నరులు గలరె యొరులు పరమమునీంద్రా!' భార. ఆర. ౨ ఆ. ౩. 'వ. మమ్ముంబోలె నొడ్డ నాదరాధిక్యంబున భరంపడి సవిశేషం బుగా నధ్యయనంబు సేయింపకుండుట మాకు వశంబు' భార. శాంతి. ౬ ఆ. ౨౯౭. ఇత్యాదు లెఱుఁగునది. (ఇప్పటికిఁ దగినవి దొరకమిం జేసి యిందు గొన్నింటికిం బ్రయోగంబులు వ్రాయఁ బడవయ్యె.) ద్వితీయాద్యంత మగునపుడు.—ఉ. భీరులఁబోలె నేల వెఱపించెదు మాటల మమ్ము?' భార. ఆర. ౬ ఆ. ౧౮౨. 'క జ్ఞానులచే మానులచే, దానులచే యోగసంవిధానుల చేతన్, బూనిన బద్ధుండగునే, శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్?' భాగ. ౧౦ స్కం పూ ౩౯౦. 'సీ. ఏమహాత్ములచేత నీ జగత్త్రయము నాప్యాయితంబయ్యె నయ్యమృతకరుని,చేఁ బోలె.' భోజ ౧ ఆ ౧౦. 'చ. వెనుకఁ గ్రమక్రమంబున నవీనముగా నుదయంబు[2]నొందెఁ బెం, పొనర నృపాల యీతనికి నుత్తమ మధ్యమ వృద్ధధర్మదర్శనమున ద్రవ్యకర్మగుణజాతి విశేష వివేచనంబు బాలునకునుబోలె మానసములో నిఖిలవ్యవహారహేతువై.' కళా. ౮ ఆ. ౯౮౨. 'నీవు ననుంబలె నొర

---

1. నట్టి నన్ను. పా. 2. నొంది పెంపొనర. పా.

వీరలర్, వేడుకఁజూతువో.' కళా. ౬ ఆ. ౧౩౧. 'దేవరకుం బలె నవ్వధూటికిన్, దొత్తగుచుం బనుల్ సలుపుదున్.' కళా. ౪ ఆ. ౨౧౮. ఇ ట్లితరంబు లూహ్యంబులు.

లుగలుక్సమాసములు—సమాసములందుఁ గొన్నిచోట్ల విభక్తి ప్రత్యయములు లోపించుటయుఁ గొన్నిచోట్ల లోపింపకుండుటయుం - ఇట్లు రెండు విధములుగా నున్నవి; అట్టి సమాసములు లుగలుక్సమాసము లని చెప్పఁబడును.

౩౮. అట్లు, పోలె, బలె, వలె శబ్దములు సంస్కృతమునందలి 'ఇవ' యొక్క అర్థమున వచ్చునవి. అవి పోలికను దెలుపుచు నుపమానవాచకముల వెంటనంటి యుండును.

(1) ఉపమేయము (ప్రస్తుతము) ప్రథమాంతమయి ఉన్నపుడు ఉపమానమునకుఁ బిదప 'అట్లు' అనునది ఉన్నయెడల నా యుపమానమునకు షష్ఠీవిభక్తి యగును. ఆ యుపమానములు నామములుగాని, ఆ, నా, నీ, తా శబ్దములుగాని అయి యుండవలెను.

నామము ఉపమాన మగుట కుదాహరణములు-'నారాయణునట్లు-' ఇచట 'నారాయణునియొక్కయట్లు' అని షష్ఠి వచ్చి సమాసమున లోపించినది. ఇచటి ఉపమేయము 'నారాయణభట్టు' అను ప్రథమాంతము.

'బకునియట్లు' బకునియొక్కవలె నని యర్థము; ఆ షష్ఠి సమాసమున లోపించినది. ఇచటి విశేష్యము 'బకుని బంధువు లగు రాక్షసులు;' అయ్యది ప్రథమాంతము. ఇట్టే 'నలునట్లు' మున్నగునవియును.

'పుత్రదారబంధుమిత్రసక్తుఁడు రోంపిఁ బడిన గజమునట్లు యెడరు నొందు-' అనుచోట 'గజము' ఉపమానము; ఉపమేయము 'పుత్రదారబంధుమిత్రసక్తుఁడు' ప్రథమాంతము. ఉపమానమునకు వచ్చిన షష్ఠి సమాసమున లోపించినది. ఈ విధముగా 'వానియట్లు' తచ్ఛబ్దమునకును, 'నాయట్లు'అన్న

చ్ఛబ్దమునకును, 'నీయట్లు' యుష్మచ్ఛబ్దమునకును, 'తనయట్లు' ఆత్మార్థకమగు నను ఉదాహృతులు. ఎల్లయెడల షష్ఠి సమాసమున లోపించినది.

(2) 'పోలె, బలె' అను నుపమావాచకములు పరములగునపుడు ఉపమానములగు నామ, తచ్ఛబ్దార్థములకును ప్రథమావిభక్తి యగును; తక్కిన వానికి-నా, నీ-తా శబ్దములకు ద్వితీయ యగును.

'చంద్రికయుఁ జంద్రుండువోలె' మున్నగునవి ప్రథమాంతములగుట స్పష్టము. 'చంద్రుండువోలె' ఇచటి ప్రథమ లోపింపలేదు. ఇది యలుక్సమాసము.

'...చెలిపలుకులు తన కమృతమువోలె...' ఇచట చెలిపలుకులు ఉపమేయము; ఉపమానమగు 'అమృతము' నకు ప్రథమ. ఇది అలుక్సమాసము.

అస్మదర్థాదులకు ద్వితీయ యగుటకు 'నన్నుఁబోలె, నిన్నుఁబోలె, నినుంబోలె, తన్నుఁబోలె' ఉదాహరణములు.

రాముఁడుబలె, వేల్పుబలె, తామరపాకునీరుబలె, గోరుబలె, వాఁడు బలె.' అనునవి 'బలె' పరమగుచో నుపమానములగు నామ, తచ్ఛబ్దార్థములకు ప్రథమ యగుట కుదాహరణములు. 'నన్నుబలె, నిన్నుబలె, తన్నుబలె' అనునవి అస్మదర్థప్రభృతులకు ద్వితీయ యగుట కుదాహరణములు. ఇవి అలుక్సమాసములు.

(3) ఉపమేయము ప్రథమాంత మగునప్పుడు 'వలె' కు ముందున్న నామ తచ్ఛబ్దార్థములకు షష్ఠి యగును. 'నా, నీ, తా' శబ్దములకు షష్ఠిగాని, ద్వితీయగాని యగును.

'రామునివలె, వానివలె'-నామ, తచ్ఛబ్దార్థముల కుదాహరణములు. ఇవి లుక్సమాసములు. ఇచటి షష్ఠి లోపించిన దని యెఱుఁగవలెను. 'నావలె, నన్నువలె, నీవలె, నిన్నువలె-తనవలె, తన్నువలె' అనునవి వలె పరమగుచో 'నా, నీ, తా' శబ్దములకు షష్ఠియు, ద్వితీయయు వచ్చుటకుదాహరణములు.

ఇచట వచ్చిన షష్ఠి లోపించినప్పుడు లుక్సమాసము అగును; ద్వితీయ వచ్చినపుడు అలుక్సమాస మగును. పయి షష్ఠీ, ప్రథమా, ద్వితీయలు బహువచనాంతములకు నగును. కాన 'బకులయట్లు, చంద్రులువోలె. రాములుబలె, రాములవలె, పూరుపురూరవులట్లు, భగీరథరఘుపతులయట్లు. ఒరులువోలె, మాయట్లు, మమ్మువోలెన్-' అను ప్రయోగములు సుసాధ్యము లగును.

(4) ఉపమేయము ద్వితీయాద్యంత మగునపుడు 'పోలె' మున్నగునవి పరమగునపుడు ఉపమానములకు, ఉపమేయములచివర నున్న విభక్తులే యగును.

'భీరులంబోలె......వెఱపించెదు మమ్ము ..' ఇచట ఉపమేయమగు 'మమ్ము' ద్వితీయాంతము; కాన ఉపమానవాచకమగు 'భీరు' శబ్దము కూడ ద్వితీయాంతముగానే యున్నది. 'జ్ఞానులచే . . . భక్తిమంతులచేతంబోలెన్.' ఇచట 'జ్ఞానులచే' మున్నగునవి ఉపమేయములు. అవి తృతీయాంతములై యున్నవి. కావున ఉపమానమగు 'భక్తిమంత' శబ్దమును తృతీయాంతముగానే యున్నది. 'ఏ మహాత్ములచేత...అయ్యమృతకరునిచేఁబోలె-' ఇచట ఉపమేయమగు 'మహాత్మ' శబ్దమువలె ఉపమానమగు 'అమృతకర' శబ్దమును తృతీయాంతముగానే యున్నది. '...ఈతనికి......బాలునకును బోలె......' అనుచోటఁగూడ ఉపమానోపమేయములు రెండును షష్ఠీవిభక్తియందే యుండుట గ్రహింపనగును.

'...ననుఁబలె వీరలన్.' దేవరకుంబలె నవ్వధూటికిన్' అనుచోట్లను ఉపమానోపమేయములు సమానవిభక్తికము లగుట స్పష్టము.

ప్రయోగము లున్నయెడల వాని ననుసరించి, తచ్ఛబ్దమునకు వలెనే ఏతచ్ఛబ్దము, అదశ్శబ్దము మున్నగువానికిని విభక్తులు కలుగుటయు,అవి కొన్నియెడల లోపించుటయుఁ, గొన్నియెడల లోపింపకుండుటయు తెలిసికొనునది.

'కరణి, కైవడి, మున్నగు నుపమావాచకములు కొన్ని కలవు; అవి 'అట్లు' అనుదానివలెనే కార్యములను పొందు నని గ్రహింపఁదగినది. ఈయంశమే 'అట్లు కరణ్యాదులకు గ్రాహకము' అనుదానిచే విశదీకరింపఁబడినది.

## ౩౮. ప్రథమాంతములమీఁది పోలెబలెపోని శబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాష నగు.

ఉ సమిద్ధహవ్యవహుఁడుంబోలెన్' హరి ఉ. ౧౦ ఆ. 'తిండికాఁడునుబోలె.' భార. స్త్రీ. ౧ ఆ. ౧౯. 'నిధిఁగన్న పేద యుఁబోలె' భార. ఆది ౪ ఆ. ౧౬౭. [1]అగ్నియుఁబోలె.' భార. ఆది. ౨ ఆ. ౬౦. 'తగరునుబోలె.' నిర్వ. ౪ ఆ. ౫౫. 'బూడిద పండునుబోలె' పాండు. ౫ ఆ ౧౪. 'అమృతధారాపాతంబును బోలె.' భార. ఆర ౨ ఆ. ౧౫ 'తే. అనిన విని యేమి చెప్పఁగ నచటనున్న, వారలెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి, ప్రతిమలునుబోలె నతినిశ్చలత నొకింత, తడవు గనుపట్టి రత్యద్భుతంబు నొంది.' కళా. ౫ ఆ. ౫. 'పవడంపుఁజొట్టులుఁగుఁజందమునుంబలె.' య. ౫ ఆ. ౩౧. 'ఉ మత్తత విప్రయోగిజన మర్దనుఁడైన ప్రసూన ధన్వికిం, గత్తులొసంగినట్టి జనఘాతుక మాధవనామధేయ మ, త్యుత్తమ మే గతిం గలిగెనో కద నీకు సుధాఖ్య గారకున్, హత్తినలీల రక్కసుల కంచితపుణ్యజనాఖ్యయుంబలెన్.' శశాం. ౪ ఆ. ౯౧. 'భూషణవిశేషములుంబలె.' కళా. ౩ ఆ. ౮. ఇత్యాదు లెఱుంగునది.

౩౮. 'పోలె, బలె, పోని' శబ్దములు పరములుగా నున్నపుడు ప్రథమాంతములమీఁద ద్రుతము విభాషగాఁ జేరుచుండుట కల దని యర్థము.

'సమిద్ధహవ్యవహుఁడు పోలెన్-' అనుటకు సమిద్ధహవ్యవహుఁడుం బోలెన్' అయినది. ''తిండికాఁడునుబోలె, పేదయుఁబోలె, అగ్నియుఁబోలె, తగరునుబోలె, బూడిదపండునుబోలె, ప్రతిమలునుబోలె... చందమునుంబలె

---

1. అగ్నియపోలె. పా.

పుణ్యజనాఖ్యయుంబలెన్, భూషణవిశేషములుంబలె-' అను చోట్లను ప్రథమాంతములపై ద్రుతము వచ్చె నని తెలిసికొనునది.

## ౪౦. కొన్నియెడల నుపమానంబులు పెక్కు లగుచో నివి కడదాని కొక్కటిగ చూపట్టెడి

ఉ. 'ఏ-గీ. కమలషండంబు నాగలోకంబు దలిరుఁ, బాన్పు కల్పాంతమున జముబానసంబు, నింటిలోపలవోలె.' నిర్వ ౪ ఆ. ౬౧. 'వీంద్రును వాంద్రునుబలె' ప్రభా. ౧ ఆ ౭ పు.

౪౦. పెక్కు ఉపమానము లున్నపుడు 'పోలె' మున్నగు ఉపమావాచకములు చివరి యుపమానమునకు మాత్రము చేరుట కానఁబడుచున్నది.

'కమలషండంబు...' అనుచోట '..దలిరుపాన్పుఁబోలె, — అని యుండనగును. 'పోలె' చివరి యుపమానమగు 'బానసంబునింటిలోపల' మీఁదనే వచ్చినది. 'వీంద్రును, వాంద్రునుబలె'-అనుచో 'వీంద్రునుబలె, వాంద్రునుబలె' అని యర్థము. 'బలె' చివరి యుపమానముమీఁదనే వచ్చినది.

## ౪౧. పోలె ప్రభృతులు తఱచుగఁ బ్రథమాదివిభక్త్యంత నామంబులకంటెను, తాదర్థ్యార్థక క్రియలకంటెను పరంబు లయి యుత్ప్రేక్షాద్యోతకంబు లగు.

ఉ. 'ఎ-గీ. గచ్చు చమరిన దారుచక్రంపుబిళ్ల, వోలె.' స్వా. ౫ ఆ. ౪౦. (ప్రకారాంతము బిళ్ల యోయన ఇట్లంతట నెఱుంగునది.) 'వ. శోకతప్తంబయిన తన హృదయంబు దడుపుచున్నదియుంబోలె.' భార. ఆర. ౨ ఆ. ౨ ౧. 'ధవుఁగూర్మిఁ గొసరుచున్నదివోలె.' స్వా. ౫ ఆ ౪౦. 'క. దినదినమునకుఁ గృశించెను, గనుకనియును ద్రపయు నిరవకాశతఁబోలెఁ.'

కళా. ౭ ఆ. ౧౫౮. 'సీ. తనుఁబాసి శశి దవ్వ చనిన నెవ్వగఁ బోలెఁ దొలిదిక్కు జవరాలు వెలుకఁబాఱె.' స్వా. ౫ ఆ. ౪౦. 'గార యిచ్చుటకునుబోలె' స్వా. ౬ ఆ ౧౦౭. 'తే. కలయ జగమునఁ గలయట్టి నలుపు లెల్లఁ, దెలుపులుగఁజేసి నీడలు తెలుపుసేయఁ, గా వళేముగామిఁ బొడమిు దుఃఖమునఁబోలె, సాంద్రచంద్రిక తుహినబాష్పములు గురిసె స్వా. 3 ఆ. ౨౭. 'పయఁటకొం గది మాన్పఁగఁబోలెఁ గాళ్లపైఁ, బ్రబ్బికొనఁ.' కళా. ౮ ఆ. ౧౪౦. 'సాహసపుటగ్గలికంబలె' చంద్ర. ఇ ట్లితరంబు లెఱుంగునది.

౪౧. 'పోలె' మున్నగునవి ప్రథమ మున్నగు విభక్తులతోఁగూడిన నామములకంటెను, తాదర్థ్యమర్థము కల క్రియలకంటెను పరములై యున్న యెడల ఉత్ప్రేక్షను సూచించుచుండు నని యర్థము. తాదర్థ్యార్థక క్రియలనఁగా తుమున్నంతములు.

'పోలె' మున్నగు శబ్దము లుపమావాచకములును, ఉత్ప్రేక్షావాచకములును, తథార్థకములును కూడ నగుచుండును. అందు ఉపమావాచకములగునపుడు వచ్చు కార్యము లీవలకే చెప్పఁబడినవి. అవి యుత్ప్రేక్షావాచకము లగు పట్టు లిచట చూపఁబడుచున్నవి.

'దారుచక్రంపుబిళ్లవోలె' (దారుచక్రంబుబిళ్ల యోయన అని యర్థము). '...తడుపుచున్నదియుంబోలె, కొసరుచున్నదివోలె,'- ప్రథమాంతముల కుదాహరణములు. 'నిరవకాశతంబోలెన్, నెవ్వగఁబోలెన్, దుఃఖమునఁబోలె, సాహసపుటగ్గలికంబలె' అనునవి తృతీయాంతములపై 'పోలె' ఉత్ప్రేక్షావాచకమగుట కుదాహృతులు. 'గార యిచ్చుటకునుబోలె' షష్ఠి కుదాహృతి. 'మాన్పఁగఁబోలె' అనునది తాదర్థ్యార్థక క్రియ కుదాహరణము.

**౪౨. మఱియవి కొన్నియెడల నామంబుల ప్రథమాది విభక్తులు కొన్నింటికిఁ బరంబులై తథార్థంబు లయ్యెడి.**

ఉ॥ 'ఇపుడువోలె.' కళా. ౭ ఆ. ౨౧. 'మున్నువోలె.' కళా. ౨ ఆ. 'ఎప్పుడు [1]బలె.' కళా. ౭ ఆ. ౧౦౪. 'ఆ మథన సమయ ఘూర్ణమానాబ్ధిఁబోలెఁ బెట్టు, మ్రోఁత లడరె.' కళా. ౬ ఆ ౪. 'వ. శరధితరంగలమీఁదనుంబోలె.' స్వా. ౩ ఆ. ౨౮ ఇత్యాదు లూహ్యంబులు.

౪౨. అవి = 'పోలె ప్రభృతులు. పోలెప్రభృతులు కొన్నిచోట్ల ప్రథమాదివిభక్త్యంతములగు నామములపై చేరి, 'అట్లులు' అను నర్థము నిచ్చునవై యుండును.

ఇపుడువోలె = ఇప్పటియట్లు: మున్నువోలె = మునుపటియట్లు, ఎప్పుడు వలె = ఎప్పటియట్లు; మథనసమయఘూర్ణమానాబ్ధిఁబోలె=తఱుచు నప్పుడు తిరుగుడుపడుచున్న సముద్రముప్రకారము; శరధితరంగలమీదనుం బోలె=సముద్రపుటలల మీఁదివిధముగ-' అని యర్థములు.

**౪౩. అట్టిపోనిబోఁటివంటి శబ్దంబులు వవర్ణకంబులు, బోఁటి తనంతఁ బ్రత్యయార్థంబు నగు అట్టి ప్రభృతులు పరంబు లగుచో నట్టు ప్రభృతిపరనామాములకుం బలెఁ బూర్వపదంబులకు విభక్తులు త్రివిధ బులం బరఁగు. అందు బోఁటివట్టులు సమానంబులు. అవి పరంబు లగుచో నాత్వార్థమునకు నామశబ్దంబు లకుం బోలెఁ గార్యంబు పోని పరంబగుచో డువర్ణ కంబు మీఁద ద్రుతంబు నిత్యంబు**

1. వలె. పా.

ఉ. రామునియట్టి, వానియట్టి, నాయట్టి, నీయట్టి, తనయట్టి, [1]'నీయట్టి పుణ్యాత్మకుల్ గలరే?' భాగ. ౧౦. స్కం. పూ. ౧౭౩౬. 'వ. రెండవ మన్మథుండునుంబోనివాని.' భార. ఆర ౨ ఆ 33. సురకన్యవోని, సురకన్యయుఁబోని. 'అవనినాథుఁడు, గనియెను సురకన్యవోనికన్నియ.' భార. ఆది. ౪ ఆ. ౧౬౯. దేవివోని, దేవియుఁబోని, 'ఏ గీ. వరుణేంద్రుదేవియుఁబోనిదాని దేవయానిఁ గనియె.' భార. ఆది. 3 ఆ. ౧౪౦. నికుంజంబుఁబోని, నికుంజంబునుబోని. 'కనకశైలనికుంజం, బునుబోని.' భార. ఆది. ౬ ఆ. 3౦. పిడుగులువోని, పిడుగులుంబోని; 'ఘోరపుం, బిడుగులువోనితూపులు.' కళా. ౮ ఆ ౫౯. నన్నుఁబోని, నిన్నుఁబోని, తన్నుఁబోని మొ. రాముని బోఁటి, వాని బోఁటి, తనబోఁటి, నాబోఁటి, నన్నుబోఁటి, నీబోఁటి, నిన్నుబోఁటి మొ.—'క. వీఁడెల్లబోఁటిబాలుఁడు గాఁడు' హరి. పూ. ౫ ఆ. ౧౪౯. 'ఇట్టినా, బోఁటి భీతుని నీకుఁ దోడనఁ బోలునే?' రా. ఆర. కాం. ౨ ఆ. ౮. 'నినుబోంట్లను నమ్మక యేనును బ్రతికెద.' భార. శాంతి. 3 ఆ. ౨౪౧. 'ఇట్లు మాబోంట్లు, మముబోట్లు; మీబోంట్లు, మిముబోంట్లు మొ. 'ఉ. బోటుఁదనాలు చన్నె మిముబోంట్లకుఁ దక్కినవారికిన్ బలెన్?' కళా. ౭ ఆ. ౨౨౫. రామునివంటి, వానివంటి, తనవంటి, నావంటి, ననువంటి, నీవంటి, నినువంటి మొ. 'దేవా! దేవరవంటి నీదుకరుణా, దృష్టిన్.' వి. పు. ౭. ఆ. 3౮౨ [2]'కార్చిచ్చువంటి శాపంబు.' భార. ఆది. ౨ ఆ. ౧౮౧. 'పెనునిట్టతాటివంటి

1. నీయంత పుణ్యాత్మకుల్. పా. 2. కార్చిచ్చునట్టి. పా.

గుదియ.' జై. ౨ ఆ. ౪౧. 'నీవంటి ఘనుఁడు.' వి. పు. ౨ ఆ. ౩౦౫. 'నినువంటి నీతిపరుల్గా.' శశాం. ౩ ఆ. ౬౯. 'నిన్ను వంటి పుణ్యనిరతుండు.' వి. పు. ౪ ఆ. ౩౩౭. ఇట్లు మావంటి, మమువంటి, మీవంటి, మిమువంటి యిత్యాదులు గ్రాహ్యం బులు. 'క. నావుడు ముని యి ట్లను వ,త్సా! విను మావంటి తైర్థికావళికెల్లన్, మీవంటి గృహస్థులసుఖ, జీవనమునఁగాదె తీర్థసేవయుఁ దలఁపన్.' స్కా. ౧ ఆ. ౬౫. 'ఎ-గీ. నాకు మిమ్ము వంటి లోకోత్తరుల కియ్యఁ, గలిగె నింతకంటె ఘనత గలదె? వి. పు. ౭ ఆ. ౩౮౬. ఇతరంబులు ప్రయోగంబుల నెఱుం గునది.

౪౩. పదర్థకంబులు=మాదిరి యను నర్థమును దెల్పునవి. అట్టి-పోని-బోఁటి-వంటి అనునవి పదర్థకము లయి యుండును. ఇందు 'బోఁటి' యనుదాని చివరఁ బ్రత్యయములు చేరవచ్చును; తక్కినవాని చివరఁ బ్రత్యయములు చేరవు; కాన వానికి స్వతంత్రప్రయోగార్హత లేదు. 'అట్టి' మున్నగునవి పరమై యున్నపుడు- 'అట్టు మున్నగునవి పరముగా నున్నపుడు సామవాచకాదుల చివరఁ జేరినట్లే.—ముం దున్న పదముల-చివర మువ్విధములగు విభక్తులును-అనఁగా-ప్రథమ, ద్వితీయ, షష్ఠియుఁ జేరుచుండును. ఈ నాల్గింటను 'బోఁటి, వంటి' అనునవి సమానమైనవి. కావున ఆ రెండును పరములై యున్నపుడు 'తా' శబ్దమునకు నామ, తచ్ఛబ్దంబులకువలెనే కార్యమగును. 'పోని' పరమైనయెడల 'దు' ప్రత్యయముమీఁద ద్రుతము నిత్యముగాఁ జేరు చుండును.

'రామునియట్టి-వానియట్టి-నాయట్టి-నీయట్టి - తనయట్టి - నీయట్టి— పుణ్యాత్మకుల్ గలరే?' ఇచట 'అట్టి' పరమైనందున నామతదస్మద్యుష్మ దాత్మార్థంబులకు షష్ఠి యయి, అది సమాసమున లోపించినది.

'రెండవ మన్మథుండునుంబోనివాని-' ఇచట 'పోని' పరమగుచో ప్రథమ, డుమంతమగుటచే నిత్యముగా ద్రుతము వచ్చెను. 'సురకన్యవోని, సురకన్యయుంబోని-' ఇచటఁ బ్రథమయు, ౩౯-వ సూ. చే వికల్పముగా ద్రుతమును. 'దేవివోని, దేవియుంబోని - నికుంజంబువోని, నికుంజంబును బోని - పిడుగులువోని, పిడుగులుంబోని' మున్నగుచెడల ప్రథమమీఁద ద్రుతము వికల్పము. 'నన్నుఁబోని, నిన్నుఁబోని, తన్నుఁబోని-' అనుచోట్ల అస్మదర్థప్రభృతులకు ద్వితీయ.

'రామునిబోఁటి, వానిబోఁటి-' నామ, తచ్ఛబ్దార్థంబున షష్ఠి-'తన బోఁటి, నా బోఁటి, నన్నుఁబోఁటి, నీబోఁటి, నిన్నుబోఁటి' ఇచట అస్మదర్థాదులకు షష్ఠి, ద్వితీయలు. 'రామునివంటి' మున్నగు చోట్లను ఇట్లే - ప్రయోగములు స్పష్టములు.

ఇది సమాసపరిచ్ఛేదము.

# తద్ధితపరిచ్ఛేదము



తద్ధితము లనఁగా విశేష్యవిశేషణము లగు శబ్దముల మీఁద భావాద్యర్థములయందు రాఁదగిన ప్రత్యయవిశేషము లని యర్థము.

## ౧. తద్ధిత ప్రత్యయములు పరంబు లగునప్పుడు పదంబుల డువర్ణకాదులకు లోపం బగు.

తద్ధితపరిచ్ఛేదము-విభక్త్యంతములగు విశేష్యశబ్దములపైని, విశేషణ శబ్దములపైని భావాద్యర్థములందు విధింపఁబడు ప్రత్యయములు తద్ధితము లనఁబడును. వానింగూర్చి వివరించు భాగము తద్ధితపరిచ్ఛేదము.

పయి తద్ధితముల స్వరూపమే 'తద్ధితము లనఁగా-' అను వాక్యముచే వివరింపఁబడినది. 'తన' మున్నగునవి తద్ధితప్రత్యయములు.

౧. 'తన' మున్నగు తద్ధితప్రత్యయములు పరములై యున్నపుడు పదముల చివర నున్న 'డు' మున్నగు ప్రత్యయములు లోపించు నని సూత్రార్థము.

బాలవ్యాకరణమునందు తద్ధితప్రత్యయములకు ముం దున్న విభక్తి ప్రత్యయములకు లోపము విధింపఁబడ లేదు. 'రామునియొక్క+తనము = రామునితనము' మున్నగు రూపములు సిద్ధించుటకయి 'సమాసవిభక్తికి లోపం బగు, లట్టునకుఁ గాదు' అను సూత్రమునే ఆశ్రయించి, యచటి 'సమాస' పదము వృత్తిసామాన్యమున కుపలక్షణ మనియు, అందువలన తద్ధితవృత్తిలోను విభక్తులు లోపించు ననియుఁ జెప్పికొనవలసి యుండినది. అట్టి లోపము తీర్చుట కయి ప్రౌఢవ్యాకర్త యిచట విభక్తి ప్రత్యయములకు లోపమును విధించుచున్నాఁడు.

## ౨. తన వర్ణకంబు పరం బగునపుడు తచ్ఛబ్దార్థకమునకు లోపంబు విభాష నగు.

ఉ. ఆఁకొన్నతనము, ఓర్వలేనితనము మొ. పక్షమున ఆఁకొన్నవానితనము, ఆఁకొన్నదానితనము, ఓర్వలేనివాని తనము, ఓర్వలేనిదానితనము. 'పెల్లాఁకొన్నతనాన.' భీమ. ౨ ఆ. ౧౨౦.

౨. తచ్ఛబ్దార్థకమునకున్='వాని' మున్నగువానికి; 'తన' అను ప్రత్యయము పరమగుచో 'ఆ' శబ్దరూపము లగు 'వాని' మున్నగువానికి లోపము వికల్పముగా నగు నని యర్థము.

ఆఁకొన్నవానియొక్క+తనము = ఆఁకొన్నతనము. (ఇచట ౧. సూ. చే 'యొక్క' లోపము. ఈ సూత్రముచే 'వాని' లోపము) ఓర్వలేనివాని యొక్క+తనము = ఓర్వలేనితనము. ఈ లోపము వికల్ప మగుటచే, ఇది రానప్పుడు 'ఆకొన్నవానితనము' మున్నగు రూపము లగును.

## 3. మతుబర్థంబునం దరివర్ణకంబు పరంబగునపుడు పూజ సొన్నముల కడయచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘం బగు.

ఉ. పూజారి, పూజరి; సొన్నారి.

3. 'కలవాఁడు, కలది' అను నర్థ మిచ్చునది మతుబర్థము. ఆ యర్థము నందు వచ్చిన 'అరి' అను వర్ణకము పరముగా నున్నపుడు 'పూజ' లోని జకారముమీఁది యచ్చునకు దీర్ఘము వికల్పముగా వచ్చును; 'సొన్న' లోని 'న్న' మీఁది యచ్చునకు దీర్ఘము నిత్యముగా నగును. 'పూజారి' (దీర్ఘము వచ్చినది.) 'పూజరి' (దీర్ఘము రాలేదు.) 'సొన్నారి' (దీర్ఘము.) 'పూజరి' యైనట్లు 'సొన్నరి' కాఁజాలదు.

౪. మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరం బగుచో నిత్వంబు నగు.

ఉ. చెంచిత. 'క. చెంచితలం బింఛపత్రచేలాంచితలన్.' భాగ. ౧౦ స్కం. పూ. ౭౯౩. (గ్రామ్యజనుల పాటలయందును జెంచీత యని యికారదీర్ఘంబ వినంబడియెడి.)

౪. మతుబర్థములో 'చెంచు' అనుదానికి 'త' పరమగునపుడు ఇత్వము కూడ వచ్చు నని యర్థము.

బాలవ్యాకరణమున 'తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నిత్వంబు చూపట్టెడు' నని సూత్రింపఁబడి 'చెంచెత' అని యుదాహరింపఁ బడినది. 'చెంచిత' అని ఇత్వసహితరూపము నుండుటచే నీ సూత్రమును జెప్ప వలసి వచ్చినది. సూత్రమునందలి సముచ్చయగ్రహణముచే 'చెంచెత' అనియు నుండు నని గ్రహింపవలెను.

౫. చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతు బర్థం బకారం బగు.

ఉ. చెడుగఁడు, దుడుకఁడు, నిడుపఁడు.

౫. 'చెడుగు, దుడుకు, నిడుపు' అనునవి మహద్వాచకము లగునపుడు మతుబర్థమునందు అకారము వచ్చును. చెడుగు + అ + ఁడు = చెడుగఁడు; అట్లే 'దుడుకఁడు, నిడుపఁడు,' అనునవియుంను. (చెడుగఁడు = చెడుగు కలవాఁడు. ఇట్లే తక్కినవియును.)

ఇచట కుమారదేవపండితీయమున 'అప్రత్యయాంతమునకు మగాది గణగణనమునం జేసి డుజ్జు వచ్చును' అని కలదు. కాని మగాదిగణమున అప్రత్యయాంతము గణింపఁబడలేదు; అక్కఱయుం లేదు. పుంలింగ మహా ద్వాచకములకు డుజ్జు ఎట్లును వచ్చును. (చూ. బాల. తత్సమ. సూ. ౨౨.)

౬. వేఱున కడవర్ణకంబు స్వార్థంబునం దగు.

ఉ. వేఱడము.

౬. శబ్దమునకుఁ గల యర్థమే స్వార్థము. ఈ యర్థమునందు 'వేఱు' అనుదానికి 'అడ' ప్రత్యయము వచ్చును. 'వేఱు+అడ+ము = వేఱడము.' అమహత్తగుటవలన 'ము' ప్రత్యయము. (వేఱడము = వేఱు.)

౭. వెల్ల కడివర్ణకంబు స్వార్థంబునం దగు.

ఉ. వెల్లడి.

౭. 'వెల్ల' అనుదానికి స్వార్థమునందు 'అడి' అను ప్రత్యయ మగును. వెల్ల+అడి. (బాల. సంధి. ౧౧. అపదాదిస్వర నిత్యసంధి)=వెల్లడి. (వెల్లడి= వెల్ల.)

౮. తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం బిడి వర్ణకం బగు.

ఉ. తెలివిడి, విరివిడి, వినికిడి, లేమిడి, రాపిడి.

౮. 'తెలివి, విరివి, వినికి, లేమి, రాపు' అనువానికి స్వార్థమునందు 'ఇడి' ప్రత్యయ మగును.

తెలివి+ఇడి=తెలివిడి. (అపదాదిస్వర నిత్యసంధి బాల. సంధి. ౧౧. సూ.) ఇట్లే తక్కినవియుంను. తెలివిడి=తెలివి; విరివిడి=విరివి; వినికిడి = వినికి; లేమిడి=లేమి; రాపిడి=రాపు.

౯. ఇతవర్ణకం బింపుబిగుపోరులకు స్వార్థంబునం దగు.

ఉ. ఇంపితము, బిగితము, పోరితము.

౯. 'ఇంపు, బిగు, పోరు' అనువానికి స్వార్థమునందు 'ఇత' అను వర్ణక మగును.

ఇంపు+ఇత+ము = ఇంపితము; 'బిగితము, పోరితము' కూడ నిట్లే. ఇచట బాల. సంధి. ౧౧. సూ. చే నిత్యసంధి. ఇవి అమహత్తు లగుటవలన 'ము' ప్రత్యయము. (ఇంపితము=ఇంపు.)

**౧౦. ఇదవర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునం దును, క్రొవ్వుబెట్టులకు మతుబర్థంబునందును నగు.**

ఉ. ఒప్పిదము, తప్పిదము, పెల్లిదము, క్రొవ్విదము, బెట్టిదము.

౧౦. 'ఇద' అను వర్ణకము 'ఒప్పు, తప్పు, పెల్లు' అనువానికి స్వార్థమునందు వచ్చును; ఆ 'ఇద' యే 'క్రొవ్వు, బెట్టు' అనువానికి మతు బర్థమున వచ్చును.

ఒప్పు+ఇద+ము = ఒప్పిదము. (అపదాదిస్వర నిత్యసంధి, అమహత్తగుటవలన 'ము' ప్రత్యయము.) ఇట్లే తక్కినవియును. ఒప్పిదము=ఒప్పు; తప్పిదము=తప్పు; పెల్లిదము = పెల్లు. (ఇవి స్వార్థమున 'ఇద' వచ్చిన పదములు). క్రొవ్విదము = క్రొవ్వు కలది; బెట్టిదము = బెట్టు కలది. (ఇచట 'ఇద' మతుబర్థమునందు వచ్చుట గమనించునది.)

**౧౧. స్వార్థంబునం దిరివర్ణకంబు వాఁపున కగు.**

ఉ. వాఁపిరి.

౧౧. 'వాఁపు' అనుదానికి స్వార్థమున 'ఇరి' వర్ణక మగును. వాఁపు+ఇరి=వాఁపిరి (అపదాదిస్వర నిత్యసంధి) వాఁపిరి=వాఁపు.

**౧౨. రవర్ణకంబు నాయఁకశబ్దమునకు భావంబునం దగు.**

ఉ. నాయఁకరము.

౧౨. భావార్థమునందు 'ర' ప్రత్యయము 'నాయఁక' శబ్దమునకు వచ్చును. 'నాయఁక+ర+ము = నాయఁకరము' (అమహత్తగుటచే 'ము' ప్రత్యయము.)

కుమారదేవపండితీయమున 'ర' ప్రత్యయమునకు మాఱుగా తప్పుగా ముద్రింపఁబడిన ప్రతి ననుసరించి 'కర' ప్రత్యయము గ్రహింపఁబడి 'కర ప్రత్యయము పరమగునపుడు నాయఁకశబ్దాంత్యక కారము లోపించు' నని వ్రాయఁబడినది. తద్ధితప్రత్యయము పరమగునపు డెయ్యెడను అంత్యవర్ణమునకు లోపము చెప్పఁబడలేదు. సూత్రమున లేని 'క' ను చేర్చి, ప్రకృతిలో నున్న 'క' ను త్రోసివేయుట సరికాదు. అది యప్రామాణికము కూడ.

**౧౩. కారవర్ణకంబు చెలినయములకు భావంబునందును, నుడికోలలకు స్వార్థంబునందు నగు. ఈ కకారము నకుఁ గొన్నియెడల గకారం బగు.**

ఉ. చెలికారము, నయగారము, నుడికారము, కోలగారము.

౧౩. 'కార' ప్రత్యయము 'చెలి, నయము' లకు భావార్థమునం దగును. ఇయ్యది 'నుడి, కోల' అనువానికి స్వార్థమున వచ్చును. 'కార' లోని కకారము కొన్నియెడల గకారముగా మాఱును

చెలికారము = చెలియొక్క భావము; నయగారము నిట్లే. ఇచటి కకారము గకారమైనది. 'కోల' అనునది కోలఁత' లోని తకారము లోపింపఁగా మిగిలిన రూపము - నామవాచకము.

**౧౪. చలికి మిరివర్ణకంబు స్వార్థంబునం దగు.**

ఉ. చలిమిరి.

౧౪. 'చలి' అనుదానికి స్వార్థమునందు 'మిరి' అగును. చలిమిరి=చలి.

## ౧౫. టివర్ణకం బొందునంత్యవర్ణంబునకు భావంబునం దగు.

ఉ. ఒంటి.

౧౫. 'ఒందు' అనుదాని కడపటి యక్షరమునకు (దు = అనుదానికి) ఆదేశముగా భావార్థమునందు 'టి' అగును. ఒందు + టి = ఒంటి. (ఒంటి యనఁగా ఒంటరితన మని యర్థము.)

## ౧౬. పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునంద యేఁడు వర్ణకం బగు

విశేష్యంబు భిన్నవచనవిభక్తికంబయ్యు మానార్థక శబ్దములమీఁదఁ బరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునందే యేఁడు వర్ణకంబు వచ్చు నని యర్థము.

ఉ. మూరెఁడు తోఁక, తూమెఁడు బియ్యము, పుట్టెఁడు తవిఁదలు, రెండుపుట్ల గింజలు మొ.

౧౬. కొలఁతను దెలుపునది పరిమాణార్థము - ఆ యర్థమున 'ఏఁడు' ప్రత్యయము ప్రథమైకవచనమునందుమాత్రమే యగు నని యర్థము. అనఁగా విశేష్యంబు వేఱు విభక్తియందును, వేఱు వచనమునందును ఉన్ననుకూడ దాని విశేషణము మానార్థకమగుచో వచ్చు 'ఏఁడు' ప్రత్యయము ప్రథమైక వచనమునందే యుండు నని భావము.

'పుట్టెఁడు తవిఁదలు' - ఇచట విశేష్యము బహువచనాంతమైనను, విశేషణము ఏకవచనమునందే యున్నది. 'పుట్టెఁడు తవిఁదలకు' అను చోట విశేష్యము షష్ఠీబహువచనమున ఉన్నను, విశేషణమగు మానార్థము ప్రథమైకవచనమునందే యుండుట గమనింపఁదగును.

## ౧౭. దఘ్నార్థంబునం దత్సమపదంబులమీఁదను బంటి గానంబడియెడి.

ఉ. 'కటిబంటి నెత్తురుకాలువల్.' రామా. ౮ ఆ. ౨౩౩.

౧౭. లోఁతును దెలుపునపుడు తత్సమపదములమీఁదఁగూడ 'బంటి' ప్రత్యయము కానఁబడుచున్న దని సూత్రార్థము.

బాలవ్యాకరణమున దఘ్నార్థమున బంటి, కొలఁదులు విధింపఁబడినను, ఉదాహరణములుమాత్ర మాచ్ఛికములకే యీయఁబడినవి. కాన ఆ ప్రత్యయములు తత్సమములమీఁద రా వనెడి భ్రాంతి కలుగుచున్నది. తత్సమములమీఁది 'బంటి' కానవచ్చుటచే ఆ భ్రాంతిని తొలగింప నీ సూత్రము చెప్పఁబడుచున్నది. 'కటిబంటి' లోని 'కటి' తత్సమము.

## ౧౮ ప్రాచుర్యార్థంబునం దెనుఁగుపదంబులమీఁదను మయట్ప్రత్యయము చూపట్టెడు.

ఉ. తనమయము. 'వ. విచ్చలవిడిని దనమయంబుగా గగనంబున నిగుడు నచ్చక్రంబుం గనుంగొని' ఉ. హరి. 3 ఆ. ౧౪౪. తమమయము. 'ఎ-గీ. 'సమదవృత్తిఁ గేలి సలిపెఁ జకోర చ,యంబు చదలు దమమయంబు గాఁగ.' నిర్వ. ౬ ఆ. ౪౮. మెదడుప్రోవులమయము. 'తే. ప్రధనభూమి, మెదడుప్రోవుల మయ మయ్యె మిక్కుటముగ.' హరి. ఉ. ౧౦ ఆ. ౫౮ మొ.

౧౮. ప్రాచుర్యార్థము = ఎక్కువ యను నర్థము. ఈ యర్థమునందు ఆచ్ఛికపదములమీఁద కూడ మయట్ ప్రత్యయము (మయ-అనునది) కాన వచ్చుచున్నది.

'మయట్' ప్రత్యయము సంస్కృతవ్యాకరణమునఁ జెప్పఁబడినది. అది సంస్కృతపదములమీఁదనే వచ్చును. కాని, యయ్యది అచ్చతెనుఁగుల

మీఁదను రావచ్చు నని యీ సూత్రము చెప్పుచున్నది. సూత్రమునందలి 'తెనుఁగుపదములమీఁదను' అను సముచ్చయమువలన మయట్ప్రత్యయము తత్సమములమీఁదను రావచ్చు నని తెలియుచున్నది.

ఆచ్ఛికముల కుదాహరణములు - 'తనమయము; తమమయము; మెదడు ప్రోవులమయము.'

'రామునిమయము' మున్నగునవి తత్సమముల కుదాహరణములు కాఁగల వని గ్రహించునది.

**౧౯. ఒకానొకచో మతుబర్థంబున నవర్ణంబు చూపట్టెడి.**

ఉ. 'క. అనిలజ! నీ కిట్లని పల్కనుజను నే? తలఁప లేడి కడుపునఁ బులి పుట్టునె యిట్టి దివ్యతేజం,బునవాఁ డధమాన్వయమునఁ బుట్టునె? చెప్పుమా!' (దివ్యతేజంబునవాఁడు = దివ్యతేజము గలవాఁడు.) భార. ఆది. ౬ ఆ. ౫౮. ఇతరంబులు ప్రయోగదృష్టంబులు గ్రాహ్యంబులు.

౧౯. కొన్నిచోట్ల మతుబర్థమునందు 'న' అను ప్రత్యయము కాన వచ్చుచున్నది. ఉదా- 'దివ్యతేజంబునవాఁడు.'

ఇతరంబులు___ఈ ప్రకరణమునఁ బ్రయోగబాహుళ్యము ననుసరించి కొన్ని ప్రత్యయములు చూపఁబడినవి. మహాకవిప్రయోగముల ననుసరించి వేఱుగ ప్రత్యయములు ఉండిన నుండవచ్చును. ఇట్టివానిని ప్రయోగముల ననుసరించియే నిర్ణయింపవలె నని భావము.

ఇది తద్ధితపరిచ్ఛేదము.

---

# క్రియాపరిచ్ఛేదము



౧. తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం త్రికాలవాచి యగు.

ఉ. 'వారి యనువయించు, సితకృష్ణతంతురాజితతంత్ర మది.' భార. ఆది. ౧ ఆ. ౧౦౮. (అనువయించు=అనువయించు చున్న) 'వ. నా నేర్చువిధంబున.' (నేర్చు=నేర్చిన.) భార. ఆది. ౧ ఆ. ౨౦. 'నాపడుప్రయాసము లూరకపోకయుండ.' (పడు= పడిన) కళా. ౪ ఆ. ౯. 'ఆ. ద్రుపదుపీటిలోన దొమ్మికయ్యము రేఁచెఁ, బసులఁ బట్టె విరటుపట్టణమున, మఱియు నెన్ని లేవు మార్తాండతనయుండు, తోడరి మనకుఁ జేయు దుండగములు?' (చేయు=చేసిన) జై. ౧ ఆ. ౯౨ 'ఆ. జనమేజయుచేయు సర్ప యాగమున' (చేయు=చేయఁగల) భార. ఆది. ౧ ఆ. ౧౨౭ మొ.

పనిని తెలియఁజేయునది క్రియ, ఆ క్రియనుగూర్చి తెలియఁజేయు. గ్రంథభాగము క్రియాపరిచ్ఛేదము.

౧. తద్ధర్మాద్యర్థమునుబట్టి యేర్పడిన విశేషణము తద్ధర్మార్థకవిశేషణము. అట్టి విశేషణము అసహాయతయందును-అనఁగా తత్తత్కాలబోధక ప్రత్యయ విశిష్టము కాకున్నను త్రికాలవాచి యగును; అనఁగా భూత-భవిష్య-ద్వర్త మానార్థములను మూఁడింటిని దెలుపును.

ఉదాహరణములలో అనువయించు' అనునది వర్తమానమునకును, కడ పటి దగు 'చేయు' అనునది భవిష్యత్తునకును ఉదాహరణములు. మిగిలినవి భూత

కాలమున కుదాహరణములు. ఉదాహృతులు సుస్పష్టములు. వయివానిని 'అను వయించుచున్న, చేర్చిన, పడిన, చేసిన, చేయఁగల' అనియుం జెప్పవచ్చును.

**౨. ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబు అగు నుండు చను చేరుకొనులు ప్రశ్నార్థకైకారపరకంబు లగునపుడు వాని కడ యచ్చులకు లోపంబు విభాష నగు. అగుచో నుండు డకారంబునకు నకారం బగు.**

చేరుకొను అనఁగా ననుప్రయుక్త మగు కొనుధాతు వని యర్థము.

ఉ. 'క. అ, మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే?' భార. విరా. ౧ ఆ. ౧౨౨. 'మునీంద్ర! నీకుఁ జన్నే నలినాక్షులందు మది నిల్పఁగ?' భార. ఆది. ౮ ఆ. ౧౭౯. 'అహితముఁ భయముఁ దొరకొన్నె నాకు నాపుత్రులకుఁ?' భార. సభా. ౨ ఆ. ౧33. పక్షమున నుండునే మొ.

౨. కొన్నియెడల తద్ధర్మార్థకము లగు 'ఉండు, చను.' అనుప్రయుక్తమగు 'కొను' అనువాని చివర ప్రశ్నార్థకమగు ఏకారము చేరియుండునపుడు ఆ తద్ధర్మార్థకముల చివరి యచ్చులకు లోపము వికల్పముగా నగును. అట్లు లోపము కలుగునపుడు 'ఉండు' అనుదాని డకారము నకారముగా మాఱును.

సూత్రమునందు 'చేరుకొను' అని కలదు; దానికి 'చేర్పుడుగా వచ్చిన కొనుధాతువు-లేక అనుప్రయుక్తమగు కొనుధాతువు' అని యర్థము.

'...హాని పుట్టక యున్నే?' (ఉండున్+ఏ) ఇచట డకారముమీఁది ఉకారము లోపించిన పిదప డకారము నకారముగా మాఱి ద్విత్వము పొందినది.

'నీకుఁ జన్నే? ('చనున్+ఏ-' అచ్చు లోపించి, సంధి. 3. సూ. చే నకార ద్విత్వము.) 'దొరకొన్నె?' (దొరకొనున్+ఏ. అచ్చు లోపింపఁగా నకారద్విత్వము ఇచటి 'కొను' అనుప్రయుక్తము.)

ఈ చివరియచ్చు లోపించుట వికల్పము కాన లోపము రానపుడు 'ఉండునే? చనునే? దొరకొనునే?' అనియు నగును.

## 3. తద్ధర్మభూతక్రియ లార్యాద్యర్థపరకంబు లయి ప్రశ్నార్థకంబు లగు.

ఉ 'సీ. మీవంశమున నరదేవోత్తములైన సద్ధర్మ మార్గంబు సలుపుదయ్య?' భార. సభా. ౧ ఆ. ౨౬. 'క. సన్నా నితులయి వర్తింతురయ్య నీదైవజ్ఞుల్?' భార. సభా. ౧ ఆ. 33. 'పంచితయ్య' భార. సభా. ౧ ఆ. ౪౭.

3. 'అయ్య, అమ్మ' మున్నగునవి ఆర్యాద్యర్థకములు; అవి పరములయి యున్నపుడు తద్ధర్మార్థకక్రియలును, భూతార్థకక్రియలును ప్రశ్నార్థకములుగా మాఱును.

'...సలుపుదయ్య?' (సలుపుదు + అయ్య - ఇచట తద్ధర్మక్రియకుఁ బిదప 'అయ్య' అని యున్నందున నిది ప్రశ్నార్థకమైనది. 'సలుపుదయ్య' అనఁగా 'సలుపుచున్నావా?' అని యర్థము.). వర్తింతురయ్య (వర్తింతురు + అయ్య=వర్తించుచున్నారా?-ఇచట తద్ధర్మార్థకము ప్రశ్నార్థకముగా నయినది.) పంచితయ్య! పంచితి+అయ్య=పంచితివా?' అని యర్థము. ఇచట భూతార్థకక్రియ ప్రశ్నార్థకముగా మాఱినది.)

## ౪. ఒక్కొకచోఁ దద్ధర్మక్రియ యార్యాద్యర్థపరకం బయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకం బగు.

'చ. తనయుఁడు తండ్రి యగ్రజుఁడు తమ్ముఁడనం జనునయ్య రాజ్యముం, గొనునెడ?' నిర్వ. 3 ఆ. ౯౫. 'సురాంగనలెల్ల నిట్టి నీ, చేతకు మెత్తురమ్మ?' స్వా. 3 ఆ. 33 మొ.

౪. 'అయ్యా, అమ్మ' మున్నగు శబ్దములు పరములై యున్న—అనఁగా వానికి ముందున్న తద్ధర్మార్థక క్రియ కొన్నిచోట్ల వ్యతిరేకార్థమును సూచించు ప్రశ్నార్థకముగా మాఱును-అనఁగా వ్యతిరేకప్రశ్నార్థక మగు నని భావము. (వ్యతిరేకవ్యంజకము = వ్యతిరేకార్థమును సూచించునది) '...అనం జను నయ్యా!' (చను + అయ్యా?=అనఁజనదని యభిప్రాయము) '...చేతకు మెత్తు రమ్మ?' (మెత్తురు + అమ్మ=మెచ్చ రని యభిప్రాయము.)

**౫. ఆర్యాద్యర్థక మొక్కచో నటుశబ్ద పూర్వకంబు నగు.**

ఉ. చెల్లునటయ్య, చెల్లునటమ్మ. 'ఉ. దయసేయక తిన్నని మేను వెన్నెలన్, వేఁతురటమ్మ యింతకను వేఁదురు సెల్లునటమ్మ యింతికిన్.' స్వా. 3. ఆ. 33 మొ.

౫. అయ్య, అమ్మ మున్నగునవి ఆర్యాద్యర్థకములు. వానికి కొన్నిచోట్ల 'అటు' అనునది ముందు చేరుచుండును.

చెల్లునటయ్య! (చెల్లును + అటు + అయ్య) 'చెల్లునటమ్మ' అనునదియు నిట్లే. 'వెన్నెలన్ (వేఁతురు + అటు + అమ్మ) వేఁతురటమ్మ!'

భూత తద్ధర్మార్థకములు ఆర్యాద్యర్థకములకంటె ముందున్నచో ప్రశ్నార్థకము లగు నని యిదివఱకు వివరింపఁబడినది. ఇచట ఆర్యాద్యర్థకములు 'అటు' అనుదానితో వ్యవహితము లయ్యును ప్రశ్నార్థకము లగు నని యభిప్రాయము.

ఈ విధముగా 'అటు' చేరుట తఱచుగా వ్యతిరేకసూచకప్రశ్నార్థకములందే కానవచ్చుచున్నది.

**౬. మహద్బహుకర్తృక క్రియకు నేకవచనంబు విభాష నగు.**

ఉ. 'క. తన యెఱిఁగిన యర్థం బొరుఁ, డనఘా! యిది యెట్లు చెప్పు మని యడిగినఁ జె, ప్పనివాఁడును సత్యము చె, ప్పని

వాఁడును ఘోరనరక పంకమునఁ బడుఁగా.' భార. ౧ ఆ. ౧౩౭.
పక్షమున - 'క బలవంతుఁడు పయిఁ నెత్తిన, బలహీనుఁడు ధనము
కోలుపడిన యతఁడు మ్రుచ్చిలి వేఁగునతఁడుఁ గామా, కుల
చిత్తుఁడు నిద్ర లేక యుండుదు రధిపా!' భార. ఉద్యో. ౨ ఆ.
౨౧ మొ.

౬. మహద్బహుళకర్తృక క్రియ = పెక్కు మహద్వాచకములు కర్త
లుగాఁ గల క్రియ; ఒక్కటే యగు క్రియకుఁ గర్తలుగా పెక్కు లుండి,
ఆ కర్తలు మహద్వాచకములుగా నున్నయెడల, క్రియ ఏకవచనమునందును,
బహువచనమునందును గూడ నుండవచ్చు నని సూత్రమున కభిప్రాయము.

'...అడిగినఁ జెప్పనివాఁడును, సత్యము చెప్పనివాఁడును ఘోరనరక
పంకమునఁ బడున్-' అనుచోట కర్తలు రెండున్నను క్రియ 'పడున్' అని ఏక
వచనమునందే యున్నది. దీనిని 'పడుదురు' అనియుఁ జెప్పవచ్చును; క్రియ
బహువచనములో నుండుటకు '...నిద్ర లేక యుందురు...' అనునది ఉదా
హృతి. దీనిని 'నిద్ర లేక యుండును-' అనియుఁ జెప్పవచ్చును.

## ౭. కొన్నియెడలం ద్వరితార్థసూచకం బయి భావిని భూతంబు చూపఁబడి.

ఉ. 'తా వచ్చె సుదర్శనాయుధుఁడు.' భాగ. ౧౦ స్కం.
పూ. ౧౭౩౪.

౭. త్వరితార్థసూచకంబు='తొందర' అను నర్థమును తెలియఁజేయు
నది. కొన్నిచోట్ల భూతకాలక్రియ తొందరను సూచించునదై భవిష్యదర్థ
మునఁ బ్రయోగింపఁబడును.

'తా. వచ్చె సుదర్శనాయుధుఁడు...' అనుచో 'వచ్చె' అను భూత
కాలిక క్రియ 'రాఁగలఁడు' అను నర్థమును - తొందరగా రాఁగలఁ డని
సూచించుచుఁ దెలుపుచున్నది.

**(౮) వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకం బగు**

**అర్థత్రయము = వర్తమానభూతభవిష్యదర్థములు.**

ఉ. వర్తమానమునకు - 'పాఱఁడు లేచి దిక్కులకు.' (పాఱఁడు = పాఱుచున్నవాఁడు కాఁడు.) భాగ. ౭ స్కం. ౧౯౪. 'పలుకదు సఖులతో లలితాంగి.' (పలుకదు = పలుకుచున్నది కాదు.) భార. ఆర. ౨ ఆ. ౨౬. భూతమునకు - 'క. నలుఁగాన మివ్వనంబున.' (కానము=కనినవారము కాము.) భార. ఆర. ౨ ఆ. ౧౮౬. 'తెక్కలు రావు పిల్లలకు.' (రావు = వచ్చినవి కావు) భాగ. ౭ స్కం. ౬౩. భవిష్యత్తునకు - 'వాసుదేవుఁడుఁ రాఁ డను.' (రాఁడు=రాఁగలవాఁడు కాఁడు) భాగ. ౧౦ స్కం. పూ. ౧౭౨౭. 'ఆ. నలునకాని నళినదళనేత్ర వరియింప, దట్టె' (వరియింపదు=వరియించునది కాదు) భార. ఆర. ౨ ఆ. ౫౨ ఇత్యాదు లెఱుంగునది.

౮. వ్యతిరేకార్థక క్రియ వర్తమానవ్యతిరేకార్థమును, భూతవ్యతిరేకార్థమును, భవిష్యద్వ్యతిరేకార్థమును - ఆ యా సందర్భములనుబట్టి మూఁ డర్థములను బోధించుచుండు నని యర్థము.

ఉదాహరణములు స్పష్టములు. భవిష్యదర్థోదాహరణమున 'వరియింపదు = వరియింపఁగలది కాదు' అని యర్థమును గ్రహింపనగును.

**౯. ప్రార్థనంబునం దన్ప్రత్యయాంత క్రియలమీఁదఁ గద కదవు పూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు.**

ఉ. ప్రోవఁగదన్న, ప్రోవఁగదవన్న; ప్రోవఁగదయ్య, ప్రోవఁగదవయ్య; ప్రోవఁగదమ్మ; ప్రోవఁగదవమ్మ; ప్రోవఁ

గదె, ప్రోవఁగదవె, ప్రోవఁగదవే. 'సుకీర్తిమై మనఁగదన్న.' భాగ. ౧౦ స్కం. పూ. ౧౫౦. 'చెప్పఁగదయ్య' భాస్కరశతకము 'తుది యెప్పుడు మద్విరహాంబురాశికిన్, చెప్పఁగదమ్మ!' భాగ. ౧౦ స్కం. పూ. ౧౦౩౦. 'శా. తండ్రీ! నాకు ననుగ్రహింపఁగదె వైద్యం బంచుఁ బ్రార్థించినన్' స్వా. ౫ ఆ. ౧౭. క. నీపాదకమలసేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం, తాపారభూతదయయును, దాపసమందార! నాకు దయ సేయఁగదే!' భాగ. ౧౦ స్కం. పూ. ౧౨౬౯. 'పురంబుఁజేరనిం, కెవ్విధిఁగాంతుఁ దెల్పఁగదవే తెరువేది?' స్వా. ౨. ఆ. ౩౯ మొ.

౯. ప్రార్థనార్థమునందు 'అన్' అను ప్రత్యయము, చివరఁ జేరు పదములవియు 'కద, కదవు' అనునవియును, వానికిఁ దర్వాత 'అన్న-అమ్మ, అయ్య అ, ఆ, ఎ, ఏ, ఒ, ఓ మున్నగునవియుం జేరుట కలదు. '(ప్రోవు+అన్+కద+అన్న) ప్రోవఁగదన్న!' ఇట్లే తక్కినవియును.

## ౧౦. ప్రార్థనాదులందన్ప్రత్యయాంత క్రియలమీఁది యమ్మునకిత్కారంబు విభాష నగు.

ఉ. 'సీ. ఓర్పుమై నుప్పిండి యుపవాసముండనీ, మగనాలిసరిఁ బోలఁదగదు విధవ.' (ఉప్పిండి = ఉప్పిండిగ.) కాశీ. ౨ ఆ. ౮౩. 'మ. మునిధర్మంబులకెల్ల దవ్వని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ.' కళా. ౩ ఆ. ౨౮. 'స్రగ్ధర - కననీ గోత్రాలు బిడ్డన్ గగనకుసుమముం గల్గనీ ఆయి మాటల్, విననీ ముక్తుండు వెండిన్ విపులఁ బొడమనీ.' పాండు. ౩ ఆ. ౧౨౮ మొ.

౧౦. ప్రార్థనార్థమునందు 'అన్' ప్రత్యయము చివర వచ్చు క్రియల మీఁద నుండు 'ఇమ్ము' అనుదానికి 'ఈ' కారము ఆదేశముగా వచ్చును.

'...ఉండనీ.' (ఉండు + అన్ + ఇమ్ము) ఇచటి 'ఇమ్ము' ప్రార్థనమునం దన్నంతముపై నున్నందున దీని కంతటికిని 'ఈ' ఆదేశముగా వచ్చి 'ఉండనీ' అయినది. 'నవ్వనీ' '(నవ్వు+అన్+ఇమ్ము' 'కననీ (కను+అన్+ఇమ్ము). మిగిలినవియు నిట్లే.

## ౧౧. ఒకానొకచో రండు పొండులకు రాపొం డని రూపంబు గానంబడియెడి.

ఉ. 'క. నిండుదలంపునఁ దగ రా, పొండను గారవము లేని పొరపొచ్చెమునం, గొండంత పసిఁడి యిచ్చిన, నుండంగాఁ జనునే? వారియొద్దను దండ్రీ?' య. 3 ఆ. ౯౦.

౧౧. కొన్నియెడల 'రండు, పొండు' అను సమూహమునకు 'రాపొండు' అను ప్రయోగము కనఁబడుచున్నది. ఇచట తొలిక్రియ ఏకవచనమునం దుండుట విచిత్రము; కావుననే తదర్థము సూత్రమును చెప్పవలసి వచ్చినది. ఉదాహృతి స్పష్టము.

## ౧౨. కొన్నియెడల భావార్థకరూపము నుశబ్దపరకంబయి యానంతర్యార్థకం బయ్యెడి.

ఉ. 'అనుటయు లుబ్ధకుం డిట్లనియె.' భార. అర. ౫ ఆ. 3౨ మొ.

౧౨. కొన్నిచోట్ల భావార్థకరూపమగు 'ట' ప్రత్యయాంతము సముచ్చయార్థమున వచ్చెడి 'ను' తోఁగూడినదై అనంతర్యార్థమును (తరువాత-అను నర్థమును) బోధించు నని సూత్రార్థము.

'అనుటయుం లుబ్ధకుం డిట్లనియుం-' అనుచో 'అనుటయుం' అనఁగా 'అనిన యనంతర' మని యర్థము. 'అనుట' అనునది భావార్థకము. దానికి శబ్ద ౧౧౬ సూ. చే 'ను' వచ్చినది. 'అనుట' అనుదంత మగుటచే ఆ 'ను' అను నది 'గగ' వర్ణపూర్వకమయి వచ్చినది. 'ను' ద్రుత మగుటచే స్థిరము పరము కాఁగా అది లోపించి 'యు' మాత్రము మిగిలినది.

బాలవ్యాకరణమునందు ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు నని మాత్రము చెప్పఁబడినది. ఇందు 'యుంను' ఆనంతర్యార్థమున వచ్చు నని తెలుపుట విశేషము.

## ౧౩. భావంబునం దనుప్రయుక్తం బగు కొనుటకుం గోలు విభాష నగు.

ఉ. ఇచ్చుకోలు, పుచ్చుకోలు మొ. పక్షమున ఇచ్చుకొనుట, పుచ్చుకొనుట మొ.

౧౩. భావార్థమునందు అనుప్రయుక్తమై యుండు 'కొనుట' అను దానికి బదులు 'కోలు' అని వికల్పముగా వచ్చు నని యర్థము. ఉదా.' ఇచ్చుకోలు, పుచ్చుకోలు.' 'కోలు' రానపుడు ఇచ్చుకొనుట, 'పుచ్చుకొనుట' అని యుండును. ఇచట 'కొనుట' అనునది 'ఇచ్చు, పుచ్చు' ల కనుప్రయుక్త మగుట స్పష్టము.

## ౧౪. కొఱకు కంటె పొంటెలు పరంబులగునపుడు భావార్థక టువర్ణకంబునకు లోపంబు విభాష నగు

ఉ. 'క. దానిఁ జూపుకొఱకునె కాదే, యీయయ్యఁబట్టి దెచ్చుట!' కళా. 3 ఆ. ౧౭౦. 'తే. భూమి పాలించుకొఱకునై పుట్టినాఁడ.' వి. పు. ౨ ఆ. ౧౧౯. 'క. పతి కలుగుకంటె సౌఖ్యము, సతులకు నొండొకటి కలదె చర్చింపంగాఁ, బతిలేమి

సర్వాశాన్యము, పతి గలిగిన సతికి నింద్రపదవది యేలా?' విక్ర. ౬ ఆ. ౧౧౭. 'క. ఏపగిదిని బ్రతుకరాదె యిటు చెడుకంటెన్.' హరి. పూ. ౫ ఆ. ౨౩౦. 'తే. అనృతవిక్రమమును బ్రకటించుకంటె.' నిర్వ. ౭ ఆ. ౨౧. 'ఎ-గీ. అఖిలతృణలతాతరునిచయంబుఁ జీడ, పత్తె నిట్టలంబుగ జడి పట్టుపొంటె.' హరి. పూ. ౭ ఆ. ౧౬౦ - మొ. పక్షమున చూపుటకొఱకు, కలుగుటకంటె, పట్టుటపొంటె మొ.

౧౪. 'కొఱకు, కంటె, పొంటె' అను ప్రత్యయములు పరములైయున్నప్పుడు భావార్థమునందు వచ్చిన 'ట' వర్ణకము వికల్పముగా లోపించును.

'దానిఁ జూపుకొఱకునె కాదే?...' ఇచట 'దానిఁ జూపుటకొఱకునె కాదే!' అని యర్థము. ఇట్టే 'భూమి పాలించుకొఱకునై పుట్టినాఁడ' అనుచోట 'భూమి పాలించుటకొఱకునై పుట్టినాఁడ' అనియు నుండును. 'కలుగుకంటె, చెడుకంటె, ప్రకటించుకంటె, పట్టుపొంటె, అనునెడల 'ట' లోపమును గమనించునది.

## ౧౫. ఒకొ్కకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు.

ఉ. 'రాహుకం,ఠము దెగి దేహము ధరణిఁ బడియె.' భార. ఆది ౨ ఆ. ౧౯. 'బిట్టడలు మనంబునం గదిరి హా! యనువారును.' భార. విరా. ౩ ఆ. ౫. 'ఏ త్తెఱవ్రేసిన మోము దాఁకి తిరిగె గరుడి.' నిర్వ. ౩ ఆ. ౨౭. 'ఆదియున్ మేనుచ్చి హా లక్ష్మణా, యంచున్ గూలె.' రా. అర. కాం. ౨ ఆ. ౫౯. 'సీ. పారలెత్తి ఘనసారతరువులఁ దనుదానన్ దొరఁగిన పచ్చకప్పురపు రజము.' స్వా. ౨ ఆ. ౫౫౧ మొ.

౧౫. భూతార్థకాసమాపకక్రియ = ఇకారాంతమగు క్త్వార్థకక్రియ; ఆక్రియ కొన్నియెడల హేత్వర్థమునుగూడఁ దెలుపు నని యర్థము.

'రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె' ననునెడ 'తెగి' అనఁగా 'తెగిన హేతువున' అని యర్థము. అట్టి యర్థమును 'తెగి' అను భూతకాలికాసమాపక క్రియ తెల్పుచున్నది. 'బిట్టడలు మనంబునం గదిరి.' అనగా 'బిట్టడలు మనంబునం గదిరిన హేతువున' అని యర్థము. ఇట్లే 'వ్రేసిన=వ్రేసిన హేతువుచే; మేనుచ్చి=మేనుచ్చిన హేతువుచే, పొరలెత్తి=పొరలెత్తిన హేతువుచే' అని యర్థములను గ్రహింపవలెను.

## ౧౬. కవిత్రయేతర ప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్యయాదులుపరంబులగునపుడు పకారం బించుక్చకారంబునకేనిఁ గానఁబడదు.

ఉ. 'క. ఎవ్వారినిఁ బోరించని తుణమొక్కటియుఁ దరింపఁగ వశమే?' కళా. ౨ ఆ. ౪. 'క. ఊహించ నొక నాల్గు గడియల, సంచారము వలయు.' కళా. 3 ఆ ౫౯. అపిశబ్దార్థముచే 'అంగనభీతుల కెల్ల భీతి దీర్చుము వెసఁబొమ్ము నమ్మునుచుం గదలెన్.' కళా. ౬ ఆ. ౧౪ మొ.

౧౬. కవిత్రయమువారిని విడిచి తక్కినవారి ప్రయోగములను గమనించినచో 'ని' మున్నగు ప్రత్యయములు పరములగునపుడు ఇంచుక్కులోని చకారమునకుఁగూడ పకారాదేశము కలుగకుండుట కానవచ్చుచున్నదని సూత్రార్థము.

బాలవ్యాకరణమున క్రియా. ౮౭, ౮౮, ౯౦ సూత్రములలో ఇంచుక్చకారమునకు పకారాదేశము విధింపఁబడి యున్నది. కవిత్రయము వారిని విడిచి తక్కుంగల కవులు మాత్రము పకారాదేశము చేయకుండుటయుఁ గానవచ్చుచున్నదని భావము.

'...పోరించని' (పోరించు+ని) అనుచో 'ని' పరము కాఁగా 'ఇంచు' చకారమునకు పకారాదేశము రాలేదు. 'ఊహించన్' (ఊహించు+అన్)

అనుచోట 'అన్' పరము కాఁగా పకారాదేశము రాలేదు. సూత్రమునందు 'నిప్రత్యయాదులు' అని యుండుటవలన 'అన్' అనునదియుం గ్రహింపఁబడినది.

సూత్రమునందు 'ఇంచుకచ్ఛకారంబున కేని' అని అపి శబ్దార్థము సంగ్రహింపఁబడుటచే ఇంచుగ్భిన్న చకారమునకును పకారాదేశంబు లేకుండుట కానఁబడుచున్న దని యర్థము. '...భీతి దీర్చుము' అనుచోట 'తీర్చు' 'తీర్పు' గా మాఱలేదు.

## ౧౭. పకారంబు కొన్ని యెడల శత్రర్థపరక చువర్ణకంబునకుం గానంబడెడి.

ఉ. 'మోవిమోవిఁ జేరుపుచును.' కళా. ౭ ఆ. ౧౬౨. 'గర్జింపుచు' జై. ౨ ఆ. ౪౯ మొ.

౧౭. కొన్ని యెడల శత్రర్థకచువర్ణకము పరముగాఁ గల 'చు' వర్ణమునకును పకారాదేశము వచ్చుట కల దని యర్థము.

బాలవ్యాకరణమున ఆగమచకారమునకు ముత్తు పరముగా నున్నపుడే పకారాదేశము విధింపఁబడినది; శత్రర్థకచువర్ణకము పరమగునపుడు విధింపఁబడలేదు. ప్రయోగములంబట్టి యట్టియెడను పకారాదేశవిధాన మావశ్యకమైనందున నీ సూత్రము వ్రాయఁబడుచున్నది.

'మోవిఁజేరుపుచును' (చేరుచు+చును) 'గర్జింపుచు' (గర్జించు + చున్.) అనుచోట్ల శత్రర్థకచువర్ణకమునకు ముందున్న ఆగమచకారమునకు పకారాదేశము స్పష్టము.

## ౧౮. అన్నంతక్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకం బగు.

ఉ. 'చొక్కుచుఁ జొక్కఁజేయుచు.' కళా. ౭ ఆ. ౧౫౭. 'ఉ. కేశవుఁ డవ్విరాట్తనువుఁ గృష్ణసమాఖ్య వహింపఁజేసెనో?' కళా. ౮ ఆ. ౧౧ మొ. (చొక్కఁజేయు=చొక్కించు; ఇట్లంతట నెఱుంగునది.)

౧౮. 'చేయు' అనుదానితోఁ గూడి యున్నప్పుడు అన్నంతమగు క్రియ ప్రేరణార్థము నిచ్చును.

'చొక్కుచుఁ జొక్కఁజేయుచున్-' అనుచోఁ 'చొక్కు+అన్+ చేయుచున్' అను ప్రక్రియావస్థయందు చొక్కన్ అనునది అన్నంతక్రియ. దానికి 'చేయు' అనునది చేరినందున ప్రేరణార్థక మైనది.

'...వహింపఁజేసెనో ?' (వహించు+అన్+చేసెనో) ఇచటను అన్నంత క్రియ ప్రేరణార్థక మయినది. చేయుధాతువుతోఁ జేరినపు డీ ప్రేరణార్థము రాదు.

బాలవ్యాకరణమునందు ఇంచుక్పుక్పుగాగమములు ప్రేరణార్థకములుగాఁ జెప్పఁబడినవి. చేయుయోగమున నన్నంతముకూడ ప్రేరణార్థక మగుచున్నందున నీ సూత్రమును చెప్పవలసి వచ్చినది.

౧౯. వ్యాపారోన్ముఖత్వంబున నన్నంతక్రియలకుఁ బాఱు ధాతు వనుప్రయుక్తం బగు.

ఉ. 'సీ. పయిఁ బరామరిక చొప్పడమిఁ బాకము తప్పి పండఁబాఱిన పాల మెండఁబాఱె.' స్వా. 3 ఆ. ౧౨౯ మొ.

౧౯ వ్యాపారోన్ముఖత్వంబు = పని నెఱవేఱుట కభిముఖముగా - (ఫలించుటకు సిద్ధముగా) నుండుట; అట్టి యర్థమును బోధించునపుడు అన్నంత క్రియకుఁ దర్వాత 'పాఱు' ధాతువు చేర్పఁబడుచుండు నని యర్థము.

'పండఁబాఱిన' (పండు+అన్+పాఱిన=పండుటకు సిద్ధముగా నున్న యని యర్థము.) 'ఎండఁబాఱెన్' (ఎండు+అన్+పాఱెన్=ఎండుటకు సిద్ధముగా నుండెను అని యర్థము.)

౨౦. తిగుచు ధాతువు నన్నంతరూపములు తివ్వఁదివ యనియు,

ఉ. 'క. ఎవ్వరికిని మోపెట్టను, దివ్వను శక్యంబుగాని దృఢకార్ముకముల్.' భార. ఆది. ౭ ఆ. ౨౫. 'గొప్పపట్టి తివం బోవ.' కళా. 3 ఆ. ౧౨౭.

౨౦. తిగుచు ధాతువునకు అన్నంతరూపము 'తిగువన్' అగును; కాని దాని స్థానమున 'తివ్వ, తివ' అనునవియుం గానవచ్చుచున్న వని యీ సూత్రము చెప్పుచున్నది.

'...తివ్వను శక్యంబుగాని' = తిగువ శక్యము కాని; 'కొప్పు పట్టితివం బోవన్'=కొప్పు పట్టి తిగువంబోవ.

**౨౧. కంటెవర్ణకంబు పరంబగునపుడు విశేషణ నవర్ణకంబు మీఁది యమహత్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు.**

ఉ. 'క. లోకత్రయరాజ్యము మును నిర, మిత్రముగాఁ గనినకంటె.' లక్ష్మీ. 3 ఆ. ౧3౮. 'విభునిపంచినకంటె.' హరి. ఉ. ౪ ఆ. 'తే. *శరణుఁజొచ్చిన రక్షింపఁజాలియుండి, మనుపకుండిన కంటెఁ గల్మషము గలదె?' విక్ర. 3 ఆ. ౯3. 'క. కుడిచినకంటెను క్షేత్రము, పడసిన తెఱవధికమంద్రు పాడికిఁ జనుచోన్.' విజ్ఞా. వ్య. ౪౮. పక్షమున కనినదానికంటె మొ.

౨౧. 'కంటె' ప్రత్యయము పరముగా నున్నపుడు విశేషణపదము యొక్క 'న' ప్రత్యయముమీఁద వచ్చు 'అది' అను శబ్దమునకు లోపము వికల్పముగా నగును.

('...కనినకంటె) (కనినదానికంటె) ఇచట 'కనిన' విశేషణము; 'కంటె' పరమగునపుడు దాని చివరి 'న' వర్ణకముతర్వాతఁ గల 'దాని' అను

* శరణునొందిన. పా.

అమహత్తచ్ఛబ్దార్థమునకు లోపము వచ్చినది. 'పంచినకంటె' (పంచినదానికంటె అని యర్థము) 'మసుపకుండినకంటె' (మసుపకుండినదానికంటె అని యర్థము.) 'కుడిచినకంటెను' (కుడిచినదానికంటెను అని యర్థము.) అను నవియుం నిట్టే.

'ఉన్న-కలజీ-న వర్ణకంబులు భవద్భావికత్ర్యర్థంబులం దగు' నని బాలవ్యాకరణమున భూతకాలార్థమగు 'క్తవదర్థమున 'న' ప్రత్యయము విధింపఁబడినది. వుయి ప్రత్యయములు సత్వాభిధానంబులం దగు ననియు నచటనే చెప్పఁబడినది. కావున నిచట నీ 'న' వర్ణకముకంటెఁ బరమైన సత్వాభిధాన మగు అమహత్తచ్ఛబ్దార్థమునకు లోపము వచ్చినది. లోపము రానపుడు 'కనినదానికంటె' మున్నగు రూపము లగు నని గ్రహింపవలెను.

## ౨౨. క్రియావిధేయవిశేషణంబులమీఁది యగు ధాతువున కన్నంతమునకు లోపంబు విభాష నగు.

ఉ. క్రియావిశేషణములకు: 'క. పెల్లు దొరఁగు నెత్తురునై.' భార. భీష్మ. ౧ ఆ. ౨౭౦. 'క. సౌందర్యవిలాసాదుల, యందునె తగులువడి యితర మరయని మగవా, రుం దఱచుగఁ గలర.' కళా. ౭ ఆ. ౯౪. 'ఉ. దీనికి నేల నవ్వెదివి తెల్లము నాకెఱిఁగింపు నావుడుర్.' వి. పు. ౨ ఆ. ౨౩౯. విధేయవిశేషణములకు - 'క. లవణంబు *కప్ప మడుగుము.' ఉ. హరి. ౪ ఆ. ౧౩౪. 'తగు వస్తువు లప్పన మంపువారు.' కళా. ౮ ఆ. ౪౫. 'వరునిప్రేమ నడుమఁ దెరువాటు గొట్టె' కళా. ౭ ఆ. ౨౩౯. 'చ. భవ, జ్జనకుఁ బరీక్షితుఱ భుజగజాల్మఁ డసహ్యావిషోగ్రధూమకే, తనహతిఁజేసి చేసె నతి దాంతుఁ గృతాంతనికేతనాతిథిఱ.' భార. ఆది. ౧ ఆ. ౧౨౪. పక్షమున 'పెల్లుగఁ దొరఁగు,

* మనకుఁ గప్ప పా.

కప్పముగ నడుగుము, కృతాంత నికేతనాతిథిగ' మొ. 'మంత్రు లఁగా, నొనరించితె?' భార. సభా. ౧ ఆ. ౨౬ మొ.

౨౨. అగుధాతువున కన్నంతమునకున్-అన్ ప్రత్యయాంతమగు 'అగు ధాతువునకు; ఇదియే బాలవ్యాకరణమునఁ జెప్పఁబడిన నుఞ్యంతము. క్రియా విశేషణమునకును, విధేయవిశేషణమునకును అనుప్రయుక్తమగు 'కన్, కాన్' అను అన్నంతమగు నగుధాతువు వికల్పముగా లోపించు నని సూత్రార్థము.

క్రియావిశేషణములమీఁది యగుధాతులోపమునకు ఉదాహరణములు. 'వెల్లు దొరఁగు నెత్తురునై-' (వెల్లు క్రియావిశేషణము దానిమీఁది 'కన్' లోపించినది.) '......దఱచు గలర' ('దఱచు' క్రియావిశేషణము; దానినిమీఁది అన్నంతమగు నగుధాతువు 'కన్' లోపించినది.) *'తెల్లము నా కెఱిఁగింపుము' (తెల్లము క్రియావిశేషణము; దానిమీఁది 'కాన్' లోపించినది.)

విధేయవిశేషణములమీఁద అన్నంతమగు నగుధాతువు లోపించుట కుదాహరణములు:- 'లవణంబు కప్ప మడుగుము' (కప్పముగా నడుగుము అని యర్థము.) ఇచట 'కప్పము' విధేయవిశేషణము. దానిమీఁది 'కాన్' లోపించినది.

'తగు వస్తువు లప్పన మంపువారు' (అప్పనముగా నంపువా రని అర్థము) ఇచట 'అప్పనము' విధేయవిశేషణము; దానిమీఁది 'కాన్' లోపించినది. 'వరుని ప్రేమ నడుమఁ దెరవాటు గొట్టె' (తెరవాటుగాఁ గొట్టె నని యర్థము.) ఇచటను విధేయవిశేషణముపయి 'కాన్' లోపించినది. 'కృతాంతనికేతనా తిథిన్' (కృతాంతనికేతనాతిథిగా నని యర్థము.) ఇచట 'అతిథి' ననునది విధేయవిశేషణము దానిపయి 'కాన్' లోపించినది.

ఇట్లన్నంతమగు నగుధాతువు లోపించుట వికల్పము; కావున లోపము రాక 'వెల్లుగఁదొరఁగుఁ-కప్పముగ నడుగుము-' మున్నగురీతినికూడ ఉండును.

---

*తెల్లముగా నెఱిఁగింపుము—పా.?

**౨౩. ఒకానొకచో నన్నంత మగు నగుధాతువు దీర్ఘంబు నకు భావ్యర్థంబున నున్న పరంబగునపుడు హ్రస్వమును గానంబడియెడి.**

ఉ. 'క. తరుణీ! యేరికిఁ జెల్లునె, యరయఁగ నే మింతె వార మనుకొన నిదిగో!, పిరువీఁకు గనున్నది. తాఁ, గర మద్భుత మైన సవతికయ్యముచేతన్.' (కనున్నది - కానున్నది యని యర్థము పిరువీఁకు కర్త.) కళా. ౧ ఆ. ౧౭౯. ఉ. 'నీకు నాథుఁడుగ నున్న మహామహు నా నృపాలు నా, కెప్పుడు చూడఁగాఁగలుగు?' (నాథుఁడు గనున్న-నాథుఁడు కానున్న యని యర్థము.) కళా. ౫ ఆ. ౭౯ మొ.

౨౩. కొన్నిచోట్ల అన్నంతమగు నగుధాతువుయొక్క దీర్ఘమునకు ('కాన్' అనుదానికి) భవిష్యదర్థమునందు 'ఉన్న' అనునది పరంబగునపుడు హ్రస్వము కానవచ్చుచున్న దని యర్థము.

బాలవ్యాకరణమున 'నుజ్యంతం బగు నగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు నుజ్కి విభాష నగు; దానికి హ్రస్వంబు విభాష నగు' నని క్రియావిశేషణమునకుఁ దర్వాత నున్న అన్నంతదీర్ఘమునకే హ్రస్వము వికల్పముగా విధింపఁబడినది. ఇచట భావ్యర్థమునందును హ్రస్వత చెప్పఁబడుట విశేషము.

'......పిరువీఁకు గ నున్నది...' (పిరువీఁకు గాన్+ఉన్నది-అనియుండును. ఇచట 'క నున్నది కా నున్నది' అని రెండు రూపములు నుండునని భావము.) ఇచట పిరువీఁకు కాఁగల' దని యర్థము. 'నీకు నాథుఁడుగనున్న' (నీకు నాథుఁడు కానున్న - నాథుఁడు కాఁగల అని యర్థము.)

## ౨౪. శబ్దపల్లవ క్రియలు కొన్ని ద్విరుక్తంబు లగుచో నుత్తరపదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాష నగు.

ఉ. 'సీ. చటులఖురోద్ధతాశ్వశ్రేణిఁ బొడివి రయంబునఁ దునిమి తూఁటాడియాడి' భార. విరా. ౫ ఆ. ౫౬. 'సీ. *ఇందు రారావయ్య విందులు విందులం చర్థిఁ బిల్వఁగ నడయాడి యాడి' హరి. పూ. ౫ ఆ. ౧౯౩. 'పోరాడియాడి చెన్నొందవె నేని.' హరి. పూ. ౭ ఆ. (?) 'వ. పరస్పరజయార్థులగుచు వాదడిచి యడిచి.' కాశీ. ౫ ఆ. ౪౯. 'సీ. ఎడమను గవళ్లఁ దడఁబడ కుండంగ గుఱుతులు మదిఁ బాదుకొలిపి కొలిపి' కళా. ౪ ఆ. ౪౧. 'చ. తదీయరూపముఁ గా, మదిఁ దలపోసిపోసి.' పర. ౨ ఆ. ౧౭ మొ. పక్షమున తూఁటాడి తూఁటాడి మొ.

౨౪. ధాతువు మున్నగువానికి ధాతువు అనుప్రయుక్తమయి విలక్షణమగు నర్థమును చెప్పినచో శబ్దపల్లవ మనఁబడును. అట్టి శబ్దపల్లవములు కొన్ని రెండుసారు లుచ్చరింపఁబడు నపుడు ఆమ్రేడితముయొక్క (రెండవ పదముయొక్క) పూర్వభాగమునకు లోపము వికల్పముగా నగునని సూత్రార్థము.

'...తూఁటాడి యాడి' (తూఁటాడి, తూఁటాడి అని ఉండఁగా, రెండవ తూఁటాడిలోని పూర్వభాగమగు 'తూఁటు' అనునది లోపించినది. 'తూఁటాడు' శబ్దపల్లవము. 'నడయాడి, యాడి' (నడయాడి, నడయాడి) లోని రెండవ 'నడ' లోపించినది.) 'పోరాడి యాడి' (పోరాడి, పోరాడి) 'వాదడిచి యడిచి' (వాదడిచి, వాదడిచి) 'పాదుకొలిపి, కొలిపి' (పాదుకొలిపి, పాదుకొలిపి). 'తలపోసిపోసి' (తలపోసి, తలపోసి). ఉత్తరపద పూర్వావయవలోపము వికల్పమగుటచే లోపము రానపుడు 'నడయాడి నడయాడి' యున్నగురీతి నగును.

---

*ఎ-గీ. విందురావయ్య! విందుల విందు వినుము, నర్థిఁ దను బిలువఁగ నడయాడియాడి. ఫా.

**౨౫. శబ్దపల్లవ క్రియలును ద్వ్యవయవ క్రియలును సమాప్తంబులయి పునర్గృహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు.**

ఉ. 'చ. ఆ లతాంగిఁ దోడ్కొని చనుదెమ్ము; తే నను్వుఁ గూడని పక్షమునందు.' భోజ. 3 ఆ. ౨౨౯. 'ఇలకుం దివికిం జననిచ్చు; నిచ్చు యే, నని వెసనార్చు' రా ఆర. కాం ౨ ఆ. ౧౩౬ మొ. పక్షమున చనుదే, చననిచ్చి మొ.

౨౫. ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తములయి, విలక్షణ మగు నర్థమును దెల్పునవి శబ్దపల్లవములు; రెండవయవములు కల్గి, యా రెండిటి యర్థములను తెల్పునవి (విలక్షణార్థమును తెలుపనివి) ద్వ్యవయవములు. ఈ రెండు విధములగు క్రియలును వాక్యసమాప్తిని పొందించిన పిదప, తిరిగి గ్రహింపఁబడినచో, వాని పూర్వావయవములకు లోపము వికల్పముగాఁ గలుగును.

(సమాప్తంబులయి = వాక్యసమాప్తిని పొందించిన వయి; పునర్గృహీతంబులు = తిరిగి గ్రహింపఁబడినవి. తత్పూర్వావయవంబునకు = శబ్దపల్లవ, ద్వ్యవయవక్రియల తొలి యవయవములకు.)

'ఆ లలితాంగిఁ దోడ్కొని చనుదెమ్ము; తే నను్వు కూడనిపక్షమునందు-' ఇచట 'చనుదెమ్ము' క్రియ సమాప్తమయినది; అది శబ్దపల్లవక్రియ; అది మఱల గ్రహింపఁబడినపుడు దాని పూర్వావయవ మగు 'చను' అను నది లోపించి 'తెమ్ము' అనునదే మిగిలి 'తే నను్వు...' అని అయినది.

'ఇలకుం దివికిం జననిచ్చు; నిచ్చు యే నని...' ఇచట 'చననిచ్చు' సమాప్తము. అది ద్వ్యవయవక్రియ. ఆ క్రియ పునర్గృహీతమయినపుడు తత్పూర్వావయవ మగు 'చనన్' లోపించి 'ఇచ్చు' మాత్రము నిలిచి 'ఇచ్చి'

అని కానవచ్చుచున్నది. ఈ లోపము రానపుడు 'చనుదెమ్ము' నకుఁ బిదప 'చనుదే' అనియుం 'చననిచ్చు' నకుఁ బిదప 'చననిచ్చి' అనియుం నుండును.

**౨౬. ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబులగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు.**

ఉ 'ఉ. విప్రకులుండ! వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియుఁ్ర.' భార. ఆది. ౨ ఆ. ౬౩. 'క. మన కాప్తుఁడు సంజయుఁ డీ,తని యుపదేశంబువట్టి ధర్మమున ముకుం,దుని నాశ్ర యింపవయ్యె! య,తనిఁబొందిన బ్రతుకుదీవుఁ దమ్ములు సుతులుఁ్ర.' భార. ఉద్యో. ౨ ఆ.3 ౨౧. 'ఉ. నేను నా, సేనయు దాడి పెట్టిద విశ్రృంఖలతఁ్ర.' హరి. ఉ. 3 ఆ. ౯౮. 'ఆ. ఎలుఁగు రాలుపడఁగ నిట్లనుఁ బదునాలు, గేండ్లు రాఘవుండు నీవు నన్న,రణ్యభూము లందు రక్షించి నేఁడు కా,ఱడవి నెట్టు లొంటి *విడిచె దనిన' జై. ౬ ఆ. ౬౮ మొ పక్షమున 'మ. మోహాంధుండు భీష్ముండుఁ గేశవ! నీవుం గడఁగుండు.' భార. సభా. ౨ ఆ. ౬3. మొ.

౨౬. కొన్నిచోట్ల సహార్థము (కూడ అను నర్థము) నందు 'నీ-నా' శబ్దముల యర్థము చెప్పఁబడినపుడు క్రియలు వికల్పముగా 'నీ-నా' శబ్దార్థములే కర్తలు కలవిగా నుండు నని యర్థము.

'విప్రకులుండ! వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియుఁ్ర - ' అను నెడ సహార్థము కలదు. 'విప్రకులుండ! నీవు నీ నిషాదితోఁగూడ వేగమ వెల్వడు' మని యిట నర్థము. ఈ యర్థమున 'నీవు' అనునది అభిహిత మగుటచే 'వెల్వడు' క్రియకు అదియే కర్తయైనది; కాన క్రియ 'వెల్వడుము' అని

* విడిచె దన్న. పా.

అయినది. యుష్మదర్థము కర్త యగుట వికల్ప మగుటచే పక్షాంతరమున 'వెల్వడుఁడు వేగము నీవును నీ నిషాదియుఁక్' అని యుండవచ్చును.

'...అతనిఁ బొందిన బ్రదుకు దీవు దమ్ములు సుతులుఁక్-' అనుచోట 'నీవు నీ తమ్ములతోడను, సుతులతోడను బ్రదుకుదు' వని యర్థము. ఈ సహార్థమునందు 'ఈవు' అభిహిత మగుటచే 'బ్రదుకు' క్రియ కదియే కర్తయై 'బ్రదుకుదువు' అయినది. అది కర్త కానపుడు 'బ్రదుకుదు రీవు దమ్ములు సుతులున్' అని యగును.

'నేను నా సేనయుఁ దాడిపెట్టెద నిశ్శృంఖలతక్' అనునెడ 'నేను నా సేనతోఁగూడ విశృంఖలముగా ఎదిరించెద' నని యర్థము. ఈ సహార్థమున 'నేను' అను నస్మదర్థ మభిహిత మగుటచే అదియే 'దాడిపెట్టు' క్రియకుఁ గర్తయైనది. కావున 'దాడిపెట్టెద' నని క్రియ యైనది. అస్మదర్థము కర్త కానపుడు 'దాడిపెట్టెదము' అని యుండును.

'...బదునాలు గేండ్లు రాఘవుండు నీవు న న్నరణ్యభూములందు రక్షించి, నేఁడు కా అడవి సెట్టు లొంటి విడిచె దనిన-' అనుచోట 'నీవు రాఘవునితోఁ గూడఁ బదునాలుగేండ్లు అరణ్యభూములందు నన్ను రక్షించితి' వని యర్థము. ఈ సహార్థమునఁ గల 'నీవు' 'విడుచు' క్రియకుఁ గర్త యగుటచేఁ గ్రియ 'విడిచెదు' అయినది. పక్షంబున 'విడిచెదరు' అని అగును.

'భీష్ముండు, కేశవా! నీవుం గడగుండు-' అనుచో 'కేశవా! నీవు భీష్మునితోఁ గూడ కడఁగు' మని యర్థము. ఈ సహార్థమున 'నీవు' కర్త కానపుడు క్రియ 'కడఁగుండు' అనునది. ఇయ్యది యుష్మదర్థము క్రియకు గర్త కానప్పటి యుదాహరణము.

**౨౭. కర్తృభూతక్రియతోడం దత్కర్త కన్వయం బగు.**

ఉ. నీవు రావచ్చును బోవచ్చును మొ. ఇందు రాఁబోవను కర్తృభూతక్రియలతో వానికిఁ గర్త యగు నీ వనుదాని కన్వయం బని యెఱుంగవలయు.

౨౭. కర్తృభూతక్రియ = వలయు+ఆదులకు ముందుండి, కర్తృభావమును పొందిన క్రియ; 'రావలయుంచు' మన్నచోట్ల 'రా' మన్నగునది. అట్టి కర్తృభూతక్రియతోడనే వాని కర్తకు సమన్వయ మగు నని సూత్రార్థము.

'నీవు రావచ్చును, పోవచ్చును' అనునపుడు 'రా, పో' అనునవి కర్తృభూతక్రియలు. ఇచట కర్తయగు 'నీవు' అనునది 'వచ్చును' తో సమన్వయింపక 'రా-పో' లతోనే సమన్వయించు నని భావము.

ఇచట 'రా-పో' లు కర్తృభూతములగుటచేతను, 'నీవు' కర్తయగుటచేతను ఆ రెంటికిని సమన్వయము కుదురదేమో యని భ్రాంతి కలుగుట కవకాశ మున్నందున, ఆ భ్రాంతిని దొలగించుటకీ సూత్ర మారంభింపఁబడినది.

౨౮. ఒఓలకు సందేహార్థకంబులకు వలయుచోఁ గొన్ని యెడలఁ గదా కదే లనుప్రయుక్తంబు లగు ఉద్దేశ్యంబు ద్వ్యవయవంబేని విధానం బందొక్కటి కడదాని కగు.

ఉ. 'ఉ. ఎంత కృతార్థులమో కదా!' వి పు. ౭ ఆ. ౫౭. 'మ. శాంతంబు కాదో కదే!' భోజ.. ౩ ఆ. ౨౩౨. 'అవునో కాదో కదా!' రామా. ౬ ఆ. ౧౩౦ మొ.

౨౮. సందేహము అర్థముగాఁ గల ఒ-ఓ లకు కావలసినపుడు కొన్నిచోట్ల 'కదా! కదే' అనునవి అనుప్రయుక్తము లగును. ఉద్దేశ్యము రెండవయవములు కలదై యున్నపుడు ఆ రెంటిలోఁ జివరిదానికే విధానం బుండును.

[ఉద్దేశ్యంబు=దేని నుద్దేశించి కార్యము విధింపఁబడునో అయ్యది; విధానము = విధించుట—విధి. 'ఎంత కృతార్థులమో కదా!' - అనుచో సందేహార్థమున 'కృతార్థులమో!' అను ఓకారమునకుఁ బిదప 'కదా!' ప్రయోగింపఁబడినది. 'శాంతంబు కాదో కదే!' అనునది 'కదే!' అనుప్రయుక్తమగుట

కుదాహృతి. 'అవునో, కాదో కదా!'- అనుచోట 'అవునో కాదో' అను నుద్దేశ్యంబు రెండవయవములు కలది. కాన దానిలో చివరి దగు 'కాదో' అను నొక్క దానికిమాత్రము కదా!' (విధానము) అనుప్రయుక్తమైనది. 'అవునో కదా. కాదో కదా!' అని రెండు సారులు 'కదా' ప్రయోగింప బడ లేదు. సూత్రమునందు 'వలయుంచో' అని చెప్పుటచే 'కదా, కదే' లను ప్రయుక్తములు కానివియుం గల వని స్పష్టము. అవి లేకుండుటకు 'ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో, నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో!' మున్నగు నవి యుదాహరణములు.

## ౨౯. తలఁచుగం గ్రియలమీఁది కదకదవుల కన్నాదులు పర్యాయంబున ననుప్రయుక్తంబు లగు.

ఉ. 'ఆ. అలసితివిగదన్న! యాఁకొంటివిగదన్న!' భాగ. ౧౦ స్కం. పూ. ౨౫౯. 'పీయపురాల వైతిగదవే యిపుడు!'' విజ. 3 ఆ. ౧౨౫ మొ. తలఁచుగ ననుటచే ఉ. 'పూఁతపసిండి వంటి వలపుం బచరించుకులంబునీతికిన్, లేఁతగదమ్మ యిత్తెఱఁగు లేమ!' స్వా. 3 ఆ. 33. 'దయాంబురాశివిగదమ్మ!' భాగ. ౧౦ స్కం. పూ. ౧౭౪౨ ఇత్యాదు లూహ్యంబులు.

౨౯. క్రియలమీఁద నుండు 'కద, కదవు' అనువానికి 'అన్న' మున్నగునవి క్రమముగా ననుప్రయుక్తము లగుట తలఁచుగాఁ గనఁబడు చున్న దని యర్థము. (పర్యాయముగా-ఒకటి రానవు డింకొకటి చొప్పున క్రమముగా నని యర్థము.)

'అలసితివిగదన్న, ఆఁకొంటివిదగన్న!-ఇచట 'కద' కు 'అన్న' అను ప్రయుక్త మైనది. 'పీయపురాలవైతి కదవే!'- అనుచో 'కదవు' కు 'ఏ' అనుప్రయుక్తము. సూత్రమునందు 'తలఁచుగం గ్రియలమీఁద' నని యిట్లు

క్రియలమీఁది 'కద, కదవు' ల కన్నాదుల యప్రయోగము తెలిచని చెప్పుటచే క్రియలు కానివానిపయిని కూడ కద, కదవుల కన్నాదులు చేరుట కలదను నర్థము సిద్ధించుచున్నది. కావుననే '...లేఁతగదమ్మ!' అనుచో 'లేఁత' అను నామము మీఁది 'కద' కు 'అమ్మ' చేరినది; 'దయాంబురాశివి గదమ్మ' అనుచో విశేషణముపయిఁ ('దయాంబురాశివి' పయి) గల 'కద' కు 'అమ్మ' అనుప్రయోగ్యమయినది.

## 30. అన్ప్రత్యయాంత మగు నగుధాతువు కొన్నియెడలఁ బెక్కుచోట్ల కొక్కటియు నగు

ఉ. 'తే. ధర్మజుఁడు తూర్పు భీముఁడు దక్షిణంబు, నర్జునుఁడు పడమరఁ గవ లర్థి నుత్తరంబుగా వేఁటవోయిరి రాజముఖ్యు, లనఘు లింతకు వత్తురు వినుతబలులు.' భార. ఆర. ౬. ఆ. ౧౫౮. పక్షమునఁ దూర్పుగ, దక్షిణంబుగ, పడమరగ ననియు నుండవచ్చును.

30. అన్ ప్రత్యయాంతమైన 'అగు' ధాతువు కొన్నిచోట్ల నొక్కటియే చాలయెడల సమన్వయించు నని సూత్రార్థము.

'ధర్మజుఁడు తూర్పు...నుత్తరంబుగా...' అనుచోట 'ఉత్తరంబుగా' అనుచోటఁ గల అన్నంత మగు నగు ధాతువు 'తూర్పు' మున్నగువానితోఁ జేరి 'తూర్పుగా, దక్షిణంబుగా, పడమరగా' అనియును నన్వయించును.

## 3౧. కాదె కదార్థకం బగు.

'ఎ-గీ. శౌరికృప గాదె నాకు నక్షయబలంబు.' జై. ౨ ఆ. ౬౪.

3౧. 'కదా!' అనునర్థమున 'కాదె!' అనునది గూడ వచ్చు నని యర్థము. "శౌరికృప కాదె నాకు నక్షయబలంబు"- ఇచట 'కదా!' కు 'కాదె!' వచ్చినది.

## ౩౨. అయి కాన్ అవ్యయంబులు స్వయమర్థకంబు లగు.

ఉ. వాఁడయి వచ్చెను, వాఁడుగా వచ్చెను. వాఁడు తనంత వచ్చె ననుట. 'ఉ. తలంపరు నీకుఁ దెల్ప నీ, వై పరికింప వంచు దురహంకృతి నాయమఁగన్న దంపతుల్.' కళా. ౭ ఆ. ౩౬. 'అక్షీణప్రభావుండు *సర్వకళా సంజనకుండు [1]నార దుఁడుగా రాఁజూచి.' నిర్వ. ౫ ఆ. ౩౫ పొ.

౩౨. 'అయి, కాన్-' అను నవ్యయంబులు రెండును 'స్వయము' అను నర్థమును దెల్పును. ('అయి' అగు ధాతుక్త్వార్థరూపము. 'కాన్' అగుధాతువు యొక్క అన్నంతరూపము. స్వయమర్థ మనఁగా-'తనంత' అని యర్థము.)

వాఁడయి వచ్చెను; వాఁడుగా వచ్చెను.' వాఁడు తనంత వచ్చె నని యర్థము. '...నీవై పరికింప వంచు...' 'నీయంత నీవు పరికింప వంచు' నని యర్థము. 'నారదుండుగా రాఁ జూచి' 'నారదుండు తనంత రాఁ జూచి' అని యర్థము. ఇయ్యవి ఇతర మగు నర్థమును గూడఁ జెప్పుచున్నందున 'అయి, కా నవ్యంబులు స్వయమర్థకంబులు నగు' నని యుండుట లెస్స,

## ౩౩. అకా నిత్యర్థకం బగు.

ఉ. 'అపజయమకా లక్షించి.' భార. అర. ౨ ఆ. ౬౩ పొ.

౩౩. ఇత్యర్థకంబు = 'అని' అను నర్థము నిచ్చునది. అ+కాన్ = అగు ధాతువుయొక్క అన్నంతరూపము, అవధారణార్థకమగు 'అ' తర్వాతఁ బ్రయుక్తమయినది. అట్టి 'అకాన్' అనునది 'అని' అను నర్థమును తెల్పు నని భావము.

'అపజయమకా లక్షించి' అపజయము అని లక్షించి యని యర్థము.

## ౩౪. కరఁగుతలఁగుమొఱయ్యాదు లంతర్భావిత ప్రేరణంబులు.

---

* సంఖ్యకళా. పా. 1. నారదుండు రాఁగాఁ జూచి. పా.

౩౪. అంతర్భావితప్రేరణంబులు = ప్రేరణార్థకములగు ఇంచుక్చువు గాదులు లేకయే యా యర్థము నిచ్చునవి. కరఁగు, తలఁగు, మెఱయు మున్నగునవి స్వార్థములును, ప్రేరణార్థకములును గూడ నగు నని భావము.

వీనికి శబ్దరత్నాకరమున నే యి ట్లుదాహరణములు కలవు-'కరఁగు = ద్రవించు-రమణభుజానిపీడనఁ గరంగిన కాంతల' లక్ష్మీ. ఆ ౩. ప. ౭౧. ప్రే. కరఁగించు-ఎ-గీ. కుసుమబాణుని బాణముల్ గూడ నైదుః, గరఁగి సేరిమి వాటించి...' భార. విరా. ఆ ౨. ప. ౨౭. తలఁగు=తొలఁగు. 'క. నలుఁడును ధరణీరాజ్యము తలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గడున్...' భార. అర. ఆ ౨. ప. ౪౬. ప్రే. తొలఁగించు - సీ. ఉత్తమక్షత్రియుం డొరుల దుఃఖంబులు తలఁగంగఁ బుట్టిన ధర్మశీలుఁడు-' భార. ఆది. ఆ. ౬. ప. ౨౮౩.

మెఱయు=ప్రకాశించు-'మెఱసి యే నుపచారము వేడ్క సేయఁగా నెన్నఁడు మెచ్చునో.' భాను. ఆ. ౩. ప. ౫౭. ప్రే. బయలుపఱచు-' 'కఱచునెడ సేయునెడ వడిఁ బఱచునెడం బెనఁగునెడ నపారబలంబుల్ మెఱయునెడ...' భార. ఆది. ఆ ౫. ప. ౧౬౪.

మెఱయ్వాదులను నెడఁ గల ఆదిపదముచే 'కురియు, ఆగు, మున్నగు వానిని గ్రహింపవలెను. ఆఁగు=నిలుచు ప్రే. అడ్డగించు - క. మ్రోఁగుచుఁ దూపులు దూపుల, నాఁగుచు.' రామా. ఆ ౮. ప. ౧౧౭. కురియు=వర్షించు-ప్రే. కురియించు ఎ-గీ. అసురకామినీనేత్రతోయములు గురిసి, యంబుదద్యుతి త్రిదశసస్యంబుఁ బ్రోచు, నెవ్వఁ డవ్విష్ణుఁడు' హరి. పూ. ౪. ఆ.౧౦౧.

### ౩౫. అడుగ్వాదులు ద్వికర్మకంబులు.

౩౫. అడుగు మున్నగు క్రియలు రెండు కర్మలు కలిగి యుండు నని యర్థము. 'ఈ కారణమును వాని నడుగుము; రాజును ధనమును యాచింపుము' మున్నగు చోట్ల 'అడుగు యాచించు' క్రియలు రెండేసి కర్మలను కలిగి యుండుట స్పష్టము.

ఇది క్రియాపరిచ్ఛేదము.

# కృదంతపరిచ్ఛేదము



ధాతువులవలన నేర్పడిన నామములు కృదంతములు. ధాతువునకు విహితం బగు డుజ్ భిన్న ప్రత్యయము కృత్తనియు, నది చివరఁ జేరునది కృదంత మనియుఁ జిన్నయసూరిగారు వివరించిరి. అట్టి కృదంతములను వివరించు గ్రంథభాగము కృదంతపరిచ్ఛేద మనఁబడుచున్నది.

## ౧. డయ్యు దయ్యు నొచ్చుపుచ్చుల కివర్ణకం బగు; అగుచో వానికడహల్లులు పకారంబులగు.

ఉ. డప్పి, దప్పి, నొప్పి, పుప్పి.

౧. డయ్యు, దయ్యు, నొచ్చు, పుచ్చు - అను ధాతువులకు 'ఇ' ప్రత్యయ మగును. అట్లగునపుడు ధాతువుల చివరియక్షరము పకార మగు నని యర్థము.

డయ్యు+ఇ = (పత్వము) డప్పి; దయ్యు+ఇ = దప్పి; నొచ్చు+ఇ=నొప్పి; పుచ్చు+ఇ=పుప్పి.

'డయ్యు'-అనునది 'దయ్యు' నకు రూపాంతరము కావచ్చు నని బాలవ్యాకరణమునందలి ప్రకీర్ణ. ౧౮. సూ. వలన దెలియుచున్నది; 'నొచ్చు, ప్రిచ్చు' లకు 'నొవ్వు, ప్రివ్వు' అని యగు నని బాలవ్యాకరణము నందలి కృదంత. ౧౭-వ సూ. లోని ఉదాహరణములవలన స్పష్టమగుచున్నది. 'పుచ్చు' అనునది 'ప్రిచ్చు'నకు రూపాంతరము కాఁదగును. కావున 'ప్రిప్పి' యను సాధువు కానగును. పయి కృదంతరూపములు బాలవ్యాకరణమున సాధింపఁబడనందున ఇచటఁ జూపఁబడినవి.

## ౨. రాయున కిడి వర్ణకంబు నగు.

ఉ. రాయిడి, రాపు.

౨. 'రాయుం' నకు 'ఇడి' వర్ణకము నగును. రాయుం+ఇడి='రాయిడి' అగును. ఇది రానపుడు బాలవ్యాకరణమునుబట్టి 'మాయుం+పు=మాపు' వలె 'రాయుం+పు=రాపు' అగును. సూత్రమున 'రాచు' అని ముద్రిత పాఠము; అది సరికాదు. 'రాచు' నకు 'ఇడి' వచ్చిన 'రాచిడి' కావలసివచ్చును. కుమారదేవపండితీయమున 'రాచు' గ్రహింపఁబడినది.

## 3. ఈర్చుబ్బుకందుదువ్వువడ్డించుల కెన వర్ణకం బగు; అగుచో ఈర్చుబ్బుల చకార బకారంబులు పకారంబు లగు; వడ్డించునించు లుప్తం బగు.

ఉ. ఈర్పెన, ఉప్పెన, కందెన, దువ్వెన, వడ్డెన.

3. 'ఈర్చు, ఉబ్బు, కందు, దువ్వు, వడ్డించు' లకు 'ఎన' అను ప్రత్యయ మగును. అట్లగునపుడు 'ఈర్చు' చకారమునకును, 'ఉబ్బు' బకారమునకును పకారము ఆదేశముగా వచ్చును. 'వడ్డించు' లోని 'ఇంచు' నకు లోప మగును.

ఈర్చు+ఎన = ఈర్పెన; ఉబ్బు+ఎన = ఉప్పెన; కందు+ఎన = కందెన; దువ్వు+ఎన=దువ్వెన; వడ్డించు+ఎన-వడ్+ఎన=వడ్డెన.

ఇచట 'ఈర్పుడు' అనియు బాల. కృదం. ౨౦. సూ. అనుసరించి యగును. 'ఉబ్బు, కందు'లు ఎట్టి ప్రత్యయములు చేరకయు విశేష్యము లగును. ఉబ్బు=సంతోషము; కందు=నలుపు.

## ౪. పురవర్ణకంబు కాఁచు ధాఁచు దాయ్యాదుల కగు.

ఉ. కాఁపురము, దాఁపురము, ధాపురము మొ.

౪. 'పుర' అను ప్రత్యయము కాఁచు, దాఁచు, దాయుఁ మున్నగువాని కగును.

కాఁచు + పుర + ము = కాఁపురము; దాఁచు + పుర + ము = దాఁపురము (దాఁపరిక మని యర్థము.): దాయుఁ + పుర + ము = దాఁపురము (ప్రాప్తి యని యర్థము.)

ఇచట కృత్యగత పకారము పరమైనందున బాల. కృదంత సూ. ౨. ననుసరించి చయలకు లోపము.

౫. ఎక్కుదిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకం బగు. అగుచో నెగు ఎక్కున కాదేశం బగు.

ఉ. ఎగుమతి, దిగుమతి, ఇట్లు ఎగువ.

౫. పంపుట యను నర్థమునందు 'ఎక్కు, దిగు' లకు 'మతి' అను ప్రత్యయము వచ్చును. 'మతి' పరమగునపుడు 'ఎక్కు' నకు 'ఎగు' ఆదేశమగును. ఎక్కు + మతి - ఎగు + మతి = ఎగుమతి; (పైస్థలములకుఁ బంపుట యని అర్థము.) దిగు + మతి = దిగుమతి. (పై స్థలములనుండి స్వస్థలమునకుఁ దెప్పించుట అని యర్థము. 'వ' పరమైనను 'ఎగు.' ఆదేశమగును. ఉ. ఎగువ.

౬. వువర్ణం బులియ్యాదుల కగు.

ఉ. ఉలివు మొ.

౬. 'ఉలియు' మున్నగువానికి 'వు' అను వర్ణక మగును.

ఉలియు + వు = ('యు' లోపము) ఉలివు. ఈ 'ఉలియు' ను మన్వాదులలోఁ జేర్చినయెడల బాల. కృదంత. ౧౭-వ సూ. చేతనే 'వు' వర్ణకము వచ్చి 'ఉలివు' కాఁగలదు. కావున నీ సూత్ర మనావశ్యకము.

## ౭. కాచువీచులకు వలివర్ణకం బగు.

ఉ. కావలి, వీవలి.

౭. 'కాచు, వీచు' అనువానికి 'వలి' వర్ణక మగును.

కాచు+వలి = కావలి; వీచు+వలి=వీవలి. (ఇచట. బాల. కృదంత. ౨. సూ. చే చకారలోపము. (వీవలి = గాలి; కావలి = రక్షణము.) 'కాచు' నకు 'పు' వర్ణకము వచ్చి 'కాపు' అనియుం రూప మగును (బాల. కృదంత. ౧౧. సూ.)

ఇది కృదంతపరిచ్ఛేదము.

# వాక్యపరిచ్ఛేదము

పదముల సమూహము వాక్య మని సామాన్యలక్షణము. అట్టి వాక్యములనుగూర్చి వివరించు గ్రంథభాగ మగుటచే దీనికి వాక్యపరిచ్ఛేద మని పేరు వచ్చినది.

**౧. వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగు నర్థము గల యాసత్తియుక్తపదసముదాయంబు.**

యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పరసంబంధమునందు బాధ కలుగకుండుట. ఆకాంక్ష యనఁగా నిలుపుదల లేక పయిఁబయిఁ బోయెడి పదార్థములమీఁది యాదరము. అది వినువారికిఁ దెలిసికొనవలయు ననెడి యపేక్షారూప మయినది. ఆసత్తి యనఁగాఁ బదముల చేరిక. యోగ్యతయు, ఆకాంక్షయు, ఆసత్తియు లేక 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు. గోవు గుఱ్ఱము' అని యిట్లు చెప్పుటచేతను, బుద్ధిమఱపు లేక నేఁడు 'దేవదత్తుఁ' డని చెప్పి మఱియొకనాఁడు 'పోవుచున్నాఁ' డని చెప్పుటచేతను పదసముదాయము వాక్యముగా నేర్పడినను నది వాక్య మని చెప్పఁదగినది కా దని తాత్పర్యము. వాక్యములందుఁ గొన్ని క్రియాన్వయము కలవి. కొన్ని తదితరాన్వయము కలవి. వాని కుదాహరణములు మీఁద స్పష్టములు గాఁగలవు. క్రియ లనఁగా వర్తమానాద్యర్థకము లయిన సమాపకక్రియలు, క్త్వాతదవ్యతిరేక శతృతుమున్నాదులచే దానంతర్యార్థకము లసమాపక

క్రియలు. ఇందు మొదటివి మూఁడు క్రియాఽభిన్న కర్తృకంబులు. వెనుకటివి మూఁడు క్రియావిభిన్న కర్తృకంబులు.

౧. పదములకుఁ గల పరస్పరాన్వయార్హత యోగ్యత యనఁబడును. సమన్వయమునందు పదములకుఁ బరస్పరము అపేక్షారూప మగు-ప్రశ్నించుకొను నవకాశ మాకాంక్ష; 'వినువారికిఁ దెలిసికొనవలయు ననెడి యపేక్షయే ఆకాంక్ష' యను మూలాభిప్రాయము సరికాదు. పదములు దగ్గఱగాఁ జేరి యుండుట యాసక్తి.

అర్థవంతమయి యోగ్యతతోను, ఆకాంక్షతోను, ఆసత్తితోను గూడి యుండిన పదముల సమూహము - క్య మగు నని సూత్రార్థము.

పదార్థములకుఁ బరస్పరసమన్వయమునందు బాధ యేర్పడినచో యోగ్యత యుండదు. 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు' అని చెప్పునపుడు నిప్పుచేఁ దడుపుట ఎల్లపుడును అసంభవము. కావున నచట బాధ యున్నందున యోగ్యత లేదు. కావున 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు' అనునది వాక్యము కాఁజాలదు. 'గోవు గుఱ్ఱము' అనునెడ అపేక్ష లేనందున నిది వాక్యము కాఁ జాలదు. 'ఇది గుఱ్ఱము' అనునెడ 'ఏది?' అను నపేక్షకు అవకాశ మున్నందున సాకాంక్ష కలుగును గాన, అది వాక్య మగుచున్నది. నేఁడు 'దేవదత్తుఁడు' అని చెప్పి, మఱియొకనాఁడు 'పోవుచున్నాఁడు' అని చెప్పినయెడల నిది వాక్యము కాఁజాలదు. ఏలయన నిచట పదములయొక్క చేరిక లేనందుని ఆసత్తి లేదు. కావునఁ బయిని చెప్పఁబడిన 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు, 'గోవు గుఱ్ఱము' మున్నగునవి పదసమూహము లైనను వాక్యములు కాఁజాలవు.

వాక్యములు రెండు విధములు. (1) క్రియాన్వయము కలవి. (2) క్రియలకంటె నితరములగుదానితో నన్వయము కలవి. 'దేవదత్తుఁడు పోవుచున్నాఁడు' మున్నగునవి క్రియాన్వయము కల వాక్యములు. 'రామునియొక్క గృహము' మున్నగునవి క్రియేతరాన్వయము కల వాక్యములు.

క్రియలు సమాపక క్రియలు, అసమాపక క్రియలు నని రెండు విధములు. వాక్యమును పూర్తిచేయు క్రియలు సమాపకక్రియలు; వాక్యమును

పూర్తిచేయని క్రియ లసమాపక క్రియలు. భూత, భవిష్యద్, వర్తమాన, తద్ధర్మార్థకము లగు క్రియలు సమాపక క్రియలు. వండెను; వండఁగలఁడు; వండుచున్నాఁడు; వండును మున్నగునవి వాని కుదాహరణములు. క్త్వార్థకము. వ్యతిరేకక్త్వార్థకము, శత్రర్థకము, తుమున్నర్థకము, చేదర్థకము, అనంతర్యార్థకము నగు క్రియ లసమాపక క్రియలు.

భూతకాలార్థమున వచ్చు 'ఇ' కారాంత క్రియ క్త్వార్థకము. భూతకాలార్థమున వచ్చు 'అక' ప్రత్యయాంతము వ్యతిరేకక్త్వార్థకము. వర్తమానార్థము నిచ్చు 'చు'న్నంత క్రియ శత్రర్థకము. తాదర్థ్యమున వచ్చు 'నుజీ' ప్రత్యయముతోఁ గూడినది తుమున్నర్థకము. 'అయినచో' అను నర్థము నిచ్చు 'ఇనన్' ప్రత్యయముతోఁ గూడినది చేదర్థకము. 'తరువాత' అను నర్థమున వచ్చు 'దున్' ప్రత్యయము వచ్చునది అనంతర్యార్థకము.

ఈ యసమాపక క్రియ లాఱింటిలో మొదటి మూఁడును - అనఁగా క్త్వార్థక, వ్యతిరేకక్త్వార్థక, శత్రర్థములు మూఁడును క్రియాఽభిన్నకర్తృకములు. అనఁగా క్రియలకు అభిన్నమగు కర్త కలవి [క్రియా+అభిన్న కర్తృకములు] అని యర్థము. అనఁగా క్త్వార్థకాదులగు క్రియ లుండు వాక్యములందలి సమాపక క్రియ కేవి కర్తలై యుండునో, అవియే తమకును కర్తలుగాఁ గలవి యని భావము. 'రాముఁడు వచ్చి, చూచెను' - అనుచోట 'వచ్చి' క్త్వార్థకము. 'చూచెను' సమాపక క్రియ. ఆ 'చూచెను.' కు కర్త 'రాముఁడు.' కాన ఆ 'రాముఁడే' 'వచ్చి' అనుదానికిని కర్తయై యున్నాఁడు. ఇచటి కర్త సమాపకాసమాపక క్రియలు రెంటికిని వేర్వేఱుగాఁ గాక అభిన్నముగా నుండుటంబట్టి యిది క్రియాఽభిన్నకర్తృకము. 'వాఁడు పాడుచు నేఁగు' ననుచో 'పాడుచున్' అను శత్రర్థమునకును, 'ఏఁగు' అను క్రియకును 'వాఁడు' అనునదియే కర్త. కావున నిదియుం క్రియాఽభిన్న కర్తృకమున కుదాహరణ మగును.

అసమాపక క్రియలలో మిగిలిన మూఁడును—అనఁగా-తుమున్నర్థక, చేదర్థక, అనంతర్యార్థకములు మూఁడును క్రియాభిన్నకర్తృకములు. అనఁగా తుమున్నర్థకము మున్నగునవి యుండు వాక్యములందలి సమాపక క్రియ కేవి కర్తలై యుండునో, (అవి కాక) దానికంటె నితరములగునవి తమకు (తుమున్నర్థాదులకు) కర్తలుగాఁ గలవి యని భావము. కాని తుము న్నర్థకము విభిన్న కర్తృకము కాదు; విభిన్నకర్తృక మనుట చింత్యము. 'రాముఁడు చదువను బోయెను' అనుచోట 'పోయెను' కు కర్త 'రాముఁడు'; తుమున్నంత క్రియకు రాముఁడే కర్త. 'వర్షములు కురిసిన, పంటలు పండును' అనుచోట 'కురియు, పండు' లకుఁ గర్తలు భిన్నములు. ఇది చేదర్థమున కుదాహరణము. 'జాబిల్లి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె' ననుచోట అనంతర్యార్థమున 'తోఁతెంచు, వికసిల్లు' క్రియలకుఁ గర్తలు వేర్వే అగుట స్పష్టము.

**౨. పద మనఁగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు నర్థబోధకంబు నైన వర్ణము, లేక వర్ణసముదాయము.**

ఉ. ఖంబు, లేక ఘటంబు మొ. ప్రయోగార్హము. ఖ, ఘట మొ. అనన్వితము - ఖంబు ఘటంబునం దోఁచెడి మొ. అనేకము-ఖంబును ఘటంబును మొ. అనర్థబోధకము-క, చ, ట, త, ప మొ.

౨. ప్రయోగార్హంబు = ప్రయోగింపఁదగినది; అనన్వితంబు = ఇతర పదముతో అన్వయి పనిది. (ఇతర పదములతో నన్వయించుచోట అయ్యది వాక్యమే యగును) ఏకంబు-ఒక్కటియే యైనది. అర్థబోధకంబు = ఏదైన అర్థమును బోధించునది. వర్ణముగాని, వర్ణసమూహముగాని పద మగును. అయ్యది అర్థమును బోధించునదై, ఒక్కటియై, అనన్వితమై, ప్రయోగింపఁ దగినదై యుండవలె నని యర్థము.

మొదటి సూత్రమునందు 'పదసమూహము వాక్య' మని చెప్పుటచే ఆ పద మెట్టిదో చెప్పవలసి యున్నందున నీ సూత్ర మారంభింపఁబడినది. ప్రత్యయముతోఁ గూడిన ప్రకృతియే ప్రయోగార్హమై పద మగును. కేవల ప్రకృతికిఁ గాని, కేవల ప్రత్యయమునకుఁ గాని ప్రయోగార్హత లేదు. 'ఖంబు, ఘటంబు' అనుచోట్ల 'ఖ-ఘట' ప్రకృతులు. 'ంబు' ప్రత్యయము. ఈ ప్రకృతి ప్రత్యయములు కలసియే 'ఖంబు - ఘటంబు' అయినవి. 'ఖ ఘట-ంబు' అని వేర్వేఱుగఁ బ్రయోగింపరాదు. 'ఖంబు ఘటంబునఁ దోఁచెను.' అనునది అన్వితమున కుదాహరణము : ఇది వాక్యము. అన్వయము కలది అన్వితము. అన్వయ మనఁగాఁ బరస్పరసంబంధము. అట్టి సంబంధము పయి వాక్యమునఁ గలదు. ప్రత్యేకముగ నున్న 'ఖంబు-' 'ఘటంబు' అనునవి పరస్పర సంబంధము లేక యున్నందున అనన్వితములై, పదము లగుచున్నవి. ఏక మనఁగా అవిభాజ్యము - వేఱుచేయుటకు వీలుకానిది. 'ఖంబు ఘటంబు' అనునపుడు ప్రకృతి ప్రత్యయములను వేఱుచేసినచో పదత్వము నశించును. అవి కలసియే యుండవలెను. 'ఖంబు ఘటంబునఁ గలదు.' అను వాక్యమును 'ఖంబు, ఘటంబున, కలదు' అని విభజింప వీలగును. కావున వాక్యమే విభాజ్య మగు ననియుఁ, పదము అవిభాజ్య మనియు గ్రాహ్యము. అర్థమును బోధింపని 'క-చ-ట-త-ప' మున్నగు రీతి వర్ణములకు పదత్వము లేదు.

## 3. పదము లవి నామములు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.

నామములు నా వస్తువాచకశబ్దములు. సందర్భవశంబున నవి కొన్ని కర్త లనియుఁ గర్మము లనియుఁ జెప్పఁబడును. ధాత్వర్థ వ్యాపారాశ్రయము కర్త. ధాత్వర్థ ఫలాశ్రయము కర్మము. క్రియ లనఁగా వ్యాపారావబోధనము లయినవి. అవి సకర్మకములు, అకర్మకములని ద్వివిధములు. కర్మముగలది సకర్మ

కము, కర్మము లేనిది యకర్మకము. కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనంబడు. అది కర్తరిప్రయోగము, కర్మణిప్రయోగము నని ద్వివిధము క్రియచేఁ గర్త చెప్పఁబడునేని యది కర్తరిప్రయోగము;కర్మము చెప్పఁబడునేని కర్మణిప్రయోగము. కర్తరిప్రయోగము సకర్మకక్రియగలచో సకర్మకకర్తరిప్రయోగ మనియు, అకర్మకక్రియగలచో నకర్మకకర్తరి ప్రయోగమనియుఁ జెప్పఁబడును. అవ్యయము లనఁగా విభక్తివచన శూన్యములు. అవి ప్రతిపదోక్తములు, లాక్షణికములని ద్వివిధములు.ప్రకృతి సిద్ధములు ప్రతిపదోక్తములు, లక్షణసిద్ధములు లాక్షణికములు.

3. పదము లన్నియును నామములు, క్రియలు, అవ్యయములు నని మూఁడు విధములు వస్తువులను దెలియఁజేయు శబ్దములు నామము లగును. నామములలోఁ గొన్ని కర్త లగును. కొన్ని కర్మ లగును. ధాత్వర్థమగు పనికి ఆధారమగునది కర్త; ధాత్వర్థమగు ఫలమున కాశ్రయమైన కర్మ. 'దేవదత్తునిచే వంటకము వండఁబడె' ననుచోట 'వండఁబడుట' పని; దాని కాధారమైన వాఁడు-వంట చేసిన వాఁడు దేవదత్తుఁడు కర్త; 'వండుట' అని పనికి ఫలము 'వంట.' ఆ వంట కాశ్రయమైనది-వండఁబడునది 'వంటకము' కర్మ' పనిని తెలియఁజేయు పదములు క్రియలు. ఈ క్రియలు సకర్మకము లనియు, అకర్మకము లనియు రెండు విధములు. కర్మను కోరునవి సకర్మకములు; కర్మ కోరనివి అకర్మకములు. కర్త, కర్మ క్రియ అను మూఁడును గలిసిన ప్రయోగ మనఁబడును. ప్రయోగమునందలి క్రియ సమాపకమయి యుండును. ప్రయోగములందు తఱచు కర్త కర్మ క్రియ లుండును; కర్మ లేని ప్రయోగము లును నుండును. ప్రయోగము కర్తరిప్రయోగము, కర్మణిప్రయోగము నని రెండు విధములు. క్రియచేఁ గర్త చెప్పఁబడునేని కర్తరి ప్రయోగ మగును. ఉదా-'దేవదత్తుఁడు వంటకమును వండెను.' క్రియచేఁ గర్మ చెప్పఁబడునేని

కర్మణిప్రయోగ మగును. ఉదా:— దేవదత్తునిచే వంటకము వండఁబడెను. కర్తరి ప్రయోగమునఁ గర్మయు నున్నచో సకర్మక కర్తరిప్రయోగ మగును. దీనికి 'దేవదత్తుఁడు వంటకమును వండెను' అనునదియే ఉదాహరణము. కర్తరి ప్రయోగమున కర్మ లేనియెడల అకర్మక కర్తరి ప్రయోగ మగును. ఉదా—'దేవదత్తుఁడు నిద్రించెను.'

'లింగ, విభక్తి, వచనములు లేనివి అవ్యయములు. అవి యన్నిలింగములందును, అన్ని విభక్తులందును, అన్ని వచనములందును మార్పు లేక ఒక్క విధముగానే యుండును. 'వచ్చి, వెళ్లి, చేయక-,' మున్నగు నసమాపక క్రియలును, 'ఆహా బళే' మున్నగు ఆశ్చర్యార్థకములును అవ్యయములు. ఈ యవ్యయములు-ప్రతిపదోక్తములు, లాక్షణికములు నని రెండు విధములు. వ్యాకరణలక్షణముచే సిద్ధించు 'వచ్చి, వెళ్లక, తోతెంచుడు-' మున్నగునవి లాక్షణికములు. పుట్టుకనుండియు నట్టే - ప్రకృతిసిద్ధములై యుండు 'ఆహా, అయ్యో, మిన్నక-' మున్నగునవి ప్రతిపదోక్తములు.

## ౪. పదములకుఁ బరస్పరము గల సంబంధ మన్వయ మనంబడు.

౪. పదములలో నొకదానితో నింకొకదానికిఁ గల సంబంధ మన్వయ మనఁబడును. ఈ యన్వయము ఏకపదమున నుండదు. వాక్యమున కిది అత్యావశ్యకము.

## ౫. విషయబోధకము వాక్యము.

(విషయము - తెలియఁదగిన యంశము.)

౫. తెలియఁదగిన యంశమును బోధించునట్టి పదసమూహము వాక్యమగును.

## ౬. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు.

విషయ ముద్దేశ్యవిధేయములతోఁ గూడినది. అనఁగా-విషయమునం దుద్దేశ్యము, విధేయము నని రెండు కల వని యర్థము. ఉద్దేశించి చెప్పఁదగినది యుద్దేశ్యము; మీఁదఁ దెలియఁదగినది విధేయము, ఉద్దేశ్యము వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును; విధేయము, వక్తకుమాత్రము తెలియును. విశేష్యాదిక ముద్దేశ్యము; క్రియాదికము విధేయము. విశేష్యాదికము విశేష్యము, విశేషణము, సర్వనామము; క్రియాదికము-క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము. ఆది పదద్వయముచే అన్నంత క్రియలును, నేలాద్యవ్యయములును గ్రాహ్యములు. విశేష్యాదు లుద్దేశ్యవిధేయములు రెండు నగు. క్రియలుద్దేశ్యములు కానేరవు.

ఉద్దేశ్యవిధేయములకుఁ గ్రమముగా నుదాహరణములు—

'ఈ హయంబులు పవనగతిం బఱచు.' భార ఆర ౨ ఆ. ౧౬౭. ఇందు హయంబులు విశేష్యము ఉద్దేశ్యము; పఱచుఁ క్రియ విధేయము. 'వాగ్భూషణమే సుభూషణము.' భర్తృ. విద్వత్పద్ధతి.౧౫.ఇందు వాగ్భూషణము విశేష్యము ఉద్దేశ్యము; సుభూషణము విశేష్యము విధేయము. 'వీరభోజ్యము సుమ్ము రాజ్యము.' భార. ఆర. ౨ ఆ. ౨౨౨. ఇందు రాజ్యము విశేష్యము ఉద్దేశ్యము; వీరభోజ్యము విశేషణము విధేయము. 'బాహుకుం డను వాఁ డెవ్వాఁడో?' భార. ఆర. ౨ ఆ ౧౮౫. ఇందు బాహుకుండు విశేష్యము ఉద్దేశ్యము; ఎవ్వాఁడో సర్వనామము విధేయము. 'అవివేకి చెడుఁ.' స్వా. ౩ ఆ. ౧౩౫. ఇందు అవివేకి విశేషణము ఉద్దేశ్యము; చెడుఁ క్రియ విధే

యము 'వచ్చినవాఁడు ఫల్గునుఁడు.' భార. ఉద్యో. ౩ ఆ. ౮౫. ఇందు వచ్చినవాఁడు విశేషణము ఉద్దేశ్యము; ఫల్గునుఁడు విశేష్యము విధేయము. 'అక్రోధనుఁడు కరం బధికుఁడు.' భార. ఆది. ౩ ఆ. ౧౪౫. ఇందు అక్రోధనుఁడు విశేషణము ఉద్దేశ్యము; అధికుఁడు విశేషణము విధేయము. 'మూఁడవవాఁ డెవ్వఁడు ?' భార. ఆర. ౨ ఆ. ౧౮౮. ఇందు 'మూఁడవవాఁడు విశేషణము ఉద్దేశ్యము; ఎవ్వఁడు సర్వనామము విధేయము. 'కొందఱు పిశాచం బని పఱచిరి.' భార. ఆర. ౨ ఆ. ౧ ౨. ఇందు కొందఱు సర్వనామము ఉద్దేశ్యము; పఱచిరి క్రియ విధేయము. 'ఇది నలురథఘోషము.' భార. ఆర. ౨ ఆ. ౧౮౨. ఇందు ఇది సర్వనామము ఉద్దేశ్యము; ఘోషము విశేష్యము విధేయము. 'ఇది మర్త్యుల కవిషయము.' భార. ఆర. ౨ ఆ. ౧౦౬. ఇందు ఇది సర్వనామము ఉద్దేశ్యము; అవిషయము విశేషణము విధేయము. 'వీ రెవ్వరయ్య ?' భార. ఆది. ౬. ఆ. ౧౯. ఇందు వీరు సర్వనామము ఉద్దేశ్యము; ఎవ్వరు సర్వనామము విధేయము. 'మృగాకులోగ్రవనంబుల కరుగ నేల ?' భార. ఆర. ౨ ఆ. ౭౧. 'ఏలా వాలాయము సేయ.' స్వా. ౩ ఆ. ౬౪. ఇందు అరుగన్, చేయన్ - ఇవి - అన్నంత క్రియలు ఉద్దేశ్యములు; ఏల, ఏలా - ఇవి యవ్యయములు విధేయములు. మఱియు 'నీ వితరులఁ గొలువ నేటికి ?' భార. ఉద్యో. ౪ ఆ. ౫౯. ఇత్యాదు లూహ్యంబులు.

౬. ఆ తెలియఁదగిన యంశము ఉద్దేశ్యము, విధేయము నని రెండు విధములు. తెలియఁదగిన యంశము ఉద్దేశ్యము విధేయము రెండు నుండును. ఉద్దేశించి చెప్పఁదగినది ఉద్దేశ్యము-అనఁగా దేని నుద్దేశించి (గుఱించి) ఏదైన

యంశము చెప్పఁబడునో, అయ్యది ఉద్దేశ్య మగును. ఆ యుద్దేశ్యమును గుఱించి యేది విధింపఁబడునో-(విశేషముగాఁ జెప్పఁబడునో) అది విధేయము. 'ఈ హయంబులు పవనగతిం బఱచు' ననునెడ 'హయంబులు' ఉద్దేశ్యము; 'పఱచున్' విధేయము. ఇం దుద్దేశ్యము చెప్పెడివానికిని, వినువానికిని-నుభయు లకును తెలియును; విధేయము చెప్పెడివానికిమాత్రము తెలిసినను.

విశేష్యము, విశేషణము, సర్వనామము - ఈ మూఁడును ఉద్దేశ్యము, విధేయమును గూడ నగును. క్రియలు విధేయములుమాత్ర మగును. వివరణమునందలి క్రియాదిక మనఁగా - క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము; అన్నింతక్రియ, వీల మున్నగు నవ్యయములు; ఇవి ఉద్దేశ్యవిధేయము లుభయములు నగు నని యర్థము. ఉదాహరణములు స్పష్టములు.

## ౭. సంపూర్ణ మసంపూర్ణ మని వాక్యంబు ద్వివిధంబు.

సమాపకక్రియలు గల వాక్యము సంపూర్ణవాక్యము; అసమాపకక్రియలు గల వాక్యము అసంపూర్ణవాక్యము

ఉ. 'ఆ. దాని విడిచి పోవఁగా నోప కఱచుచు, నంతరిక్షమునను హంస లెల్లఁ, బిండుగట్టి తిరుగుచుండె.' భార. ఆర. ౨ ఆ. ౧౩. 'క. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గడుం, దలరి దమయంతిఁ దోడ్కొని, వెలువడియె నశేషరాజ్యవిభవచ్యుతుఁడై.' భార. ఆర. ౨ ఆ. ౬౪. 'మధ్యాక్కర. నన్ను, నారాజునకు నెఱిఁగించి కరుణ నాయందుఁ గావింపు, మారంగ ననుడు నిషధవిషయమున కరిగి యాహంస, వీరసేనజునకు దాని గుణరూపవిభవముల్ సెప్పె.' భార. ఆర. ౨ ఆ. ౨౨ మొ. ఇందు విడిచి, ఓపక, అఱచుచు నిత్యాది క్రియాఽభిన్నకర్తృకంబు లగు నసమాపక క్రియలు గల

ఉండెన్, వెలువడియెన్, చెప్పె నిత్యాది సమాపక క్రియలతోడి వాక్యము సంపూర్ణ వాక్యము. తలఁగఁగన్, ఐనన్, అనుచున్ ఇత్యాది క్రియావిభిన్నకర్తృకంబు లగు నసమాప క్రియల తోడి వాక్య మసంపూర్ణవాక్యము నని యెఱుంగవలయు.

౭. వాక్యము సంపూర్ణమని, అసంపూర్ణమని రెండు విధములు. సమాపక క్రియ గల వాక్యము సంపూర్ణము; అసమాపకక్రియ గల (సమాపక క్రియ లేని) వాక్యము అసంపూర్ణము; ఉదాహరణములు స్పష్టము.

## ౮. వాక్యసముదాయము మహావాక్యము నాఁబడు; అయ్యది రామాయణాదికము.

౮. సముదాయ మనఁగా సమూహము; వాక్యముల సమూహము మహావాక్య మనఁబడును. రామాయణము మున్నగు గ్రంథములు దాని కుదాహృతులు.

## ౯. క్రియాన్వయవాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబు లగు.

భావక్రియలు గల వాక్యము వ్యతిరేకక్రియలు గల వాక్యమునకును, వ్యతిరేకక్రియలుగల వాక్యము భావక్రియలు గల వాక్యమునకును, ఉభయము లుభయములకును వ్యంజకము లగు నని యర్థము. అప్పుడు భావక్రియ లేన్యంత తద్ధర్మార్థకములుగాను లేక యినన్నంతములగు తద్ధర్మార్థకములుగాను—వ్యతిరేకక్రియ లేన్యంత వ్యతిరేకార్థకములుగాను వ్యతిరేకార్థకములుగాను నుండును.

ఉ. 'వాఁడు వచ్చునేని (లేక) వాఁడు వచ్చిన వీఁడు వచ్చును; వాఁడు వచ్చునేని (లేక) వాఁడు వచ్చిన వీఁడు

రాఁడు.' (వీనికి వ్యంగ్యార్థములు - వాఁడు రాఁడేని వీఁడు రాఁడు, వాఁడు రాఁడేని వీఁడు వచ్చును.) 'నీ వియ్యవేని నే నియ్యను, నీ వియ్యవేని నే నిత్తును' (వీనికి వ్యంగ్యార్థములు—నీ విత్తువేని నే నిత్తును, నీ విత్తువేని నే నియ్యను) ఆది పదముచే నితరంబు లూహ్యంబులు.

ఇది యేతన్మార్గసూచనాక్రమము. ఇట్లు దీని నింక ననేక ప్రకారంబులఁ జెప్పను వచ్చును.

౫. ఇదివఱకు ౧-వ సూత్రవివరణములో వాక్యము క్రియాన్వయ వాక్యము, తదితరాన్వయవాక్యము నని రెండు విధములుగా నుండు నని చెప్పఁబడినది. అందు క్రియాన్వయవాక్యములు కొన్ని వ్యంగ్యార్థమును సూచించునవై యుండు నని యభిప్రాయము.

భావక్రియలు గల వాక్యము వ్యతిరేకక్రియలుగల వాక్యముయొక్క ఆర్థమును సూచించు ననియు, వ్యతిరేకార్థము నిచ్చు క్రియ గల వాక్యము భావక్రియలు గల వాక్యము నర్థమును సూచించు ననియు, వ్యతిరేకమువలన వ్యతిరేకము, భావక్రియలవలన భావక్రియలును వ్యంగ్యము లగు ననియు నర్థము. ఇ ట్లర్థము నిచ్చునపుడు భావక్రియలు 'ఏని' అంతమందుఁ గల తదర్థార్థకములుగాఁగాని, 'ఇనన్' ప్రత్యయ మంతమందుఁ గల తదర్థార్థక ములుగాఁగాని యుండును. వ్యతిరేకక్రియలు ఏని అంతమందుఁ గల వ్యతిరే కార్థకముగాఁగాని, కేవల వ్యతిరేకార్థకములుగాఁగాని యుండును. ఉదా హరణములు స్పష్టములు.

ఇందలి వివరణమునందలి విషయము మార్గదర్శకముగా మాత్రము చూపఁబడినది. ఈ విధముననే ప్రకారాంతరములయెడను వ్యంగ్యార్థములను గమనింప నగును.

## ౧౦ ఇట్లనియె, అనిన నని భావ్యర్థకథన ప్రారంభ పరిసమాప్తులు క్రమంబుగ నగు.

భావ్యర్థకథన ప్రారంభమునఁ బూర్వవాక్యాంతమునందు 'ఇట్లనియె' అనియును, ప్రారబ్ధవాక్య పరిసమాప్తియందు 'అనిన అనియును బదంబులు క్రమంబుగఁ బ్రయుక్తంబు లగు నని యర్థము

ఉ. 'వ. అయ్యింద్రునకుఁ గలి యిట్లనియె. తే-గీ. అవనిలో దమయంతీ స్వయంవరంబు. విస్తరిల్లుట విని కడువేడ్కతోడ, నేను దమయంతిచే వరియింపఁబడుదు, నని తదర్థమై యరిగెద నాసఁజేసి వ. అనిన నందఱు నగి.' భార. ఆర. ౨ ఆ. ౫౬, ౫౭, ౫౮ మొ.

౧౦. భావ్యర్థకథన మనఁగా ముందు జరుగఁబోవుదానిని చెప్పుట; భావ్యర్థమును చెప్పుటకుఁ బ్రారంభించినపుడు దానికి పూర్వమున నున్న వాక్యము చివర 'ఇట్లనియె' అనునది చేరును. ప్రారంభించిన వాక్యము ముగిసినపిదప 'అనిన' అనునది చేరును.

'అయ్యింద్రునకుఁ గలి యిట్లనియె-' అనుచో 'ఇట్లనియె' ననఁగా-ముందుఁ జెప్పఁబోవు రీతిని పలికె నని యర్థము. 'అనిన నందఱు నగి' అనుచో 'అనిన' అనఁగా 'ఈ చెప్పినరీతిని పలుకఁగా' అని యర్థము.

## ౧౧. కొన్నియెడలం బదాదులు విశేషణంబు లధ్యాహార్యంబు లగు.

ఉ. 'క. కలకంఠకంఠికన్నీ, రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ!' సుమతిశతకము. 32 (ఇంటన్=ఆ యింట) 'క. పురుషుండు రెండు దెఱఁగుల, ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ

దా నెయ్యెడలన్, బరుసములు వలుకకునికిన్, దురితంబులు వారయు పనులం దొఱంగుటవలనన్.' (రెండు దెఱంగులన్=ఈ రెండు తెఱంగులచేత.) భార. ఉద్యో. ౨ ఆ. ౪౧ మొ.

౧౧. తచ్ఛబ్దము ('ఆ' శబ్దము) మన్నగునవి తదాదులు. కొన్ని చోట్ల తచ్ఛబ్దాదులు విశేషణము లగుచో - ఆ తచ్ఛబ్దాదులు ఆ వాక్యమునం జెప్పంబడకున్నను - వానిని వేఱొకయెడనుండి తీసికొనివచ్చి యన్వయమును చెప్పవలసి యున్నదని యర్థము. 'కలకంఠకంఠి...సుమతీ!' అనుచో 'ఇంటన్' అనంగా, 'ఆ యింట' నని తచ్ఛబ్దమును దెచ్చుకొని సమన్వయించుకొనవలెను. 'పురుషుండు......దొఱంగుటవలనన్' అనునెడ 'రెండు తెఱంగులన్ = ఈ రెండు తెఱంగులచేత' నని ఏతచ్ఛబ్దమును తెచ్చుకొని యన్వయమును చెప్పవలెను.

[అధ్యాహార్యము = వాక్యమున సమన్వయము పూర్తియగుటకై యితర స్థలమునుండి తెచ్చికొన్న పదము.]

## ౧౨. కొన్నియెడల సంబంధంబునం బూర్వవాక్యంబునందలి పదం బధ్యాహార్యం బగు.

ఉ. 'గొంతిసంకటపాటుం గోడలిబన్నంబు.' భార. భీష్మ. ౨ ఆ. 'పంక్తిముఖు నాతని తమ్మునిం గుంభకర్ణునిం, దనయుని మేఘనాదుని.' నిర్వ. ౨ ఆ. ౧౪. 'దానవేశ్వరునకుం దమ్ములకును.' నిర్వ. ౨ ఆ. ౭౨ మొ.

౧౩. సంబంధ మనంగా బాంధవ్యము. స్వస్వామిభావము మన్నగునది. దానిని దెలుపునపుడు కొన్నియెడల వాక్యమునందలి పూర్వపదము నధ్యాహారము చేయుట కలదని యర్థము.

'గొంతిసంకటపాటుం గోడలిబన్నంబు' అనుచోట 'కోడలు' శబ్దమునకు ముందు 'గొంతి' అనుదాని నధ్యాహారము చేసి 'గొంతికోడలిబన్నంబు' అను

గానవలెను. 'పంక్తిముఖు...తనయుని మేఘనాదుని-' అనుచో 'పంక్తిముఖ' పదము నధ్యాహారమొనర్చి 'పంక్తిముఖు తనయుని' అని చెప్పవలెను. 'దాన వేశ్వరునకుఁ దమ్ములకును' అనుచో 'దానవేశ్వరుని తమ్ములకు' నని చెప్పవలెను.

## ౧౩. న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు.

(న్యూనవచనంబులు - ఐన, ఏని, ఏ. ఓ. మొ.)

ఉ. 'క. ఎత్తెఱఁగున ధర్మక్రియఁ, జిత్తంబునఁ జేర్పవలయు జీవించుతఱిన్.' భార. అను. ౪ ఆ. ౨౫౧. (ఎత్తెఱఁగునన్ = ఎత్తెఱఁగునన్నైనను, లేక ఎత్తెఱఁగుననేని అని యిక్కడ ఐన ఏని యవ్యయంబు లధ్యాహార్యములు. ఇట్లు మీఁదను నెఱుఁగునది.) 'అక్కట! మందభాగ్యునకు నట్టి తనూభవరత్నమెవ్విధిన్, దక్కునె?' భార. ద్రో. ౨ ఆ. ౨౪౦. 'తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగ నే మింతవార మనుకొన.' కళా. ౧ ఆ ౭౨. 'వీని నెమ్మెయిన్, బట్టి వధింతు.' వి. పు. ౭ ఆ. ౧౬౩. 'అన్నం *బొండొక లేదు.' పాండు. ౪ ఆ. ౧౭౬. 'దైవమకటా! యిటుఁ దెచ్చునె యేమి వచ్చెనే.' చంద్ర. 'కర్మములు మేలు నిచ్చును.' భాగ. ౧౦ స్కం. పూ. ౩౨. (కర్మములు = కర్మములే యని యిక్కడ నేనార్థ మధ్యాహార్యము.) 'డప్పిఁ జెందును.' (చూ. మీఁదు.) డప్పిఁ జెందునో యని యిక్కడ 'నో' యధ్యాహార్యము మొ.

౧౩. ఐన, ఏని, ఏ, ఓ మున్నగునవి న్యూనవచనంబు లని చెప్పఁబడును. అట్టి న్యూనవచనము లుండవలసిన వాక్యములందు- ఆ 'ఐన'

---

* బొండిక లేదు. పా. ఇదియే యుచితమైనది.

మున్నగునవి లేకున్నను, వాని నధ్యాహారము చేసికొని సమన్వయము కుదుర్ప నగు నని యర్థము. అర్థము వివరించునపుడు పూరింప ననువుగా ఉండి, స్ఫుటముగా నర్థము వచ్చువానిని మానినను మానవచ్చు నని భావము.

'అక్కటా!...ఎవ్వధిన్, దక్కెనె?' అనుచోట 'ఎవ్విధినైన లేక ఎవ్విధినేని' అని ఐన, ఏని-అధ్యాహార్యములు. 'తరుణీ! ఏరికిఁ జెల్లునె?' అనుచోటను 'ఎరికైనను, లేక ఏరికేనియు' నని ఐన, ఏనులలో నొకటి యధ్యాహార్యము. 'పీని నెమ్మెయిం బట్టి వధింతు. ఇట 'ఎమ్మెయినైనను, లేక ఎమ్మెయినేనియు' నని 'ఐన ఏనులలో నొకటి అధ్యాహార్యము.' అన్నం బొండొకలేద.' అనుచో 'ఒండొకరైనను, ఒండొకయేనియు' నని ఐన, ఏనులలో నొకటి అధ్యాహార్యము. 'దైవమకటా! యిట దెచ్చెనె;' ఇచట 'ఇటనైనను, లేక ఇటనేనియు' నని ఐన, యేనులలో నొక్కటి అధ్యాహార్యము.

'దప్పిఁ జెందును' అనుచోట 'దప్పిఁ జెందునో యేమో' అను ఊహా సందేహము లర్థము లగు 'ఓ' అధ్యాహార్యము. ఈ యుదాహరణమునందు 'కర్తయుఁ నధ్యాహార్యము. కర్తకూడ నధ్యాహార్యము కావచ్చునని తర్వాతి సూత్రమునఁ జెప్పబడుచున్నది. ఈయంశమే వివరణమునందలి '(చూ. మీఁదు)' అను సంకేతము తెలియఁజేయుచున్నది.

౧౪. కొన్నియెడలం గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు,

ఉ. కర్తకు:—'నన్నుఁ జూచి నగరె?' (జనులు కర్త అధ్యాహార్యము.) భార. ఆర. ౨ ఆ. ౧౩౬. 'క. సరకుగొనరు సురవరులను, గురుశక్తిని భీష్మబాహ్లికులఁగైకొన రు, ద్ధురత జరాసంధుని వెర, వరిగా మెచ్చరు మహేశ్వరగర్వముల్.' (హంసడింభకులు కర్త అధ్యాహార్యము.) ఉ. హరి. ౪ ఆ. ౯౯ మొ. కర్మమునకు—'దవదహనం బుదగ్రతరదాహము సేయుచునున్నఁ జూచి.' (దాహముచేయుటను కర్మము అధ్యా

హార్యము) భార. అర. ౨ ఆ. ౧౨౩ మొ. క్రియకు—ప్ర. అక్కడ నెవఁ డున్నాఁడు ? ఉ. రాముఁడు (ఉన్నాఁడు క్రియ అధ్యాహార్యము) మొ.

౧౪. కొన్ని స్థలములందుఁ గర్తగాని కర్మగాని క్రియగాని అధ్యాహారము నొందవచ్చు నని యర్థము. కొన్నియెడల వాక్యమునఁ గర్తగాని, క్రియగాని లేకపోవచ్చును. అయినను అవి యర్థసిద్ధములయి యధ్యాహార్యములగుటచే నట్టి వాక్యములకు వాక్యత్వహాని లే దని అభిప్రాయము.

'కర్తకు=కర్త యధ్యాహార్య మగుట కుదాహరణము' అని యర్థము. ఇట్లే 'కర్మమునకు, క్రియకు' అనుచోట్ల 'అవి యధ్యాహార్యము లగుట కుదాహరణము' లని యర్థమును చెప్పుకొనవలెను.

## ౧౫. అనేక కర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు.

ఉ. 'ఏ వాని బంధుమిత్రులు, జీవధనంబులును డప్పిఁ జెందును గృశునిం, గా వాని నెన్నఁగాఁ దగు.' భార. శాంతి. ౧ ఆ. ౫౨. 'క. సురగంధర్వ ప్రభృతులు; ధరణీశైలాపగాబ్ధిధాత్రీజాదుల్, నరవర! నీ కే యపకృతి, నరయఁగఁ గావించె ?' రా. అర. కాం. ౨ ఆ. ౩౪౨. 'తమసేనలు వారును విశ్రమించిరి.' ఉ. హరి. ౪ ఆ. ౩౧. 'వ. సర్వభూతంబులు దేవాసురులు వినాశగతులు కారె.' రా. అర. కాం. ౨ ఆ. ౩౪౫ మొ.

౧౫. ఒక వాక్యమునందుఁ బెక్కు కర్త లున్నపుడు, అందలి క్రియకు దగ్గఱగా నుండు కర్తయొక్క లింగము, వచనము కలుగుచుండు నని యర్థము. 'ఏ వాని బంధుమిత్రులు జీవధనంబులును డప్పిఁ జెందును ..' ఇచట క్రియకు దగ్గఱ 'జీవధనంబులు' అను అమహదర్థకర్తృపద మున్నందున దాని లింగవచనములే క్రియకుఁ జేరి 'చెందును' అయ్యెను.

'సురగంధర్వప్రభృతులు......ధాత్రీజాదుల్...గావించె' - ఇచట 'కావించు' క్రియకు ధాత్రీజాదుల్' అనునది సమీపకర్త. ఆ కర్తృపద మమహదర్థకము కావున దాని ననుసరించియే లింగ, వచనములు వచ్చి 'కావించె' అని యైనది. 'తమసేనలు, వారును విశ్రమించిరి' అనుచోఁ గ్రియకు సమీపకర్త మహద్వాచక మగుటచే దాని ననుసరించియే యీ క్రియ పుంలింగ బహువచనములను బొంది 'విశ్రమించిరి' అయినది.

'సర్వభూతంబులు దేవాసురులు వినాశగతులు గారె!' అనుచెడ క్రియా సమీపవర్తి యగు 'దేవాసుర' పదము ననుసరించియే క్రియ 'కారె' అని పుంలింగమున, బహువచనమున నున్నది.

**౧౬. భూతార్థకాసమాపక క్రియ వలయుచో వాక్యాంతర జనిస్థానం బగు; అగుచోఁ గర్త తత్కర్తలందలిదియు రెండియే నొం డగు.**

వలసినప్పుడు కొన్నియెడల భూతార్థకాసమాపకక్రియ నుండి వాక్యాంతరము పొడమును. అప్పుడు దానికి కర్త యా యసమాపకక్రియా కర్తృసముదాయంబునం దుండునదియే యేదైన నొక్కటి యగు నని యర్థము.

ఉ. 'మ. ధవళాక్షుల్ చని కాంచి రంత నెదురన్ దత్తీర దేశంబునం, దవదాతాంబుజఫేనపుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్.' 'వ. కని కద్రువ వినతఁ జూచి.' - (ఇక్కడ కని కనఁగా నందు నను నర్థము నిచ్చుచున్నది.) భార. ఆది. ౨ ఆ. ౩౦-౩౧. 'వ. దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని శక్రుం డిదియేమి యెందులకుం బోయెద వని యడిగిన నయింద్రునకుఁ గలి యి ట్లనియె.' (ఇక్కడ కని - కనిరి అందు నను నర్థము నిచ్చుచున్నది.) భార. అర. ౨ ఆ. ౫౮. ఇ ట్లింతట నూహ్యంబులు. 'చ. శుంభ నిశుంభు లుగ్రకో, పనులయి

*డాసి శుంభుఁ డతిభైరవసైన్యసమేతుఁడై రయంబునఁ గవిసెన్.' మార్కం. ౬ ఆ. ౧౮౫ మొ. ఏతల్లక్షణానుక్తవిశేషప్రయోగంబులుం గలవు. ఉ. 'వ. నలుండు...దమయంతీ ద్వితీయుండై యుండి బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోఁ దమనుండటఁ దిరుగుచున్న పక్షులం గని యవి భక్ష్యంబగు నని యప్పక్షులం బట్టికొన సమకట్టి కట్టిన పుట్టంబు వానిపై వైచిన నవి పుట్టంబుతోన గగనంబున కెగసి నవ్వుచు విగతవస్త్రుండైన నలున కిట్లనియె.' (ఇందు ఉండి అనునంతవఱకుఁ గల యసమాపక క్రియలకు కర్తలు నలదమయంతులు; ఓపక అనునది మొదలు వైచిన్ అనునంతవఱకుఁగల యసమాపక క్రియలకుఁ గర్త నలుఁ డధ్యాహార్యము. భార. ఆర. ౨ ఆ. ౬౬. 'సీ. ఆహవసన్నద్ధులై భీమకర్ణనందన మేఘవర్ణులు ధర్మతనయు, పాదంబులకు మ్రొక్కి పంకజాక్షునకు దండము పెట్టి యంతఃపురమున కరిగి, కుంతికి నెఱఁగి వీడ్కొని వచ్చి విచ్చు గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి గుస్తరించి, యనఘ! నేఁ దురగంబు గొనివచ్చునంచాఁక నంగరక్షకుఁడవై యధిపుఁ గాచి, యుండు మని మాద్రిపుత్త్రుల నుపచరించి, ద్రోపదికిఁ జెప్పి మఱియును దానవారి, యడుగులకు వ్రాలి యద్దేవుననుమతమున, నరిగె నను మోదమున యౌవనాశ్వపురికి.' (ఇందు వచ్చి అనునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్తలు భీమకర్ణనందన మేఘవర్ణులు. గ్రుచ్చి యనునది మొదలు అరిగె ననునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్త భీముఁ డధ్యాహార్యము. (జై. ౧ ఆ. ౧౩౮. ఇట్టివి ప్రయోగంబులవలన నెఱుంగునది.

---

* రా నిశుంభుఁడతి. పా.

౧౬. భూతార్థకాసమాపకక్రియ క్త్వార్థము; ఇకారాంతము; వాక్యాంతరజనిస్థానంబు = వేఱొక వాక్యము పుట్టుటకు స్థానమైనది. తత్కర్త లందలిదియ = ఆ భూతార్థకాసమాపక క్రియకుఁ గల కర్తలందలిదే.

కావలసినప్పుడు కొన్నిచోట్ల భూతకాలార్థము నిచ్చునట్టి అసమాపక క్రియనుండి వేఱొక వాక్యము ఏర్పడును. అట్లేర్పడు వాక్యాంతరమునకుఁ గర్తగా, వెనుకటి యసమాపకక్రియకుఁ గల కర్తలలో నేదియో యొకటియై యుండు నని యర్థము

'శుంభనిశుంభు లుగ్రకోపనులయి డాసి, శుంభుఁడలి ..' అనుచోట ''శుంభునిశుంభు లుగ్రకోపనులయి రా, నిశుంభుఁ డలి...' అని పాఠము కలదు. అదియే సరియైనది ఆ పాఠమున నిది యుదాహరణము కాఁజాలదు.

మీఁది లక్షణముచే గతార్థములు కాని విశేషప్రయోగములు నున్న వని వివరణమునఁ జెప్పఁబడినది. దానికి 'నలుండు . దమయంతీ ద్వితీయుండై . ఇట్లనియె' అని యుదాహరింపఁబడి 'ఇందు, ఉండి' అనునంతవఱకును గల యసమాపకక్రియలకుఁ గర్తలు నలదమయంతులు; 'ఓపక' అనునది మొదలు 'వైచినన్' అనునంతవఱకును గల యసమాపకక్రియలకుఁ గర్త నలుఁ డధ్యాహార్యము' అని వివరణముకూడ వ్రాయఁబడినది. కాని యిది విచార్యము. 'నలుఁడు...దమయంతీ ద్వితీయుండై' అనునపుడు కర్త నలుఁడే యగును. నలదమయంతు లిరువురు గారు. ఇరువురును గర్త లయినచో 'నలుఁడు దమయంతీ ద్వితీయుండై' అని యుండదు. కాఁగా నిచట 'నలుఁడే' కర్త యగుటవలనను, ఆ పదము వాచ్యముగనే యున్నందునను, అధ్యాహార్య మని చెప్పుట పొసఁగదు. 'ఆహవసన్నద్ధులై ..' అను నుదాహరణము సరిపడును; అది వివరణమున కనుగుణముగ నున్నది.

## ౧౭. కొన్నియెడల నవయవకర్తృక క్రియ తదవయవి కర్తృకం బగు.

ఉ. 'తల వడంకుచునుండు తన పితృవరుల' (తలవడంకుచునుండు=తలవడఁకుట గలవా రగుచునుండు నని యర్థము.) భా. ఆది. ౨ ఆ. ౧౫౧ 'తేఁకువ సెడియె నీ పాలుఁడు.' (చెడియెన్ - చెడుట కలవాఁ డాయె నని యర్థము) భార. ఆర. ౪ ఆ. 3౫3. ఇట్లంతట నెఱుఁగునది 'చెలువేదెఁ జందు రుండు.' భార. ఉద్యో. ౨ ఆ. ౧౦౭. 'ఏ-గీ. *సుభటవర్గంబు లొక్కటఁ సొబగు మాలె.' రా. యు. కాం. ౧౧౪౦. 'అక్కట! యీ లతాంగిహృదయంబున నీదెసఁ గూర్మి యెంతయున్; నెక్కొని యున్నది.' మార్కం. ౨ ఆ. ౪౦౯. తే. బడలికలు వాసి చనుము.' స్వా. ౨ ఆ. ౪౭ మొ.

౧౭. అవయవవాచకము కర్తగాఁ గల క్రియలు కొన్నియెడల అవయవి వాచకము కర్తగాఁ గలవి కూడ నగు నని యర్థము. అనఁగా అవయవ వాచక కర్తృక క్రియ లర్థవివరణసందర్భమున అవయవివాచకములనుగూడ బోధించి, వానికిని క్రియలుగానగు నని భావము.

'తల వడఁకుచునుండు తన పితృవరుల-' అనుచోట 'వడఁకుచునుండు' అను క్రియ అవయవివాచకమగు 'తల' అనునది కర్తగాఁ గలిగి యున్నది. దీనిని వివరించునపుడు 'తల వడఁకుచుండు'. అనఁగా 'తల వడఁకుట గల వారగుచునుండు' అని యర్థము వచ్చును. 'తలవడఁకుట గలవారు' అవయవి వాచకమగు కర్తృపదము. దానికిని 'వడఁకుచుండు' ననునదియే క్రియ యైనది. ఇట్లే తక్కినచోట్లయందును గ్రహించునది.

'చెలువేదెఁ జందురుండు' అనఁగా 'చెలువు గల చందురుం డేదె (సొబగుతగ్గె)' నని యర్థము. 'సుభటవర్గంబు లొక్కట సొబగు మాలె' ననఁగా 'సొబగైన సుభటవర్గంబులు సొబగుమాలె' నని యర్థము, 'అక్కట! యీ

* ఉభయకర్ణంబులు. పా.

లతాంగి హృదయంబున నీదెస కూర్మి యెంతయుఁన్, నెక్కొని యున్నది' అను నెడ 'నీదెస కూర్మి గల యా లతాంగి నెక్కొనియున్న' దని అర్థము. 'బడలికలు వాసి చనుము' అనునెడ 'బడలికలు వాసిన నీ' వని యర్థము.

౧౮. వాక్యసంగ్రహంబునం దినన్నంత క్రియాపూర్వకంబు లగు కాకకాన్యవ్యయంబు లనుక్తవాక్య పదగ్రాహకంబు లగు.

ఉ. కాకకు.—'తే. నీవు నలునకుఁ జేర్మితో దేవివైనఁ, గాక నీసముజ్జ్వలరూపకాంతివిభవ, నిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్యభద్ర, లక్షణావళు లవి సఫలంబు లగునె?' భార. ఆర. ౨ ఆ. ౨౦. (వాక్యవ్యాసమునందు—నీవు నలునకుఁ జేర్మితో దేవివైన నీ సముజ్జ్వలరూపకాంతివిభవనిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్యభద్రలక్షణావళు లవి సఫలంబు లగును. కాకున్న నీ సముజ్జ్వలరూపకాంతివిభవ నిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్యభద్ర లక్షణావళు లవి సఫలంబులు కావు.) కానికి - 'ఆ. నలున కాని నళినదళనేత్ర వరియింపదట్టి!' (వాక్య వ్యాసమునందు - నలునే వరియించునుగాని వేఱొకని నళినదళనేత్ర వరియింపదట్టి) భార ఆర. 3 ఆ. ౫౨ మొ.

౧౮. పెద్దవాక్యమును క్లుప్తీకరించిన వాక్యసంగ్రహమును, చిన్న వాక్యమును విపులీకరించిన వాక్యవ్యాసము నగును. భూతకాలమున వచ్చు ఇగాగమముతోఁగూడి చేదర్థమున వచ్చిన ద్రుతాంత మగు నకారము కలది 'ఇనన్నంత క్రియ' అట్టి క్రియ ముందుగా నుండి, దానితర్వాత 'కాక, కాని' అను నవ్యయము లున్నయెడల అయ్యవి అనుక్తములగు (వాక్యమునందుఁ జెప్పఁబడని) వాక్యమునకుఁ గాని, పదమునకుఁగాని గ్రాహకములగునని యర్థము.

'నీవు నలునకుఁ జేర్చితో...' అనునది 'కాక' అను నవ్యయ మనుక్త వాక్యమునకు గ్రాహక మగుట కుదాహరణము. 'దేవివై నన్-' అను ఇనన్నంత మునకుఁ బిదపనే 'కాక' యుంన్నదనుట స్పష్టము.

'నలున కాని నళినదళనేత్ర వరియింప దట్టె' అనునది 'కాని' అను నవ్యయము అనుక్తపదగ్రాహక మగుట కుదాహరణముగ నీయఁబడినది. కాని, యిచటి 'కాని' కి ముందున్నది అవధారణార్థకము; ఇనన్నంత క్రియ కాదు. ఈయి ప్రయోగమును బట్టి 'కాని' అనునది ఇనన్నంత క్రియకుఁ బిదప లేకున్నను, (అవధారణార్థకాదులకుఁ దర్వాత నున్నను) అనుక్తవాక్య పదములకు గ్రాహక మగు నని గ్రహింపనగును.

## ౧౯. కొన్ని యెడలం గాని క్రియాపూర్వకంబు పూర్వవిరుద్ధోత్తరార్థకం బగు.

వాక్యంబులందు పూర్వార్థమునఁ గ్రియమీఁద వచ్చిన కానియవ్యయ ముత్తరార్థవాక్యముయొక్క యర్థము పూర్వార్థ వాక్యముయొక్క యర్థమునకు విరుద్ధముగా నుండు ననుటను దెలుపుచున్నది యని యర్థము.

ఉ. వాఁడు వచ్చును గాని కార్యవ్యాసంగముచేత రాఁడాయెను. వాఁడు రాఁడు గాని నీ నిర్బంధముచేత వచ్చి నాఁడు మొ.

౧౯. కాని క్రియాపూర్వకంబు=క్రియకుఁ దర్వాత వచ్చిన 'కాని' యను నవ్యయము. అట్టి యవ్యయము కొన్ని యెడలఁ దనకుఁ దర్వాత నున్న వాక్యముయొక్క యర్థము పూర్వార్థవాక్యమునకు (తనకు ముందున్న భాగముయొక్క యర్థమునకు) విరుద్ధముగా నుండుటను తెలుపు నని యర్థము. ఉదాహరణములు స్పష్టములు.

## ౨౦. కొన్నియెడల వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహ వాక్యంబు నొం డగు.

ఉ. 'వ. అయ్యా! యేను నీకుం బ్రియంబు సేసెద; నీ హృదయేశ్వరియైన దమయంతిపాలికిం బోయి నీ గుణంబులు దానికి వర్ణించి చెప్పి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయంద బద్ధానురాగ యగునట్లు చేసెద.' భార. ఆర. ౨ ఆ. ౧౪. 'వ. ఇది యెట్లు; ధర్మపరిపాలనపరులై వీరులై రణనిహతులైన రాజు లక్షయలోకసుఖంబు లనుభవింప నతిథులై యిందుల కెంత కాలం బయ్యె రాని కారణం బేమి?' భార.ఆర. ౨ ఆ. ౩౮. 'వ. శక్రుం డిది యేమి; యెందులకుం బోయెద వని యడిగిన.' భార. ఆర. ౨ ఆ. ౫౬ మొ.

౨౦. విపులముగా నున్న వాక్యములు వ్యాసవాక్యములు. అట్టివాక్యములకు ముందు కొన్నిచోట్ల నా యభిప్రాయమునే సారరూపమున బోధించు సంగ్రహవాక్యములను గూర్చుట కలదు.

ఉదాహరణములందు మొదటివానిలోని 'అయ్యా! యేను నీకుం బ్రియంబు సేసెద' అనునదియు, రెండవదానిలోని 'ఇది యెట్లు?' అనునదియు, కడపటిదానిలోని 'ఇది యేమి?' అనునదియును సంగ్రహవాక్యములు.

## ౨౧. కొన్నియెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు.

ఉ. 'వ. ఇందుల కెంత కాలంబయ్యె రాని కారణం బేమి?' భార. ఆర. ౨ ఆ. ౩౦. మొ. (చూ. క్రిందు.)

౨౧. కొన్నియెడల నొక వాక్యమునడుమ వేఱొకవాక్యము ప్రవేశించి యుండుట కలదు. ఉదాహృతిలో 'ఇందులకు రానికారణం బేమి?' అను వాక్యగర్భమున 'ఎంతకాలంబయ్యె-'నను వాక్యాంతరము చేరి యుండుట స్పష్టము. ఇట్లు వాక్యాంతరముతోఁ గూడి యుండుట సంగ్రహవాక్యముతోఁ

గూడిన వ్యాసవాక్యములపట్లను గానవచ్చును. దీని యుదాహరణము ౨౦-వ సూత్రోదాహరణములలోని చివరిది. ఈ విషయమే '(చూ. క్రిందు.)' అనుదానిచే తెలుపఁబడుచున్నది.

## ౨౨. పొమ్ము నిశ్చయార్థంబునం దగు.

ఉ. 'అల్లునిఁ గల్యాణగుణోత్తరుం బడయ కెట్లుం బోవఁ బొమ్మంచు.' నిర్వ. 3 ఆ. ౪3 మొ.

౨౨. నిశ్చయమును తెల్పినపుడు 'పొమ్ము' అని వాడుట కల దని యర్థము. 'పొమ్ము' పోవుధాతువునకు 'ముజ్జు'పరము కాఁగా ఏర్పడు రూపము. 'పడయ కెట్లుం బోవన్ = పొందక వివిధముగనైనను పోఁజాలను; పొమ్ము= నిశ్చయము' అని యుదాహరణభాగమున కర్థము.

## ౨3. పద్యంబులకుఁ గులకం బగు.

కులకం బనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము.

ఉ. 'తా నొక పండు చెచ్చెరన్. కొని వ్రచ్చుడు.' భార. ఆది. ౨ ఆ. ౧౯౮, ౧౯౯ మొ.

౨3. ఒక పద్యమున వాక్యము ముగియకపోఁగా, అది దానితరువాతి పద్యముతో నన్వయించినచోఁ గులక మని చెప్పఁబడును.

'తా నొక పండు చెచ్చెరన్' అనుదానితో నొక పద్యము ముగియుంచున్నది. కాని వాక్యము పూర్తికానందున 'కొని వ్రచ్చుడు-'అనుదానితో నన్వయము పొందుచున్నది. సంస్కృతమునందు నాలుగు పద్యముల కెక్కువ సంఖ్యగలవానికి ఏకాన్వయ మున్నప్పుడు 'కులక' మగు ననియు, రెండు పద్యములకు సమన్వయ ముండిన 'యుగ్మము,' మూఁడింటి సమన్వయమున 'విశేషకము,' నాలుగు పద్యముల సమన్వయమున 'కలాపకము' అగు ననియు చెప్పఁబడుచున్నది. ఇచట నా నియమము గమనింపఁబడలేదు.

ఇది వాక్యపరిచ్ఛేదము.

---

# ముక్తలక్షణవివేచనము

## సంజ్ఞ

గ్రంథమంతయుఁ బూర్తియైన పిమ్మట-అందందు కొన్నిలక్షణములు విడువఁబడినట్లు తోఁచఁగా, గ్రంథకర్త అట్టివాని నిచట వివరించుచున్నాఁడు. కావుననే ఈ భాగమునకు 'ముక్తలక్షణ వివేచన' మని పేరు పెట్టఁబడెను.

సంజ్ఞ = సంజ్ఞాపరిచ్ఛేదములో నుండవలసిన సూత్రము లని యభిప్రాయము.

### ౧. దీర్ఘపూర్వక మగు లఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫం బగు.

ఉ. 'క. వెఱవక కలలోఁ జేసిన, కొఱగామికి వగచు చోట గుణరత్నము చే,కుఱె నీకు నలిగి తన్నినఁ, బఱపుపయిం బడినయట్లు పద్మదళాక్షీ!' ఉ. హరి. ౫ ఆ. ౧౫౩ మొ

౧. దీర్ఘమునకుఁ దర్వాత లఘురేఫ మున్నచో ఆరేఫము హ్రస్వమునకుఁ దర్వాత నుండునదగునేని-అనఁగా-ఆదీర్ఘము హ్రస్వమగునేని, లఘురేఫ మలఘురేఫ మగును. ఇది ౯-వ సూత్రమునకుఁ దర్వాత నుండఁదగినది.

'వెఱవక...చే,కుఱె నీకు...' ఇచట 'చేకూరు'-'అని తొలిరూపము. లఘురేఫమునకు ముందు 'కూ' అని దీర్ఘము కలదు; ఆ దీర్ఘము హ్రస్వము కాఁగా, లఘురేఫ మలఘురేఫమై 'చేకుఱు' అయినది.

### ౨. అలఘురేఫము లుప్తాచ్క మగుచో లఘురేఫం బగు.

ఉ 'ఎ-గీ. నీవును నాపద, కోర్చి భంగపాటు తీర్చి కొనుము.' భార. విరా. ౧ ఆ. ౫౮ మొ. 'లఘుర్భవేద్గురుః

కుత్రచి ద్గురుశ్చ లఘు స్తథా, ఉచ్చారణస్య కల్ప్యత్వా న్నిదానం తత్ర సద్వచః' అని యథర్వణాచార్యులు. మఱియు 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్.' 'అనయోస్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ, అస్యా అత్యంతదోషత్వాద్దుష్కవి స్స హి కథ్యతే.' అని ప్రథమాచార్యులును, ద్వితీయాచార్యులును నియమించి యుండుటంజేసి యవి పూర్వరేఫంబులే యనుటకు వల్ల కాదు. (చేకూరు-లఘురేఫము, తీఱు-అలఘురేఫము.)

౨. లుప్తాచ్కము=లోపించిన యచ్చు కలది - అచ్చు లోపించినది. అలఘురేఫమునందుఁ గల అచ్చు లోపించినప్పుడు ఆ రేఫము లఘురేఫమగును.

'...ఓర్చి భంగపాటు తీర్చికొనుము' అనునెడ 'ర్చి' ద్వయమునకు ప్రాసమైత్రి. 'తీఱు' ధాతువున తొలుత అలఘురేఫము కలదు. ఆ ధాతువునకుఁ బ్రేరణమున 'చు,' ఆత్మార్థమున 'కొను' చేరఁగా 'తీఱుచుకొనుము' అగును. 'తీఱు' లోని ఉకారమునకు లోపము రాఁగా 'తీఱ్ + చు' అనునపుడీ సూత్రముచే అలఘురేఫము లఘురేఫము అయి 'తీర్చుకొనుము' అగును. 'కొను' పరమగుచో ఉత్వమునకు వికల్పముగా ఇత్వము రాఁగా 'తీర్చికొనుము' అని అయినది. 'తీర్చుకొనుము' అనియుం నుండవచ్చును.

అథర్వణాచార్యులు తన వికృతివివేకమున ఉచ్చారణము కల్పిత మగుటవలన కొన్నియెడల గురువు లఘువుగను లఘువు గురువుగను మాఱుచుండును; ఇట్టి మార్పును పెద్దలు సమ్మతింతురు' అని చెప్పినందువల్ల నీ సూత్రము వ్రాయఁబడినది; ప్రయోగముకూడ చూపఁబడినది.

లఘ్వలఘువు లగు 'యరవ'లలో 'యవ'ల లకుఁ బరస్పరము మైత్రి యుండును; కాని 'రఱ' లకు మాత్రముండ దని ప్రథమాచార్యుఁడగు నన్నయభట్టు 'నాన్యేషాం' ఇత్యాది సూత్రమున వివరించి యున్నాఁడు. 'రఱ' లకు

పరస్పర మైత్రిఁగూర్చుట తప్పు; అట్లు కూర్చిన కవి "కుకవి యగు" నని ద్వితీయాచార్యుఁ డగు అథర్వణుండును చెప్పియున్నాఁడు. ఆ నియమముల ననుసరించి లఘురేఫాలఘురేఫములు వేర్వేఱుగా నుండుననియుం, వానికిఁ బరస్పరము మైత్రి లేదనియుం, నియమానుసారముగ అలఘురేఫమునకు లఘురేఫ మాదేశ మగు ననియుం గ్రహింపవలెను. ఇది సంజ్ఞాప్రకరణమున ౧౧-వ సూ. గా ఉండఁదగినది.

## సంధి

## 3. ద్విత్వరహితంబగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరం బగుచో సంధి రాదు.

ఉ. నను నెఱిఁగె, నిను నెఱిఁగె మొ.

సంధి = సంధిపరిచ్ఛేదములోఁ జేర్పవలసిన సూత్ర మని భావము.

ద్విత్వముతోఁ గూడియుండని ద్వితీయావిభక్తిసంబంధ మగు ఉకారమునకు అచ్చు పరమగునపుడు సంధి రాదు.

'ననున్ + ఎఱిఁగె, నినున్ + ఎఱిఁగె' అనునప్పుడు బాలవ్యాకరణములోని 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులయం దున్న ఉకారమున కచ్చు పరమగునపుడు సంధి వికల్పముగా నగు' నను సూత్రముచే వికల్పసంధి వచ్చి 'నానెఱిఁగె, నినెఱిఁగె' అని కావలసి యుండఁగా, అట్టి రూపములు కాకుండుటకే సూత్ర మారంభింపఁబడినది. ఇది సంధిపరిచ్ఛేదమున మొదట నుండవలసిన సూత్రము.

ఇట్టిచోట్ల సంధి రానందున 'నను నెఱిఁగె, నిను నెఱిఁగె' అని మాత్రమే యుండును.

## సమాసము

సమాసము = క్రిందివి సమాసపరిచ్ఛేదమున నుండవలసిన సూత్రములని భావము.

## ౮. తలఁచుగ సర్వనామంబుతోడం గర్మధారయంబు చూపట్టదు.

౧. కర్మధారయసమాసము సాధారణముగా 'అ-ఈ-ఏ' అను త్రికంబు కంటె వేఱగు సర్వనామముతోఁ గలిసినది యుండ దని భావము. బాల వ్యాకరణమున 'కర్మధారయంబు త్రిక, స్త్రీసమ, ముగంతధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండదు' నని మాత్రము చెప్పఁబడుటచే దానిని వివరించుట కీ సూత్రము చెప్పఁబడినది. ఇది ౯-వ సూత్రమునకుఁ గాని ౧౦-వ సూత్రమునకుఁ గా దని తర్వాత నుండఁదగును.

## ౯. ద్విగువు మహదర్థఘటితం బదృష్టంబు.

౨. మహద్వాచకముతోఁగూడిన ద్విగువు కానరా దని యభిప్రాయము. ద్విగువున సంఖ్యావాచక మగు విశేషణము విశేష్యముతోడ సమాసమును పొందుచుండును. 'ముజ్జగములు, ముల్లోకములు, నలుగడలు' మున్నగుచోట్ల రెండు పదములును అమహదర్థకములై యున్నవి. నలుగురు+వీరులు అనుచోట మహద్వాచకములే యున్నందున సమాసమున లే దని భావము. ఇది ౨౦-వ సూత్రమునకు ముం దుండ నగును.

ఇది ముక్తలక్షణవివేచనము.

సుబోధినీసహిత

త్రిలిఙ్గలక్షణశేషము

సమాప్తము.

# ఉదాహరణసూచిక

# సూత్రానుక్రమణిక



పుట. సూత్రము.

| పుట. | | | సూత్రము. |
|---|---|---|---|
| 85. | పూజ్యతాతిశయంబున యుష్మదర్థ బహువచనంబునకు | శబ్ద | ౪౫ |
| 34. | పూ పూవు | సంధి | ౧౧ |
| 184. | పైరూగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబు | సమాస | ౫ |
| 293. | పొమ్ము నిశ్చయార్థంబునం దగు | వాక్య | ౨౨ |
| 224. | పోలెప్రభృతులు తఱచుగఁ బ్రథమావిభక్త్యంత | సమాస | ౪౧ |
| 223. | ప్రథమాంతములమీఁద పోలెబలెపోని శబ్దంబులు | సమాస | ౩౯ |
| 52. | ప్రధానంబు పశ్చాద్వాచ్యం బగు | శబ్ద | ౭ |
| 237. | ప్రాచుర్యార్థంబునం దెనుఁగుపదంబులమీఁదను | తద్ధిత | ౧౮ |
| 18. | ప్రాణగొడ్డ మగ్రామ్యంబు కాఁదగు | సంజ్ఞా | ౧౨ |
| 127. | ప్రాప్తహ్రస్వంబులగు మూఁడేలమీఁది వర్ణంబులకు | శబ్ద | ౧౦౦ |
| 244. | ప్రార్థనంబునం దన్ప్రియాంత క్రియలమీఁదఁగద | క్రియా | ౯ |
| 245. | ప్రార్థనాదులం దన్ప్రత్యయాంత క్రియలమీఁది | క్రియా | ౧౦ |
| 43. | ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు | సంధి | ౨౨ |
| 110. | బహుత్వంబున మేకు శే విభాష నగు | శబ్ద | ౭౨ |
| 125. | బిందుపూర్వడకారంబు పరంబగుచోఁ దుది | శబ్ద | ౯౪ |
| 247. | భావంబునం దనుప్రయుక్తం బగు కొనుటకుం | క్రియా | ౧౩ |
| 209. | భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు | సమాస | ౩౧ |
| 286. | భూతార్థకాసమాపక క్రియ వలయుచో | వాక్య | ౧౬ |
| 232. | మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరంబగుచో | తద్ధిత | ౪ |
| 231. | మతుబర్థంబునం దరివర్ణకంబు పరంబగునపుడు | ,, | ౩ |
| 40. | మధ్యమపురుషమువర్ణంబున కచ్చు పరంబగునపుడును | సంధి | ౧౮ |
| 226. | మఱియవి కొన్నియెడల నామంబుల ప్రథమాది | సమాస | ౪౨ |
| 62. | మహాత్మమూహార్థకశబ్దం బమహాత్మ్యర్యయుక్తం | శబ్ద | ౧౭ |
| 242. | మహద్బహుకర్తృకక్రియకు నేకవచనంబు | క్రియా | ౬ |
| 129. | మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం | శబ్ద | ౧౦౪ |

---

మదరాసు : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1972—కాపీలు. 2000